దజల్లనెమ్మి పురివన్నెల్పిన్నెమైమీఱని! ర్మలవక్త్రేందుకళావిలాసమునఁజేరన్వ
చ్చికందోయిశీ! తలముంజేయఁగనందనందనునినాత్మంగాంచుటెంకెన్నఁడో॥

తా॥ నెమలిపురిభూషణంబుగఁగలశ్రీకృష్ణమూర్తిమకరందప్రవాహంబుగ
లలేనగవుగుఱుతుచేతం గోమలంబై చందురుంబోలిన నెమ్మొగంబుతోడంగా
నుపించినాకన్నుఁగవ నెత్తఁజల్లచేయుననుట. ... ... ❖

శ్లో॥ కారుణ్యకర్బురకటాక్షనిరీక్షణేన తారుణ్యసంవళితశైశవవైభవేన।ఆ
ష్ణతాభువనమద్భుతవిభ్రమేణ శ్రీకృష్ణచంద్రశిశిరీకురులోచనంమే॥ ౨౫

టీక॥ అద్భుతవిక్రమేణ - అద్భుత - గోవర్ధనోద్ధరణాదికార్యములచేతఆ
శ్చర్యభూతమైన- విభ్రమేణ- విలాసముగలదిగనుకనే- భువనం - లోకము
- ఆపుష్ణతా- పోషించుచున్నట్టి - కారుణ్యకర్బురకటాక్షనిరీక్షణేన - కారు
ణ్య- దయచేత- కర్బుర- చిత్రవర్ణముతోఁగూడిన-కటాక్ష- కడకన్నులయొక్క-
రీక్షణేన- చూపులుగల-తారుణ్యసంవళితశైశవవైభవేన-తారుణ్య-యౌవన
ముతోడ- సంవళిత-కూడుకొన్న- శైశవ-బాల్యముయొక్క - వైభవేన-సంపదచే
- శ్రీకృష్ణచంద్ర- చంద్రసదృశుఁడవైనయోశ్రీకృష్ణస్వామి- మే- నాయొక్క-
లోచనం- నేత్రమును- శిశిరీకురు- చల్లగాజేయుము- ... ... ❖

శా॥ కూడింగూడనిప్రాయపున్సొగసు పెక్కుల్మిక్కిలైపెక్కఁగా। నీడుం
జోడునులేనివీక్షణసుధావృష్టిన్ జగత్సృష్టికిన్ । దోడున్నీడగు గోకులాంబునిధి
చంద్రుంగాంతిసాంద్రుండమిన్ । జూడంజూడఁగదృక్పకోరికలుగాంచున్ సం
తానందమున్॥ ... ... ... ... ... ౨౫

తా॥ గోవర్ధనోద్ధరణంబు మొదలగునాశ్చర్యకరంబులగువిలాసంబులంగలిగి
గంబు నెల్లఁబోషించెడిదైకృపారసంబుచేనైనచిత్రవర్ణంబుతోఁగూడినకడకం
టిచూపులుఁగలిగిజవ్వనంబుతోడంగూడినబాల్యంబుగలిగి తేజరిల్లుదివ్యమంగళవి
గ్రహంబుచేతఓశ్రీకృష్ణస్వామినాకన్నులంగానంబుముసుట. ❖

శ్లో॥ కదావాకాళిందీకువలయదళశ్యామలతరాః కటాక్షాలక్ష్యం తేకిమపి
కరుణావీచినిచితాః । కదావాకందర్పప్రతిభటజటాచంద్రశిశిరాఃకమప్యస్తోకం
దదతిమురళీకేళినినదాః॥ ... ... ... ... ౨౬

టీక॥ కాళిందీకువలయదళశ్యామలతరాః- కాళిందీ- యమునయందలి- కు
వలయ- నల్లకలువలయొక్క - దళ- రేకులవలెను- శ్యామలతరాః- మిక్కిలిశ్యామ
వర్ణముగల- కటాక్షాః- కడకన్నులు- కిమపికరుణావీచినిచితాః- కిమపి- చెప్ప

నలవిగాని- కరుణా- దయయొక్క - వీచి- అలలచేత-నిచితాః-వ్యాపింపబడినవి యై- కదావా- ఎప్పుడు-మయా-నాచేత-లక్ష్యంతే-చూడబడుచున్నవి- కందర్ప ప్రతిభటజటాచంద్రశిశిరాః- కందర్ప- మన్మథునియొక్క - ప్రతిభట- శత్రుఁడగు హరునియొక్క - జటా- జడలయందుండెడి- చంద్ర - చంద్రునివలె - శిశిరాః ఆహ్లాదకరములగు- మురళీకేళినినదాః - మురళీ- వేణువుయొక్క - కేళీ-క్రీడార్థ మైన- నినదాః- నాదములు- కిమపి- చెప్పనలవిగాని-అంతస్తోషం-అంతఃకరణా హ్లాదమును- కదావా- ఎప్పుడు- దదతి - ఇచ్చుచున్నది- ...

ఉ॥ ఎన్నఁడొ యా యమునోత్పలసితేతరలోలదయార్ద్రదృగ్విలా। సోన్నతి నా పయిన్ నిగుడియుండుటఁ శంభుజటాటవీతటా। సన్నసుధాంశుశీతలలసన్ మురళీనినదామృతంబుచే। వెన్నుఁడు నాదు వీనులకు విందొనరింపఁ దలంచె నెన్నఁడో॥ ... ... ... .. ... ౨

తా॥ యమునయందలినల్లకలువరేకులకైవడినల్లనగుచు జెప్పనలవిగానికరుణాతరంగంబులనిండింపఁబడు కడకన్నులు నాచే నెన్నఁడు గానఁబడును శివుని జడయందలి చంద్రునికరణి నాహ్లాదంబునొసంగంజాలిన వేణువినోదనాదంబు లెన్నఁడు నామనంబునకుం సంతోషంబు జేయునోయనుట- ... ...

శ్లో॥ అధీరమాలోకితమార్ద్రజల్పితం గతఞ్చ గమ్భీరవిలాసమన్థరమ్। అమన్దమాలిఙ్గితమాకులోన్మదస్మితఞ్చ తే నాథ వదన్తి గోపికాః॥ ౨

టీక॥ హే నాథ- ఓ శ్రీకృష్ణస్వామి- తే - నీయొక్క - ఆలోకితం - చూచుట- అధీరం- చలనమునుగాను-గతం- నడచుటను- గంభీరవిలాసమంథరమ్-గంభీర- తెలియనశక్యమైన- విలాస- విలాసములచేత - మంథరం - మందమును- ఆర్ద్రజల్పితం- సరసంబుగామాటాడుటను- ఆకులోన్మదస్మితం-ఆకుల-వ్యాప్తమగు- ఉన్మద- మిక్కిలిమదముతోగూడిన - స్మితం - నగవునుగలదానిగా ఆలింగితం- కౌగిలించుటను- అమందం- గాఢమయినదానిగాను గోపికాః- గోపికలు- వదంతి- చెప్పుచున్నారు- ... ... ...

ఉ॥ అందము గుల్క నీ యలసయానము మాటల తేనెసోనమే। లైందుమ స్మితంపుసుధఁ జెందు కటాక్షము లౌర మించుకున్। విందులు గాఁగిలింతకును తియ్యటిచును గోపకాంతలా। నందముతోడఁ బల్కుదురు నాథ భవన్మహి సుభావమున్॥ ... ... ... ... ...

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తి నీచూపు నతిచపలంబుగను గమనంబు నతిమందంబు

లింగనంబునతిగాఢంబుగను - వచనంబునతివిలాససరసదరహాసంబుగనెల్లగోపికలుంబల్కుదురుగావున- నాకన్నుగవనీదర్శనంబుగోరుచున్నదియనుట.

శ్లో॥ అస్తోకస్మితభరమాయతాయతాక్షంనిశ్శేషస్తనమృదితంవ్రజాఙ్గనాభిః। నిస్సీమస్తబకితనీలకాన్తిధారన్దృశ్యాసన్త్రిభువనసున్దరం మహస్తే॥ ౨౮

టీ॥ అస్తోకస్మితభరం. అస్తోక- అధికమయిన- స్మిత - చిఱునగవనియెడి- భరం- భారముగలయట్టి- ఆయతాయతాక్షం- ఆయతాయత - దీర్ఘములైన వానితోసమములైన- అక్షమ్- నేత్రములుగలయట్టి-వ్రజాంగనాభిః- గోపస్త్రీలచేత - నిశ్శేషస్తనమృదితం - నిశ్శేష- మిగులులేనట్టుగాను - స్తన- స్తనములచేత. మృదితం- పీడింపఁబడినయట్టి - నిస్సీమస్తబకితనీలకాంతిధారం - నిస్సీమ- మేరలేనట్టుగాను- స్తబకిత- సంజాతగుచ్ఛములుగాజేయబడిన - నీల- నల్లనివియైన- కాంతి- కాంతులయొక్క - ధారం- ధారలుగలయట్టి- త్రిభువనసుందరం- త్రిభువన- మూఁడులోకములయందుండెడివారలకంటె - సుదరం - సుందరమైన. తే. నీయొక్క - మహః- తేజశ్శరీరము- దృశ్యాసం - చూచెదగాత.

ఉ॥ మబ్బుజిగిన్నగందగుసమంచితకోమలనీలదేహముక్ ।గుబ్బమిటారిచన్నవలక్రొద్దినివ్రేతలుగాఁగిలింపఁగా।నుబ్బుచుమందహాసరుచియొప్పఁగఁగొప్పగుకన్నుదోయిచే। నబ్బురమయినచక్కనియొయారపుదేజముఁగాంచెదన్మదిన్॥ ౨౮

తా॥ అతిశయంబగుమందహాసంబును మిక్కిలిగొప్పలగుకన్నులుంగలిగి గోపికలపాలిండ్లచేనధికంబుగ బీడింపంబడుచు మేరలేనినల్లనైనకాంతి ప్రవాహంబుగలిగిలోకత్రయంబునందుండు సోయగంబుల గుంపుకయివడివెలుంగునీ తేజశ్శరీరంబుజూచెదఁగాతయనుట. ... ... ...

శ్లో॥ మయిప్రసాదంమధురైఃకటాక్షైర్వంశీనినాదానుచరైర్విధేహి। త్వయిప్రసన్నేకిమిహాపరైర్నస్త్వయ్యప్రసన్నేకిమిహాపరైర్నః॥ ౨౯

టీక॥ వంశీనినాదానుచరైః- వంశీనినాద- వేణునాదమును - అనుచరైః. అనుసరించుచున్నయట్టి- మధురైః - మనోజ్ఞములైన- కటాక్షైః - కడకంటిచూపులచేత- మయి- సంసారబద్ధుఁడనైననాయందు- ప్రసాదం - అనుగ్రహమును- విధేహి- చేయుము- త్వయి(సర్వేశ్వరుఁడవయిననీవు)ప్రసన్నేసతి-ప్రసన్నుఁడవగుచుండ. ఇహ- ఈలోకమందు- అపరైః- ఇతరులతోడ- నః-మాకు- కిం- ఏమిప్రయోజనము- త్వయి- నీవు- అప్రసన్నేసతి- ప్రసన్నుండవుగాకుండ - ఇహ. ఈలోకమందు. అపరైః- ఇతరులతోడ- కిం. ఏమిప్రయోజనము.

ఉ॥ నీవుప్రసన్నదృష్టిఁ గరుణించిన నా గుణ మెట్టిదేని యుర్వీ । భావన మాను నీ కృపకుఁ బాత్రము గాక చరించు వేళ న । న్గావఁగ జాలరెవ్వరును గావున వేణురవానుసారిలీ । లావహ మౌ కటాక్షమున లాలన జేయుము నన్ను నందనందనా॥ ౨౯

తా॥ నీవు ప్రసన్నుండవైనప్పుడీలోకంబునఁ బరులతో నేమి ప్రయోజనంబు నీవు ప్రసన్నుండవు గాకయుండిన నీలోకంబున నితరులతోడ నేమి కార్యంబు కావున సంసారబద్ధుఁడనగు నాయందు వేణుగానంబు ననుసరించు మనోహరంబులగు కడకంటిచూపుల చేత ననుగ్రహంబు జేయుమనుట. ... ... ◈

శ్లో॥ నిబద్ధముగ్ధాఞ్జలిరేష యాచే నీరన్ధ్రదైన్యోన్నతముగ్ధకణ్ఠమ్ । దయామ్బుధే దేవ భవత్కటాక్షదాక్షిణ్యలేశేన సకృన్నిషిఞ్చ॥ ... ౩౦

టీక॥ ఏషః- ఈ నేను- నిబద్ధముగ్ధాంజలిస్సన్ - నిబద్ధ- కూర్పఁబడినయట్టి- ముగ్ధ- మూఢమయిన- అంజలిస్సన్- కేల్మోడ్పుఁగలవాడనై- నీరన్ధ్రదైన్యోన్నతముగ్ధకణ్ఠం- నీరంధ్ర- దట్టమయిన- దైన్య- దీనతచేత- ఉన్నత- ఎత్తఁబడిన- ముగ్ధ - గద్గదము గాఁ జేయఁబడిన - కణ్ఠం- కుత్తుకఁ గల్గునట్లుగాను- యాచే- యాచించుచున్నాను- దయాంబుధే- దయాసముద్రుఁడనయిన- హేదేవ - ఓ శ్రీకృష్ణస్వామి - భవత్కటాక్ష దాక్షిణ్యలేశేన - భవత్ - నీయొక్క - కటాక్ష- కడకన్నులయొక్క - దాక్షిణ్య - వితరణము యొక్క - లేశేన - కొంచెముచేత- సకృత్- ఒక్కమాఱు- నిషించ- తడుపుము- ... ... -- ◈

ఉ॥ వేమఱుఁ గేలుమోడ్చి నిను వేఁడెద నే నెలుఁగెత్తియు త్తఱిన్ । నా మొరయాలకింపు కరుణానిధి దీనశరణ్య సంతతో । ద్దామ భవత్కృపారస సుధామధురార్ద్రతరంగపాళిలో । నేమికొ యింత నాపయి నొకించుక నించిన నందనందనా॥ ◈

తా॥ ఓయి దయాసముద్రుడవైన శ్రీకృష్ణ కృపారసంబు దొలుకు కడకంటి చూపుల చేత నన్నొకపరి జూడుమనుచు నీసంసారబద్ధుండయిన యేను దైన్యంబున నెలుంగు రాల్పడం బ్రార్థించెదననుట అనగా నీకటాక్షదర్శనంబున శరభంగుడు మొదలగువారలవలె గృతార్థుఁడ నగుదుననుట. ... ... ◈

శ్లో॥ పిఞ్ఛావతంసరచనోచితకేశపాశే పీనస్తనీనయనపఙ్కజపూజనీయే। చన్ద్రారవిన్దవిజయోద్యతవక్త్రబిమ్బే చాపల్యమేతి నయనం తవ శైశవే నః॥ ౩౧

టీ॥ పిఞ్ఛావతంసరచనోచితకేశపాశే - పింఛ - నెమలిపురియను- అవతంస- భూషణముయొక్క - రచనా- అలంకారక్రియకు - ఉచిత- తగిన- కేశపాశే- సిగగలయట్టి - పీనస్తనీనయనపంకజ పూజనీయే - పీనస్తనీ - జవ్వనులయొ

క్క - నయన- నేత్రములనియెడు- పంకజ- కమలములచేత- పూజనీయే - పూజింపఁదగినయట్టి- చన్ద్రారవిందవిజయోద్యతవక్త్రబింబే- చంద్ర- చంద్రునియొక్క - అరవిందే- కమలములయొక్క- యు- విజయ- జయించుటయందు- ఉద్యత- ఉద్యుక్తమయిన- వక్త్రబింబే - ముఖమండలముగల - తవ - నీయొక్క - శైశవే- బాల్యమందు- నః- మాయొక్క - నయనం - నేత్రము- చాపల్యం - చపలత్వమును- ఏతి- పొందుచున్నది- ... ... ... ... ❖

మ॥ పొగరుల్ సిబ్బెపుగుబ్బలుబ్బగదమిన్ బూబోండ్లుగందోయిద । ళ్ళగమిన్ బూజలొనర్ప నెమ్మిపురి క్రొమ్మించుల్ సిగన్ దట్టమై । సిగుడన్ జందురుజౌకసేయుముఖకాంతిస్ఫీతమై యొప్పనీ । సొగసుంబ్రాయముఁజూచినా నయనముల్ సొంపొందగాగోరెడిన్॥ ... .. ... ... ౩౧

తా॥ నెమలిపురియనుభూషణంబుచేఁగైసేయఁదగినసిగగలిగిజవరాండ్రకన్నుఁదామరలచేఁబూజింపఁదగిచంద్రునికమలంబునుజయింప నుద్యుక్తం బగుచున్న ముఖమండలంబునుంగలిగిననీబాల్యంబందునామనంబాస జేయుచున్నదియనుట-

శ్లో॥ త్వచ్ఛైశవం త్రిభువనాద్భుతమిత్యవైమి యచ్చాపలఞ్చ మమ వాగవివాదగమ్యమ్ । తత్కిం కరోమి విరణన్మురళీ విలాస ముగ్ధంముఖాంబుజముదీక్షితుమీక్షణాభ్యామ్॥ ... ... ... ... ... ౩౨

టీక॥ త్వచ్ఛైశవం - త్వత్- నీయొక్క - శైశవం - బాల్యము- త్రిభువనాద్భుతం - త్రిభువన - మూఁడులోకములకును - అద్భుతం - ఆశ్చర్యసంపాదకమని- అవైమి-ఏఱుంగుదును-మమ-నాయొక్క - చాపలం చపలమైనది-యత్- ఏదిగలదో- తత్- అది- అద్భుతమ్- ఆశ్చర్యసంపాదకమని - అవైమి-ఎఱుంగుదును- వాగవివాదగమ్యమ్- వాక్- వాక్యములచేత - అవివాద- వివాదములేనట్టుగాను - గమ్యమ్ - తెలుసుకోఁబడినయట్టి- విరణన్మురళీవిలాసముగ్ధమ్ - విరణత్- మిక్కిలిమ్రోయుచున్న- మురళీ వేణువుయొక్క - విలాస - గానవిశేషములచేత- ముగ్ధం- సుందరమైన- ముఖాంబుజం - ముఖకమలమును- ఉదీక్షితుం- చూచెడికొఱకు- కింకరోమి- ఏమిచేయుదును- ... ... ❖

మ॥ పరమాశ్చర్యమునీదుశైశవముసెప్పన్ రాదులోకంబునన్ । వరుసన్నాచపలత్వమట్టిదయ నిర్వాచ్యంబు చర్చింపుమా । మురళీనాద సుధామనోరుహముఖాంభోజాతమీకన్నులన్ । బరిశీలింపఁగఁ గోరినాఁడ సులభంబా తారతమ్యక్రతల్॥ ... ... ... ... ౩౨

తా॥ నీబాల్యంబుముల్లోకంబులకు నాశ్చర్యంబుఁ బుట్టించెడిదియనియెఱుంగుదు విషయంబులవెంటనంటు నాచాపల్యంబునట్టిదయనియెఱుంగుదు నెఱింగియు నిర్వివాదంబుగ నావాక్కులకు విషయమై వేణుగానామృతంబు చేసుందరంబగు నీనెమ్మోముఁ దామరంజూడ గోరియున్నవాడ నేమి సేయుదుననుట. ◈

శ్లో॥ పర్యాచితామృతరసానిపదార్థభఙ్గీఫల్గూనివల్గితవిశాలవిలోచనాని। బాల్యాధికానిమదవల్లవభావితాని భావేలుఠన్తిసుదృశాంతవజల్పితాని॥ ౩౩

టీక॥ పర్యాచితామృతరసాని- పర్యాచిత- స్రవించుచున్న - అమృతరసాని- సుధారసముగలయట్టి- పదార్థభంగీఫల్గూని- పదార్థ- మణిసువర్ణాదులయొక్క - భంగీ- పఙ్క్తులయొక్క - ఫల్గూని- అసారముఁగలయట్టి- వల్గితవిశాలవిలోచనాని- వల్గిత- రతిమొదలగువానిసూచించు చేష్టలతోఁగూడినట్టి- విశాల- విశాలములైన- విలోచనాని నేత్రములఁగలయట్టి- బాల్యాధికాని - బాల్యాతిరిక్తములయినట్టి- మదవల్లవభావితాని- మద- యౌవనవంతులైన- వల్లవ-గోపకులచేత- భావితాని- చెప్పఁదగిన- తవ- నీయొక్క - జల్పితాని-వచనములు-సుదృశాం- విద్వాంసులయొక్క - గోపికలయొక్కయనియర్థాంతరము- భావే-మనస్సునందు- లుఠంతి- వర్తించుచున్నవి- ... ... ... ... ◈

ఉ॥ కమ్మనితేనియల్గులుకఁ గావలదేఱని మానికమ్ములన్। జిమ్ముచు బెళ్కుఁజూపులవిలసిల్లఁగ వల్లవభావితమ్ములై। యిమ్మగుబాల్యరీతి కెనయింపఁగ రానినిజోక్తి బాలిక। న్నెమ్మది నెంచి యెంచితమి నెక్కొనఁజేర్చినశౌరిగాంచెదన్॥ ❀

తా॥ స్రవించుచుండునమృతంబుఁగల్గి మణిసువర్ణాదులయందసారత్వంబుఁదెలుపునవియై రతిమొదలగువానిసూచించు చేష్టలంగలకన్నులంగలిగి బాల్యంబునతిక్రమించినవియై యౌవనవంతులగు గోపాలకులచే సంభావింపంబడిన నీవచనంబులు విద్వాంసులమనంబులయందుఁ దిరుగుడుపడుచున్నవియనుట॥ ◈

శ్లో॥ పునఃప్రసన్నేనముఖేందుతేజసాపురోవతీర్ణస్యకృపామహాంబుధేః। తదేవలీలామురళీరవామృతంసమాధివిఘ్నాయకదానుమేభవేత్॥ ౩౪

టీక॥ పునఃప్రసన్నేన- మిక్కిలిస్వచ్ఛమైన- ముఖేందుతేజసా - ముఖేందు- ముఖచంద్రునియొక్క - తేజసా - తేజస్సుతోఁగూడ-పురోవతీర్ణస్య- పురః-పురోభాగమందు- అవతీర్ణస్య- అవతరించిన - కృపామహాంబుధేః - దయాసముద్రుండైనశ్రీకృష్ణస్వామియొక్క - తత్ - అప్రసిద్ధమయిన - లీలా మురళీరవామృతం - లీలా - విలాసముతోఁగూడిన-మురళీరవామృతమేవ - అమృతమువంటి

వేణునాదమే- మే- నాయొక్క - సమాధివిఘ్నాయ-సమాధి-ధ్యానముయొక్క విఘ్నాయ- విఘ్నముకొఱకు- కదాను-ఎప్పుడు- భవేత్-అగును॥ ...

ఉ॥ అందెలుఘల్లుఘల్లురననాడుచు వేణువునందుగీతమానందముతోడఁబాడుచునునాటితెఱంగునఁగన్నుదోయికిన్ విందుఘటిల్లఁగట్టెదుటనిల్చి ప్రసన్నముఖాంబుజంబుతో నందకుమారుఁడెన్నఁటికొనర్చునొ నాదుసమాధిభంగముల్॥

తా॥ మిక్కిలిస్వచ్ఛంబగు నెమ్మొగంబును చందురునితేజంబుతోఁ దయాసముద్రుండై నాముందటంగానుపించిన శ్రీకృష్ణమూర్తియొక్క విలాసంబుతోఁ గూడిన వేణుగానంబు నాసమాధి నెప్పుడు సెఱుచుఁగాతయనుట॥ ... -

శ్లో॥ భావేనముగ్ధచపలేనవిలోకనేన మన్మానసేకిమపిచాపలముద్వహంతం। లోలేనలోచనరసాయనమీక్షణేన లీలాకిశోరముపగూహితుముత్సుకోస్మి॥

టీ॥ ముగ్ధచపలేన - ముగ్ధ - సుందరమయిన- చపలేన- చపలమైనట్టి- విలోకనేన - చూపుచేత - భావేన- చేష్టచేతను-మన్మానసే-మత్ - నాయొక్క -మానసే- చిత్తమందు- కిమపి-అనిర్వాచ్యమైన- చాపలం- చపలత్వమును-ఉద్వహంతం- చేయుచున్నట్టి- ఈక్షణరసాయనం- ఈక్షణ- చూపులకు-రసాయనం-తే. హ్యవిశేషమైన- లీలాకిశోరం-లీలా- విలాసముతోఁ గూడిన- కిశోరం - బాలుడైన శ్రీకృష్ణుని - లోలేన- శ్రీకృష్ణదర్శనాకాంక్షియగు- ఈక్షణేన- చూపుచేత- ఉపగూహితుం- ఆలింగనము జేయుకొఱకు- ఉత్సుకోస్మి- ఉద్యుక్తుఁడనైతిని॥

ఉ॥ చక్కనిమోముతోఁ జెలిమిసల్పెడు ముద్దులకోడిగంబుతోఁ జొక్కపునవ్వుతోఁ బెళుకుచూపులతోఁ దమిఁగోల్పుబాలకుం। డక్కనకక్కఁజేర్చుకొని కన్నులపండువుగామనంబులో । నక్కఱదీరఁగాంచెదనహర్నిశముల్ వసుదేవభాగ్యముల్॥ ... ... ... ... ౩౫

తా॥ సుందరంబగుచూపుచేఁ జెప్పనలవిగానిచపలంబగు చేష్టచేతను నామనంబు జలింపంజేయుచున్నకన్నులపండువగు బాలకృష్ణమూర్తిని మిక్కిలియాసక్తిం జేయుచూపుచే గాగిలింప నుద్యుక్తుండనైతిననుట॥ ... ...

శ్లో॥ అధీరబింబాధరవిభ్రమేణ హర్షార్ద్రవేణుస్వరసంపదా చ। అనేనకేనాపిమనోహరేణ హాహంతహాహంతమనోధునోతి॥ ... ౩౬

టీక॥ కేనాపి- నిర్వచింపనశక్యమయినట్టి - మనోహరేణ - మిక్కిలిమనోజ్ఞమైన- అనేన- ఈతోచుచున్న-అధీరబింబాధరవిభ్రమేణ- అధీర-చపలమైన-బింబ- దొండపండువంటి- అధర- అధరోష్ఠముయొక్క -విభ్రమేణ-విలాసముచేత

హృద్యార్ద్రవేణుస్వరసంపదా చ - హృద్య- మనోజ్ఞములుగా జేయంబడిన - ఆర్ద్ర- సుఖకరములైనట్టి- వేణుస్వర- పిల్లనగ్రోవియందలిస్వరములయొక్క - సంపదా చ- సమృద్ధిచేతను- మనః- మనస్సు- ధునోతి- చలించుచున్నది- హాహంత- అన్యాయము- హాహంత- అన్యాయము॥ ... ... ... ... ❁

మ॥ చలబింబాధరలీలగ్రోమ్మొయుంగుంగా శారీరకాంతిచ్ఛటల్ । జలదాసీకముగా రణ మురళిగర్జారీతిగా నెంచిని । చ్చాలు నాట్యంబు మనోమయూర మొనరించన్నై చ్చ్వకందోయికిన్ ఫలమీ మోహనరూపముం గనెదు సౌభాగ్యంబు చింతింపగన్॥

తా॥ మనోహరంబగుచుం జెప్పనలవిగాకయుండి యీముందటం దోచున్న చలించుచున్న కెమ్మోవి- లీలచేతను మనోహరంబుగాం జేయబడిన వేణునాదసంపదచేత- నామనంబు చలించుచున్నదియనుట॥ ... ... ❁

శ్లో॥ యావన్న మే నిఖిలమర్మదృఢాభిఘాతనిస్సంధిబంధన ముదేతి నవోపతాపః।
తావద్విభో భవతు తావకవక్త్రచంద్రచంద్రాతపద్విగుణితా మమ చిత్తధారా॥

టీక॥ హే విభో- ఓయిశ్రీకృష్ణ - నవోపతాపః - మరణవేదనా విశేషము. మే- నాయొక్క - నిఖిలమర్మదృఢాభిఘాతనిస్సంధిబంధనం - నిఖిల- సమస్తమైన- మర్మ- నెఱకులయందు- దృఢ - మిక్కిలి- అభిఘాత- కొట్టుటచేత- నిస్సంధిబంధనం- వోగొట్టబడిన అవయవవిశేషములు గలుగునట్లుగాను- యావత్- ఎంతకాలము. నోదేతి- పుట్టకయుండునో- తావత్- అంతపర్యంతము- మమ- నాయొక్క - చిత్తధారా- చిత్తపరంపర- తావకవక్త్రచంద్రచంద్రాతపద్విగుణితా - తావక। నీసంబంధియయిన- వక్త్రచంద్ర- ముఖచంద్రునియొక్క - చంద్రాతప - వెన్నెలచేత- ద్విగుణితా- రెండింతలుగాచేయంబడినది- భవతు అగుగాత॥ ❁

మ॥ శతవర్షంబులమీందనొందుదురవస్థన్ జెందిలోంగుందిచా । ధితస్థైయింద్రియగోళమ్ములిమ్ముగులసంధీభూతముల్గాకముం। దతినుప్పొంగెడుంగాతదీవకసుధాధారాళ వేణుస్వనో। న్నతలావణ్య రమానివాసముఖ చంద్రజ్యోత్స్న నాముందటన్॥ .. ... ... ... ... 3

తా॥ ఓయిశ్రీకృష్ణమూర్తీ - ఎంతకాలంబు సమస్తమర్మస్థానఘాతంబ్రిజిలునవయవంబులు గలుగునట్టు నాకు మరణంబు దోపకయుండునో అంతర్యంతంబును నేత్రమార్గంబున వెడలు నాచిత్తపరంపర నీ నెమ్మోముచందు వలనం బొడము వెన్నెలచేనుప్పొంగుగాతయనుట. ... ...

శ్లో॥ యావన్న మే నరదశా దశమీ దృశోపి రన్ధ్రాదుదేతి తిమిరీకృతసర్వభావా।

వణ్యాకేళిసదనస్తవతావదేవలక్ష్మ్యాసముత్క్వణితవేణుముఖేందు బింబమ్॥

టీక॥ తిమిరీకృతసర్వభావా - తిమిరీకృత- చీకటులుగాఁజేయఁబడిన - సర్వ- సమస్తమైన- భావా- పదార్థములుకలిగిన- దశమీ. పదియవదియైన- పరదశా- నర- మనుష్యులయొక్క - దశా- అవస్థ - మే- నాయొక్క - దృశః- నేత్రములయొక్క - రన్ధ్రాత్- రంధ్రమువల్లను- యావత్- ఎంతకాలము- నోదేతి - పుట్టదో- తావత్- అంతపర్యంతము- లక్ష్మ్యా- సౌందర్యముచేత- లావణ్యాకేళిసదనం- లావణ్యా- కాంతివిశేషమునకు- కేళిసదనం- క్రీడాగృహమైనట్టి- తవ- నీయొక్క - సముత్క్వణితవేణుముఖేందుబింబం సముత్క్వణిత- మిక్కిలియుత్పత్తియగుచున్నధ్వనివిశేషముగల - వేణు- పిల్లనగ్రోవిగలిగిన - ముఖ - ముఖమనియెడి- ఇందుబింబం- చంద్రబింబమును-చిత్తధారా- చిత్తపరంపర- మేతు- పొందుగాత- ఈరెండుశ్లోకంబులకు దాత్పర్యం బొక్కటియగాన - నాంధ్రకవిపద్యంబొక్కటియె సెప్పెనని తెలియునది- ... ❖

శ్లో॥ ఆలోలలోచనవిలోకనకేళిధారానీరాజితాగ్రసరణేఃకరుణామ్బురాశేః।
ఆర్ద్రాణివేణునినదైఃప్రతినాదపూర్ణై రాకర్ణయామిమణినూపురశింజితాని॥

టీ॥ ఆలోలలోచనవిలోకనకేళిధారానీరాజితాగ్రసరణేః- ఆలోల-చంచలములైన- లోచన-నేత్రములుగలగోపస్త్రీలయొక్క - విలోచన- చూపులయొక్క -కేళి - విలాసములతోఁగూడిన-ధారా- పఙ్క్తులచేత-నీరాజిత- నివాళింపఁబడిన-అగ్రసరణేః-పురోభాగముగల- కరుణాంబురాశేః- దయాసముద్రుఁడైన శ్రీకృష్ణమూర్తియొక్క - ప్రతినాదపూర్ణైః-ప్రతినాద-ప్రతిధ్వనులచేత-పూర్ణైః- సంపూర్ణములైన- వేణునినదైః- వేణుధ్వనులతోఁగూడి- ఆర్ద్రాణి- రసవంతేములైన- మణినూపురశింజితాని- మణి- రత్నమయములైన- నూపుర- కాలియందెలయొక్క - శింజితాని- ధ్వనులను- అకర్ణయామి- వినుచున్నాను- ❖

మ॥ ననురక్షించుకృపాపయోధియగుకృష్ణస్వామిలోలావలోకనధారారతిగోపకారతలొసంగంజూచుచున్స్వీకమై। జనుదెరఁబ్రతినాదపూరమురళీసంగతతాళానురం। జనమంజీరరవామృతంబుచెవినించఁగవిందునింపొందఁగన్॥

తా॥ చంచలంబులగుతనచూపులయందలి విలాసంబులచే నివాళింబడుచున్నపురోభాగంబుగలదయాసముద్రుఁడైనశ్రీకృష్ణునియొక్క ప్రతిధ్వనులచే నగను వేణునాదంబులతోఁగూడిన రత్నమయంబులైన కాలియందియల నాదంబు వినుచున్నానను‌ట. ... ... ... ... ... ❖

శ్లో॥ హే దేవ హే దయిత హే జగదేకబంధో హే కృష్ణ హే చపల హే కరుణైకసింధో। హే నాథ హే రమణ హే నయనాభిరామ హా హా కదానుభవితాసి పదం దృశోర్మే॥ ... ... ... ... ... ४०

టీక॥ హే దేవ- ఓయి దేవ- హే దయిత- ఓయి ప్రియుఁడ - హే జగదేకబంధో- ఓయి జగద్బంధుఁడ- హే చపల - ఓయి చపలుఁడ - హే కరుణైకసింధో. ఓయి దయాసముద్రుఁడ- హే నాథ- ఓయి నాథుఁడ- హే రమణ- ఓయి రమణుఁడ - హే నయనాభిరామ- ఓయి నేత్రమనోహరుఁడ- హే కృష్ణ- ఓయి కృష్ణుఁడ. మే- నాయొక్క - దృశోః- నేత్రములయొక్క - పదం- విషయము- హా హా- అకటా- కదాను- ఎప్పుడు- భవితాసి- అగుచున్నావు- ... ...

శా॥ఓ దేవోత్తమ యో రమేశ దయితా యో లోకరక్షామణీ। యో దామోదర కృష్ణ చంచలహరీ యో సత్కృపాంభోనిధీ। యో దీనావననాథ యో రమణ నిన్నొప్పారు రమ్యాకృతిన్। మోదంబొప్పగ జూతు నెన్నటికి నా మోహంబు సన్నిల్లగన్

తా॥ లీలాశుకుండు ప్రత్యక్షుండగు శ్రీకృష్ణుని గనుంగొని యతం డీయాకారణంబుల నగపడకుండునో యని యూహించి తదనుకూలంబులగు నుత్తరంబులఁ శ్రీకృష్ణమూర్తినిఁ గూర్చి విన్నపంబుఁ జేయుచున్నాఁ డదియెట్టులనిన ఓకృష్ణమూర్తీ అకటా నాకన్నుల కెన్నటికిం దోచెదవో యని ప్రార్థించి అప్రకాశమానుండగు నేను నీ కెటుల ప్రత్యక్షుంబుగా నేర్తునని శ్రీకృష్ణుండు పల్కునో యని శంకించి దేవుండవు గాన స్వతస్సిద్ధ ప్రకాశ భావంబు నీయందదయునికి జేసి నాకగపడుట కేమి కొఱంతయని విజ్ఞాపనం బొనరించి స్వతస్సిద్ధ ప్రకాశభావంబు నాయందు గలిగియుండినను నాకు నీవు ప్రేమాస్పదుండవు గావు గాన నీకు నే గానుపించననునో యని శంకించి ఓయి కృష్ణ నీవు నాకు దయితుండవు గావున నీకు నే ప్రేమాస్పదుండఁ గాక పోవు టెట్లని వివరించి ఓయి నాకు నీవు ప్రేమాస్పదుండవయినను నీయట్టివానికి మఱియెవ్వనికైన నగపడుదుం గాక నీకగపడననునో యని యూహించి చపలుండవు గావున చాపల్యంబునం జేసి నాకనలకగపడి యెదవని వచియించి చాపల్యంబునం జేసి నీకు నే నగపడకయుండెదననో యని యెంచి కరుణైకసింధుండవు గానఁ జాపల్యంబుకన్న దయయధికంబు నియందుండుటం జేసి యవశ్యంబును నీవు నాకుం గానంబడవలయు నని విన్నవించి దయాసముద్రుండవయ్యును నీకు నాకు నేమి విశేషసంబంధంబుగ న ప్రత్యక్షుం బగుదుననునో యని యాలోచించి నాకు నీవు నాథుండవు గావున స్వామిభావరూపవిశేషసంబంధంబు నీకు నాకుం గలిగియుండునది కారణ

గనాయుండటం దోచుటనీ కవశ్యకర్తవ్యంబని వేడుకొని ఇట్టివిశేష సంబంధంబు నాకెల్లరయందుండుటం జేసి బహుస్త్రీనాయకుండగు వాఁడొక్కతెయందవిశేషానురాగంబు జేయుఛగిది యేనొకనికింగా నంబడియెద ననునోయని తలంచి రమణుండవై నకతంబున నెల్లరయందు నిరుపాధికుఁడవై సమంబు గరమియించుటనీకు స్వభావంబు కదా దానం జేసి యైనను ప్రత్యక్షుండవు గావలయునని ప్రార్థించి రమణుండనైనను నీమనంబునందరమియించెదం గాక కన్నులకెటులంగా నంబడియెద నను నోయని తలంచి నయనాభిరాముండవు గావున నాకన్నులకుం బడుపుగ ప్రత్యక్షుంభాసంగుటయెన్నఁడొకో యని ప్రార్థించుచునను ట. ❖

శ్లో॥ అమూన్యధన్యాని దినాన్తరాణి హరే త్వదాలోకనమన్తరేణ। అనాథబన్ధో కరుణైకసిన్ధో హా హన్త హా హన్త కథం నయామి॥ ... ౪౧

టీక॥ కరుణైకసింధో - దయాసముద్రుఁడవైనయట్టి- అనాథబంధో- దీనబంధుఁడవైన- హేహరే- ఓకృష్ణ- త్వదాలోకనమంతరేణ - నీదర్శనంబు మాని- అధన్యాని- కృతార్థములుగాని- అమూని - ఈదర్శనరహితములయిన - దినాంతరాణి- దినములను- హాహంత- అకటకటా- కథం- ఏప్రకారము- నయామి- గడుపుచున్నాను- ... ... ... ... ❖

శా॥ నిన్నుం గానక నీకథల్వినక నిన్నే మాటుఁజిత్తంబులో। నెన్నం జాలక నిన్నుఁ జేరొకనక నిన్నే వేళఁ బూజింపలే। కన్నాయాతన నికేత నాంగణ నిధీ యయ్యో దయావారిధీ। యెన్నే నిందిన ఘుల్ క్రమించితి వృథా యేమందు నాదుర్దశ॥

తా॥ దయాసముద్రుఁడవై దీనబంధుండవైన యోకృష్ణ నీదర్శనంబులేక కృతార్థంబులు గానియీదినంబులనకటకటా యేవిధంబున గడపఁజాలుదునే నుట.

శ్లో॥ కిమిహ శృణుమః కస్య బ్రూమః కథం కృతమాశయా కథయత కథామన్యాం ధన్యామహో హృదయేశయః। మధురమధురస్మేరాకారే మనోనయనోత్సవే కృపణకృపణా కృష్ణే తృష్ణా చిరం బత లమ్బతే॥ ... ... ౪౨

టీక॥ బత- ఓజనులార- మధురమధురస్మేరాకారే- మధురమధుర-సుందరసదృశమైనయట్టి- స్మేర - కాంతియుతమయిన- ఆకారే- ఆకృతిగలయట్టి- మనోనయనోత్సవే- మనః- మనస్సునకు- నయన- నేత్రములకు- ఉత్సవె- సంతోషకారణుఁడైన- కృష్ణే- శ్రీకృష్ణమూర్తియందు- కృపణకృపణా- కృపణసదృశమైన- తృష్ణా- ఆశ- చిరం- బహుకాలమునుండి - లంబతే- అవలంబించుచున్నది- ఆశయా- ఆశచేత- కథం- ఏప్రకారము కృతం- చేయఁబడెను- కస్య- ఎవ్వనికి- బ్రూ

మః- చెప్పుదుము- కిం. ఏమి- శృణుమః- వినుదుము- కృష్ణః- కృష్ణుఁడు - హృదయేశయః- హృదయమందున్నాఁడు- అహో- ఆశ్చర్యము- అన్యాం- మఱియొకటైన- ధన్యాం- కృతార్థమైన- కథాం- కథను- కథయత- నుడువుడు. ❖

శా॥ ఏశాస్త్రంబులయందు నే గురునితో నేమందు నెట్లువ్వొకో। యాశల్ ధన్యులు దెల్పలేరకద ప్రత్యక్షంబుగా నద్దయా। రాశిన్ నేత్రమనోభిరాముస్మితవక్త్రప్రాభవుం యాదవా। ధీశున్ గోరెడుదీయ తృష్ణ యకటా దీనత్వముల్ జెందెడిన్॥

తా॥ అధికసౌందర్యసంపన్నంబగు నాకారంబుగల్గి వనంబునకును నేత్రంబులకును సంతోషంబుఁ జేయనోపు శ్రీకృష్ణుని యందు చిరకాలంబునుండియధికంబయిన యాస యవలంబించుచున్నది - యిట్టియాసచే నేమి సేయువాఁడనెవ్వఁ లననేమి వినుదునో జనులార కృష్ణుఁడు హృదయంబున నున్నవాఁడతనిం గాంచుట కుపాయంబును డువుడనుట. … … … … ❖

శ్లో॥ ఆభ్యాం విలోచనాభ్యామమ్బుజదళలలితలోచనమ్బాలం। ద్వాభ్యామపి పరిరబ్ధుం దూరే మమ హన్త దైవసామగ్రీ॥ … … ౪౩

టీక॥ ఆభ్యాం- ఈపర్వతాదిమహద్వస్తువులం జూడసమర్థములైన యట్టి ద్వాభ్యాం- రెండైన- విలోచనాభ్యాం- మిక్కిలియుఁ జూడసమర్థములైన కన్నులచేత. అంబుజదళలలితలోచనం - అంబుజదళ - తామరరేకులవలెను - లలిత సుందరములైన- లోచనం- నేత్రములుగల- బాలం- అర్భకుఁడైన శ్రీకృష్ణుని- పరిరబ్ధుం- ఆలింగనముఁ జేయుటకొఱకు- దైవసామగ్రీ- అదృష్టము- దూరే- దూరమగుచున్నది- హంత- అన్యాయము॥ … … … ❖

ఉ॥ ముద్దులుగుల్కు బాలుఁడని ముచ్చటఁ గౌఁగిటఁ గ్రుచ్చియెత్తఁగా। నొద్దికమై మెలంగెడు భుజోన్నతికంబురు హాత్కుఁడంచు నే। ప్రొద్దును వేడ్కఁ జూడఁ దలపోసినఁ జిక్కఁడు గన్నదోయికిన్। గొద్దికిమీఱె దైవమనుకూలము గామికి నేమి సేయుదున్॥ … … … … … ౪౩

తా॥ పర్వతాదిమహాద్వస్తువులం గాంచనోపినవియైన నిర్దోషంబులగు నీరెండు కన్నులచే నర్భకుండగు పుండరీకాక్షు నొకనిం జూడఁ గోరు నాకు దైవంబనుకూలింపదయ్యె నకటా యనుట. … … … … ❖

శ్లో॥ అశ్రాంతస్మితమరుణారుణాధరోష్ఠం హర్షార్ద్రద్విగుణమనోజ్ఞవేణుగీతం। విభ్రామ్యద్విపులవిలోచనార్ధముగ్ధం వీక్షిష్యే తవవదనామ్బుజం కదా ను॥

టీక॥ అశ్రాంతస్మితం- అశ్రాంత- ఎడతెగని- స్మితం- చిఱునగవుగలయట్టి-

అరుణారుణాధరోష్ఠం- అరుణారుణ- ఎఱ్ఱనగు దానితో సమమైన- అధరోష్ఠమ్- అధరము గలయట్టి- హర్షార్ద్రద్విగుణమనోజ్ఞవేణుగీతం- హర్షార్ద్ర- సంతోషంబుతోఁగూడి- ద్విగుణ- రెండంతలై- మనోజ్ఞ- మనోహరంబగు- వేణుగీతం- వేణుగానమునుఁగలయట్టి- విభ్రామ్యద్విపులవిలోచనార్ధముగ్ధం- విభ్రామ్యత్ చలించుచున్న- విపుల- వెడలుపులగు- విలోచన- కన్నులయొక్క- అర్ధ- ఏకదేశముచేత- ముగ్ధం- సుందరమైన- తవ- నీయొక్క- వదనాంబుజం- ముఖకమలమును- కదాను- ఎప్పుడు- వీక్షిష్యే- చూచుచున్నాను. ... ...

మ॥ మురళీగానసుధాధునీకలితసమ్మోదంబునిండారగా। నరమోదప్పొంగనుదోయిఁ బెల్కుమరఁగా నాతామ్రబింబాధర। స్ఫురణ న్వాన్నెలతేటలేనగవు లన్సొంపొందు నెమ్మోముఁదా। మరసేవింపఁగఁగల్గునుత్సవము సంభావించుటింకెన్నఁడో॥ ... ... ... ... ... ౪౪

తా॥ ఎడతెగని చిఱునగవు గలిగిమిక్కిలి యెఱ్ఱనగు నధరోష్ఠంబుగలిగిసంతోషంబునం జేసిద్విగుణంబై మనోహరంబైన వేణుగానంబుఁగలిగి చలించుచున్నదై యేకదేశంబుచే సుందరంబై వెలుంగు నీ నెమ్మోముఁ దామరనెన్నటికిఁ గాంచుచున్నానను. ... ... ... ...

శ్లో॥ లీలాయతాభ్యాం రసశీతలాభ్యాం నీలారుణాభ్యాం నయనాంబుజాభ్యాం। ఆలోకయేదద్భుతవిభ్రమాభ్యాం కాలేకదా కారుణికః కిశోరః॥

టీక॥ కారుణికః- దయాప్రధానుఁడగు- కిశోరః- బాలకృష్ణమూర్తి- లీలాయతాభ్యాం- లీలా- విలాసములచేత- ఆయతాభ్యాం- పొడవులయినయట్టి- రసశీతలాభ్యాం- రస- శృంగారరసముచే- శీతలాభ్యాం- మనోహరములయినయట్టి- నీలారుణాభ్యాం- నీల- నల్లనయినట్టి- అరుణాభ్యాం- ఎఱ్ఱనయినయట్టి అద్భుతవిభ్రమాభ్యాం- అద్భుత- ఆశ్చర్యసంపాదకములైన- విభ్రమాభ్యాం విలాసములుగల- నయనాంబుజాభ్యాం- నేత్రకమలములచేత- కాలేకదా- ఏ కాలమందు- మామ్- నన్ను- ఆలోకయేత్- చూచును॥ ...

ఉ॥ ఎన్నికల్వచెల్వులోకదిక్కున నొక్కెడఁగమ్మఁ జిమ్మక్రొ। మ్మిన్నలగ్రుమ్మరించునవమేచకశోణితమించుమించులీ। లన్నగసించునిస్తులవిలాసరసాయతశీతలంబులౌ। కన్నులనన్ను నెన్నటికిగాంచునొ బాలకుఁడాదరంబునన్॥

తా॥ విలాసంబులచే నతిశయిల్లిశృంగారరసంబునుం జేసి యతిమనోహరంబులై నీలారుణ కాంతులం దేజరిల్లి యాశ్చర్యకరంబులగు విలాసంబులం గలిగి

వెలయుకన్నుఁదామరలచే దయాప్రథోనుండగు బాలకృష్ణుండెన్నటికి నన్నుఁ జూచునోయనుట॥ ... ... ... ... ... ౪

శ్లో॥ బహుళచికురభారమ్బద్ధపింఛావతంసం చపలచపలనేత్రం చారుబి మ్బాధరోష్ఠం। మధురమృదులహాసం మందరోదారలీలం మృగయతి నయనం మేముగ్ధవేషంమురారేః॥ ... ... -- ... ౪౬

టీక॥ బహుళచికురభారం - బహుళ- గొప్పదైన- చికురభారం- కేశస మూహముఁగలయట్టి- బద్ధపింఛావతంసం- బద్ధ - కూర్పబడిన - పింఛ - నెమ లిపురి- అవతంసం- శిరోభూషణముగాఁగలయట్టి - చపలచపలనేత్రం- చప లచపల- చంచలసదృశములైన- నేత్రం - కన్నులుగలయట్టి-మధురమృదులహా సం- మధుర- మనోజ్ఞమైన- మృదుల- కోమలమైన- హాసం-నవ్వుగలయట్టి-మం దరోదారలీలం- మందర- మందరపర్వతముయొక్క - ఉదార- గంభీరములగు- లీలం- విలాసముగలయట్టి- మురారేః- శ్రీకృష్ణునియొక్క - ముగ్ధవేషం- ముగ్ధ- సుందరమైన- వేషం- వేషమును- మే- నాయొక్క - నయనం-నేత్రము-మృగయ తి- వెదకుచున్నది- ... ... ... ... ... ❁

చ॥ లలితవుఁగెంపుసొంపుఁగళలన్విలసిల్లెడు మోవినవ్వుఁదే। టలునునుగొ ప్పకొప్పునఁబెడంగగు పింఛముబెళ్కు చూపులున్। సలలితమందరాద్రి ధృతి సంపదయుంజెలువారుశౌరిమం। జులతరవేషము న్వెదకిచూడఁగనాకనుదో యిగోరెడిన్॥ ... ... ... ... ... ౪౬

తా॥ గొప్పయగుకొప్పుపైనలంకరించిన నెమలిపురిదండలనుచంచలంబుల గునేత్రంబులనుసుందరంబైన దొండపండువంటి యధరంబునుమనోజ్ఞంబైకో మలంబైనసగవునుమందరసమానంబగుధైర్యంబునుంగల్గిన శ్రీకృష్ణునిసుందరవే షంబునునాకన్నుదోయిచూడంగోరియున్నదనుట॥ ... ... ❁

శ్లో॥ బహులజలదచ్ఛాయాచోరంవిలాసభరాలసంమదశిఖిశిఖాలీలోత్తం సంమనోజ్ఞముఖామ్బుజమ్। కమపికమలాపాంగోదగ్ర ప్రసన్నజగజ్జితంమధు మపరిపాకోద్రేకంవయంమృగయామహే॥ ... ... ౪౭

టీక॥ బహులజలదచ్ఛాయాచోరం- బహుల- అధికమగు- జలద- ఉదకమ నుఇచ్చుచున్న మేఘమునుయొక్క - ఛాయా- కాంతిని-చోరం-దొంగిలించుచున్న యట్టి- విలాసభరాలసం- విలాసభర- విలాసములచేత- అలసం - అలసుఁడైన యట్టి- మదశిఖిశిఖాలీలోత్తంసం-మదశిఖి- మత్తమయూరముయొక్క - శిఖా-పిం

ఘనే - లీలా - విలాసార్థమయిన- ఉత్తంసం- భూషణముగలయట్టి - మనోజ్ఞముఖాంబుజం- మనోజ్ఞ- సుందరమైన- ముఖాంబుజం - ముఖకమలముఁగలయట్టి - కమలాపాంగోదగ్రప్రసన్నజగజ్జితం - కమల- తామరరేకులవంటి-అపాంగ - కడకన్నులయొక్క - ఉదగ్ర- లేశములచేత - ప్రసన్న- కృతార్థముగాఁజేయబడిన- జగత్- లోకములందలి- జితం- తుచ్ఛపదార్థములుగలయట్టి - కమపి- అనిర్వాచ్యమయిన- మధురిమపరీపాకోద్రేకం - మధురిమ-సౌందర్యములయొక్క - పరిపాక- పరిపాకముయొక్క - ఉద్రేకం- అతిశయముగలకృష్ణుని- వయం - మేము- మృగయామహే - వెదకుచున్నాము॥ ... ... ❁

మ॥ తనకారుణ్యకటాక్షవీక్షణముచేఁదైత్రిలోక్యజాడ్యంబులెల్లనివర్తింపమనోహరాననముతోలావణ్యవేషంబుతో।ఘనధారాధరకాంతితో శిఖిశిఖాకర్ణావతంసంబుతో। ననువైయుండెడువానినారయుచునుద్యత్ప్రీతిసేవించెదన్॥

తా॥ నీలమేఘంబుబోలెనల్లనగుశరీరకాంతిగల్గియొయ్యారంబులనలసుందరైనెమలిపురికర్ణావతంసంబుగల్గిమనోజ్ఞంబగుముఖకమలంబుగల్గి తామరరేకులవంటికడకన్నులచేనెల్లలోకంబులనుపవిత్రంబులుగాఁజేయుచు సౌందర్యాతిశయంబుచేదేజరిల్లివెలయుశ్రీకృష్ణదేవునినేవెదకుచున్నాననుట॥ .. ... ❁

శ్లో॥ పరామృశ్యస్దూరేపరిషదిమునీ[illegible]జవధూదృశాన్దృశ్యం శశ్వత్త్రిభువనమనోహారివదనం। అనామృశ్యంవాచామనిదముదయానామపికదాదరీదృశ్యేదేవందరదళితనీలోత్పలనిభం॥ ... ... ... ౭౮

టీక॥ అనిదముదయానాం-ఇట్టిదేశకాలంబులనుదయించినవనితెలియనలవిగాని- వాచాం- వేదాంతవాక్యములచేత - అనామృశ్యం- ప్రతిపాదింపసలవిగానివాఁడుగనుకనే- పరిషది - పుణ్యస్థలవిశేషమందు- మునీనాం - వేదాంతవిదులైనమునులకు- పరామృశ్యమపి - మనోగమ్యుఁడయినప్పటికిని- దూరే-దూరుఁడగును- వ్రజవధూదృశాం- వ్రజవధూ-గోపస్త్రీలయొక్క - దృశాం- నేత్రములచేత- దృశ్యం- చూడదగినట్టి - శశ్వత్ - వాలాయముగాను- త్రిభువనమనోహారివదనం-త్రిభువన- ముల్లోకములకును-మనోహారి- మనోజ్ఞంబగు-వదనం- ముఖముగలయట్టి- దరదళితనీలోత్పలరుచిం- దరదళిత - కొంచెముగావిరిసిన- నీలోత్పల - నల్లకలువలయొక్క - రుచిం - కాంతివంటికాంతిగల - దేవం- దేవుడయినకృష్ణుని - కదా- ఏసమయమందు - దరీదృశే-లెస్సగాఁజూచుచున్నాను॥ ❁

మ॥ మదిలోనిల్పెదగోపికాసయన పద్మశ్రేణికెల్లప్పుడున్। విదితంబైమునిం

నాయకాగ్రసరకన్వేషింపగామూఁగమై। యిదమిత్థంబని వేదపాళికనువైదొ
చకఁ బఠించఁగా ముదల్తుదలేనట్టినవోత్పలాభమగువస్తున్మోహనాకారముః॥

తా॥ ఇట్టిదేశకాలంబులంబొడమిననియని తెలియసలవిగానివేదాంతవా
క్యంబులచేఁబ్రతిపాదింప నశక్యుండగుటకనే నైమిశారణ్యాది పుణ్యస్థలంబుల
దుండునతీత వేదాంతులైన మునులమనంబులకు గమ్యుండయ్యును దూరుండగు
చుగోపస్త్రీనేత్రంబులచేఁజూడఁదగిముల్లోకంబులవారలకునుమనోజ్ఞంబగుమ
ఖంబుచేఁదేజరిల్లియుఁగలిసిన నల్లకలువలకాంతింబోనికాంతిచే వెలయుశరీరంబు
గలిగివెలుంగుదేవునినెప్పుడుచూచుచున్నాననుట॥ ... ... ❁

శ్లో॥ లీలామ్బుజాననమధీరముదీక్షమాణం నర్మాణి వేణువివరేషు నివేశయన్తం। లో
లాయమాననయనం నయనాభిరామం వందే కదానుదయితం వ్యతిలోకయిష్యే

టీక॥ లీలాంబుజాననం- లీలా- విలాసముతోఁగూడిన - అంబుజ- కమలమ
వంటి- ఆననం- ముఖముగలయట్టి- అధీరం- చంచలమగునట్లుగాను-ఉదీక్షమా
ణం- చూచుచున్నయట్టి - వేణువివరేషు- వేణు - పిల్లనగ్రోవియొక్క - వివరే
షు- రంధ్రములయందు- నర్మాణి- సంకేతములను- నివేశయంతం - ప్రవేశిం
పఁజేయుచున్నట్టి- లోలాయమాననయనం - లోలాయమాన- ఈషచ్చంచల
ములైన- నయనం - నేత్రములగలయట్టి- నయనాభిరామం - నయన-నేత్రము
లకు- అభిరామం- ఆహ్లాదమునుఁజేయుచున్న- దయితం - ప్రియుఁడైనకృష్ణు
ని- కదాను- ఎప్పుడు- వ్యతిలోకయిష్యే-చూచుచున్నాను-కదాను-ఎప్పుడు-వం
దే- నమస్కరించుచున్నాను॥ ... ... ... ... ❁

ఉ॥ ఏతఱిఁజూచిమ్రొక్కఁగలనేతఱిఁజూచునతండునన్సరో। జాతమృదు
స్మితాననునిఁజంచలలోచను వేణుగీతసం। కేతముచేతఁగోపికలఁగేళికినైజతఁ
గూర్చునేర్పరిః। నూతనపంచసాయకమనోహరమూర్తినిగంటికింపుగః॥ ౪౯

తా॥ విలాసయుతంబగుకమలంబుబోలియున్ననెమ్మొగంబుఁగల్గిచంచలం
బగునట్లుచూచుచు వేణురంధ్రంబులయందుగోపికల సంకేతంబులదెలుపుచునీ
షచ్చంచలంబులగు నేత్రంబులుగలిగి చూచువారల చూపులకు నాహ్లాదంబుబు
ట్టించుచువెలుంగు ప్రియుండగుకృష్ణునే సమయంబునంగాంచుదు నెత్తఱినమ
స్కరింతుననుట॥ ... ... ... ... ... ❁

శ్లో॥ లగ్నంముహుర్మనసిలమ్పటసమ్ప్రదాయం రేఖావలేఖినిరసజ్ఞమ
నోజ్ఞవేషం। లజ్జన్మృదుస్మితమధుస్నపితాధరాంశు రాకేందులాలితముఖేందు
ముకుందబాల్యం॥ ... ... ... ... ... ౫౦

టీక॥ రసజ్ఞమనోజ్ఞవేషం - రసజ్ఞ - సారగ్రాహియైనట్టి - మనోజ్ఞ - సుందరమయిన - వేషం. అలంకారముగల - లజ్జన్మృదుస్మితమధుస్నపితాధరాంశురాకేందులాలితముఖేందుముకుందబాల్యం. లజ్జత్ - లజ్జించుచున్నయట్టి - మృదు - కోమలమయిన - స్మిత - మందహాసమనియెడి - మధు - తేనియచేత - స్నపిత - తడుపఁబడిన - అధర - అధరోష్ఠముయొక్క - అంశు - కాంతులుగలిగినట్టి - రాకేందు - పూర్ణిమాచంద్రునిచేత - లాలిత - సమ్మానింపఁబడిన - ముఖ - ముఖమనెడు - ఇందు - చంద్రుడుగలిగిన - ముకుంద - శ్రీకృష్ణమూర్తియొక్క - బాల్యం - శైశవము - రేఖాపలేని - రేఖా - శ్రీకృష్ణసౌందర్యమనియెడి - అపలేఖిని - చిత్తరువుఁగల - మే - నాయొక్క - మనసి - మనమందు - ముహుః - మాటిమాటికిని - లగ్నం - కూడుచున్నదియై - లంపటసమృద్ధాయం - ఆయాసమునిచ్చెడిది - భవతి - అగుచున్నది. ... ... ... ... ... ❖

ఉ॥ సన్నపునవ్వునివ్వటిలుచందురుకావి మెఱుంగుమోవియుఁ । బున్నమచందమామయొఱపున్నగు మోముసుముద్దుగుల్కులీ । లన్నెలవైన మోహనవిలాసముఁగాంచినగోపవేషసం । పన్నునిఁజిన్నిప్రాయమెదఁబాయక వ్రాసిన యట్టులుండెడుఁ॥ ... ... ... ... ... ౫౦

తా॥ సారవంతంబై మనోహరంబగు నలంకారంబుగలిగిలజ్జించుచున్నకోమలంబగుచిఱునగవను తేనియచేఁదడపంబడినయధరోష్ఠంబుకాంతులుగలిగిపూర్ణిమాచంద్రునిచేలాలింపఁబడుచున్నముఖచంద్రుఁగలశ్రీకృష్ణబాల్యము నామనంబునవ్రాసినయటులుండికన్నులకగపడకయాయాసంబుం జేయుచున్నదియనుట.

శ్లో॥ అహిమకరకరనికరమృదుమృదితలక్ష్మీసరసతరసరసిరుహసదృశదృశి దేవే। వ్రజయువతిరతికలహవిజయనిజలీలామదముదితవదనశశిమధురిమణి లియ్యే॥ ౫౧

టీక॥ అహిమకరకరనికరమృదితలక్ష్మీసరసతరసిరుహసదృశదృశి - అహిమకర - సూర్యునియొక్క - కర - కిరణములయొక్క - నికర - సమూహముచేత - మృదు - కోమలముగునట్లుగాను - మృదిత - కొంచెముగాస్పృశింపంబడిన - లక్ష్మీ - కాంతిచేత - సరసతర - మిక్కిలిసరసమయిన - సరసీరుహ - కమలములకు - సదృశ - సమానమయిన - దృశి - నేత్రములుగల - దేవే - శ్రీకృష్ణునియందు - వ్రజయువతిరతికలహవిజయనిజలీలామదముదితవదనశశిమధురిమణి - వ్రజయువతి - గోపికలయొక్క - రతి - రతమనియెడి - కలహ - కలహమందు - విజయ - జయముచేతనైన - లీలామద - విలాసమదముచేత - ముదిత - సంతోషించుచున్న - వదనశశి - ముఖచంద్రుడుగల - మధురిమణి - సౌందర్యమందు - లియ్యే - లీనుడనగుచున్నాను. ❁

చ॥ రతికలహమ్మునన్ సతుల రాయిడిఁ జేసి జయించి మించు నుద్ధతిగను పించు తేనగవు నందము గుల్కెడు మోముఁ దమ్మిచే। నతుల విభాత భానుకిరణాప్తి వికస్వర భాస్వరాంబుజా। యత నయనద్వయిం జెలఁగు నా మధురద్యుతి లీనమయ్యెడున్।

తా॥ సూర్యకిరణసమూహంబుచే మృదువగుచుఁ దులస్పృశింపంబడిన కాంతిచే సుందరంబులగు కమలంబులకు సమానంబులైన నేత్రంబులు గలిగి గోపస్త్రీలతోడ సలుపు రతులని యెడి యుద్ధంబులనైన జయంబునం బొడము స్వకీయంబగు లీలామదంబున సంతసిల్లు ముఖచంద్రుడు గలిగి వెలుంగు శ్రీకృష్ణదేవుని సౌందర్యంబునందు లీనుండనగుచున్నాననుట. ... ... ... ❀

శ్లో॥ కరకమలదళదళితలలితతరవంశీకలనినదగళదమృతఘనసరసిదేవే। సహజరసభరభరితదరహసితవీథీసతతవహదధరమణిమధురిమణి లియే॥ ౫౨

టీక॥ కరకమలదళదళితలలితతరవంశీకలనినదగళదమృతఘనసరసి- కరకమల- హస్తకమలముల యొక్క -దళ- వ్రేళ్లచేత - దళిత - స్వరభేదములను బోధింపఁబడిన యట్టి- లలితతర- మిక్కిలి శ్రావ్యమైన। వంశీ - వేణువు యొక్క - కల- అవ్యక్తమధురమగు- నినద- ధ్వనిచేత- గళత్ - జాఱుచున్న- అమృత- అమృతము యొక్క - ఘన- అధికమయిన- సరసీ- సరస్సుగల యట్టి - సహజరసభరభరితదరహసితవీథీసతతవహదధరమణిమధురిమణి - సహజ- స్వాభావికమైన- రసభర - రసముచేత - భరిత - నిండింపం బడిన - దరహసిత - మందహాసముల యొక్క - వీథీ- పంక్తులను- సతత- ఎప్పుడును- వహత్ -వహించుచున్న-అధరమణి- అధర- రత్నము యొక్క - మధురిమణి- సౌందర్యముగల - దేవే- శ్రీకృష్ణునియందు- లియే - లీనుడనగుచున్నాను- ... ... ... ❀

చ॥ లలితకరాంగుళీదళదళన్మురళీమధురస్వరామృతో। జ్జ్వలసరసీమనోజ్ఞసహజస్మితకందళిచంద్రచంద్రికా। వలదరుణాధరోష్ఠమధువాసితచారుముఖాంబుజంబునన్। దొల్లఁగ కనాదు మానసమధువ్రతమియ్యెడ లీనమయ్యెడిన్॥

తా॥ కరాంగుళులచే స్వరభేదంబులఁ బొందింపఁబడుచు మనోహరంబగు వేణురవంబని యెడి యమృతంబు కొలనుగలిగి స్వభావసిద్ధంబుగ రసవంతంబులగు చిఱునగవుల గుంపుల భరియించు నధరంబు సౌందర్యముగల శ్రీకృష్ణదేవునియందు లీనుడనగుచున్నాననుట. ... ... ... ... ❀

శ్లో॥ కుసుమశరశరసమరకుపితమదగోపీకుచకలశఘుసృణరసలసదురసి దేవే। మఃలితమృదుహసితముషితశశిశోభాముహుంధికముఖకమలమధురిమణి లియే॥

టీక ॥ కుసుమశరశరసమరకుపితమదగోపీకుచ కలశఘుసృణరసలసదురసి- కుసుమశర- మన్మధునియొక్క - శర - బాణములయినపుష్పములచేతనైన - సమరయుద్ధమందు- కుపిత- కోపయుక్తలయిన - మద - మత్తలయిన- గోపీ - గోపికలయొక్క - కుచకలశ - కలశములవంటి స్తనములయందలి - ఘుసృణ- అంగరాగవిశేషముయొక్క - రస- రక్తిమచేత- లసత్ - ప్రకాశించుచున్న- ఉరసి వక్షముఁగలయట్టి - మద- ముదముతోడ- లులిత-కలసియున్న - మృదుహాసిత- మందహాసముచేత - ముషిక- అపహరింపఁబడిన- శశి- చంద్రునియొక్క - శోభా- కాంతిచేత- ముహుః- అధికమయిన- ముఖకమల- నెమ్మోముదామరయొక్క - మధురిమణి- సౌందర్యముఁగల - దేవే- శ్రీకృష్ణమూర్తియందు- లీయ్యే- లీనుఁడనగుచున్నాను- ... ... ... ... ...

ఉ॥ పువ్వులఁబువ్వుఁగానలుకఁబూనినవల్లవపల్లవాధరల్ ప్రొవ్వుసఁబువ్వుమీఁజనుగుత్తులనొత్తినకుంకుమంబెదర । నివ్వటిలఁ శశాంకుఁజిగినీఁటులఁ దేటలఁ గొల్లలాడులేనవ్వులగోముమోమునఁగనందగునందకుమారుఁజెందెదన్ ॥ ౫౩

తా॥ పువ్వులచల్లులాటయందోటుపడికోపంబుసేయుగోపికలబంగరుకుండలంబోనిచన్నులరాయిఁడినంటినకుంకుమపూఁతచేవెలుఁగు వక్షంబునుమదంబుతోఁగూడినకోమలంబగు చిఱునగవుచేవెన్నెలంగొల్లలాడునెమ్మోముచక్కదనంబునుంగలిగితేజరిల్లు శ్రీకృష్ణదేవునందు లీనుండగుచున్నాననుట.

శ్లో॥ ఆనమ్రామసితభ్రువోరుపచితామక్షీణపక్ష్మాఙ్కురే
ష్వాలోలామనురాగిణోర్నయనయోరార్ద్రాం మృదౌ జల్పితే।
ఆతామ్రామధరామృతే మదకలామమ్లానవంశీరవే
ష్వాశాస్తే మమ లోచనం వ్రజశిశోర్మూర్తిం జగన్మోహినీమ్॥

టీక॥ అసితభ్రువోః- అసిత- నల్లనైన-భ్రువోః- కనుబొమలయందు-ఆనమ్రాం- కొంచెమువక్రమయినట్టి- అక్షీణపక్ష్మాఙ్కురేషు - అక్షీణ- దట్టమైన పక్ష్మ- ఱెప్పలయొక్క - అంకురేషు- రోమాంకురములయందు - ఉపచితాం- వృద్ధినొందినయట్టి - అనురాగిణోః - దయగలిగిన- నయనయోః - నేత్రములయందు- ఆలోలాం- చంచలమయినట్టి- మృదౌ- మృదువయిన - జల్పితే-మాటయందు- ఆర్ద్రాం- సరసమయినట్టి-అధరామృతే- అమృతమువంటియధరమందు- ఆతామ్రాం- అరుణమయినట్టి- అమ్లానవంశీరవేషు - అమ్లాన - గంభీరమైన- వంశీరవేషు- వేణునాదములయందు- మదకలాం- మద- మదముచేత- కలాం- అవ్యక్తమధురమయినట్టి - జగన్మోహినీం- జగత్- లోకములకు- మోహి

సీం- మోహసంపాదకమయిన-వ్రజశిశోః-గోపాలబాలునియొక్క - మూర్తిం దివ్యమంగళవిగ్రహమును. మమ- నాయొక్క - లోచనం. నేత్రము. ఆశాస్తే. ప్రార్థించుచున్నది- ... ... ... ... ...

ఉ ॥ కాంచుటయెన్నఁడీక్షణసుఖంబుగఁ దొంగిలితెప్పలుఙ్బనా । యిం చినవింటివంటిబొమలింపగుమాటలుకెంపుమోవిఁబొం । కించినపిల్లఁగ్రోవిబలికించుహళాహళియుఙ్ దయోన్నతిఙ్ । మించినబెళ్కుఁజూపుఁగలమిక్కిలిచక్కనిముద్దుబాలకుఙ్ ॥ ... ... ... ... ౫౪

తా॥ ఈషద్వక్రంబులగునల్లనికనుబొమలును బెంపొందిదట్టంబులగు తెప్పలందలివెంట్రుకలును జంచలంబులయి కరుణారసంబుఁదొలుకు కన్నులునుసరసంబునుగంభీరంబునగు వేణునాదంబునుంగలుగుటంజేసి జగంబులకానందజనితసమ్మోహంబును తాదించునట్టిగోపాలబాలుని దివ్యమంగళ విగ్రహంబుగనుంగోరెదననుట- ... ... ... ... ...

శ్లో॥ తత్కైశోరంతచ్చవక్త్రారవిన్దంతత్కారుణ్యంతేచలీలాకటాక్షాః। తత్సౌన్దర్యంసాచమన్దస్మితశ్రీస్సత్యంసత్యందుర్లభంనైవతేషు॥ ... ౫౫

టీక॥ తత్కైశోరం- తత్- నామనంబందుదోచినయట్టి- కైశోరం-బాల్యమును- తచ్చ- నాచిత్తమందుదోచినయట్టి- వక్త్రారవిందం- ముఖకమలమును- తత్కారుణ్యం- తత్- నామనంబందగుపడినయట్టి-కారుణ్యం- దయయును- తే- నాహృదయమందుఁగానుపించినయట్టి- లీలాకటాక్షాశ్చ - లీలా- విలాసములతోఁగూడిన - కటాక్షాశ్చ - కడకంటిచూపులును- తత్సౌందర్యంచ - తత్- నాచిత్తంబునసాక్షాత్కరించినయట్టి - సౌందర్యంచ - సోయగమును - సా- నామెదయందుఁగానంబడిన- మన్దస్మితశ్రీశ్చ -,మందస్మిత - లేనగవుయొక్క - శ్రీశ్చ - సంపదయును. నైవతేషు- ఇంద్రుండుమొదలగువేలుపులయందు-దుర్లభం- లదు- సత్యం- యథార్థము- సత్యం- యథార్థము. ... ...

శా॥ఆకారుణ్యకటాక్షవీక్షణములాయందంవులేఁబ్రాయమా। యాకారద్యుతియాదరస్మితముతీరామోముచక్కందనం। బాకెంజాయపదంబుల-నడలయొయ్యారంబులేవేల్పులం। జేకాలంబునలేదులేదనుచునేనెందేనిజాటించెదఙ్॥

తా॥ సమాధినిష్ఠుండనగునాయెదంబరికించినచోనగుపడినశ్రీకృష్ణదేవునియబ్బాల్యంబునదయయునానెమ్మొముఁదానుగయు నాకడకన్నులచూపులునాసోయగంబునాలేనగవునేవేల్పులయందేనియులేదనుచునిక్కంబుగాఁబల్కెదనుట॥

శ్లో॥ విశ్వోపప్లవశమనైకబద్ధదీక్షం విశ్వాసస్తబకితచేతసాం జనానాం। పశ్యామః ప్రతినవకాంతికందళార్ద్రం పశ్యామః పథిపథి శైశవం మురారేః॥ ❖

టీక॥ మురారేః- శ్రీకృష్ణమూర్తియొక్క - శైశవం- బాల్యమును- ప్రతినవకాంతికందళార్ద్రం- ప్రతినవ - ప్రతిక్షణనూతనములైన- కాంతి - కాంతుల యొక్క -కందళ- మొలకలచేత- ఆర్ద్రం- సరసమైనదానిగాను- పశ్యామః- మనముచే నెఱుంగుచున్నాము- విశ్వాసస్తబకితచేతసాం - విశ్వాస - విశ్వాసము చేత- స్తబకిత - సంజాతగుచ్ఛములుగల - చేతసాం- చిత్తములుగల - జనానాం జనులయొక్క - పథిపథి- ఆయాయిస్థలములయందు- విశ్వోపప్లవశమనైకబద్ధదీక్షం- విశ్వ- సమస్తమయిన- ఉపప్లవ- ఉపద్రవములయొక్క - శమన- శాంతియందు- ఏక- ముఖ్యమగునటుల- బద్ధ- ఘటింపఁబడిన- దీక్షం- నియతిగలదానిగాను- పశ్యామః- మనంబుచే నెఱుంగుచున్నాము॥ ... ... ❖

మ॥ నుతధారాధరకాంతికందళముకన్నన్ చల్లఁజేయన్ సమగ్రతరాతంకపరంపరాశమనదీక్షన్ దేహముల్ప్రాఁకా।యత గాంచన్నె అనమ్మినట్టిప్రజకత్యానందమా దేవకీ। సుతునొయ్యారపుబాలలీలగనవచ్చున్నాఁడు దృగ్వీధులన్॥ ౫౬

తా॥ ఆశ్రితులగుజనంబులసర్వోపద్రవంబులఁబోవఁజేయుచునియమంబుగలిగి ప్రతిక్షణంబును క్రొత్తలగు కాంతులచే సరసంబై వెలుంగు శ్రీకృష్ణునిబాల్యంబు నుగనుంగొనుచున్నాననుట॥ ... ... ... ... ❖

శ్లో॥ మౌళిశ్చంద్రకభూషణా మరకతస్తంభాభిరామం వపుర్వక్త్రం చిత్రవిముగ్ధహాసమధురం బాలే విలోలే దృశౌ। వాచశ్శైశవశీతలా మదగజశ్లాఘ్యా విలాసస్థితిర్మందం మందమయే క ఏష మధురావీథీమితో గాహతే॥ ౫౭

టీక॥ అయే బాలే- ఓవనితా- మౌళిః- సిగ- చంద్రకభూషణా- చంద్రక- నెమలిపురియనెడి- భూషణా- ఆభరణముగలది - వపుః- శరీరము - మరకతస్తంభాభిరామం- మరకత- ఇంద్రనీలమణియొక్క - స్తంభ- స్తంభమువలె- అభిరామం- సుందరము- వక్త్రం- ముఖము- చిత్రవిముగ్ధహాసమధురం - చిత్ర - విచిత్రమైనట్టి- విముగ్ధ- మిక్కిలిసుందరమైనట్టి- హాస - చిఱునగవుచేత - మధురం- మనోహరము- దృశౌ- కన్నులు- విలోలే- చంచలములు- వాచః- పలుకులు- శైశవశీతలాః- శైశవ- బాల్యముచేత- శీతలాః- చల్లనైనవి- విలాసస్థితిః- విలాసలీలయొక్క - స్థితిః- ఉనికి- మదగజశ్లాఘ్యా- మదగజ- మదపుటేనుఁగువలె- శ్లాఘ్యా- కొనియాడఁదగినది - (ఇట్టిగుణంబులుగలిగి) మందంమందం- మెల్లమెల్లన-

ఇతః- ఇటునుండి- మధురావీథీం- మధురా- మధురాపట్టణముయొక్క- వీథిం- వీథిని- కపిషగాహతే- వీఁడెవ్వఁడుప్రవేశించుచున్నాఁడు॥ ... ✦

ఉ॥ మౌళితటీఘటించినసమంచితపింఛముమందహాసముల్ । లోలవిశాలలోచనములుం జిఱునవ్వుగుముద్దుమాటలుల్ । నీలపుడాలునేలుమెయి నిగ్గులుగల్గిన బాలుఁడెవ్వఁడో । వ్రాలెడువీనిఁజూడుమధురాపురవీథులఁబాటలాధరా॥ ౫౭

తా॥ మధురాపురంబుతెఱువుఁబ్రవేశించునట్టి శ్రీకృష్ణునింగనియొకదివ్యవిలాసినితోడంబలుకుచున్నది నెమలిపురిచేనలంకరింపఁబడినసిగయును విచిత్రంబునుందరంబునగుచిఱునగవుగలనెమ్మొగంబును జంచలంబులగుకన్నులును బాల్యంబువలనసరసంబులగునాలాపంబులును మత్తగజంబులవలెకొనియాడఁదగినవిలాసంబునుంగలిగిమెల్లమెల్లననటనుండి మధురాపురంబుతెఱువుంబ్రవేశించు వీఁడెవ్వఁడువీనింజూడుమనుట॥ ... ... ... ... ✦

శ్లో॥ పాదౌ పాదవినిర్జితాంబుజవనౌ పద్మాలయాలంకృతౌ । పాణీ వేణువినోదనప్రణయినౌ పర్యాప్తశిల్పశ్రియౌ । బాహూ దోహదభాజనం మృగదృశాం మాధుర్యధారాగిరో । వక్త్రం వాగ్విభవాతిలంఘితమహో బాలం కిమేతన్మహః॥ ... ... ... ... ... ౫౮

టీక॥ పాదవినిర్జితాంబుజవనౌ- పాద- అంశముచేత- వినిర్జిత-జయింపఁబడిన- అంబుజవనౌ- కమలవనములుగల- యస్య- ఏశ్రీకృష్ణునియొక్క- పాదౌ- పాదములు- పద్మాలయాలంకృతౌ- పద్మాలయా- లక్ష్మీదేవిచేత-అలంకృతౌ- పూజింపఁబడినవియో- వేణువినోదనప్రణయినౌ- వేణు- పిల్లనఁగ్రోవియొక్క- వినోదన- వాయించుటయందు- ప్రణయినౌ- ప్రీతిగల- యస్య-ఏకృష్ణునియొక్క- పాణీ- హస్తములు- పర్యాప్తశిల్పశ్రియౌ-పర్యాప్త- పరిపూర్ణమైన- శిల్ప- విన్నాణముయొక్క- శ్రియౌ- సంపదగలవియో- యస్య- ఏకృష్ణునియొక్క- బాహూ- భుజములు- మృగదృశాం- స్త్రీలకు-దోహదభాజనం- దోహద- దోహదక్రియతు- భాజనం- స్థానమో- (దోహదమనఁగానసమయమందుఁదరుల తలనుబుష్పింపఁజేయుక్రియ - అట్లేశ్రీకృష్ణునిభాహువులుస్పృశించుటమాత్రంబునబాలికలనైనప్రౌఢలనుగాఁజేయ సామర్థ్యముగలవియనుట) యస్య- ఏశ్రీకృష్ణునియొక్క- గిరః- మాటలు - మాధుర్యధారాః- మాధుర్య- తియ్యదనముయొక్క- ధారాః- ప్రవాహములుగలవియో యస్య- ఏశ్రీకృష్ణునియొక్క- వక్త్రం- ముఖము - వాగ్విభవాతిలంఘితంవా

గ్వైభవ - ప్రాగ్వైభవమును - అతిలంఘితం - అతిక్రమించినదియో. ఏతత్ - ఈ కృష్ణరూపమైన - మహః - తేజస్సు - బాలంకిం - శిశువా యేమి - అహో - ఆశ్చర్యము.

చ॥ చెలువల కెల్లదోహదముఁ జేయు కరంబులు లచ్చి కాకరం । బులు జితపద్మ
ముల్పగణముల్మ గళీరచనాచమత్క్రియా । కలితము కేలుదమ్మి ముఖకాంతులు
వింతలు తేనెలూఱుగా । టులు గల యట్టి శైశవవిడంబన తేజమి దేమి చిత్రమో॥

తా॥ శ్రీమహాలక్ష్మిచేత గంధపుష్పాదుల నలంకరింపంబడు నడుగుఁదామరలును - పిల్లనగ్రోవిని మ్రోయించుటయందుఁ బ్రాగల్భంబగు విన్నాణంబు గలకరంబులు నవాఙ్మానసగోచరంబగు సెమ్మొగంబును గల యీ తేజమును శిశువని చెప్పనలవియగునె యనుట॥ ... ... ... ... ❖

శ్లో॥ బర్హంనామవిభూషణమ్బహుమతంవేషాయ శేషైరలంవక్త్రంద్వి
త్రవిశేషకాంతిలహరీవిన్యాసధన్యాధరం। శీలైరల్పధియామగమ్యవిభవైః శృంగా
రభంగీమయంచిత్రంచిత్రమహో విచిత్రమహో చిత్రంవిచిత్రంమహః॥ ౫౯

టీక॥ వేషాయ - అలంకారముకొఱకు - శేషైః - ఇతరములగు భూషణములచేత - అలం - సాధ్యము లేదు - బర్హం నామ - బర్హమని ప్రసిద్ధమైన - విభూషణం - అలంకరణము బహుమతం - అంగీకరింపఁబడియెను - వక్త్రం - ముఖము - ద్విత్రవిశేషకాంతిలహరీవిన్యాసధన్యాధరం - ద్విత్ర - రెండుమూఁడయిన - విశేష - తిలకములయొక్క - కాంతి - కాంతులయొక్క - లహరీ - ప్రవాహముయొక్క - విన్యాస - వ్యాప్తిచేత - ధన్య - హృద్యమైన - అధరం - మోవిగలది - అల్పధియాం - స్వల్పబుద్ధిగలవారలకు - అగమ్యవిభవైః - అగమ్య - అగోచరమైన - విభవైః - వైభవముగల - శీలైః - స్వభావములచేత - శృంగారభంగీమయం - శృంగార - శృంగారములయొక్క - భంగీమయం - పరంపరా ప్రాచుర్యముగల - మహః - తేజస్సు - చిత్రం - ఆశ్చర్యము - చిత్రం - ఆశ్చర్యము - అహో - ఆశ్చర్యము - విచిత్రితం - ఆశ్చర్యముగలది - అహో ఆశ్చర్యము - చిత్రం - ఆశ్చర్యము - విచిత్రం - మిక్కిలియాశ్చర్యము॥ ❖

ఉ॥ సొమ్ములు మేనికందముని చూడక పింఛమె పూని మోముపైఁ । గమ్మనిబొ
ట్టు దొంతరలు గాఁ గలసిల్లఁగఁ గావిమోవి। చెల్వమ్ము రసోత్తరంగవిభవమ్ము నగమ్య
ము నైతనర్పజి। త్రమ్మొక పాటివారికిదరంబె నుతింపనో యారతేజముల్॥ ❁

తా॥ కాంచనరత్నమయంబులైన భూషణంబులం గైకొనక నెమలిపురియె మేలైన భూషణంబుగ ధరియించి చందనకస్తూర్యాదితిలకంబులచే నందంబగు ముఖారవిందంబున రసోత్తరంబగు కెమ్మోవి మెఱయ సింగారంబులరాశియొయు

న వెలుంగు శ్రీకృష్ణరూపంబగు తేజంబతివిచిత్రంబై యుండుఁగాననిట్టి తేజంబుననల్ప బుద్ధులగువారలకు నుతింపనలవియగునే యనుట॥ ... ... ❖

శ్లో॥ అగ్రే సమగ్రయతి కామపి కేళిలక్ష్మీమన్యాసు దిక్ష్వపి విలోచనమేవ సాక్షి। హా హంత హస్తపథదూరమహో కిమేతదాసీత్కిశోరమయమమ్బ జగత్త్రయం మే॥

టీక॥ హస్తపథదూరం- హస్తపథ- హస్తప్రసారణమునకు- దూరం-దూరమగునట్టుగాను- అగ్రే- ముందటను - కామపి - నుడువనలవిగాని - కేళిలక్ష్మీం కేళీ- విహారముయొక్క - లక్ష్మీం- సంపదను - సమగ్రయతి- నిండింపఁజేయుచున్నది- అన్యాసు - ఇతరములైన- దిక్ష్వపి- దిక్కులయందును - కేళిలక్ష్మీం - విహారసంపదను- సమగ్రయతి - నిండింపఁజేయుచున్నది - విలోచనమేవ - నేత్రమే- సాక్షి- ప్రమాణము- హాహంత- అకటకటా- హేఅంబ-ఓతల్లి-జగత్త్రయం లోకత్రయమును- మే- నాకు- కిశోరమయం- బాలమయముగాను - ఆసీత్- ఆయెను- ఏతత్- ఇది- కిం-ఏమి-అహో-ఆశ్చర్యము॥ ... ... ❖

శా॥ చూడంజూడమనోహరాకృతికడుంజోద్యంబుగా బాలకుం। డాడ ముందటఁగౌఁగిలింతుననిడాయంజిక్కఁడారీతినే। క్రీడించుకదిశలందునిందులకునక్షిద్వంద్వమే సాక్షియో। జాడం ముజ్జగమంబ బాలమయమాశ్చర్యంబునా కెంతయుం।

తా॥ చూడజూడమనోహరంబయి యాడుచు గౌఁగిలింపబోవదూరంబై యెల్లదెసలయందు క్రీడించుచుండునిందులకు గన్నుగవయ సాక్షియో తల్లి ముజ్జగంబును బాలమయంబయ్యెనిదియేమివిచిత్రంబనుట. ... ... ❖

శ్లో॥ చికురమ్బహుళం విరళమ్భ్రమరం మృదులం వచనం విపులం నయనం। అధరం మధురం వదనం లలితం చపలం చరితం చ కదానుభవే॥ ... ౬౧

టీక॥ కృష్ణస్య- శ్రీకృష్ణమూర్తియొక్క - బహుళం- దట్టమైన- చికురం- ముంగురులను- తలములను- విరళం- పలచనైన- భ్రమరం- ముంగురులను- మృదులం - కోమలమైన - వచనం- వాక్యమును- విపులం- విశాలమైన - నయనం- నేత్రములను- మనోహరం- మనోజ్ఞమయిన- అధరం- అధరోష్ఠమును- లలితం- సుందరమైన- వదనం- ముఖమును- చపలం- చంచలమయిన - చరితంచ- చరిత్రమును- కదా ఎప్పుడు- అనుభవే- చూచుచున్నాను- ... ... ...

ఉ॥ వెన్నెలగోపకాంతలను వేడుకగోరెడుచాపలంబుతో। కన్నులబెళ్కునగుమొగంబునవ్రాలుచలాలకాళితో। దిన్ననిపల్కుతో ముడిచిదిద్దినగొప్పశిఖపాళితో। నెన్నఁడునాదుమ్రోలఁజరియించునో వెన్నుఁడుకావిమోవితో

తా॥ గోపికలంగోరెడుచపలంబును విశాలంబులగుకన్నులును సొగసు

గు మొగమునం గ్రాలుముంగురులును - నును మెఱుంగుగొప్పకొప్పునుఁ - దియ్యదనంబుఁదెల్పుముద్దుపల్కులును - మనోజ్ఞంబగు- కెమ్మోవియుంగలిగి తేజరిల్లు శ్రీకృష్ణమూర్తినెప్పటికింగాంచెదనోయనుట. ... ... ❖

శ్లో॥ పరిపాలయనః కృపాలయేత్యసకృజ్జల్పితమాత్మ బాన్ధవః । మురళీమృదులస్వనాన్తరే విభురాకర్ణయతాంకదానునః॥ ... ... ౬౨

టీక॥ హేకృపాలయ- ఓయిదయావంతుఁడ- నః- మమ్మును-పరిపాలయ- రక్షింపుము- ఇతి- ఇట్లని- అసకృజ్జల్పితం- అసకృత్- మాటిమాటికినుడివెడు-జల్పితం- వచనమును- విభుః- శ్రీకృష్ణమూర్తి- ఆత్మబాంధవస్సన్- ఆత్మ-నాకు- బాంధవస్సన్- బంధువుఁడగుచును- మురళీమృదులస్వనాంతరే- మురళీ - వేణువుయొక్క - మృదుల- కోమలమయిన-స్వనాంతరే- ధ్వనిమధ్యమందు-కదాను- ఎప్పుడు- ఆకర్ణయతాం- వినును- ... ... ... ❖

చ॥ నిరుపమవేణుగానమహనీయసుఖానుభవైకమగ్నతన్ ।గరఁగిపరాకుఁగైకొనినకంజదళాక్షుఁడుపదప్తచిత్తుఁడై । నిరతమునన్ను గావు నవనీతహరాయని మాటిమాటికిన్ । మొగయిడునట్టినావచనముల్దయతో నెపుడాలకించునో॥౬౨

తా॥ తులలేనివేణుగానంబుననైనసుఖానుభవంబునబరాకుఁబొందినశ్రీకృష్ణవిభుండు నాకుబంధుండై ననురక్షింపు మోదయాసముద్రయని మాటిమాటికిమొరయిడుచున్న నావచనం బెన్నటికివినునోయనుట- ... ... ❖

శ్లో॥ కదానుకస్యాన్ను విపద్దశాయాం కైశోరగన్ధిః కరుణామ్బుధిర్నః । విలోచనాభ్యాం విపులాయతాభ్యాం వ్యాలోకయిష్యన్విషయీకరోతి॥ ౬౩

టీక॥ కస్యాన్నువిపద్దశాయాం : ఏయాపత్సమయంబున - కైశోరగన్ధిః- ఈషద్బాల్యముగల - కరుణాంబుధిః- దయాసముద్రుఁడగుశ్రీకృష్ణమూర్తిన్- విపులాయతాభ్యాం- విపుల- వెడల్పులయినట్టి- ఆయతాభ్యాం - నిడుపులైనట్టి - విలోచనాభ్యాం- నేత్రములచేత - వ్యాలోకయిష్యన్ - మిక్కిలిచూడఁగలవాఁడయి- నః- మము- కదాను- ఎప్పుడు- విషయీకరోతి- గోచరునిఁగాఁజేయుచున్నాఁడు- ... ... ... ... .. ... ❖

చ॥ ఒకవలవంతఁజింతిలుచునుండెడినన్ను శిశుత్వగంధమా। త్రకలితయౌవనంబుదనరన్ గరుణావరుణాలయుండువా।యకశతపత్రపత్రవిపులాయుణలోచనలీలజూచుచూ । డ్కెకిఁదగుపీడటంచుఁబరికించుటలెన్నఁడుగల్గనేర్చునో॥౬౩

తా॥ ఎట్టియాపత్కాలంబుననైననుకొంచెంబుగనుండుబాల్యంబుగలిగి వెలయుదయాసముద్రుండైన శ్రీకృష్ణదేవుండు వెడల్పులై నిడుపులై వెలుంగుక

న్నులచేజూడవిడక్షుండకదాయనినను నెప్పుడు గాంచునోయనుట॥

శ్లో॥ మధురమధరబింబే మఞ్జులంమన్దహాసే శిశిరమమృతవాక్యే శీతలన్దృష్టిపాతే।
విపులమరుణనేత్రే విశ్రుతం వేణునాదే మరకతమణినీలమ్బాలమాలోకయేను॥ ౬౪

టీక॥ అధరబింబే- దొండపండువంటియధరమందు- మధురం- తియ్యనైనయట్టి- మన్దహాసే- చిరునగవందు- మఞ్జులం- మనోజ్ఞమైనయట్టి- అమృతవాక్యే- అమృతమువంటిమాటయందు- శిశిరం- చల్లనైనయట్టి- దృష్టిపాతే- చూపందు- శీతలం- చల్లనైనట్టి- అరుణనేత్రే- అరుణ- ఎఱ్ఱనైన- నేత్రే- నేత్రమందు- విపులం- విశాలమయినట్టి- వేణునాదే- వేణుధ్వనియందు- విశ్రుతం - మిక్కిలి వినుచున్నయట్టి- మరకతమణినీలం- మరకతమణి- ఇంద్రనీలమణివలెను- నీలం- నల్లనయిన- బాలం- గోపాలుని- ఆలోకయేను- చూచుచున్నావాయేమి॥

చ॥ చల్లనిబెళ్కుఁజూపుసుధఁజల్లెడుమాటలుదియ్యమోవియుఁ। సల్లలితారుణద్యుతివిశాలవిలోచనముల్ మృదుస్మితో। త్ఫుల్లముఖాంబుజంబుఁబరిపూరితవేణువినోదనాదముఁ। నల్లనిమేనిక్రొమ్మెఱుఁగునవ్వలసిల్లినబాలు గాంచెదఁ।

తా॥ తియ్యదనంబు దెల్పుకెమ్మోవియుమనోహరంబగు చిఱునగవు నమృతంబునోలుకుముద్దుపలుకును జల్లనగుచూపును గెంజాయరఁజెల్లు వెడలువగన్నుగవయునుబరిపూర్ణమయినవేణుగానంబునుంగలిగి యింద్రనీలరత్నంబుబోలునెమ్మేనిచాయచేదేజరిల్లుబాలకృష్ణునింజూచెదననుట-

శ్లో॥ మాధుర్యాదపిమధురంమన్మథతాతస్యకిమపికైశోరమ్। చాపల్యాదపిచపలఞ్చేతోమమహరతిహన్తకింకుర్మః॥ ... ... ... ౬౫

టీ॥ మాధుర్యాదపి- సకలజనసిద్ధసౌందర్యంబుకన్నను- మధురం - సుందరమయినయట్టి- చాపల్యాదపి- సకలజనచపలతకన్నను- చపలం- చంచలమయినయట్టి- కిమపి- చెప్పశక్యముగాని- మన్మథతాతస్య- మన్మథ- ప్రద్యుమ్నునికి- తాతస్య తండ్రియైనశ్రీకృష్ణునియొక్క - కైశోరం- బాల్యము- మమ- నాయొక్క - చేతః- చిత్తమును- హరతి- హరించుచున్నది- కింకుర్మః- ఏమిసేయుదుము- హన్త- అకట

ఉ॥ గబ్బిమెఱుంగుబోండ్లతటకాపడిలోలతఁజూచునంతలో। నిబ్బరమైనచిత్తరమునెక్కొనునందముకన్ననందమై। యబ్బురమైనబాల్యమునసద్దిరయంగఁగన్నతండ్రియా। గుబ్బుననామదింగలుగుగుట్టుఁగలంచెనికేమిసేయుదుఁ॥౬

సకలజనంబులందుండెడిసౌందర్యంబునకన్ననధికంబగు సౌందర్యంబుగలిగి సకలలోకచాపల్యంబునకన్ననధికంబగుచంచలంబుగలిగి వెలుఁగుమరుని తం

యగ శ్రీకృష్ణదేవుని చెప్పనలవిగాని బాల్యంబు నా మనంబుఁ గలఁచుచున్నది యిక నేమి సేయుదుననుట. ... ... ... -- ...

శ్లో॥ వక్షఃస్థలే చ విపులం నయనోత్పలే చ మన్దస్మితే చ మృదులం మదజల్పితే చ। బిమ్బాధరే చ మధురం మురళీరవే చ బాలం విలాసనిధి మాకలయే కదా ను॥ ౬౬

టీక॥ వక్షస్థలే చ - వక్షస్థలమందును - నయనోత్పలే చ - కలువవంటి నేత్రమందును. విపులం. విశాలమయినయట్టి. మందస్మితే చ. చిరునగవందును. మదజల్పితే చ. మద. మదయుక్తమైన. జల్పితే చ. వచనమందును. మృదులం. కోమలమైనయట్టి. బింబాధరే చ. బింబ. దొండపండువంటి. అధరే చ. మోవియందును. మురళీరవే చ. వేణుగానమందును. మధురం. హృద్యమైనట్టి - విలాసనిధిం. విలాస. విలాసములకు. నిధిం. నిక్షేపమైన. బాలం - బాలుఁడైనకృష్ణుని. కదా. ఎప్పుడు. ఆలోకయే ను. చూచుచున్నాను. ... ...

మ॥ ఖళి రాకన్నుల బెళ్కు ల్మొమ్ము జిగిఁ జెప్పన్ రాదు వేణుధ్వనుల్। దరమాయెంచఁగఁ గావి మోవి రుచివింతల్ దేటలే నవ్వుని। గ్గలువ ర్ఝారె సుధామనోహరహృదూక్తుల్ మాయురే యిట్టియొ। ప్పులకుప్పం దిలకించు భాగ్య మహిమంబుల్మాకునింకెన్నఁడో॥ ... ... ... ... ... ౬౬

తా॥ విశాలంబగు వక్షంబును గన్నులుం గలిగి కోమలంబగు మందహాసంబును వచనంబునుం గలిగి తీయనగు నధరంబును వేణుగానంబునుం గలిగి - విలాసంబులను నిక్షేపంబగుచు దేజరిల్లు బాలకృష్ణు నెన్నటికిం గాంచెదనో యనుట.

శ్లో॥ మారస్స్వయం ను మధురద్యుతిమణ్డలం ను మాధుర్యమేవ ను మనోనయనామృతం ను। వాణీమృజం ను మమ జీవితవల్లభో ను బాలోయమభ్యుదయతే మమ లోచనాయ॥ ... ... ... ... ... ౬౭

టీక॥ మమ. నాయొక్క - లోచనాయ. నేత్రముకొఱకు. బాలః. బాలుఁడు. అభ్యుదయతే. ఆవిర్భవించుచున్నాఁడు. అయం. ఈబాలుఁడు. మారస్స్వయం ను. మన్మథుఁడాయేమి. మధురద్యుతిమండలం ను. మధురద్యుతి - చంద్రునియొక్క - మండలం ను. బింబమాయేమి. మాధుర్యమేవ ను. సౌందర్యమే నాయేమి. మనోనయనామృతం ను. మనః. మనస్సుయొక్కయు. నయన. నేత్రములయొక్కయు. అమృతం ను. అమృతమాయేమి. వాణీమృజం ను - వాక్పరిశుధ్యమాయేమి. మమ. నాయొక్క - జీవితవల్లభో ను. ప్రాణనాథుఁడాయేమి।

ఉ॥ మారుఁడొ కాకయంబుధిసుమారుఁడొ మానసలోచనామృతా। కాఁ

మొమాధురీగుణవికారము మంజులవాక్ప్రవృత్తియా। సారమునాదుజీవము ణిసారములేకమ ఘేమిచిత్రమో। మీయెడుబాలభావమున మెచ్చులు గుల్కెడు నాడుచూడ్కికిన్॥ ... ... ... ... ... ౬౭

తా॥ నాకన్నులకుంగాననగుచున్న యిబ్బాలుండుమన్మథుండోలేకచందురుండో సౌందర్యంపురాశియో నామనోనయనామృతమో వాక్చమత్కారముకొలేక నాప్రాణవల్లభుండోయని యిత్తెఱంగుననిశ్చయంబున వికల్పించెననుట॥ ❁

శ్లో॥ ఆర్ద్రావలోకితదయాపరిణద్ధనేత్రమావిష్కృతస్మితసుధామధురాధరోష్ఠం। ఆద్యంపుమాంసమవతంసితబర్హిబర్హ మాలోకయంతికృతినః కృతపుణ్యపుంజాః॥ ... ... ... ... ... ౬౮

టీక॥ ఆర్ద్రావలోకితదయాపరిణద్ధనేత్రం. ఆర్ద్ర. సరసములైన - అవలోకిత. చూపులుగలయట్టి. దయా. దయతోడ. పరిణద్ధ. కూర్పబడిన. నేత్రం. నేత్రములుగలయట్టి - ఆవిష్కృతస్మితసుధామధురాధరోష్ఠం - ఆవిష్కృత. ప్రకాశింపఁబడిన. స్మిత. లేనగవనెడి. సుధా అమృతముచేత. మధుర. మనోజ్ఞమయిన - అధరోష్ఠం - మోవిగలయట్టి - అవతంసితబర్హిబర్హం అవతంసిత - శిరోభూషణముగాఁజేయఁబడిన - బర్హిబర్హం. నెమలిపురిగలయట్టి. ఆద్యం. జగత్కారణుండయిన. పుమాంసం. శ్రీకృష్ణమూర్తిని - కృతపుణ్యపుంజాః. కృత. చేయఁబడిన. పుణ్యపుంజాః. పుణ్యసమూహముగల. కృతినః. విద్వాంసులు. ఆలోకయంతి. చూచుచున్నారు. ... ... ❁

ఉ॥ అందముచిందుమోముదరహాససుధామధురాధరోష్ఠము। స్పందదయావలోకనవిశాలవిలోచనముల్ శిరంబునం। బొందుగనెమ్మిపింఛమునుబూనినయాద్యునిదేవదేవుని। నందకుమారుఁగాంతురుసనాతనపుణ్యమునన్ బుధోత్తముల్॥

తా॥ సరసంబులగుచూపులుగలిగిదయాకరంబులై విశాలంబులగునేత్రంబులునుప్రకాశించుచిరునగవను నమృతంబుచేమనోహరంబగు నధరంబునుశిరోభూషణంబుగధరియించిన నెమలిపురియునుంగలిగి సర్వజగంబునకుందానయేలికయై వెలయుశ్రీకృష్ణదేవుని చిరపుణ్యంబుచేసినపెద్దలు చూచుచుందురుగదాయనుట॥

శ్లో॥ బాలోయమాలోలవిలోచనేనవక్త్రేణచిత్రీకృతదిఙ్ముఖేన। వేషేణఘోషోచితభూషణేనముగ్ధేనదుగ్ధేనయనోత్సవంనః॥ ... ... ౬౯

టీక॥ ఘోషోచితభూషణేన. ఘోష. గొల్లపల్లియందు. ఉచిత - తగిన. భూషణేన - సొమ్ములుగల. వేషేణ. అలంకారముచేత. ముగ్ధేన. సుందరమయి

ట్టి. ఆలోలవిలోచనేన - ఆలోల- చంచలములైన- విలోచనేన - నేత్రములుగ లయట్టి - చిత్రీకృతదిఙ్ముఖేన - చిత్రీకృత - చిత్తరువుగల వానిగాఁజేయఁబడిన- దిఙ్ముఖేన - దిఙ్ముఖములుగల- వక్త్రేణ- ముఖముచేత- అయంబాలః- ఈబాలుఁడు- నః- మాయొక్క - నయనోత్సుకం- చక్షుస్సంతోషమును- ముగ్ధే - సంపాదించుచున్నాఁడు- ... ... ... ... ...

ఉ॥ ఎల్లెడఁజిత్రరూపమువహించినచక్కనిమోముదమ్మితో। గొల్లవిలాసవేషమునకుందగుసొమ్ములతోఁడజల్పయో।జొల్లసదక్షిశీతలసమున్నతితోవిలసిల్లుబాలకుం। డుల్లముపల్లవింపనయనోత్సవమూరఁజరించుచున్నఁడో॥

తా॥ గొల్లపాళెంబునకుఁదగినసొమ్ములచేనలంకరింపఁబడివిశాలంబులగు నయనంబులుగలిగియెల్లదెసలంజిత్రించిన యటులవెలుంగు నెమ్మోముచేఁదేజరిల్లునిబ్బాలుండునాకన్నులకత్యంతసంతోషంబుఁజేయుచున్నాడనుట॥

శ్లో॥ ఆన్దోళితాగ్రభుజమాకులనేత్రలీలమార్ద్రస్మితార్ద్రవదనామ్బుజచంద్రబిమ్బమ్। శింజానభూషణశతం శిఖిపిఞ్ఛమౌళిం శీతంవిలోచనరసాయనమభ్యుపైతి॥ .. ... ... ... ... ౭౦

టీక॥ ఆందోళితాగ్రభుజం- ఆందోళిత - ఈషత్కంపితములకు - అగ్రభుజం- భుజాగ్రములుగలయట్టి- ఆకులనేత్రలీలం- ఆకుల- వ్యాకులమయిన-నేత్రలీలం- నేత్రవిలాసముగలయట్టి - ఆర్ద్రస్మితార్ద్రవదనాంబుజచంద్రబింబం- ఆర్ద్ర- సరసమయిన- స్మిత - చిఱునగవుచేత- ఆర్ద్ర- సరసమయిన - వదనాంబుజచంద్రబింబం - చంద్రునివంటిముఖకమలముగలయట్టి - శింజానభూషణశతం- శింజాన- మ్రోయుచున్న- భూషణశతం - ఆభరణశతముగలయట్టి- శిఖిపిఞ్ఛమౌళిం- శిఖిపిఞ్ఛ- నెమలిపురి - మౌళిం- శిరమందుఁగలయట్టి - శీతం (చూచువారలనేత్రములకు) చల్లనైనయట్టి- లోచనరసాయనం- లోచన - నేత్రములకు-రసాయనం-తియ్యనైనశ్రీకృష్ణాఖ్యవస్తువు - మమ - నాకు - అభ్యుపైతి- అభిముఖముగావచ్చుచున్నది- ... ... ...

ఉ॥ అందెలుమువ్వలున్సొలయహస్తములూవఁగఁగంకణధ్వనుల్। సందడిజేయనాననవిలాసము చందురుఁగ్రేణిసేయనా। నందవిశాలలోలనయనమ్ములతోశిఖిపింఛమౌళితో। నందముజెందులోచనరసాయనమల్లదెవచ్చెజెల్లఁగా॥

తా॥ కొంచెముగాసంచలించుచున్నమూఁపులును బ్రకాశించుచున్నవిశాలంబులగునేత్రవిలాసంబులునుసరసంబగు చిఱునగవుచేఁదేజరిల్లునెమ్మోముదావ

రయును. మ్రోయుచున్న భూషణశతంబును నెమలిపురిచేనలంకరింపఁబడినసిగయునుంగలిగి చూచువారలచూపులకుఁ జల్లదనంబు నెలవుకన్నులుఃపండువగు శ్రీకృష్ణరూపంబగు వస్తువునాకభిముఖంబుగవచ్చుచున్నదియనుట.

శ్లో॥ పశుపాలబాలపరిషద్విభూషణంశిశు రేషశీతలవిలోలలోచనః। మృదులస్మితార్ద్రవదనేందుసమ్పదామదయన్మదీయహృదయంవిగాహతే॥

టీక॥ పశుపాలబాలపరిషద్విభూషణం - పశుపాలబాల- గోపాలబాలురయొక్క - పరిషత్- సభకు- విభూషణం- అలంకారభూతుఁడైనయట్టి శీతలవిలోలలోచనః- శీతల- చూచువార్లరక్షించుచున్నయట్టి- విలోల - చంచలములైన- లోచనః- నేత్రములుగల- ఏషః శిశుః- ఈబాలుఁడు- మృదులస్మితార్ద్రవదనేందుసంపదా- మృదుల కోమలమయిన- స్మిత- లేనగవుచేత- ఆర్ద్ర- సరసమయిన- వదనేందు- ముఖచంద్రునియొక్క - సంపదా- సమృద్ధిచేత- మదీయహృదయం- మదీయ- నాసంబంధమైన- హృదయం- హృదయమును- మదయన్- మదముగలదానిఁగాఁజేయుచు- విగాహతే- పొందుచున్నాఁడు॥

చ॥ వికవికనవ్వుచున్నదుటఁ ద్రేలుకులుల్ నునుపాలబుగ్గలుం। జికిలిమెఱుంగుచూపురహిఁ జెందఁగనాననశీతలద్యుతిన్। బ్రకటితగోపశాబకసభానవభూషణమై చెలంగుబా। లకుఁడుమదీయమానసతలంబుననిల్చెనుసొంపులించుచున్॥

తా॥ గోపాలబాలకసభయందుభూషణంబులఁదేజరిల్లుచుఁ జూచువారలకురక్షకంబులై చంచలంబులగుకన్నులుగల యిబ్బాలుఁడుకోమలంబగు చిఱునగవుచేసరసంబగునెమ్మొగంబుచందురునందంపు సమృద్ధిచే వెలుంగుచునాహృదయంబుమదింపంజేయుచుఁగానవచ్చుచున్నాఁడనుట... ... ...

శ్లో॥ తదిదముపనతంతమాలనీలంతరళవిలోచనతారకాభిరామమ్। ముదితముదితవక్త్రచంద్రబిమ్బంముఖరితవేణువిలాసజీవితం॥ ... ... ౭.

టీక॥ తమాలనీలం- తమాల - చీఁకటిమ్రాఁకులవలె- నీలం- నల్లనిదైనయ తరళవిలోచనతారకాభిరామం - తరళ- చంచలములయిన - విలోచన- కన్నులయొక్క - తారక- గ్రుడ్లచేత- అభిరామం- సుందరమైనయట్టి - ముదితముదితం- మిక్కిలిసంతోషించునట్టి - వక్త్రచంద్రబింబం- చంద్రమండలమువలెను ముఖముగలయట్టి- ముఖరితవేణువిలాసజీవితం - ముఖరిత - మ్రోయుచున్న వేణు - పిల్లనఁగ్రోవియొక్క - విలాస- స్వరవిశేషములకు - జీవితం - ప్రాణమైనకృష్ణుఁడనెడివస్తువు - మే- నాకు- ఉపనతం- ఎదురయ్యె॥

ఉ॥ నీలఘనాభమైనయతివిన్నిర్మలవేణునినాదజీవమై। లోలతటిల్లతా లలిత
రోచనతారకమై ప్రసన్నతో । ద్వేలము ఖేందుమండలన వీనవిలాస కలాకలాప
మై।బాలునిలీలవచ్చికనుపట్టెమహాద్భుత తేజమిద్యెడన్॥ ... ౭౨

తా॥ చీకటిఁ బ్రూకులవలెనెల్లనిమయినిగ్గులు గలవాఁడునుజంచలంబులగువి
లోచనంబులచేమనోహరుండును - సంతసంబునొందు కతనఁ జందురుంబోనివ
దనంబుగలవాఁడును - వేణునాదవిలాసంబులకుం బ్రాణంబునగు శ్రీకృష్ణుండు
నాకెదురయ్యెననుట॥ ... ... ... ... ...

శ్లో॥ చాపల్యసీమచపలానుభవైకసీమచాతుర్యసీమచతురాననశిల్పసీమ సౌ
రభ్యసీమసకలాద్భుతకేళిసీమసౌభాగ్యసీమతదిదంవ్రజభాగ్యసీమ॥ ౭౩

టీక॥ చాపల్యసీమ- చాపల్య- దుష్టచేష్టలకు- సీమ పొలిమేరయయినట్టి చ
పలానుభవైకసీమ- చపలా- లక్ష్మీయొక్క - అనుభవ- భోగంబునకు- ఏక-ము
ఖ్యమైన- సీమ- ఇరువైనయట్టి- చాతుర్యసీమ- చాతుర్య-చతురవచనములకు సీ
మ- ముఖ్యస్థానమైనయట్టి- చతురాననశిల్పసీమ - చతురానన- బ్రహ్మయొక్క-
శిల్ప- నిర్మాణముచేయునేర్పునకు సీమ - పొలిమేరయైనయట్టి - సౌరభ్య
సీమ- సౌరభ్య- సకలపరిమళవస్తువులకు- సీమ- ముఖ్యస్థానమైనయట్టి- సకలా
ద్భుతకేళిసీమ- సకల- సమస్తములైన- అద్భుత కేళి- ఆశ్చర్యవిలాసములకు - సీ
మ- ముఖ్యస్థానమైనయట్టి- సౌభాగ్యసీమ- సౌభాగ్య- సౌందర్యమునకు-సీమ-
ముఖ్యస్థానమైనయట్టి- వ్రజభాగ్యసీమ- వ్రజ-గొల్లపల్లెలోనున్నజనులయొక్క -
భాగ్య- అదృష్టఫలమునకు సీమ- పొలిమేరయైన- తత్ - కృష్ణుడనెడివస్తువు-
ఇదం- నాయెదుటనున్నది- ... ... ... ...

చ॥ కలిమి నెలంతవేడుకలకందువ సంతతవిలోలవృత్తికిన్ । నెలవు శుభాళికా
స్పదము నేర్పుల బ్రోవజశిల్పికల్పనా। ఫలము విచిత్రలీలలకుఁ బాళెము తావుల కెల్ల
కావగో । కులజనభాగ్యసీమయిదిగోకనుఁగొంటినిగంటికింపుగన్॥

తా॥ అధికంబులగుదుష్టచేష్టలకునులక్ష్మీవిలాసంబులకును-సకలచాతుర్యం
బులకును- బ్రహ్మనిర్మాణసామగ్రులకును - సకలపరిమళపదార్థంబులకు
ను - సమస్తాశ్చర్యవిలాసంబులకును - సకలసౌందర్యంబులకును - గోపాలకు
ల భాగ్యఫలంబులకునుముఖ్యస్థానంబగు కృష్ణాభిధానలోకోత్తరవస్తువు నాకె
దురయ్యెననుట. ... ... ... ... ...

శ్లో॥ మాధుర్యేణద్విగుణశిశిరంవక్త్రచంద్రంవహంతీవంశీవీథీవిగళదమృ

తస్రోతసా సేచయంతీ। మద్వాణీనాం విహరణపదం మత్తసౌభాగ్యభాజాం
తత్పుణ్యానాం పరిణతిరహో నేత్రయోస్సన్నిధత్తే॥ ... ... ౭౪

టీక॥ మద్వాణీనాం- నాపలుకులకు- విహరణపదం- విహారస్థానమయిన
మత్తసౌభాగ్యభాజాం- అధికసౌందర్యమొందిన- మత్పుణ్యానాం- నాయదృష్ట
ములయొక్క - పరిణతిః- పరిపాకము- (అనఁగా శ్రీకృష్ణస్వామి) మాధుర్యేణ
సౌందర్యముచేత - ద్విగుణశిశిరం - మిక్కిలియాహ్లాదంబును తెచ్చెడిదంచునట్టి- వ
క్త్రచంద్రం- చంద్రునివంటిముఖంబును - వహంతీ - వహించుచున్నదై- వం
శీవీథీగళదమృతస్రోతసా - వంశీ- పిల్లఁగ్రోవియొక్క - వీథీ- రంధ్రపరంప
రనుండి - విగళత్- జారుచున్న- అమృతస్రోతసా- అమృతప్రవాహసదృశమై
నగానవిలాసముచేత - సేచయంతీ- కర్ణానందము సేయుచున్నదై-(మమనా
యొక్క) నేత్రయోః - కన్నులకు- సన్నిధత్తే- సమీపించుచున్నాఁడు. ✤

శా॥ లావణ్యాంబుధిచంద్రబింబముఖలీలన్ దాల్చి వంశీనినాదాపర్యాప్తసుధా
ప్రవాహమున నోలాడంగ్రవర్తిల్లునా। దైవాకారము నావచోవిహరణస్థానం
బు నాపుణ్యాస। ద్భావంబాఁ ప్రసన్నుమయ్యెనుయశోదా పుత్రరూపంబునన్

తా॥ నాపలుకులకు విహారస్థానంబును - సర్వోత్తమంబులగు నాయదృష్ట
బుయొక్క ఫలపరిపాకంబునగు శ్రీకృష్ణుండు సౌందర్యంబుచే సకలజనానంద
బుసంపాదించుచున్న చందురుంబోని ముఖంబును వహించుచున్నవాడును - పి
ల్లఁగ్రోవి సందులనుండి వెడలుచున్న యమృతంబువోని గానంబుచే జెవులకింపు
యునట్టివాడునునై - నాకుఁ బ్రత్యక్షమయ్యెననుట. ... ... ✤

ఇట్లు ప్రత్యక్షమైన శ్రీకృష్ణునికి నమస్కరించుచున్నాఁడు.

శ్లో॥ తేజసేస్తు నమో ధేనుపాలినే లోకపాలినే। రాధాపయోధరోత్స
శాయినే శేషశాయినే॥ ... ... ... ... ౭

టీక॥ శేషశాయినే- శేష- ఆదిశేషునియందు - శాయినే- పవ్వళించినట్టి
రాధాపయోధరోత్సంగశాయినే- రాధా- రాధయొక్క - పయోధర - స్త
ములయొక్క - ఉత్సంగ- మీఁదను- శాయినే - పవ్వళించినట్టి లోకపాలినే-
గద్రక్షకమైనట్టి - ధేనుపాలినే- ధేను- గోవులను- పాలినే- కాచునట్టి- తేజ
తేజముకొఱకు- నమః- నమస్కారము- అస్తు- అవుగాక. ...

ఉ॥ పాయనిభక్తిమ్రొక్కెదనపారకృపారసధేనుసౌఖ్యసం। ధాయికి
రక్షణవిధాయికి భాసురరాధికాకుచ। స్థాయికి బన్నగాధిపవిశాలఫణామణి

ప్రీధికా । శాయిః గోపికానయనసారససారఫలప్రదాయికే ॥ ౭౫

తా ॥ శేషశయనుండును సకలలోకపరిపాలకుండును- పరబ్రహ్మంబయ్యు భక్తజనసౌలభ్యము దెలియ జేయుటకై రాధాస్తనంబులందు బరుండువాఁడును ఆవులగాచువాఁడునయిన - శ్రీకృష్ణునికొఱకు నమస్కారము సేసెదననుట- ❀

శ్లో ॥ ధేనుపాలదయితాస్తనస్థలీధన్యకుఙ్కుమసనాథకాన్తయే। వేణుగీతగతిమూలవేధసే తేజసే తదిదమోంనమోనమః॥ ... ... ౭౬

టీక॥ ధేనుపాలదయితాస్తనస్థలీధన్యకుంకుమసనాథకాన్తయే - ధేనుపా - గోపాలురకు - దయితా - ప్రియురాండ్రయిన వేఁతలయొక్క - స్తనస్థలీ- స్తనప్రదేశమునందు- ధన్య- కృతార్థమైన - కుంకుమ - పసుపు మొదలగు చూర్ణవిశేషములతోడ - సనాథ- కూడుకొన్న- కాన్తయే- కాంతిగలయట్టి - వేణుగీతగతిమూలవేధసే- వేణు- పిల్లనఁగ్రోవియొక్క - గీత-గానముయొక్క - గతి- స్వరవిశేషములకు - మూలవేధసే- మూలబ్రహ్మమైన - తేజసే- శ్రీకృష్ణరూపమైన తేజంబుకొఱకు - తదిదం- ఆయీ- ఓంనమోనమః- ప్రణవపూర్వకములయి పలుమఱుఁ జేయు నమస్కారములు- ... ... ... ❖

మ॥ పసిగాపుంజిగురాఁకుబోండ్లమెఱుఁగుంజాలిండ్లకాశ్మీరపుంరసముల్ జొబ్బిలనబ్బి నిస్ఫురపరీరంభస్థితిం దెల్పను ల్లసితంబై మురళీనినాదగతిమూలబ్రహ్మమై ంటికింబొసఁగంజాలెడుమూర్తికిన్ మొగుడుంగేలోంకారపూర్వంబుగన్ ॥ ౭౬

తా॥ గోపికాస్తనంబులయందలి కుంకుమంబుతోఁగూడిన శరీరకాంతిగలయదియును వేణుగానంబులకు మూలబ్రహ్మంబైన తేజంబునకుఁ బ్రణవపూర్వకంబుగా గబలుమాఱు నమస్కరించెదననుట- ఇట్లు నమస్కరించిన పిమ్మట తనకెదుటవచ్చుచున్న శ్రీకృష్ణుని విలాసంబు వర్ణించుచున్నాఁడు- ... ❖

శ్లో ॥ మృదుక్వణన్నూపురమన్థరేణ బాలేన పాదామ్బుజపల్లవేన। అనుక్వణన్మఞ్జులవేణుగీతమాయాతి మే జీవితమాత్తకేళిః॥ ... ... ౭౭

టీక॥ ఆత్తకేళి- ఆత్త పొందబడిన- కేళి- విహారంబులుగల- మేజీవితం- నా ప్రాణంబైన శ్రీకృష్ణుండను తేజంబు- మృదుక్వణన్నూపురమన్థరేణ - మృదు- చెవులకింపగునట్లుగా - క్వణత్ - మ్రోయుచున్న - నూపుర - అందియలచేత- మన్థరేణ- మందసంచారముగలయట్టి- బాలేన - చిన్నవాఁడైనట్టి- పాదాంబుజపల్లవేన - తామరతూఁడులవంటి పాదంబులచేత - అనుక్వణన్మంజులవేణుగీతం- అనుక్వణత్- అందియలననుసరించి మ్రోగుచున్నట్టి- మంజుల- మనోహరమైన- వే

ణుగీతం- వేణు నాదముగలుగునట్లుగా- ఆయాతి- వచ్చుచున్నది- ... ౹

ఉ॥ చల్లనివేణుగీతనుసాదిగతాళగతుల్లెలంగిఘల్ ఘల్లుగటంచునందియలుగజ్జులునొక్కటఁబిక్కటిల్లఁగాఁ। బల్లవకోమలాంఘ్రులను బాలకుఁడాడుచుఁబాడుచుండనా। వెలితన్మాత్రకన్నులకునువిందుగజీవమువచ్చునైదెడీ॥ ౹

తా॥ నాప్రాణభూతుండగు కృష్ణుండువిహారంబులనొందుచు మృదువుగమ్రోయుచున్న యందియలచేమందసంచారంబునొందుననియును డామరజేకలుంబోనిదియునునగు చిన్నియడుగులచేనూపురంబులకనురూపంబుగాధ్వనిచేయుచున్నవేణుగానంబునకనునానంబుగన గమనంబుసేయుచువచ్చుచున్నాడనట.

శ్లో॥ సోయం విలాసమురళీనినదామృతేన సించన్నుదఞ్చితమిదం మమకర్ణయుగ్మమ్। ఆయాతి మే నయనబన్ధురనన్యబన్ధురానన్దకన్దళితకేళికటాక్షలక్ష్మీః॥

టీక॥ ఆనందకందళితకేళికటాక్షలక్ష్మీః- ఆనందకందళిత - ఆనందాంకురములంజేయుచున్నట్టి- కేళి - విలాసప్రధానములైన - కటాక్ష - కడకంటిచూపులయొక్క - లక్ష్మీః- లక్ష్మిగలట్టి మే - నాయొక్క - నయనబన్ధుః-నయననేత్రములకు- బంధుః - బంధువయినట్టి - అనన్యబంధుః - సర్వబంధువయినశ్రీకృష్ణుండు - ఉదఞ్చితం - వికటమున్నగ్నమైన - మమ - నాయొక్క - కర్ణయుగ్మం- కర్ణ చెవులయొక్క - యుగ్మం - జంటను- విలాసమురళీనినదామృతేన విలాస- విలసదగిన- మురళీ పిల్లనగ్రోవియొక్క - నినద- ధ్వనియనెడి. అమృతేన- అమృతముచేత సించన్ - తడుపుచున్నవాడై- ఆయాతి వచ్చుచున్నాడు.

ఉ॥ మాసిమిచేసిగోపకులమానసు [illegible] వాడు [illegible] బోలునునేపుననేగుర్వముంజెవిరెంపుచునాదుకంటికిన్। మేలగు [illegible] బమోదకసకృప కేళికటాక్షలక్ష్మిడై। బాలుడనన్యబంధుడెడవాయకయిట్లలయింపవచ్చెగా॥ ౨౮

తా॥ ఆనందాంకురంబులను గావించునట్టి యానందకరంబులగు విలాసకటాక్షంబులుగలవాఁడును- సర్వబంధుండును నానయనంబులకు నత్యంత ప్రియుండునునగు - కృష్ణుండాశగలదైన నాకర్ణద్వయంబును మనోహరంబగుమురళీనాదామృతంబుచేఁదడుపుచున్నవాడై వచ్చుచున్నాఁడనట. ... ౹

శ్లో॥ దూరాద్విలోకయతివారణఖేలగామీధారాకటాక్షభరితేనవిలోచనేన। ఆరాదుపైతి హృదయఙ్గమవేణునాదవేణీదుఘేనదశనావరణేన దేవః॥ ౨౯

టీక॥ హృదయఙ్గమవేణునాదవేణీదుఘేన - హృదయఙ్గమ - హృద్యమైన- వేణునాద- వేణుధ్వనియనియెడి- వేణీ- ప్రవాహమును - దుఘేన - పిదుకు

తా॥ మ్రోయుచున్న పిల్లనగ్రోవిగలవాఁడగుచు ముల్లోకంబులకు మనోజ్ఞంబులయిన యాశ్చర్యంబుగలుగఁజేయునవియై ప్రకాశించుచున్న భూషణంబులకు నెలవులై దివ్యవిలాసంబులతోడంగూడి చూడఁజూడఁజల్లనివియై యశరణ్యాంబులైన పాదంబులచేనితండితఁడెయనునటుల సమీపంబున శ్రీకృష్ణుండు వచ్చుచున్నాఁడనుట॥ ... ... ... ... ... ❖

శ్లో॥ సోయంమునీంద్ర జనమానస తాపహారీ సోయంమదవ్రజ వధూవసనాపహారీ। సోయంతృతీయభువనేశ్వర దర్పహారీ సోయంమదీయ హృదయాంబురుహాపహారీ॥ ... ... ... ... ... ౮౧

టీక॥ యః- ఎవ్వఁడు- మునీంద్రజనమానస తాపహారీ- మునీంద్ర- మునిశ్రేష్ఠులయొక్క - జన- సమూహముయొక్క -మానస తాప- మనస్తాపమును హారీ- అపహరింపసమర్థుఁడో- సః- ఆపురుషుఁడు- అయం- ఇతఁడే- యః- ఏ పురుషుఁడు - మదవ్రజవధూవసనాపహారీ- మద- మత్తలైన- వ్రజవధూ - గోపస్త్రీలయొక్క -వసన- వస్త్రములను- అపహారీ- హరింపసమర్థుఁడో- సః-వాఁడు-అయం-ఇతఁడే- యః - యెవఁడు-తృతీయభువనేశ్వరదర్పహారీ- తృతీయభువనేశ్వర- ఇంద్రునియొక్క -దర్ప-గర్వమును-అపహారీ- అపహరింపసమర్థుఁడో- సః- అతఁడు-అయం-ఇతఁడే - యః- ఎవఁడు - మదీయహృదయాంబురుహాపహారీ- మదీయ- నాసంబంధమయిన- హృదయ-ఎదయనియెడి-అంబురుహ - కమలమును-అపహారీ-అపహరింపసమర్థుఁడో- సః- వాఁడు-అయం-ఇతఁడే॥ ❖

ఉ॥ చిక్కఁగనాఁడుగోపికలచేలములెత్తినదొంగశైలముల్। చెక్కులుసేయువానిమదజృంభమునాచినదొంగభక్తిచే। నెక్కొనుమౌనికోటిమదినిల్పినపాపముబాపుదొంగనా। చొక్కపుజిత్తసారసముజూఱలుగాగొను దొంగనేటికిన్॥

తా॥ ఎవఁడు సకలమునులమనంబులం బొడము తాపంబులంగొల్లలాడె నెవ్వండెలజవ్వనంపువ్రేతలచేలంబులంజూఱగొనెనేపురుషుండింద్రగర్వంబపహరించె నెవఁడు నాడెందంపుఁదామరంగొల్లగొనెనయెసట్టిపురుషుండితండేయనుట॥ ❖

శ్లో॥ సర్వజ్ఞత్వేచమౌగ్ధ్యేచసార్వభౌమమిదంమమ। నిర్విశన్నయనంతేజో నిర్వాణపదమశ్నుతే॥ ... ... ... ...... ౮౨

టీక॥ సర్వజ్ఞత్వేచ - సర్వజ్ఞత్వమందును - మౌగ్ధ్యేచ - సౌందర్యంబునను- సార్వభౌమం- సర్వభూమీశ్వరాతిశాయియగు- ఇదం- ఈపురోవర్తియయిన- తేజః- తేజముఁగూర్చి- నిర్విశత్- ప్రవేశించుచున్న - మమ- నాయొక్క - నయ

నం. నేత్రము- నిర్వాణపదం-మోక్షసుఖమును- అశ్నుతే-అనుభవించుచున్నది-

మ॥ వినుసర్వజ్ఞతయందుఁ మాధుర్యమునన్సర్వాతిశాయిత్వభావంబునాఁ। జనునీ తేజముఁజూచినానయనముల్సారూప్యముం జెందెడిఁ। డనియాలోకముఁజేయఁగా భ్రమరకీటన్యాయముంగాంచికా। దనజ్ఞానేంద్రియరూఢికన్నులకునేలాకల్గునూహింపఁగన్॥ ... ... ... ... ... ౮౨

తా॥ సర్వజ్ఞత్వంబున సౌందర్యంబున సర్వాతిశాయివైన యీ ముందుగానంబడు తేజంబుఁగూర్చిప్రవేశించు నానయనంబు మోక్షసుఖంబు ననుభవించుచున్నదియనుట॥ ... ... ... ... ... ✤

శ్లో॥ కృష్ణానమేతత్పునరుక్తశోభముష్ణేతరాంశోరుదయంముఖేందోః। తృష్ణాంబురాశిం ద్విగుణీకరోతి కృష్ణాహ్వయం కించనజీవితం మే॥ ... ౮౩

టీక॥ మే - నాయొక్క - జీవితం- జీవనమయినదియు కించన- ఇట్టిదియనిచెప్పనలవిగానిదియు - కృష్ణాహ్వయం- శ్రీకృష్ణాఖ్యమునునగు- ఏతత్- ఈపురోవర్తివస్తువు - ముఖేందోః - ముఖచంద్రునివలన - ఉష్ణేతరాంశోః - చంద్రునియొక్క -ఉదయం-ఆవిర్భావమును- పునరుక్తశోభం- పునరుక్త- ద్విగుణితమగు శోభం- కాంతిగలదిగా- కృష్ణానం-చేయుచున్నదియై తృష్ణాంబురాశిం-ఆశాసముద్రమును-మే- నాయందు- ద్విగుణీకరోతి- రెండంతలుగా జేయుచున్నది- ✤

మ॥ కమలోల్లాసకమైనిరంతరకళల్గన్పట్టుశీతాంశుబిం। బముకంటెన్ ద్విగుణాభిరూప్యమునరమ్యంబైననెమ్మోముబు। న్నమజాబిల్లివెలుంగుతో వెలయుకృష్ణాభిఖ్యమౌ నాదుజీ। వముదృష్ణాబ్ధితరంగలన్ ద్విగుణమైవర్తిల్లఁజేసెన్నదిన్॥

తా॥ నాజీవితంబగుచుం జెప్పనలవిగాని శ్రీకృష్ణాఖ్యంబగు నీముందు కానంబడువస్తువు నెమ్మొగంబను జందురునివలనఁబూర్ణిమయందుఁ బొడముచందురునికి వన్నియం గల్పించునదియై నాయందాశా సముద్రంబును నెగడం జేయుచున్నదియనుట॥ ... ... ... ... ... ✤

శ్లో॥ తదేతదాతామ్రవిలోచనశ్రీసమ్భావితాశేషవినమ్రవర్గమ్। ముహుర్మురారేర్మధురాధరోష్ఠం ముఖామ్బుజం చుమ్బతిమానసం మే॥ ౮౪

టీక॥ ఆతామ్రవిలోచనశ్రీసంభావితాశేషవినమ్రవర్గం- ఆతామ్ర- ఈషదరుణములయిన- విలోచన- నేత్రములయొక్క - శ్రీ- కాంతిచేత- సమ్భావిత- బహూకరింపఁబడిన- అశేష- సమస్తమయిన- వినమ్రవర్గం - నరజనసమూ

హాముగలదియు. మధురాధరోష్ఠం. మధుర. మనోజ్ఞమగు. అధరోష్ఠం. అధరముగలదియునునగు. మురారే. శ్రీకృష్ణమూర్తియొక్క - యత్. ఏ. ముఖామ్బుజం. ముఖకమలమును. మే. నాయొక్క - మానసం.మనస్సు.చుమ్బతి.ధ్యానముచేయుచున్నది. యోతత్. ఆప్రసిద్ధమైనముఖము. ఏతత్. ఇది. ❖

చ॥ కలశపయోధి శీకరనికాయముచే నునుగెంపుమీఱుక। న్నుల నతపాళికింబ్రియమునూల్కొనఁ జేయుచుఁదత్సుధాకణం। బులుమధురాధరోష్ఠమునఁబ్రూనినయాదిమదేవుమోముఁగా। వలెనదిగాకయున్నయెడఁ బల్మఱునామది యానఁగోరునే॥ ... , ... ... ... ... ౬౪

తా॥ ఈషదరుణంబులకునయనంబుల కాంతిచేసన్మానింపఁబడినెడి యశేష.శేవకసమూహంబుగలిగి - మనోజ్ఞంబగునధరంబుచేఁదేజరిల్లునే - శ్రీకృష్ణనిమోముదామరనునామనంబానఁగోరునో - అట్టిముఖంబె యీయగుపడెడుముఖంబనుట॥ ... ... ... ... ... ... ... ❖

శ్లో॥ కరౌశరదుదంచితామ్బుజవిలాసశిక్షా గురూపదౌ విబుధపాదపప్రథమపల్లవోల్లఙ్ఘినౌ। దృశౌదళితదుర్మదత్రిభువనోపమానశ్రియావిలోకయ విలోచనామృతమహోమహచ్ఛైశవమ్॥ ...... ... ౬౫

టీక॥ హేవిలోచన. ఓనేత్రమా. అమృతమహః. అమృత - అమృతమువలె. మహః - తేజముగలిగిన. మహచ్ఛైశవం. మహత్. శ్రీకృష్ణమూర్తియొక్క. శైశవమ్. బాల్యమును. విలోకయ. చూడుము. కరౌ - హస్తములు - శరదుదంచితాంబుజవిలాసశిక్షాగురూ. శరత్ - శరత్కాలంబున. ఉదంచిత. పుట్టిన. అంబుజ. కమలములయొక్క - విలాస - కాంతివిశేషములయొక్క - శిక్షా. శిక్షించుటయందు. గురూ. నియామకముల. పదౌ. పాదములు. విబుధపాదపప్రథమపల్లవోల్లంఘినౌ. విబుధపాదప. కల్పవృక్షములయొక్క - ప్రథమ.నూతనములయిన. పల్లవ. చిగుళ్లను. ఉల్లంఘినౌ. అతిక్రమింపసమర్థములు - దృశౌ. నేత్రములు. దళితదుర్మదత్రిభువనోపమానశ్రియా. దళిత. విదాలింపఁబడిన. దుర్మద. గర్విష్ఠములయిన. త్రిభువన. ముల్లోకంబులపదార్థంబులయొక్క - శ్రియా. కాంతులుగలవి॥ ... ... ... .. .. ❖

ఉ॥ పాదములంటిమావిబుధపాదపనూతనపల్లవావళిం। గాదనుఁ గన్నుదోయిసరికాంతివిశేషముముజ్జగంబునన్। లేదనుశారదాబ్జవనలీలల గెల్వగేరులోచనా। హాదమయారెశైశవవిలాసముగంటిమినందసూతికిన్॥ ౬౫

తా॥ శరత్కాలంబునం బొడముకెందమ్ములం గేరు కెంగేలవయును వేలుపుట్రమా క[illegible]ముట్టినక్రొత్తచిగుళ్లం దెగడునడుగులును ముల్లోకంబులందుం జెడిగర్వి ష్ఠంబులగువదార్థంబుల కాంతివిశేషంబులం బోవం దోలు కన్నుంగవయును గలిగి యమృతంబుంబోలి వెలయు శ్రీకృష్ణునిబాల్యంబునోనయనంబా చూడుమనుట॥ ❋

శ్లో॥ ఆదిన్వానమహన్యహన్యహని సాకారాన్విహారక్రమా సార్ద్రస్థానమరుంధతీహృదయమప్యార్ద్రస్మితాస్యశ్రియా। ఆతన్వానమనన్య జన్మనయనశ్లాఘ్యామనర్ఘ్యాం దశామామన్దం వ్రజసున్దరీ స్తనతటీసామ్రాజ్యముజ్జృమ్భతే॥ ౮౬

టీక॥ అహన్యహని. ప్రతిదినమును. సాకారాన్. ఆకారముతోఁగూడిన. విహారక్రమాన్. విహారవిధులను. ఆదిన్వానం - సంపాదించుచున్నదియు - ఆర్ద్రస్మితాస్యశ్రియా - ఆర్ద్ర- సరసమైనదియు - స్మిత - చిఱునగవు గలదియునగు. ఆస్య- నెమ్మొగముయొక్క - శ్రియా- సంపదచేత. అరుంధతీహృదయమపి- అరుంధతి (పతివ్రతాశిరోమణియగు) వసిష్ఠభార్యయొక్క - హృదయమపి- హృదయమునైనను. ఆర్ద్రస్థానం- కొంచెనభిముఖముగ జేయుచున్నదియు. అనన్యజన్మనయనశ్లాఘ్యాం- అనన్యజన్మ- మన్మథునియొక్క - నయన-నేత్రములచేత - శ్లాఘ్యాం- కొనియాడఁదగినదియు- అనర్ఘ్యాం- శ్రేష్ఠమైన-దశాం- అవస్థను- ఆతన్వానం- విస్తరింపఁజేయుచున్నదియునగు. వ్రజసుందరీస్తనతటీసామ్రాజ్యం - వ్రజసుందరీ - గోపస్త్రీలయొక్క - స్తనతటీ - స్తనప్రదేశములయందు- సామ్రాజ్యం. ఆధిపత్యరూపమైన శ్రీకృష్ణాఖ్యవస్తువు- ఆమందం. ఈషన్మందమగునట్లు. ఉజ్జృంభతే- ప్రకాశించుచున్నది- ❋

మ॥ నలినాస్త్రుండునుజొక్కికన్గొనుచు నానందించు నెమ్మోముక్రొం। దళుకున్నవ్వులరుంధతీహృదయమైనం బోవ నీకాంక్షించు। తలుగాఁ బ్రొద్దోకరూపమై మెలగుచు విన్నాణంబులం దేలిని। శ్చలనంద వ్రజసుందరీస్తనతటీసామ్రాజ్యముప్పొంగెడిన్॥ ... ... ... ... ... ౮౬

తా॥ ప్రతిదినంబు నాకారవంతంబులగు విహారక్రమంబుల నెఱయం జేయుచు సరసంబగు ముఖకాంతిచేనరుంధతీ హృదయంబునైనస్వవశంబుగఁ జేయంజాలినమ్మవిల్తునివలపింపంజాలినగోపస్త్రీస్తనసామ్రాజ్యరూపంబగు శ్రీకృష్ణాఖ్యవస్తువు నాకన్నుల యెదుటం బ్రకాశించుగాతయనుట. ... ... ❋

శ్లో॥ సముచ్ఛ్వసితయావనంతరళశైశవాలఙ్కృతం మదచ్ఛవితలోచనమ

టీ॥ కాన్తాకచగ్రహణవిగ్రహబద్ధలక్ష్మీఖండాంగరాగరసరంజితమంజుల శ్రీః - కాన్తా- ప్రియురాలియొక్క - కచగ్రహణ- కేశగ్రహణముయొక్క - విగ్రహ - కలహమందు బద్ధ- గ్రహింపంబడిన- లక్ష్మీ- రుక్మిణీదేవియొక్క -ఖండ- చిటిలిన- అంగరాగ - మెయిపూతచేత- రంజిత- అలంకరింపబడిన-మంజుల- మనోహరమైన- శ్రీః సంపదగలయట్టి- గండస్థలీముకురమండలఖేలమానఘర్మాంకురం-గండస్థలీముకురమండల- అద్దములవంటిచెక్కిళ్లయందు-ఖేలమాన- నృత్యముచేయుచున్న- ఘర్మాంకురం- చిఱుచెమటగలయట్టిశ్రీకృష్ణతేజము. కిమపి- ఇట్టిదియనిచెప్పఁలవిగానిదైనై - ఖేలతి- ప్రకాశించుచున్నది- ❖

మ॥ తళుకున్నిద్దపుఁజెక్కుటద్దములపైఘర్మాంకురంబూఱఁగాఁ । గలికాభోగపయోధరాంతరలసత్కాశ్మీరసంబంధగం । ధిలవత్కుస్థలుఁడై గృహీతఘనవేణీబంధుఁడై నెయ్యపుం । జెలియం జుంబనకేళి దేల్చు హరినాచిత్తంబునం జెందెదన్॥ ... ... ... ... ... ౯౦

తా॥ కేశగ్రహణకలహంబునకుం దాఁచ్చినరుక్మిణీదేవీ స్తనమండలంబునం జిటిలినయంగరాగంబుచే నలంకరింపఁబడినదియై యద్దంబులం బోలుచెక్కిళులం జిఱుచెమటలూఱం జెలంగు శ్రీకృష్ణతేజంబు సెప్పనలవిగాక వెలుంగుచున్నదియనుట- ... ...

శ్లో॥ మధురంమధురంవపురస్యవిభోర్మధురంమధురంవదనంమధురమ్। మధుగన్ధిమృదుస్మితమేతదహోమధురంమధురంమధురంమధురమ్॥ ౯౧

టీ॥ అస్య- ఈముందటనగుపడియెడి - విభోః- శ్రీకృష్ణమూర్తియొక్క- వపుః - శరీరము - మధురంమధురం - మిక్కిలిసుందరము - మధుగంధిమృదుస్మితం- మధు- మకరందమువలె- గంధి- పరిమళముగల- మృదు- గోమలమైన- స్మితం- లేనగవుకల- అస్య- విభోః- ఈకృష్ణమూర్తియొక్క - మధురం- సుందరమైన- వదనం- ముఖము- మధురంమధురం- మిక్కిలిసుందరము- ఏతత్ - ఈకానంబడుచున్నశ్రీకృష్ణతేజము- మధురంమధురంమధురంమధురం- మిక్కిలిమనోహరమైనది- అహో- ఆశ్చర్యము- ... ... ... ... ❖

శా॥ చూడంజూడఁగ మేనఁ దానినుమడించున్మాధురీసంపదల్ । చూడంజూడఁగ మోముగోముమది మెచ్చన్గుల్కుముమ్మాటికిం । జూడంజూడమరందబిందువులమించున్మందహాసంబునీ । జాడంబల్మఱుమాధురిం జెలఁగు నాస్వామిన్విలోకించెదన్॥ ... ... ... ... ... ౯౧

తా॥ చూడంజూడ నెమ్మోమునసోయగంబినుమడించు మకరందబిందువులందెగడుచేసగవునెమ్మొగమునందుసందడించునిట్టివేషంబులంగలిగి యీయగుపడు శ్రీకృష్ణతేజంబందలి సౌందర్యంబత్యాశ్చర్యంబుఁబుట్టించుచున్నదియనుట.

శ్లో॥ శృంగారరససర్వస్వంశిఖిపిఞ్ఛవిభూషణమ్। అఙ్గీకృతనరాకారమాశ్రయేభువనాశ్రయమ్॥ ... ... ... ... ౯౨

టీక॥ శృంగారరససర్వస్వం-శృంగారరస-శృంగారరసముయొక్క - సర్వస్వం- సర్వార్థరూపమైనవాఁడును - శిఖిపిఞ్ఛవిభూషణం - శిఖిపిఞ్ఛ- నెమలిపురి- విభూషణం- అలంకారము గాగలవాడును- అంగీకృతనరాకారం- అంగీకృత స్వీకరింపఁబడిన- నరాకారం- మనుష్యశరీరముగలవాఁడును- భువనాశ్రయం- లోకాధారుఁడునైనశ్రీకృష్ణుని- ఆశ్రయే- సేవించుచున్నాను.

ఉ॥ చక్కనివానిముద్దు వెదఁజల్లెడువానిదయారసంబుచే। నెక్కొనువానిమాళితవెలించినపింఛమువానిలోకముల్ । మ్రొక్కఁగనేలువానినతిమోహనమానుషవేషధారినై। యక్కడలేనివానిజగదాశ్రయునెప్పుడునాశ్రయించెదన్ ॥ ౯౨

తా॥ రాశిగాజేయబడినశృంగారరసంబుకరణిందేజరిల్లుచు నెమలిపురియలంకారంబుగధరియించిమనుష్యదేహంబుచే వెలుంగులోకాశ్రయుండైనశ్రీకృష్ణమూర్తినాశ్రయించుచున్నాననుట. ... ... ...

శ్లో॥ నాద్యాపిపశ్యతికదాచనదర్శనేనచిత్తేనచోపనిషదాసుదృశాంసహస్రం। సత్వంచిరంనయనయోంరనయోః పదవ్యాంస్వామిన్ కదానుకృపయామమసన్నిధత్తే॥ ... ... ... ... ... ౯౩

టీక॥ సుదృశాం- విద్వాంసులయొక్క - సహస్రం - సహస్రసంఖ్యగలసమూహము- అద్యాపి- ఈవిసమందైనను - కదాచన- మఱియొకకాలంబునైనను - దర్శనేన- నేత్రముచేత- చిత్తేన- చేతస్సుచేత - ఉపనిషదాచ - వేదాంతశాస్త్రముచేతనైన - త్వాం - నిన్ను - చిరం - బహుకాలమునుండి - నపశ్యతి- చూడదు- హేస్వామిన్ - ఓకృష్ణ - సత్వం - ఆనీవు- మమ - నాయొక్క - అనయోః- ఈప్రకృతిసంబంధములగు- నయనయోః కన్నులయొక్క - పదవ్యాం- మార్గమునందు- కృపయా- దయచేత- కదాను- ఎప్పుడు- సన్నిధత్తే- సన్నిధానముచేయుచున్నావు॥ ... ... ... ...

ఉ॥ కొందఱుయోగదృష్టినొకకొందఱు వేదవిచారవాసనం। గందురునిన్ను నెప్పుడొయొకానొకవేళ నభిజ్ఞులైనవా । రందఱునిట్టినీవుకరుణాంబుధిప్రాకృతదృష్టిఁజెందునా । ముందటనిల్చియెన్నఁడుఁబ్రమోదమొనర్తువునందనందనా॥ ౯౩

తా॥ వేలసంఖ్యలంగలవిద్వాంసులుగోందయుయోగనిష్ఠంబగుమనంబుననైనవిజ్ఞానవంతంబగుచూపుననైనవేదాంతశాస్త్రంబుననైననెంతకాలంబునకు నిన్నుంగాంచనోపరట్టియవాఙ్మానసగోచరుండవగునీవు కేవల ప్రకృతిసంబంధంబుగలనాకన్నులకెన్నటికింగానంబడువాఁడవోక దాయనుట. ... ◈

శ్లో॥ కేయంకాంతిః కేశవ త్వన్ముఖేందోః కోయంవేషః కాపివాచామభూమిః। సేయంసేయంస్వాదుతా మంజులశ్రీర్భూయోభూయోభూయశస్త్వాంనమామి॥ ... ... ... ... ... ౯౪

టీక॥ హేకేశవ- ఓశ్రీకృష్ణః త్వన్ముఖేందోః-త్వత్-నీయొక్క - ముఖేందోః. ముఖచంద్రునియొక్క - ఇయంకాంతిః- ఈకాంతి- కా- ఎయ్యదియనిచెప్పవచ్చును- అయంవేషః- ఈయలంకారము- కః- ఎద్దియనవచ్చును-సాసా-ఆయాప్రసిద్ధంబగు- ఇయమియంస్వాదుతా- ఈయీలావణ్యము- మంజులశ్రీః- సౌంబర్యలక్ష్మియును - వాచామభూమిః- వాగగమ్యము - తత్ - ఆకారణమువలన- భూయోభూయః- మాటిమాటికి - భూయశః-అధికముగ- త్వాం- నిన్నుఁగూర్చి- నమామి- మ్రొక్కుచున్నాను॥ ... ... ... ◈

ఉ॥ ఎక్కడిగోపరూపమదియెక్కడిముద్దుమొగంబుసోయగం। బెక్కడసీకళావిభవమెక్కడనేమనయెన్నవచ్చును। మ్మక్కయగోచరంబుభవదాకృతిపద్మభవాదిసూక్తికిన్ । మ్రొక్కెదసారెసారెకునమోహరయేయనినందనందనా॥ ౯౪

తా॥ ఇట్టిదియనిచెప్పనలవిగానినెమ్మొగంపుఁజందురునికాంతియువాచామగోచరంబగునలంకారమునునుడువనశక్యంబగులావణ్యంబునుమనోహరంబగుసౌందర్యసంపదయుంగల్గియుండుగాననిట్టినిన్నుంగూర్చిమ్రొక్కుచున్నాననట

శ్లో॥ వదనేందువినిర్జితశ్శశీదశధాదేవపదంప్రపద్యతే। అధికాంశ్రియమశ్నుతేతరాంతవకారుణ్యవిజృంభితంకియత్॥ ... ... ౯౫

టీక॥ హేదేవ- ఓకృష్ణ - శశీ- చంద్రుఁడు-తవ- నీయొక్క - వదనేందువినిర్జితః వదనేందు- ముఖచంద్రునిచే- వినిర్జితః- తిరస్కరింపఁబడినవాఁడై - దశధా- పదినఖములగుచు- పదం-పాదయుగళమును- ప్రపద్య-పొంది- అధికాం- అధికమయిన- శ్రియం- కాంతిని- అశ్నుతేతరాం- పొందుచున్నాఁడు-తవ - నీయొక్క -కారుణ్యవిజృంభితం- కారుణ్యాతిశయము- కియత్-ఎంతనవచ్చును॥

ఉ॥ ఆననకాంతితోడనెదురాసిశశాంకుఁడునిల్వలేకనీ। మానితపాదపద్మములమాటునజేరినఖాంకురాకృతిం। బూనిభజించినంతనెసమున్నతి శ్రీలొనఁ

గూర్చితౌరసీ। దీనదయాపరత్వమునుతింపఁగశక్యమెనందనందనా॥ ౯౫

తా॥ చందురుండునీముఖచంద్రునెదిరించియోడి పదితెఱంగుల నీపదంబులనఖరూపంబుననాశ్రయించినంత నధికంబగు కాంతినొందెనిట్టినీదయ కెయ్యాదియుసాటిలేదనుట॥ ... ... ... --- ... ◆

శ్లో॥ తత్త్వన్ముఖం కథమివాబ్జసమానకక్ష్యంవాఙ్మాధురీ బహుళపర్వకళాసమృద్ధం। తత్కిం భువనైకకాంతం యస్యత్వదాననసమానసుషమాసదాస్యాత్॥ ... ... ... ... ... ౯౬

టీక॥ వాఙ్మాధురీబహుళపర్వకళాసమృద్ధం - వాఙ్మాధురీ - వచోమాధుర్యమనియెడి - బహుళ - అధికమయిన - పర్వకళా - పూర్ణిమాకళలచే సమృద్ధం - అతిశయించిన- తత్-ఆప్రసిద్ధమైన- త్వన్ముఖం- త్వత్- నీయొక్క -ముఖం- నెమ్మొగము- అబ్జసమానకక్ష్యం-అబ్జ చంద్రకమలములతోడ - సమానకక్ష్యం సమానకోటిగలది- కథం- ఎటుల- భవేత్-అయ్యెను- యస్య-ఏపదార్థమునకు- సదా- ఎప్పుడును- త్వదాననసమా - త్వదానన- నీముఖముతోడ - సమా- సమానమగు- సుషమా- ఉత్కృష్టకాంతి - స్యాత్-అయ్యెను-అపరం-మఱియొకటి- భువనైకకాంతం - భువన- లోకములయందు- ఏక- ముఖ్యమగు- కాంతం సుందరము- స్యాత్- అయ్యెను-తత్- అది- కిం- ఏది- ... ... ◆

చ॥ సరసిజమంటిమాతగదుసాటికిశారదపూర్ణిమాసుధా। కరరుచియంటిమాసమముగాదిఁకవేఱెజగంబునన్మనో।హరసగువస్తువొండొకటియారసిచూచునొకానొకప్పుడుం।బురుడుఘటిల్లునేభువనమోహననీముఖకాంతకాంతికిన్॥

తా॥ వచోమాధుర్యంబునుబూర్ణిమకళలచేసమృద్ధంబగునీమోముతోడంజంద్రకమలంబులుసమంబులెటులగునునీమోముతోడభువనంబులనెల్ల పదార్థంబులుసమంబులనుచుంజెప్పనెయ్యెదియుఁగానంబడమిసిద్ధంబుగాన నీసమానుండొక్కండునులేడనుట॥ ... .... ... ... ... ◆

శ్లో॥ శుశ్రూషసేయదివచశ్శ్రుతిమామకీనం పూర్వైరపూర్వకవిభిర్నకటాక్షితంయత్। నీరాజనక్రమమధురంభవదాననేందోర్నిర్వ్యాజమర్హతిచిరాయశశిప్రదీపః॥ ... ... ... ... ... ౯౭

టీక॥ హేకృష్ణ-ఓకృష్ణ- శుశ్రూషసేయది-విననిచ్ఛయించితేని - పూర్వైః- మొదటివారలయినఅపూర్వకవిభిః- అపూర్వ-చమత్కారసంపాదక ప్రబంధములనుజెప్పిన - కవిభిః - వాల్మీకాదిమహాకవులచేత - యత్- ఏవాక్యము- నక

టాకీతం. చెప్పఁబడలేదో. మామకీనం - నాసంబంధమయిన - వచః. వాక్యముసు. శ్రుణు. వినుము. శశిప్రదీపః. శశి. చంద్రరూపమయిన. ప్రదీపః. దీపము. భవదాననేందోః. భవత్. నీయొక్క - ఆననేందోః - ముఖచంద్రునియొక్క - నీరాజనక్రమధురం. నీరాజన. నివాళియొక్క - క్రమ. రీతియొక్క - ధురం. భాగమునుగూర్చి. నిర్వ్యాజం. ఉపాధిలేకుటులు. చిరాయ - బహుకాలము. అర్హతి. తగుచున్నది. ... ... ... ... ❖

చ॥ తొలుత టి వ్యాసముఖ్యకవిధుర్యులు పల్కనిసాహసంబునే। వలికెదవింటి వేనిపినుపంకజలోచన నీదుమోముతో। గలువలతేనిసాటియనఁగాఁదగ దారతివళ్లెరంబులో। వలపిడిదివ్వెగానతనఁబట్టనివాళియొనర్పఁగాదగుఁ౯॥

తా॥ ఓకృష్ణా నావలుకొక్కటివింటివేని వినుము పూర్వులగువాల్మీకివ్యాసాదిమహాకవులచేఁజెప్పఁబడనిసాహసంపుమాటనుడివెదదెట్లనినఁ జంద్రుండనియెడి దీపంబు నారతి పళ్లెరంబునసిడి నీనెమ్మొముజందురునికిని వాళియొనర్పందగుననుట॥ ... ... ... ... .. ❖

శ్లో॥ అఖండనిర్వాణరసప్రవాహైర్విఖండితాశేషరసాంతరాణి। నియన్త్రితోద్వాంతసుధార్ణవాని జయంతి శీతాని తవస్మితాని॥ ... ౯౮

టీక॥ అఖండనిర్వాణరసప్రవాహైః. అఖండ. పరిపూర్ణమయిన. నిర్వాణ. సుఖమనియెడి. రస. ఉదకముయొక్క - ప్రవాహైః - ప్రవాహములచేత. విఖండితాశేషరసాంతరాణి. విఖండిత. కొట్టఁబడిన. అశేష. సమస్తమైన. రసాంతరాణి. ఇతరరసములుగలవియు. నియంత్రితోద్వాంతసుధార్ణవాని. నియంత్రిత. యథేచ్ఛముగునటుల. ఉద్వాంత - బయలువెడలుచున్న - సుధార్ణవాని. అమృతసముద్రముగలవియు - శీతాని - చూచుజనులకుమనోహరమైనవియునగు. తవ. నీయొక్క - స్మితాని. లేనగవులు. జయంతి - సర్వోత్కర్షముగావర్తించుచున్నది. ... ... ... ... ❖

మ॥ కలితానందమహానుభావమునవేడ్కఁ౦జెందియంతంతకుం। జెలియంబొంగుసుధాతరంగితపయోధిలీలగస్పించుచుం। దళితాశేషరసాంతరంబులగులేనవ్వుల్ మిటారింపగో। కులకాంతాజనభోగభాగ్యమహిమాంకూరంబు సెల్వొందెడి౯॥ ... ... ... ... ... ౯౮

తా॥ సంపూర్ణంబగుసుఖరసప్రవాహంబులచేనిరసింపంబడిన యితరరసంబులుగలిగియథేచ్ఛముగునటులబయలువెడలునమృతసముద్రంబుగలిగిచూచువారలకుసుఖంబొనర్చునీచిఱునగవులుసర్వోత్కర్షముగావర్తించుచున్నవి యనుట

శ్లో॥ కామంసంతుసహస్రశః కతిపయేస్వారస్యధౌరేయకాః కామంవాకమనీయతాపరిమళస్వారాజ్యబద్ధవ్రతాః। తైర్నైవంవివదామహేనచవయందేవప్రియంబ్రూమహేయత్సత్యం రమణీయతాపరిణతిస్త్వయ్యేవపారంగతా॥

టీక॥ కతిపయే- కొందఱు- స్వారస్యధౌరేయకాః- సౌందర్యవంతులు-కామం- యథేచ్ఛముగాను- సంతు- ఉందురుగాక- కమనీయతాపరిమళస్వారాజ్యబద్ధవ్రతాః- కమనీయతా- సౌందర్యముయొక్క - పరిమళ- ఆధిక్యమనియెడి- స్వారాజ్య- స్వర్గరాజ్యమందు- బద్ధ - కూడుకొన్న- వ్రతాః - పుణ్యవిశేషములు సహస్రశః- వేలసంఖ్యలు- కామం- యథేచ్ఛముగను- సంతు- ఉందురుగాక- హేదేవ- ఓకృష్ణ- తైః - ఆయధికసుందరులైనవారితోడ - నవివదామహే- వివాదమును జేయము- ఏవం- ఈప్రకారము- ప్రియంచ- ప్రియమును-నబ్రూమహే- నుడువము- యత్- ఏకారణమున- రమణీయతాపరిణతిః - రమణీయతా- సౌందర్యముయొక్క - పరిణతిః- పరిపాకము - త్వయ్యేవ - నీయందే- పారంగతా- సంపూర్ణముగానుండును- సత్యం- యథార్థము॥ ❁

ఉ॥ లోకములోపలన్ రసికలోకమనేకముగల్గుఁగాకయు। స్తోకమనోహరావయవశోభితులుందురుగాకవారితో। నేకలహింపనేలముఁగమిచ్చకమేటికిసత్యమాడెదన్। నీకమనీయతామహిమనీకతగున్నఁటికొనపెయ్యెడన్॥ ౯౯

తా॥ లోకంబుననేకరసికజనంబులుండురుగాకయధికసౌందర్యసంపన్నులనేకులుండురుగాకవారితోడంగలహంబును ప్రియంబునుంబలుకనేలయథార్థంబుగనుడివెదసౌందర్యంబుతోడంబురస్కరింపనెట్టివారలంజాలరనుట॥ ❁

శ్లో॥ మందారమూలేమదనాభిరామంబిమ్బాధరాపూరితవేణునాదమ్।గోగోపగోపీజనమధ్యసంస్థంగోపంభజేగోకులపూర్ణచంద్రమ్॥ ౧౦౦

టీక॥ మందారమూలే- మందార- కల్పవృక్షముయొక్క - మూలే- మొదటియందు- గోగోపగోపీజనమధ్యసంస్థం - గో - గోవులయొక్కయును - గోప- గోపాలకులయొక్కయును- గోపీ- గోపస్త్రీలయొక్కయును-జన- సమూహముయొక్క - మధ్య- నడుమ- సంస్థం - కూర్చున్నవాఁడును- బింబాధరాపూరితవేణునాదం- బింబ- దొండపండువంటి- అధర- అధరోష్ఠముచేత - ఆపూరిత- లెస్సగాఁబూరింపఁబడిన- వేణునాదం- వేణుధ్వనిగలవాఁడును- గోకులపూర్ణచంద్రం- గోకుల- గోసమూహమునకు- పూర్ణచంద్రం - రాకాశశాంకుఁడైనవాఁడును- మదనాభిరామం- మదన- మన్మథునికన్నను- అభిరామం-

సుందరుఁడైనవాఁడునగు-గోపం- బాలగోపాలుని- భజే- భజించుచున్నాను.

ఉ॥ గోపికలోపికల్పడలికోల్వఁగగోవులుగోవులాడఁగా। గ్రేపులు మేపులా నిపరికింపఁగ గెంజికురాకుమోపిపై। మోపిన వేణువగ్గలము ట్రోయఁగఁగల్పవనిన్వ సించునా। గోపకుమారమన్మథుని గోకులవార్ధిశశిం భజించెదన్॥ ౧౦౦

తా॥ కల్పవృక్షమూలంబున గోవులయు- గోపాలకులయు- గోపికలయున డుమ నుండి కెమ్మోవియందు మోపిన వేణువు ట్రోయించుచు మన్మథమన్మథుండై గోకులవార్ధిపూర్ణచంద్రుండై వెలయు బాలగోపాలుని భజియించెదననుట.

శ్లో॥ గళద్వ్రీడాలోలా మదనవనితా గోపవనితా మధుస్మితం గీతం కిమపి మధురాచాపలధురాః। సముజ్జృమ్భా గుమ్భా మధురిమగిరాం మాదృశగిరాం త్వయి స్థానే జాతే దధతి చపలం జన్మసఫలమ్॥ .. ... .. ౧౦౧

టీక॥ గళద్వ్రీడాః- నిర్లజ్జలయిన - గోపవనితాః- గోపస్త్రీలు - లోలాః- నీయందాసక్తలై - మదనవనితాః- రతితుల్యలు-జాతాః- అయిరి - గీతం-నీసం బంధమైనగానము- మధుస్మితం- మధు-తేనియవలె - స్మితం - స్ఫూర్తిగలదిమై- కిమపి - చెప్పవలనిగానిది - జాతమ్-అయినది - చాపలధురాః-చాపల- నీసంబం ధమైనచాపల్యముయొక్క - ధురాః- భారములు-మధురాః- మనోహరములు- జాతాః- అయినవి- మాదృశగిరాం- మాదృశ - నావంటియప్రతిజ్ఞునియొక్క- గిరాం- వాక్యములయొక్క - గుంభాః- గుంఫనలు- మధురిగిరాం-వాల్మీకిమొ దలగువారలయొక్క వాక్యములవలె - సముజ్జృంభాః - అతిశయములు - జా తాః- అయినవి- త్వయి- నీవిషయము- జాతేసతి- అగుచుండఁగా- చపలం- చ పలమైన- జన్మ - జన్మమును- సఫలం- ఫలసహితమగునట్లుల- దధతి - వహించు చున్నవి- స్థానే- యుక్తము- ... ... ... ... ❖

ఉ॥ నానఁదొఱంగి తత్తరమునన్మరులెత్తినగోపకామినుల్। దేనియఁగుల్కుపా టలు సుదివ్యనిమాటలు నీకతంబునం। బూనిఫలంబు జెందు క్రియ మోదముతోడను సన్నుతింపఁగా। నానుడువుల్ఫలించెఁ జననంబు గృతార్థత జెందె నెంతయున్॥

తా॥ గోకులంబునం గ్రుమ్మరుటంజేసి యరసికలై నిర్లజ్జలైన గోపస్త్రీల సౌందర్యంబులును గానంబులును జాపల్యంబులును నీయందవినియోగించుకతం బున స్వసమానాధికరహితంబులై నభంగి నప్రతిజ్ఞుండనగు నావచనంబుల సంద ర్భంబును వాల్మీకిమొదలగువారల వచోగరిమంబుకైవడిం బ్రసిద్ధంబగుచు నీవల న వెలసెను నేఁగృతార్థుండనైతిననుట. ... ... ... ❖

శ్లో॥ భువనంభవనంవిలాసినీశ్రీ స్తనయాతామరసాసనస్మరౌచ। పరిచార పరమ్పరాసురేన్ద్రా స్తదపిత్వచ్చరితంవిభోవిచిత్రమ్॥ ... ౧౦౨

టీక॥ హేవిభో - ఓకృష్ణా - భువనం- లోకములకు- భవనం - గృహము- శ్రీః- లక్ష్మీదేవి- విలాసినీ- పాణిగ్రహణభార్య - తామరసాసనస్మరౌచ- తామరసాసన- బ్రహ్మదేవుడును- స్మరౌచ- మన్మథుడును- తనయౌ- కుమారులు- సురేంద్రాః- దిక్పాలకాదులు- పరిచారపరంపరాః- పరిచార - పరిచారకులు యొక్క - పరంపరాః-సమూహము-తదపి- అటులనైనను-త్వచ్చరితం-త్వత్- నీయొక్క - చరితం- చరిత్రము- విచిత్రం- మిక్కిలియాశ్చర్యము- ❁

మ॥ లలనారత్నముశ్రీవధూటిజగమెల్లంగేళికాసౌధమా।జలజాతాసనశంబరారులుసుతుల్శక్రాదిదిక్పాలవర్యులుభృత్యుల్వివరింపనీమహిమలోహోయిట్టిదైయుండగో।కులవాటంబునజారచోరకృతిలోకుల్నవ్వగాంతింతురే॥౧౦౨

తా॥ ఇల్లుముజ్జగంబుబార్యలోకైకమాతయగుసిరి- చతురాననుండునుమన్మథుండునుకొమరులు- ఇట్టినీవుగోకులంబుననుంటగడుచిత్రంబనుట- ❁

శ్లో॥ దేవస్త్రిలోకీసౌభాగ్యకస్తూరీతిలకాఙ్కురః। జీయాద్వ్రజాఙ్గనానఙ్గకేళీలలితవిభ్రమః॥ ... ... .. ... ౧౦౩

టీక॥ త్రిలోకీసౌభాగ్యకస్తూరీతిలకాంకురః - త్రిలోకీ- మూడులోకముల యొక్క - సౌభాగ్య- అవయవసౌష్ఠమునకు- కస్తూరీతిలకాంకురః - కస్తురిబొట్టుంబలెనున్నవాడును- వ్రజాంగనానంగకేళీలలితవిభ్రమః- వ్రజాంగనా- గోపస్త్రీలయొక్క - అనంగకేళీ- మన్మథక్రీడలయందు- లలిత - సరసమైన- విభ్రమః- విలాసములుగలవాడుననగు- దేవః- శ్రీకృష్ణమూర్తిజీయాత్-సర్వోత్కృష్టముగావర్తించుగాక- ... ... ... ... ❁

మ॥ తులుకుంజెక్కులబిక్కటిల్లుపులకాంకూరంబుతోరంబుగా। దళుకుంగస్తురిబొట్టునెన్నొసలిపైదైలోక్యభాగ్యాకృతిం। జెలగెన్ గోపనితంబినీరతికేళీశృంగారభావోన్నతుల్। దొలుకంగన్నులపండువైనవిభుగాంతున్ భాగ్యసంసిద్ధికిన్॥ ... ... ... ... ... ౧౦౩

తా॥ ముల్లోకంబులసౌష్ఠవావయవంబులకు గస్తూరీతిలకంబై గోపస్త్రీలతోనసంగక్రీడంజేయుట యందత్యంత విలాసంబులుగల శ్రీకృష్ణదేవుండుసర్వోత్కర్షంబుగావర్తించుననుట- ... ... ... ... ❁

శ్లో॥ ప్రేమదంచమేకామదంచమేవేదనంచమేవైభవంచమె। జీవదంచమే

జీవితంచ మే దైవతంచ మే దేవ తాపరమ్॥ ... ... ౧౦౪

టీక॥ హే దేవ- శ్రీకృష్ణ- మే- నా యొక్క - ప్రేమదంచ - ప్రేమంబునిచ్చువస్తువును- మే - నా యొక్క - కామదంచ - కోరికనిచ్చువస్తువును - మే నా యొక్క - వేదనంచ జ్ఞానమును- మే- నా యొక్క - వైభవంచ - ఐశ్వర్యము - మే- నా యొక్క - జీవనంచ- ప్రాణమును- మే - నా యొక్క - జీవితంచ- జీవనహేతువస్తువును- మే - నా యొక్క - దైవతంచ- దైవతమును- అపరం-మఱియొకటి- నాస్తి-లేదు- ... ... ... ... ... ◈

ఉ॥ కోరికలిచ్చువస్తునయి గూర్చుచు జీవనజీవిదమ్ములై । దారినొనర్చినం దెలివిదాల్చినవన్నియుద ప్రేమంబలె । స్వర్గములొర్చి యందిరుగనేర్పుగ దీర్పుచు గల్మియిచ్చినన్ । భారము నీవె గాని బఱిపంకజనాభ యెఱుంగనన్యులన్॥ ౧౦౪

తా॥ కోరికనిచ్చునం ప్రేమంబుఁ జేసిన నీవ నాజ్ఞానంబును యైశ్వర్యంబును జీవనంబును జీవనహేతువగు వస్తువును నాదైవతంబును నీవ కాని మఱియన్యునే నెఱుంగననుట- ... ... ... ... ... ◈

శ్లో॥ మాధుర్యేణ విజృంభన్తాం వాచో నస్తవ వైభవే । చాపల్యేన వివర్ధన్తాం చిన్తా నస్తవ శైశవే॥ ... ... ... ... ౧౦౫

టీక॥ నః- నా యొక్క - వాచః- వాక్యములు తవ- నీయొక్క - వైభవే- గోవర్ధనోద్ధరణాది వైభవమందు- మాధుర్యేణ- శ్రావ్యమగుటచే- విజృంభన్తాం- మిక్కిలి ప్రకాశించుంగాక- నః- నా యొక్క - చిన్తాః- మనోవ్యాపారములు- తవ- నీయొక్క - శైశవే- బాల్యమందు- చాపల్యేన- చపలతచే- వివర్ధన్తాం- వృద్ధిఁబొందుఁగాక- ... ... ... ... ... ◈

ఉ॥ ఏను భవత్కథామణులనెన్నెడు పట్లను దీయసూక్తిసం । తానము మాధురీగుణవితానముఁ జెందిపొసంగుఁగాత నా । మానసవృత్తి నీదు సుకుమారకిశోరవయోవిహారముల్ ప్రాపి స్ఫురించు పట్టుల తిలోలతఁ గాంచి మెలంగుఁగావుతన్॥ ౧౦౫

తా॥ నావచనంబులు నీగోవర్ధనోద్ధరణాది వైభవంబులందు మిక్కిలి మాధుర్యంబుగ నివేశయించుంగాక నామనోవ్యాపారంబులు నీబాల్యంబున నతి చాపల్యంబునం జెందుందుగాకయనుట- ... ... ... ... ◈

శ్లో॥ యాని త్వచ్చరితామృతాని రసనాలేహ్యాని ధన్యాత్మనాం । యే వా శైశవచాపలవ్యతికరా రాధాపరాధోన్ముఖాః। యా వా భావితవేణుగీతగతయో లీలాముఖామ్భోరుహే । ధారావాహికయా వహన్తు హృదయే తాన్యేవ తాన్యేవ మే

టీక॥ ధన్యాత్మనాం- కృతార్థమనస్కులయొక్క - రసనాలేహ్యాని- రసనా జిహ్వలకు- లేహ్యాని- లేహ్యావిశేషములయిన- త్వచ్చరితామృతాని - త్వత్ - నీ యొక్క - చరితామృతాని- అమృతమువంటిచరిత్రములు యాని- ఏవిగలవో- రాధాపరాధోన్ముఖాః - రాధా - రాధవిషయమయిన- అపరాధ-అపరాధ ములే. ఉన్ముఖాః - మొదలుగాఁగలవి - శైశవచాపలవ్యతికరాః - శైశవ - బా ల్యమందలి- చాపల- చాపల్యముచేత- వ్యతికరాః - ఉద్వృత్తనులు - యేవా- ఎవ్వగలవో- లీలాముఖాంభోరుహే- లీలా- విలాసయుతమయిన- ముఖాంభో రుహే - ముఖకమలమందు- భావితవేణుగీతిగతయః- భావిత- పుట్టుచున్న- వే ణుగీతి- వేణుగానముయొక్క - గతయః- భేదములు - యావా - ఏవిగలవో- తాన్యేవతాన్యేవ-అవియవియే- మే-నాయొక్క - హృదయే-హృదయమందు- ధారావాహికయా- ధారారూపముచేత. వహంతు-ప్రవహించుఁగాక॥ ❖

మ ॥ అలరుఁగా ధన్యులకేకథామృతముజిహ్వాక్ లేహ్యమేబాల్యచా । పల ముల్ రాధకునెయ్యముంగినుకనాపాదించునేయందము । ల్వేలయున్మోమునవే ణుగానికలనన్వేమాఱునాదివ్యచ । ర్యలెనామానసవీధివేఁడను ధారాళంబు గానిల్వఁగా॥ ... ... ... ... ... ౧౦౬

తా॥ కృతార్థులనాలుకల లేహ్యంబుంబోలెనుండు నీచరితామృతంబులె వ్వయో రాధకుప్రియంబునపరాధంబునంజేయునీచాపల్యోద్రేకములెవ్వయో విలాసయుతంబగు నీనెమ్మోముఁదామరయందుం బొడమిన వేణుగానప్రభే దంబులెవ్వయోయవియవి నామనంబున ధారారూపంబుగఁ బ్రవహించుచుం డుఁగాకయనుట॥ ... ... ... ... ... ❖

శ్లో॥ భక్తిస్త్వయిస్థిరతరాభగవన్ యదిస్యాద్దైవేననః ఫలితదివ్యకిశోరవే షే । ముక్తిస్స్వయంముకుళితాంజలిసేవతేఽస్మాన్ ధర్మార్థకామగతయస్సమ యప్రతీక్షాః॥ ... ... ... ... ... ౧౦౭

టీక॥ హేభగవన్- షడ్గుణైశ్వర్యసంపన్నుఁడనైనయోశ్రీకృష్ణా- నః-మా యొక్క - దైవేన- అదృష్టవిశేషముచేత- ఫలితదివ్యకిశోరవేషే- ఫలిత స్వఫల ముచేసంపాదింపఁబడిన- దివ్య- అసాధారణమైన- కిశోరవేషే- బాలవేషము గల- త్వయి- నీయందు- భక్తిః- భక్తి- స్థిరతరా-మిక్కిలిదృఢమైనది- యదిస్యాత్ ఆయెనా- ముక్తిః- మోక్షము- ముకుళితాంజలిః- ముకుళిత- మోడ్పఁబడిన-అం జలిః దోయిలిగలదియై- అస్మాన్- మమ్ము - సేవతే- సేవించుచున్నది- ధర్మార్థ

కామగతయః- ధర్మార్థకామ- ధర్మార్థకామములయొక్క - గతయః- సంచార
ములు- సమయప్రతీక్షాః- సమయ- అవసరమును- ప్రతీక్షాః- కోరుచున్నవి-*

ఉ॥ గోపకుమారవేషమునఁగూడిననీయెడభక్తిదైవసం।ప్రాపితమైమదిఁదృ
ఢతరంబుగనిల్పినముక్తికన్యనా। దావునఁగేలుమోడ్చి సతతంబునుఁగొల్వఁగవే
ళఁజూచుమ। మ్మెవునఁబిల్చిపీడ్కొలుపనేచినధర్మమునర్థకామముల్॥ ౧౦౭

తా॥ షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవైనయోకృష్ణనాభాగ్యంబునగోపాల
వేషంబూనిననీయందత్యంతభక్తిగలిగినట్టులయ్యేనేనిముక్తికాంతగేల్మోడ్పుతో
డనెవ్వడునునన్నుసేవించుచునుండుధర్మార్థకామంబులునాయవసరంబుంగాం
క్షించుచునుండుగాననీయందలిభక్తిగలిగినద్దియునాకుదుర్లభంబులేదనుట-

శ్లో॥ జయజయజయదేవదేవదేవత్రిభువనమంగళదివ్యనామధేయ। జయజ
యజయబాలకృష్ణదేవశ్రవణమనోనయనామృతావతార॥ ౧౦౮

టీక॥ శ్రవణమనోనయనామృతావతార- శ్రవణ- కర్ణములకును-మనః- మ
నస్సునకును- నయన- నేత్రములకు- అమృతమువలె- అవతార- ఆవిర్భావము-
హేదేవ- ఓకృష్ణ- జయజయజయ- సర్వోత్కర్షముగావర్తింపుము- త్రిభువన
మంగళదివ్యనామధేయ- త్రిభువన- ముల్లోకములకు- మంగళ - శుభప్రదమయి
న- దివ్య- అనితరసాధారణమయిన- నామధేయ- నామములుగల - హేబాల
కృష్ణ- ఓబాలకృష్ణుండ - జయజయజయ- సర్వోత్కర్షముగావర్తింపుము-
దేవదేవదేవ- దేవతలకు- దేవ- దేవుఁడైన- హేదేవ- ఓకృష్ణ - జయజయ- స
ర్వోత్కర్షముగావర్తింపుము॥ .... ... ... ... ❀

చ॥ జయజయదేవకృష్ణరిపుసైన్యమహాద్రితిభేదకృద్ధనా। జయజయకారణా
భువనసన్నుతమంగళనామధేయసం। జయజయబోధసాధకవచఃశ్రుతినేత్రమ
నోమనోహరా। జయజయవిశ్వజన్మలయశాసనగాఢతమోనిరాసనా। ✺

తా॥ శ్రోత్రంబులకునేత్రంబులకుమనంబునకునమృతంబువలెసుఖంబుజేయు
నుద్భవంబుగలిగిముల్లోకంబులకును శోభనకరంబులగుచు నితరాసాధారణంబు
లకుదివ్యమంగళనామంబులుగలిగి దేవదేవుండవై వెలయుచున్న యోకృష్ణాస
ర్వోత్కృష్టుండవై యుండుమనుట॥ ... ... ... ❀

శ్లో॥ తుభ్యంనిర్భరహర్షవర్షవివశావేశస్ఫుటావిర్భవచ్చాపల్యేనవిభూ
షితేషుసుకృతాంభావేషునిర్భాసతే। శ్రీమద్గోకులమండనాయమహతేవాచాం
విదూరస్ఫురన్మాధుర్యైకరసార్ణవాయమహసేకస్మైచిదస్మైనమః॥ ✺

టీక॥ నిర్భరహర్షవర్షవివశావేశస్ఫుటావిర్భవచ్చాపల్యేన - నిర్భర - అతిశయమయిన- హర్షవర్ష- సంతోషవర్షముచేత- వివశావేశ - బాహ్యశూన్యతయందు- స్ఫుట - వ్యక్తమగునటుల- ఆవిర్భవత్- పొడముచున్న-చాపల్యేన- చపలతచేత- విభూషితేషు - అలంకరింపఁబడిన - సుకృతాం- ధన్యులయొక్క - భావేషు- మనోవ్యాపారములయందు- నిర్భాసతే- మిక్కిలిప్రకాశించుచున్నవాఁడును-శ్రీమద్గోకులమండనాయ- శ్రీమత్ - సంపత్కరమయిన- గోకుల- గోసమూహమునకు- మండనాయ- అలంకారమయినవాఁడును- మహతే- వ్యాపకుఁడైనవాఁడును- వాచాం- ఉపనిషత్తులకు- విదూరస్ఫురన్మాధుర్యైకరసార్ణవాయ- విదూర- మిక్కిలిదూరమున- స్ఫురత్-ప్రకాశించుచున్న- మాధుర్య- సౌందర్యమనియెడి- ఏక- ముఖ్యమైన- రస- రసమునకు- అర్ణవాయ- సముద్రుఁడైనవాఁడును- కస్మైచిత్- చెప్పనలవిగాని- అస్మై- ఈయెదురనున్న- మహసే- తేజోరూపుఁడైనవాఁడునైన - తుభ్యం - నీకొఱకు- నమః - నమస్కారము॥ ... ... ... ... ...

శా॥ ఆనందంబునబాహ్యముల్మఱచియాత్మారామలీలారతిన్। ధ్యానగ్లాల్యఁగముంగలన్నిలిచివాచాగోచరంబైయశో। దానందాంగణరత్నమైమధురిమాధారార్ణవంబైననెం। దేనప్రోజ్వలమట్టితేజమునకెంతేమ్రొక్కవన్నొక్కెదన్॥ ... ... ... ... ... ౧౦౯

తా॥ సంపూర్ణంబగుసంతోషవర్షంబుచేబాహ్యంబుమఱచివ్యక్తంబగునటులంబొడముబాహ్యంబుననలంకరింపంబడినధన్యులమనంబులం బ్రకాశించుచుఁగోకులంబునలంకరించుచునుపనిషద్గమ్యంబయ్యునుదూరంబగుసౌందర్యాదిగుణసముదయంబను రసంబున కర్ణవుండై యవాఙ్మానసగోచరుండై ఈముంగలంగానుపించుతేజోరూపుఁడగునీకొఱకుమ్రొక్కెదననుట॥

శ్లో॥ ఈశానదేవచరణాభరణేననీవిదామోదరస్థిరయశస్తబకోద్గమేన। లీలాశుకేనరచితంతవదేవకృష్ణకర్ణామృతంవహతుకల్పశతాంతరేపి॥ ౧౧౦

టీక॥ దేవ- దేవుఁడవైన హేకృష్ణ- ఓకృష్ణ- ఈశానదేవచరణాభరణేన- ఈశానదేవ - శివునియొక్క - చరణ- పాదములే- ఆభరణేన - భూషణముగాఁగలవాఁడును- నీవిదామోదరస్థిరయశస్తబకోద్గమేన - నీవి- మూలధనమైనదామోదర- శ్రీకృష్ణమూర్తియొక్క - స్థిర - నిశ్చలమయిన-యశః- కీర్తియ

నిమోడి - స్తబక - పుష్పములగు త్రియందు- ఉద్గమేన - ఉన్ముఖుడైన - లీలాశుకేన. పోష్యశుకంబుఁబోని లీలాశుకునిచేత - రచితం - చేయఁబడిన శ్లోకసమూహము. కల్పశతాంతరేపి- ఎప్పుడును- తవ - నీకు- కర్ణామృతం - కర్ణ - చెవులకు- అమృతం- అమృతమై- వహతు- పొందుఁగాక॥ ... ... ... ❁

మ॥ ఫలవాంఛన్ హరికీర్తిఁగుచ్ఛరతియున్ ఫాలాక్షుసంసేవయున్ । గలలీలాశుకవాక్యముల్ దెనుఁగునన్ గర్ణామృతఖ్యాతిగా । నలరం జేసితి వెల్లపూడిమణిపెద్దామాత్య వెంగన్న నే । సలరుం దోయిలిమాడ్కిఁ గైకొనుము కృష్ణాకల్పసంస్థాయిగన్॥ ... ... ... ... ... ౧౧౦

తా॥ ఓయి శ్రీకృష్ణ శివుని పాదాంబుజాభరణంబుగ మనంబున ధరియించియు నఁగ శివునియందలి ద్వేషంబు తనకు లేదనుట దామోదరుండవైన నీకీర్తియను మోడియలరులగు త్రియందు ఫలాపేక్షచేఁ బోష్యశుకంబుఁబోలె వెలయు లీలాశుకుని చే రచియింపంబడిన శ్లోకసమూహంబు నీకర్ణంబులకమృతంబగుచు గల్పశతంబుల పర్యంతంబును శాశ్వతంబుగనుండుంగాతయనుట॥ ... ... ❁

మాలిని॥ తనుజితజలవాహా దారితశ్వేతవాహా । జననకృతతమోహా శాంత దుర్దాంతమోహా । యనఘగుణ సమూహా యాగ్రరక్షస్సమూహా । వినతవిషయగేహా వేంకటాహార్యగేహా॥ ... ... ... ❁



మ॥ ఇదికృష్ణాశ్రయయోగిపుంగవకృపాపీయూషసారస్వతా । భ్యుదయశ్రీవిభవప్రసిద్ధచిదచిద్భోధక్షమాశాంతిస । త్వగయాభూషణ వెల్లపూడిమణిపెద్దామాత్య వెంగాగ్రణీ । గదితాశ్వాసము పొల్పుఁ బ్రాథమికమై కర్ణామృతశ్రీకృతిన్॥

శ్రీకృష్ణకర్ణామృతము- ప్రథమాశ్వాసము-

సంపూర్ణము.





శ్రీకృష్ణకర్ణామృతము. — ద్వితీయాశ్వాసము.



శ్లో ॥ అభినవనవనీతస్నిగ్ధ మాపీతదుగ్ధం దధికణపరిదిగ్ధం ముగ్ధమంగం ము
రారేః । దిశతుభువనకృఛ్రచ్ఛేదితాపిఞ్ఛగుచ్ఛచ్ఛవినవ శిఖిపిఞ్ఛాలాంఛితం
వాంఛితంనః॥ ... ... ... ... ... ౧

టీక॥ అభినవనవనీతస్నిగ్ధమ్- అభినవ - మిక్కిలినూతనమైన- నవనీత - వె
న్నచేత - స్నిగ్ధమ్- స్వచ్ఛమైనట్టిదియు- అపీతదుగ్ధమ్ - అపీత- పానముచేయ
బడ్డ- దుగ్ధం క్షీరము గలదియు- దధికణపరిదిగ్ధం- దధి- పెరుగుయొక్క - కణ-
బిందువులచేత - పరిదిగ్ధం - అంతటబూయబడినయదియు - తాపింఛగుచ్ఛచ్ఛ
వి- తాపింఛ- కానుగుచెట్టుయొక్క -గుచ్ఛ- పువ్వులగుత్తియొక్క- ఛవి- కాం
తివంటికాంతిగలయదియు- నవశిఖిపింఛాలాంఛితం- నవ - నూతనమైన - శిఖి
పింఛ- నెమలిపురిచేత - ఆలాంఛితం - లెస్సగానలంకరింపబడినయదియు - భు
వనకృఛ్రచ్ఛేది- భువన- లోకములయొక్క - కృఛ్ర- ఉపద్రవములను- ఛేది- పో
నడువసమర్థమునైన- మురారేః- శ్రీకృష్ణమూర్తియొక్క - ముగ్ధం- సుందరమై
న- అంగం- శరీరము- నః- మాయొక్క - వాంఛితం- అభీష్టార్థమును-దిశతు-
ఇచ్చుంగాక- ... ... ... ... ... ✧

శా॥ తాపింఛచ్ఛవియైవినీలనవనీతస్నిగ్ధమైముగ్ధమై । యాపీతామితదుగ్ధ
మైదధికణైకాదిగ్ధమైలోకకృ । ఛ్రావచ్ఛేదకమైనీలశిఖిపింఛాలాంఛితంబైనశ్రీ।
గోపాలప్రభుమూర్తివాంఛితమొసంగున్మాకునశ్రాంతము॥ ... ౧

తా॥ శ్రీ మూర్తియగువెన్నచేనచ్ఛంబగుచు బానంబుచేయబడినక్షీరంబుగలిగిదధిక
ణంబులచేతంబూయంబడినదియై లోకంబులయుపద్రవంబులబోనడువసమర్థం
బై కానుగుపువ్వులకాంతి వంటికాంతిగలదియై నెమలిపురిచేనలంకరింపంబడిన
దియైసుందరంబైనశ్రీకృష్ణునిశరీరంబుమాకఖిలాభీష్టంబులనిచ్చుంగాకయనుట.

శ్లో॥ యాందృష్ట్వాయమునాంపిపాసురనిశం వ్యూహోగవాంగాహతేవిద్యు
త్వానితినీలకణ్ఠనివహోయాం ద్రష్టుముత్కణ్ఠతే। ఉత్తంసాయతమాలపల్లవమి
తిఛ్ఛిన్దన్తియాంగోపికాః కాన్తిః కాళియశాసనస్యవపుషస్సాపావనీపాతునః॥ ౨

టీక॥ పిపాసుః- పానముచేయనిచ్ఛయించుచున్న - గవాం - గోవులయొ
క్క - వ్యూహః- సమూహము- యాం- ఏకాంతని యమునాం- యమునానది

నిగా- దృష్ట్వా- చూచి- అనిశం- ఎప్పుడును-గాహతే-ప్రవేశించుచున్నదియో. నీలకంఠనివహాః- నీలకంఠ- నెమళులయొక్క - నివహాః- సమూహము- యాం. ఏకాంతిని- విద్యుత్వానితి - మేఘమునుగా- ద్రష్టుం- చూచుకొఱకు - ఉత్కంఠతే- సంతోషమును జేయుచున్నదియో -గోపికాః- గోపికలు- యాం - ఏకాంతిని- తమాలపల్లవమితి- తమాల- నల్లకానుగుచెట్టుయొక్క - పల్లవమితి-చిగురునుగా- దృష్ట్వా- చూచి-ఉత్తంసాయ-శిరోభూషణముకొఱకు- ఛిన్దన్తి- ఛేదింపదలంచుచున్నారో- కాళియశాసనస్య- శ్రీకృష్ణమూర్తియొక్క -వపుషః- శరీరముయొక్క - సా- అప్రసిద్ధమైన- పావనీ- పావనమునైన-కాంతిః-కాంతి-నః- మమ్మును- పాతు- పరిపాలించుగాక- ... ...

చ ॥ అనిశముయామునాంబువిదియానెదమంచునుగోగణంబులె । ల్లనజోరఁబర్హిపఙ్క్తులువలాహకమంచును వేడ్కతోడఁగ । న్గొనఁగఁదమాలపల్లవముకొప్పునకౌనని గోపకామినుల్ । చినుమఁగనొప్పుకృష్ణుని విశేషతనుద్యుతినన్నుబ్రోవుత౯॥ ... ... ... ... ... ౨

తా ॥ గోసమూహంబును నెమళులపిందును వ్రేతలునేకాంతింగనుంగొని యమునానదియనియు మొగుళులగుంపనియుగానుగు చిగుళ్లనియుమనంబులందలంచిత్రావనుంజూడనుంజిదుమనుంగమకించునోయట్టిశ్రీకృష్ణునినెమ్మేనిచాయనన్నుంబ్రోచుగాకయనుట- ... ... ... ...

శ్లో ॥ దేవఃపాయాత్పయసివిమలేయామునేమజ్జతీనాంయాచన్తీనామనునయపదైర్వఞ్చితాన్యంశుకాని । లజ్జాలోలైరలసవిలసైరున్మిషత్పఞ్చబాణైర్గోపస్త్రీణాంనయనకుసుమైరర్చితఃకేశవోనః॥ ... ... ౩

టీక ॥ విమలే- నిర్మలమయిన - యామునే - యమునానదీసంబంధమైన-పయసి- నీటను- మజ్జతీనామ్- స్నానముచేయుచున్నవారును- వంచితాని- దాచబడిన- అంశుకాని- వస్త్రములను- అనునయపదైః- వినయపుమాటలచేత- యాచంతీనాం- యాచించుచున్నవారునగు-గోపస్త్రీణాం-గోపికలయొక్క- అలసవిలసైః- అలస- సౌమ్యములగుటచే- విలసైః- ప్రకాశించుచున్న- లజ్జాలోలైః- లజ్జా-సిగ్గుచేత-లోలైః-చంచలములయునవియు- ఉన్మిషత్పంచబాణైః ఉన్మిషత్- ఆవిర్భవించుచున్న- పంచబాణైః- మన్మథుడుగలవియును - నయనకుసుమైః- నయన- నేత్రములనియెడి - కుసుమైః- పుష్పములచేత- అర్చితః- పూజింపబడిన- కేశవః- శ్రీకృష్ణమూర్తి-నః-మమ్మును-పాయాత్-రక్షించుగాక-

ఈశ్లోకముగోపాలకృష్ణమంత్రరాజమందలివస్త్రాకర్షణప్రయోగ ధ్యానమనిసనత్కుమారసంహితయందుఁజెప్పంబడియున్నది.

శ్లో॥ కదమ్బవృక్షమారూఢంగోపీవస్త్రాపహారిణం। కృష్ణంధ్యాత్వార్ధరాత్రేతుజపేన్మన్త్రంసహస్రకం । దశరాత్రజపాదేవమాకర్షేన్నాగకన్యకాం।కన్యకాస్త్రీదశాదీనాంకింపునర్మర్త్యయోషితః॥ ... ...

మ॥ యమునావేణికయందుగోపికలునీరాడన్‌,స్వకీయాంశుకౌ। ఘములందాచఁగసిగ్గుచేమృదులవాక్యప్రౌఢితోవేడుకన్‌।సముదంచన్మదనాలసోల్లసనిరీక్షానీలసీరేజమా।ల్యములన్వారలుపూజచేయఁదగునయ్యబ్జాక్షునింజూచెదన్‌॥

తా॥ నిర్మలంబగుయమునోదకంబున నోలలాడుచు దాచంబడినచేలంబులనసునయవచనంబులచేవేడుకొను స్త్రీలయొక్కలజ్జయనియెడియుపాధివలనఁజంచలంబులైమన్మథోద్దీపకంబులయి యలసంబులయివిలసిల్లుకన్నుదామరలచేసర్పింపఁబడు శ్రీకృష్ణుండుననురక్షించుఁగాకయనుట. ...

శ్లో॥ మాతర్నాతఃపరమనుచితంయత్ఖలానాంపురస్తాదస్తాశఙ్కంజఠరపిఠరీపూర్తయేనర్తితాసి। తత్క్షన్తవ్యంసహజసరళేవత్సలేవాణికుర్యాంప్రాయశ్చిత్తంగుణగణనయాగోపవేషస్యవిష్ణోః॥ ... ... ౪

టీక॥ సహజసరళే - సహజ - స్వభావమయిన - సరళే - ఋజుహృదయముగలయదియు - మాతః - తల్లియైనదియు - వత్సలే - దయావతియైనదియునగు- హేవాణి- ఓసరస్వతీ- జఠరపిఠరీపూర్తై- జఠర- ఉదరమనియెడి- పిఠరీ- పనటియొక్క - పూర్తయే- పూరణముకొఱకు- ఖలానాం-దుర్జనులయొక్క - పురస్తాత్- ముందరను- అస్తాశంకం-సందేహములేనటుల- మయా- నాచేత - నర్తితాసీతియత్ - నర్తనముఁజేయింపఁబడితి వనునదియేదికలదో - అతః- ఇంతకన్నను- పరం- అన్యము- అనుచితం- ఉచితముకానిది-నాస్తి-లేదు-తత్- అది- క్షంతవ్యం- సహింపదగినది- గోపవేషస్య- గోపాలవేషముగల-విష్ణోః- శ్రీకృష్ణమూర్తియొక్క - గుణగణనయా- గుణకీర్తనముచేత - ప్రాయశ్చిత్తంనిష్కృతిని- కుర్యాం- చేయుచున్నాను- ... ... ..

ఉ॥ఉదరమునించఁగోరిఖలులండడితాఘలుచేసివారికి। ట్టిమటనశంకనిన్నునటియింపఁగఁజేసినపాతకంబులన్‌।సదయుతనోర్వఁగావలెఁబ్రసన్నమతిన్ననుఁగన్నతల్లిశా। రదయదువంశనాయకునిఁబ్రస్తుతిసిష్కృతినేనొనర్చెదన్‌॥ ౪

తా॥ స్వభావసిద్ధంబగుఋజుత్వంబుగలిగిననిమిత్తంబునమదీయప్రార్థనం

బువిఫలంబుచేయనోపకయుండి జగంబులకెల్ల దక్షిణమైనకతంబున నాకుందల్లియై యత్యంతదయావతివై మదీయవాగ్రూపంబునంబరిణమించినయోసరస్వతీదుర్జనులయెదుట నినునర్తనంబుచేయుంచినపాతకంబు సహింపవలయునింక శ్రీకృష్ణునిగుణకీర్తనంబునందత్పాపప్రాయశ్చిత్తంబుఁజేయుచున్నాననుట. *

శ్లో॥ అఙ్గుల్యగ్రైరరుణకిరణైర్ముక్తసంరుద్ధరన్ధ్రంవారంవారంవదనమరుతా వేణుమాపూరయన్తమ్। వ్యత్యస్తాఙ్ఘ్రింవికచకమలచ్ఛాయవిస్తారనేత్రం వన్దేబృన్దావనసుచరితంనన్దగోపాలసూనుమ్॥ ... ... x

టీక॥ అరుణకిరణైః- అరుణ-ఎఱ్ఱనైన- కిరణైః- మయూఖములుగల-అంగుల్యగ్రైః- వ్రేళ్ళకొనలచేత - ముక్తసంరుద్ధరంధ్రం- ముక్త- విడువబడినదియు- సంరుద్ధ - కప్పబడుచున్నదియునగు - రంధ్రం - వివరముగలిగినటుల- వేణుం- పిల్లనగ్రోవిని- వదనమరుతా- ముఖవాయువుచేత- వారంవారం - మాటిమాటికిని- పూరయంతం- నిండింపజేయుచున్నవాఁడును - వ్యత్యస్తాంఘ్రిం - వ్యత్యస్త- వ్యత్యయములైన- అంఘ్రిం- పాదములుగలవాడును-వికచకమలచ్ఛాయవిస్తారనేత్రం - వికచ - వికసించిన - కమల - తెల్లదామర ఱేకులయొక్క- ఛాయ - కాంతివంటికాంతిగల- విస్తార- విశాలములయిన - నేత్రం - కన్నులుగలవాడును - బృందావనసుచరితం - బృందావన- బృందావనమందు- సుచరితం- శోభనసంచారముగల - నందగోపాలసూనుం - నందగోపాల - నందునియొక్క - సూనుం-కుమారుండైన శ్రీకృష్ణమూర్తినిగూర్చి- వందే- నమస్కరించుచున్నాను. ... ... ... ... ... ❀

మ॥ అరుణశ్రీదళుకొత్తనంగుళులనొయ్యన్గప్పుచున్విప్పుచున్। మురళీరంధ్రములాస్యమారుతమునం బూరించునొయ్యారమై। చరణద్వంద్వముమార్పడన్నిలుచుకంజాతాయతాలోకభా। సురబృందావన మందిరాంతరచరిష్ణుం గృష్ణుగీర్తించెదన్॥ ... ... ... ... ... x

తా॥ కెంపుసోంపులందేజరిల్లునంగుళాగ్రంబులవేణురంధ్రంబులంగప్పుచునువిప్పుచునుముఖమారుతంబున సారెసారెకును వేణువుంబూరించుచునువామదక్షిణపాదంబులదక్షిణవామభాగంబులదనరం బృందావనంబునజరియించు గోపాలకృష్ణునింగూర్చిమ్రొక్కుచున్నాననుట. ... ... ◈

శ్లో॥ మన్దంమన్దంమధురనినదైర్వేణుమాపూరయన్తంబృన్దంబృన్దావనభువిగవాం చారయన్తంచరన్తమ్। ఛన్దోభాగేశతమఖముఖధ్వంసినాందానవానాంహన్తా

రంతం కథయ రసనే గోపకన్యాభుజఙ్గమ్॥ ... ... ... ౮

టీక॥ మధురనినదైః- మధుర- మనోహరములయిన - నినదైః- ధ్వనులచేత- మన్దమన్దం- మెల్లమెల్లన- వేణుం- పిల్లనగ్రోవిని- ఆపూరయన్తం - నిండింపజేయుచున్నవాడును- బృందావనభువి- బృందావనప్రదేశమందు - గవాం- గోవులయొక్క - బృందం- సమూహమును- చారయంతం సంచరింపంజేయుచున్నవాఁడును- ఛందోభాగే- వేదైకదేశమయిన వేదాంతమందు - చరంతం- సంచరించుచున్నవాఁడును - శతమఖముఖద్వేషిణాం - దేవేంద్రుఁడు మొదలగువారలనడచుచున్న - దానవానాం - దనుజులను - సంహారం- నాశనముచేయుచున్నవాఁడును తం- ఆప్రసిద్ధుఁడునైన- గోపకన్యాభుజంగం- గోపికావిటుఁడైనకృష్ణుని- హేరసనే- ఓనాలుకా- కథయ- కీర్తింపుము. ... ❖

శా॥ బృందారణ్యాతరుప్రదేశములగోబృందంబులన్మేపుచు। న్మందంబౌమధురధ్వనిన్ మురళిఁబల్మారున్వినోదింపుచున్। ఛందోవీధిఁజరించుచున్వమతరక్షస్తోమవిధ్వంసనా। నందుండైనవ్రజాంగనావిటున్ సజ్జాప్రజ్ఞ గీర్తింపుమా॥ ❖

తా॥ మనోహరంబులకునాదంబులచేమెల్లమెల్లన వేణువునిండింపఁజేయుచుబృందావనంబున గోగణంబులనుమేపుచును వేదాంతవీధులం జరియించుచు నెల్లదానవులంబోనడుచుచు లోకప్రసిద్ధుండై వెలయుగోపికావిటునినో నాలుకాకీర్తింపుమనుట. ... ... ... ... ... ❖

శ్లో॥ వేణీమూలేవిరచితఘనశ్యామపిఞ్ఛావచూడో విద్యుల్లేఖావలయితఇవస్నిగ్ధపీతామ్బరేణ। మామాలింగన్మరకతమణిస్తమ్భగమ్భీరబాహుస్స్వప్నేదృష్టస్తరుణతులసీభూషణో నీలమేఘః॥ ... ... ... ౯

టీ॥ వేణీమూలే- వేణీ- కేశబంధవిశేషముయొక్క - మూలే - మొదటను- విరచితఘనశ్యామపిఞ్ఛావచూడః - విరచిత- ఉంచఁబడినదియు- ఘన- మేఘమువలె- శ్యామ- నల్లనైన- పింఛ - నెమలిపురి- అవచూడః- శిరోభూషణముగఁగలవాఁడును- స్నిగ్ధపీతాంబరేణ - స్నిగ్ధ- స్వచ్ఛమయిన- పీతాంబరేణ- పీతాంబరముచేత- విద్యుల్లేఖావలయితః- విద్యుత్- మెఱుపుల యొక్క - లేఖా - పఙ్క్తిచేత- వలయితః- చుట్టుకొనబడిన- నీలమేఘఇవ - నీలమేఘమువలెనున్నవాడును- మరకతమణిస్తంభగంభీరబాహుః-మరకతమణి- ఇంద్రనీలమణివికారమైన- స్తంభ- స్తంభమువలె - గంభీర-గంభీరములయిన- బాహుః- బాహువులుగలవాఁడును- తరుణతులసీభూషణః- తరుణ- లేఁతయగు- తులసీ- తులసీమాలిక- భూషణఃఅలంకారముఁగాగలిగినవాఁడునై నశ్రీకృష్ణమూర్తి- మాం-

రుక్మిణీదేవిని - ఆలింగన్ - కౌఁగిలించినవాఁడగుచు - స్వప్నే - స్వప్నమందు - మయా - నాచేత - దృష్టః - చూడఁబడెను. ... ... ... ◈

ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణషోడశాక్షరమంత్రధ్యానంబని
సనత్కుమారసంహితయందుఁ జెప్పంబడియున్నది. ❁

శ్లో॥ వామాంకస్థితయా వామపాణిపద్మస్థపద్మయా । పద్మావతారయా శ్లిష్టం రుక్మిణ్యా కనకాభయా ॥ హరింతాపింఛసచ్ఛాయమాసీనాం కాంచనాంబుజే । ఆశ్లిష్యంతం ప్రియాం దేవ్యా ఫలోద్యద్వామపాణినా । సౌవర్ణవేత్రవిలసద్దక్షపాణితలం స్మరేత్ । పీతాంబరధరం దివ్యం భూషామాలావిభూషణం ॥

చ॥ అలరు మెఱుంగురంగుగల హాటకశాటిక మౌళిపాళి భా । సిలు నవపింఛ కంబు తులసీదళదామము గ్రాలనట్టిమే । ఘులలితమూర్తి నాసికపుగంబము బోఁసిభుజద్వయంబుచే । సలలిరమాంవధూటిఁ జెలువందగ లన్నను పించెసింపురన్ ॥ ◈

తే॥ తొలుకాఱు మెఱుంగురంగులం దెగడు బంగరువలెవాటును మౌళితలంబునం గనుపట్టు నెమలిపురియును దులసీదామంబునుం గలిగి నీలమేఘంబు బోలిన శ్రీకృష్ణమూర్తి నీలంపుఁ గంబంబులం దెగడు బాహుయుగళంబుచే రుక్మిణిం గౌఁగిలించుకొనినా స్వప్నంబునం గానంబడియె. ... ... ◈

శ్లో॥ కృష్ణే హృత్వా సిచయనిచయం కూలకుంజాధిరూఢే ముగ్ధా కాచిన్ముహురనునయైః కిన్వితి వ్యాహరంతీ । సభ్రూభంగం సదరహసితం సత్రపం సానురాగం ఛాయాశౌరేః కరతలగతాన్యంబరాణ్యాచకర్ష ॥ ... ౮

టీక॥ సిచయనిచయం - సిచయ - వస్త్రములయొక్క - నిచయం - సమూహమును - హృత్వా - హరించి - కృష్ణే - శ్రీకృష్ణమూర్తి - కూలకుంజాధిరూఢే - కూల - యమునాతటమందలి - కుంజ - పొదయందు - అధిరూఢేసతి - ఎక్కినవాఁడగుచుండఁగా - కాచిత్ - ఒకానొకతయైన - ముగ్ధా - ముద్దరాలు - ముహుః - మాటిమాటికిని - అనునయైః - ప్రియవచనములచేత - కిన్వితి - ఏమి ప్రయోజనమని - వ్యాహరంతీ - చెప్పుచున్నది - సభ్రూభంగం - బొమముడితోఁ గూడినటులను - సదరహసితం - చిఱునగవుతోఁ గూడినటులను - సత్రపం - సిగ్గుతోడఁ గూడినటులను - సానురాగం - అనురాగముతోఁ గూడినటులను - ఛాయాశౌరేః - శ్రీకృష్ణచ్ఛాయయొక్క - కరతలగతాని - కేలనున్న - అంబరాణి - వస్త్రములను - ఆచకర్ష - లాగెను. ... ... ... ... ... ◈

ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణమంత్రరాజ వస్త్రాకర్షణప్ర

యోగధ్యానమని గోపాలకల్పమందుఁ జెప్పంబడియున్నది.

శ్లో॥ కదమ్బవృక్షమారూఢం గోపీవస్త్రాపహారిణం। కృష్ణం ధ్యాత్వార్ధరాత్రే తు జపేన్మన్త్రం సహస్రకం । దశరాత్రజపాదేవ మాకర్షేన్నాగకన్యకాః । కన్యకాస్త్రీదశాదీనాం కింపునర్మర్త్యయోషితః॥ ... ౯

ఉ॥ కోకలు మ్రుచ్చిలించి తటకుంజగృహంబున నిల్వ సిగ్గునన్ । భ్రూకుటియున్ దరస్మితనిరూఢయుఁ బ్రేమముఁ దోఁపఁ గట్టసున్ । రాకయిదేమి రా తగదు రాయసి ముగ్ధవధూటి నీటిలో। జేకొనబూనె నీడయగు చిన్నిముకుందుని చేతి చేలముల్॥

తా॥ వస్త్రసమూహంబుల నపహరించి శ్రీకృష్ణుండు యమునాతటంబునందుండిన వృక్షము నధిరోహింప నొకముగుదయైన గోపిక ప్రియవచనంబుల నిది యేమి ప్రయోజనంబని నుడువుచు బోమముడియును చిఱునగవును సిగ్గును నను రాగంబును దెలుపుచు నీడయగు కృష్ణుని కరతలంబులందుండిన చేలంబుల నాకర్షించె ననుట.

శ్లో॥ అపి జనుషి పరస్మిన్నాత్తపుణ్యో భవేయం తటభువి యమునాయాస్తాదృశో వంశనాళః । అనుభవతి య ఏష శ్రీమదాభీరసూనోరధరమణిసమీపన్యాసధన్యామవస్థాం॥ ... ... ... ... ... ... ౯

టీక॥ పరస్మిన్ - ఇతరమైన - జనుషి - జన్మమందు - ఆత్తపుణ్యః - ఆత్త - పొందబడిన - పుణ్యః - పుణ్యము గలదగుచు - యమునాయాః - యమునానదియొక్క - తటభువి - తీరదేశమందు - తాదృశః - శ్రీకృష్ణాధరమును బొందదగు యోగ్యమైన - వంశనాళః - వేణువు - భవేయమపి - అయినప్పటికిని - య ఏషః - ఏయమునాతీరమందుఁ బుట్టిన యీ వేణువు - శ్రీమదాభీరసూనోః - శ్రీమత్ - సంపత్కరుఁడైన - ఆభీరసూనోః - శ్రీకృష్ణమూర్తియొక్క - అధరమణిసమీపన్యాసధన్యాం - అధర మణి - మణివంటి యధరముయొక్క - సమీప - ప్రాంతమందు - న్యాస - ఉంచుటచేత - ధన్యాం - కృతార్థమైన - అవస్థాం - దశను - అనుభవతి - అనుభవించుచున్నది -

ఉ॥ నందతనూజు మోవిరతనంబు సమీపము చేరి ధన్యతం । బొందెఁ గళింద జాతటము పొంతవసించిన వంశనాళమా । యందము గాంచు నొక్కజననాంతరమందియ శేషసత్క్రియా । బృందము వెంటనంటి ఫలమియ్యఁగఁ గోర్కులపంటపండఁగన్ ॥ ... ... ... ... ... ౯

తా॥ శ్రీకృష్ణునికెమ్మోవి రతనంబు పొంతం జేరి యమునాతటంబున నంబొడమిన వంశనాళంబు పవిత్రంబయ్యె నేను నటులజన్మాంతరంబుననైనను శేష సత్కర్మఫలంబులచే నైనం దాదృశవంశనాళంబు పోల్కి కృతార్థత్వంబు నొందుదు

నాకోయనియొక్ర్రేతమనంబునందలించెననుట. ... ... ❀

శ్లో॥ అయిపరిచినుచేతః ప్రాతరమ్భోజనేత్రంకబరకలిత చఞ్చత్పిఞ్ఛదామాభిరామమ్। వలభిదుపలనీలం వల్లవీభాగధేయమ్ నిఖిలనిగమవల్లీ మూలకందంముకుందమ్॥ ... ... ... ... ... ౧౦

టీక॥ అయిచేతః. ఓచిత్తమా. ప్రాతరంభోజనేత్రం. ప్రాతరంభోజ. ప్రాతఃకాలకమలములవంటి. నేత్రం - కన్నులుగలవాఁడును. కబరకలితచఞ్చత్పిఞ్ఛదామాభిరామమ్. కబర. సిగయందు. కలిత. చుట్టబడి. చంచత్. ఒప్పుచున్న. పింఛదామ. నెమలిపురిదండచేత. అభిరామం. సుందరుఁడైనవాఁడును. వలభిదుపలనీలం. వలభిదుపల. ఇంద్రనీలమణివలె. నీలం. నీలవర్ణుఁడైనవాడును. వల్లవీభాగధేయం. వల్లవీ. గోపస్త్రీలయొక్క - భాగధేయం. భాగ్యస్వరూపుఁడైనవాఁడును. నిఖిలనిగమవల్లీమూలకందం. నిఖిల. సమస్తమయిన. నిగమ. వేదముల నియెడి. వల్లీ - తీవియలయొక్క - మూల. మొదటిదియగు. కందం. గడ్డయైనవాఁడును. ముకుందం. శ్రీకృష్ణమూర్తిని గూర్చి. పరిచిను. పరిచయము చేయుము. ❀

మ॥ లలితాంభోరుహనేత్రు గోపరమణీలావణ్యపాత్రున్సము। జ్జ్వలపౌరందరనీలగాత్రుఁ గబరాంచత్పింఛలీలున్విని। శ్చలవేదాంతలతాలవాలు మురళీసంగీతలోలున్ దయానిలయున్ సన్మతిమీరఁ గోరమనమా నిత్యంబు సేవింపుమా॥

తా॥ ఓమనంబా దినముఖంబునం బాల్పువిరిదమ్మిరేకులుంబోలికన్నుఁగవచేఁ దేజరిల్లి సిగయందు నలంకరింపఁబడిన నెమలిపురిదండచే నభిరాముఁడగుచు నింద్రనీలరత్నంబుంబలె నీలకాంతిగలిగి గోపస్త్రీభాగ్యరూపంబై యెల్ల వేదంబులకు నాదికారణుండై వెలయు శ్రీకృష్ణమూర్తిం గూర్చి మిక్కిలియుం బరిచయంబు చేయుమనుట. ... ... ... ... ... ... ... ❀

శ్లో॥ అయిమురళిముకుందస్మేరవక్త్రారవింద శ్వసన మధురసజ్ఞే త్వాం ప్రణమ్యాద్య యాచే। అధరమణిసమీపం ప్రాప్తవత్యాం భవత్యాం కథయ రహసి కర్ణే మద్దశాం నందసూనోః॥ ... ... ... ... ౧౧

టీక॥ ముకుందస్మేరవక్త్రారవిందశ్వసనమధురసజ్ఞే. ముకుంద. శ్రీకృష్ణమూర్తియొక్క - స్మేరవక్త్ర. నగుమొగమనియెడి. అరవింద - కమలముయొక్క - శ్వసన. నిశ్వాసమనియెడి. మధు. మకరందముయొక్క - రసజ్ఞే. రసమునెఱింగిన. అయిమురళి. ఓవంశనాళమా - త్వాం. నిన్నుఁగూర్చి. అద్య. ఇప్పుడు. ప్రణమ్య. నమస్కరించి. యాచే. యాచించుచున్నాను. భవత్యాం. నీవు. అధరమణిసమీపం. అధరమణి. మణివంటియధరముయొక్క - సమీపం. సమీపమును.

స్తావత్యాం.- పొందుచుండఁగా. నందసూనోః. శ్రీకృష్ణమూర్తియొక్క - శ్రేణే. చెవియందు. రహసి. ఏకాంతమున - మద్గాం - నాయవస్థను. కథయ. చెప్పుమా. ... ... ... ... ...

వ॥ హరియధరాంతికస్థలవిహారమునకాస్మితపూర్ణవక్త్రతా। మరససమీరసీధుసమాధురిజెందిననిన్ను వేఁడెదఁ। మురళిగోనందసూనుమదినూల్కొనగాఁజెవిఁడసుండి మే!వ్వరువినకుండ నాదువలవంతనమస్తను దెల్పుమోళ్కిదఁ ॥౧౧

తా॥ శ్రీకృష్ణునిసగుమొగంబుఁదామరంబాఁడను నిట్టూరుపుతేనియచవినొంగినయోపిల్లనఁగ్రోవినినుంగూర్చి మ్రొక్కి వేఁడెదనీపుగతసంబుఁబోని యధరంబుసమీపంబునఁ జేరినయెడ శ్రీకృష్ణునిచెవియందే కాంతంబున నాయవస్థం జెప్పుమనుట. ... ... ... ... ...

శ్లో॥ సజలజలదనీలంవల్లవీకేళిలోలం శ్రితసురతరుమూలంవిద్యుదుల్లాసిచేలం। నతసురమునిజాలంసన్మనోబింబలీలంసురరిపుకులకాలంనౌమిగోపాలబాలం॥

టీక॥ సజలజలదనీలం- సజల- నీటితోఁగూడిన- జలద - మేఘమువలె - నీలం- నల్లనైనవాఁడును- వల్లవీకేళిలోలం- వల్లవీ గోపస్త్రీలయొక్క - కేళి- సల్లాపములయందు- లోలం- ఆసతోఁగూడినవాడును - శ్రితసురతరుమూలం- శ్రిత- ఆశ్రయింపఁబడిన- సురతరు- కల్పవృక్షముయొక్క - మూలం - మొదలుగలవాడును- విద్యుదుల్లాసిచేలం- విద్యుత్ - మెఱుపువలె- ఉల్లాసి- ప్రకాశించుచున్న- చేలం- వస్త్రములుగలవాఁడును- నతసురమునిజాలం- నత- నమ్రులైన- సుర- దేవతలయొక్కయు- ముని- మునులయొక్కయు - జాలం - సమూహముగలవాడును- సన్మనోబింబలీలం- సత్ - సత్పురుషులయొక్క - మనః - మనస్సులయందు- బింబ- సాకారములైన - లీలం - విలాసములుగలవాఁడును- సురరిపుకులకాలం - సురరిపు- రాక్షసులయొక్క - కుల-వంశములకు- కాలం-యముప్రాయుఁడైనవాఁడును- గోపాలబాలం- గోపాలబాలుఁడునైన( కృష్ణుని )నౌమి- నుతించుచున్నాను. ... ... ... ...

ఈశ్లోకార్థంబుగోపాలకృష్ణద్వాదశాక్షరీమంత్రధ్యానమనిసనత్కుమారసంహితయందుజెప్పంబడియున్నది. ... ...

శ్లో॥ ధ్యాయేత్కల్పద్రుమాధస్తాన్మణిపీఠాబ్జగంశుభమ్। కృష్ణంపీతాప్సరంశఙ్ఖచక్రకరామ్బుజమ్॥ సిఞ్చమానంసుధాకుమ్భైరైరావణకరావృతైః కేణశాన్యదర్పణాసన్నంతంతపసాత్మనా। స్తూయమానంసురగణైఃపుష్పవృ

ష్టికలైర్దివి। సేవ్యమానంచమునిభిస్సిద్ధస్సాధ్యైర్మహోరగైః॥

మ॥ సజలాంభోధరజాలనీలువిలసత్సౌదామినీచేలునిన్ వ్రజభామాననకేళిలోలునిసుపర్వద్వేషకృత్కాలునిన్। ద్విజరాణ్మానసనింబలీలునిశ్రితాదిత్యద్రుమావాలునిన్। భజియింతున్నగోపబాలునతనానాదేవతాజాలునిన్॥

తా॥ నీరంబుతోడంగూడినమొగులుంబోలెనల్లనయిగోపికలసల్లాపాదిక్రీడలయందానించుచుగల్పవృక్షమూలంబున నుండిమెఱుగుంబోని చేలంబమరసర్వదానవవంశనాశకుండైన దేవతలుమునులుభజియింప సత్పురుషులయెదుట సాక్షాత్కరించుచు వెలుంగుగోపాలబాలునుతించుచున్నాననుట.

శ్లో॥ అధరబిమ్బవిడమ్బితవిద్రుమంమధురవేణునినాదవినోదినం। కమలకోమలకమ్రముఖామ్బుజంకమపిగోపకుమారముపాస్మహే॥ ... ౧౩

టీక॥ అధరబింబవిడంబితవిద్రుమం. అధరబింబ - దొండపండువంటియధరముచేత - విడంబిత - అపహసింపబడిన - విద్రుమం - పవడముగలవాడును. మధురవేణునినాదవినోదినం - మధుర - శ్రావ్యమయిన - వేణునినాద - వేణునాదముచేత - వినోదినం - కాలముగడుపుచున్నవాడును - కమలకోమలకమ్రముఖాంబుజం - కమల - కమలమువలె - కోమల - మృదువయినదియు - క్రమ - సుందరమయినదియునగు - ముఖాంబుజం - ముఖకమలముగలవాడును - కమపి - ఇట్టిదనిచెప్పనలవిగానివాడునునగు - గోపకుమారం - శ్రీకృష్ణమూర్తిని - ఉపాస్మహే - ఉపాసించుచున్నాను. ... ... ...

మ॥ మురళీనాదమధూళికాకలితసమ్మోదున్ సుధాసారమే। దురబింబాధరధూతవిద్రుమవినోదున్ రాధికాంఘ్రిద్వయీ। వరలాక్షాలసమానఫాలతలుశ్రీవత్సాంకవక్షస్థలున్।సరసీజాతమనోహరాననుమదింజక్రాయుధుంగొల్చెదన్.

తా॥ దొండపండువంటికెమ్మోవిపవడంబునపహసింప శ్రావ్యంబగువేణుగానంబునఁగాలంబుం గడుపుచుఁ గమలంబువలెమృదులంబును సుందరంబునైననెమ్మొగంబమరనిట్టివాఁడనిచెప్పనలవికాకవెలుంగు గోపాలకృష్ణునుపాసించుచున్నాననుట. ... ... ... ... ...

శ్లో॥ అధరేవినివేశ్యవంశనాళంవివరాణ్యస్యసలీలమఙ్గుళీభిః। ముహురన్తరయన్ముహుర్వివృణ్వన్మధురంగాయతిమాధవోవనాన్తే॥ ... ౧౪

టీక॥ మాధవః- శ్రీకృష్ణమూర్తి-అధరే-కెమ్మోవియందు- వంశనాళం- వేణువుని- నివేశ్య- ఉంచి- అస్య- ఈవేణువుయొక్క - వివరాణి- రంధ్రములు

ను. సలీలం - విలాసముతోఁగూడినటుల - ముహుః - పలుమఱు - అఙ్గులీభిః - వ్రేళ్ల చేత - అంతరయన్ - కప్పుచు - వివృణ్వన్ - విప్పుచును - వసాన్తే - బృందావన ముందు - మధురం - శ్రావ్యముగను - గాయతి - గానముచేయుచున్నాడు. ❋

ఉ॥ నెమ్మదియామునాంతరవనిస్స్వసియించుచుఁగొంపమోవినం। దమ్ముగవంశీ గీల్కొలిపితద్వివరమ్ములనంగుళీతతం। గ్రమ్ముచువిప్పుచున్ శ్రుతిసుఖమ్ముగగాన ముదానమానముల్ ఘుమ్మనిమ్రోయజేయుగసీకుంగనుగొంటిరెకంటికింపుగన్॥

తా॥ అధరంబునవంశనాళంబునిలిపిరంధ్రంబుల వ్రేళ్లచేమాటిమాటికిం గప్పుచువిప్పుచుంబృందావనంబున శ్రీకృష్ణమూర్తివీనులవిందగు నటులగానముంజే యుచున్నాడనుట. ... ... ... ... ... ❋

శ్లో॥ వదనే నవనీతగన్ధవాహం వచనే తస్కరచాతురీధురీణమ్। నయనే కుహ నాశ్రుమాశ్రయేథాశ్చరణే కోమలతాణ్డవం కుమారమ్॥ ... ౧౫

టీక॥ వదనే - ముఖమందు - నవనీతగన్ధవాహం - నవనీత - వెన్నయొక్క - గన్ధ - పరిమళమును - వాహం - వహించుచున్నవాడును - వచనే - వాక్యమందు - తస్కరచాతురీధురీణం - తస్కర - దొంగయొక్క - చాతురీ - చాతుర్యములయొ క్క - ధురీణం - భారవహుడైనవాడును - నయనే - కన్నవయందు - కుహనాశ్రుం - కుహనా - అబద్ధమైన - అశ్రుం - కన్నీరుగలవాడును - చరణే - పాదమందు - కో మలతాణ్డవం - కోమల - మనోహరమైన - తాండవం - నృత్యముగలవాడును - కు మారం - కుమారుడునైనకృష్ణుని - ఆశ్రయేథాః - సేవించుచున్నాను. ❋

ఈశ్లోకార్థంబుగోపాలకృష్ణైకపశౌచరీ మంత్రధ్యానమనిసనత్కు మారసంహితయందుజెప్పంబడియున్నది. ❋

శ్లో॥ హరన్తం నవనీతాదిచౌర్యేణ వ్రజయోషితామ్। గోపబాలైర్వృ తం కృష్ణం ధ్యాయన్మన్త్రమిమం జపేత్॥ ... ... ... ❋

ఉ॥ కమ్మనివెన్నవాసనముఖమ్మునఘుమ్మనిసోడుముట్టవా। క్యమ్ములజౌర్య నైపుణులుగన్పడగన్నుగవన్మృషాశ్రువు। లిమ్మగగోమలాంఘ్రియుగళమ్ము నదాండవకేళి యొప్పగాఁ। గ్రుమ్మరుగోపబాలకు ముకుందునినామది నాశ్ర యించెదన్॥ ... ... ... ... ... ౧౫

తా॥ నెమ్మోగంబుననవనీతగంధంబు వెలయమాటలయందు దొంగతనం బుచదురులుపొసంగగన్నుంగవమిథ్యాశ్రులొలుకనడుగుదామరల నాట్యంబు విస్తరిల్లంగ్రుమ్మరుగోపాలబాలునినోమనంబాయాశ్రయింపుమనుట. ❋

శ్లో॥ అమునాఖిలగోపగోపనాథంయమునారోధసినన్దనన్దనేన।దమునా వనసమ్భవఃపపేనఃకిమునాసౌశరణార్థినాంశరణ్యః॥ ... ౧౮

టీక॥ అమునా- ఈయగుపడుచున్న- నన్దనన్దనేన- శ్రీకృష్ణమూర్తిచేత-యమునారోధసి- యమునాతటమందు-గోపగోపనాథం - గోప - గోపాలకులయొక్క - గోపనాథం- రక్షించుకొనుటకు- వనసంభవః- వనమందుబొడమిన - దమునాః - దహనుడు- పపేకిల - పానముచేయబడియెనుగదా - అసౌ- శ్రీకృష్ణమూర్తి-శరణార్థినాం- శరణమునుబ్రార్థించుచున్న - నః-మాకు. శరణ్యః - రక్షకుండు. నకిము-, కాడాయేమి- ... ... ... ❁

త్రిప్రాసమత్తేభము॥ యమునాతీరవనాంతసంజనితదావాగ్నిస్ఫుటార్చిర్ని కా। యమునానాజనభీకరంబగుచుడాయన్ వేలవేఁగాచునే। య్యమునాయంబనిదానినానెసటనిత్యంబున్ హరిన్ గూర్తసం। యమునారాధనచేయునాకిప్రడభీష్టావాప్తిగాకుండునే॥ ... ... ... ... ౧౮

తా॥ ఈకానంబడుచున్న శ్రీకృష్ణమూర్తిచే యమునాతటవనంబున గోపాలరక్షణంబుకొఱకుదావానలంబుపానంబుచేయంబడియెంగదా అట్టి శ్రీకృష్ణమూర్తిశరణాగతులమగుమమ్ముం గావనెటులసమర్థుండుగాకపోవు ననుట-

శ్లో॥ జగదాదరణీయజారభావంజలజాపత్యవచోవిచారగమ్యమ్। తనుతాన్తనుతాంశివేతరాణాంసురనాథోపలసున్దరంమహోనః॥ ౧౯

టీక॥ జగదాదరణీయజారభావం- జగత్ -లోకములచేత - ఆదరణీయ- అంగీకరింపదగిన- జారభావం- జారత్వములుగలదియు-జలజాపత్యవచోవిచారగమ్యం- జలజాపత్య- చతుర్ముఖునియొక్క - వచః వాక్యములయినవేదాంతములయొక్క - విచార - సంచారముగల యుత్తరమీమాంసచేత - గమ్యం- తెలియదగినయదియు- సురనాథోపలసుందరం- సురనాథోపల - ఇంద్రనీలమణివలె- సుందరం- సుందరమయినదియునైన - మహః తేజము- నః - మాయొక్క - శివేతరాణాం- అశుభములయొక్క - తనుతాం-కార్శ్యమును - తనుతాం - చేయుఁగాక- ... ... ... ... .. ❖

చ॥ సరసిజసంభవప్రముఖసర్వసుపర్వవచోవిచారగో। చరమగు దివ్యతేజమనిశంబులు జగంబుమెచ్చజారుడై। మరకతనూత్నరత్నసుషమంజెలు వందగుమారమూర్తియై। పరగిదయార్ద్రదృష్టినశుభంబులడంచిశుభంబులీవుతన్॥

తా॥ వేదాంతవాక్యంబులవిచారంబుగలయుత్తరమీమాంసచేఁ దెలియ

దగియును జగంబులచేతనాదరింపఁబడిన జారత్వంబుగలిగి యింద్రనీల రత్నంబుంబోలె సుందరంబయి వెలుంగుతేజంబు నాయశుభంబులనడంచి శుభంబొసంగుతయనుట. ... ... ... ... ...

శ్లో॥ సాకాపిసర్వజగతామభిరామసీమా కామాయనోభవతు గోపకిశోరమూర్తిః। యాశేఖరేశ్రుతిగిరాంహృదియోగభాజాం పాదామ్బుజేచసులభావ్రజసుందరీణామ్॥ ... ... ... ... ... ... ౯

టీక॥ సా- అప్రసిద్ధమయినయదియు - కాపి- ఇట్టిదియనిచెప్ప నలవిగానియును- సర్వజగతాం - ఎల్లలోకములయొక్క - అభిరామసీమా - అభిరామసౌందర్యముయొక్క - సీమా- ఉత్తరావధియునైన- గోపకిశోరమూర్తిః- గోపకిశోర- గోపాలబాలునియొక్క - మూర్తిః- శరీరము- నః- మాయొక్క - కామాయ- శ్రేయస్సుకొఱకు- భవతు- అగుఁగాక- యా- ఏమూర్తి- శ్రుతిగిరాం- వేదవాక్యములయొక్క - శేఖరే- అంతమందు- యోగభాజాం- బ్రహ్మనిష్ఠులయొక్క - హృది- హృదయములయందును- వ్రజసుందరీణాం- గోపస్త్రీలయొక్క - పాదాంబుజేచ- పాదకమలంబునను- సులభా- సులభముగాఁ బ్రవర్తించుచున్నదియో- సాకామాయభవతు అనియన్వయము- ... ...

ఉ॥ ఎల్లజగంబులుఁ గరహివహించుశుభాస్పదసీమయోగిహృత్ఫుల్లసరోజపాళిఁబదముల్దులకింపఁద్రయీవధూటికా। హల్లకసీమలంబొలుచునద్భుతగోపకిశోరమూర్తియో। వల్లవకామినీచరణవారిజసేవకులెస్సఁజిక్కెఁగా॥

తా॥ ఎద్దియేనియువేదాంతంబునబ్రహ్మనిష్ఠులహృదయంబులంబ్రకాశించునదియయ్యుంగోపవధూచరణాంబుజసేవకుఁబాల్పడియెనోయట్టి ప్రసిద్ధంబగునదియునెల్లలోకంబులసోయగంబునకునెల్లయునైనగోపాలకృష్ణమూర్తిమాశ్రేయస్సుకొఱకగుంగాకయనుట. ... ... ... ...

శ్లో॥ అత్యంతబాలమతసీకుసుమప్రకాశందిగ్వాసనంకనకభూషణభూషితాంగమ్। విస్రస్తకేశమరుణాధరమాయతాక్షం కృష్ణంనమామిమనసావసుదేవసూనుం॥ ... ... ... .. ... ౧౦

టీక॥ అత్యంతబాలం- మిక్కిలిబాలుఁడైనవాఁడును - దిగ్వాసనం- దిగంబరుండైనవాఁడును- విస్రస్తకేశం- విస్రస్త - ముడివేయని - కేశం - వెంట్రుకలుగలవాఁడును - అతసీకుసుమప్రకాశం - అతసీకుసుమ - నల్లవిశపుష్పముయొక్క - ప్రకాశం - ప్రకాశమువంటిప్రకాశముగలవాఁడును - కనకభూషణభూషితాంగం- కనక- బంగారువికారమయిన - భూషణ - ఆభరణములచే

భూషిత- అలంకరింపఁబడిన - అంగం- శరీరముగలవాఁడును - అరుణాధరం అరుణ- ఎఱ్ఱనైన- అధరం-అధరముగలవాఁడును-ఆయతాక్షం- ఆయత-దీర్ఘములైన- అక్షం- కన్నులుగలవాఁడునైన- వసుదేవసూనుం- శ్రీకృష్ణమూర్తిని- మనసా- మనస్సుచేత- నమామి నమస్కరించుచున్నాను. ... ❖

ఉ ॥ కోమలసుందరాకృతియుఁగొప్పకనుంగవకెంపుమోవియు । న్మోమున వ్రేలుముంగురులునూత్న విభూషణ భూషితాంగము । ద్దామదిగంబరాకృతియుఁదాల్చినవెన్నునిఁజిన్నిబాలకున్ । శ్రీనెఱయన్ భజింతునతసీసుమభాసుని నందసూనునిన్ ॥ ... ... ... ... ౧౯

తా ॥ మిక్కిలిబాలుండునునల్లనిశపూవుంబోనినెమ్మేని చాయచేఁదేజరిల్లువాఁడును దిగంబరుండునుగనకాభరణంబులచేనలంకరింపఁబడిన శరీరంబుగలవాఁడును ముడువనివెంట్రుకలుగలవాఁడును వెడలువగుకనుంగవగలవాఁడును గెంపుపెంపుగణిఁయింపనియధరంబుగలవాఁడును వసుదేవసూనుండునునగుశ్రీకృష్ణమూర్తింగూర్చిశిరంబుచేనమస్కరించుచున్నానినుట. ... ❖

శ్లో॥ హస్తాంఘ్రినిక్వణితకఙ్కణకింకిణీకం మధ్యేనితమ్బమవలమ్బితహేమసూత్రమ్ । ముక్తాకలాపముకుళీకృతకాకపక్షం వందామహే వ్రజచరంవసుదేవభాగ్యమ్॥ .. ... ... ... ... ౨౦

టీక ॥ హస్తాంఘ్రినిక్వణితకంకణకింకిణీకం - హస్తాంఘ్రి - కరచరణకమలములయందు- నిక్వణిత - మ్రోయుచున్న - కంకణ - మంజీరముల యొక్క- కింకిణీకం - చిఱుగంటలుగలవాఁడును - మధ్యేనితంబం - నితంబ మధ్యమందు- అవలమ్బితహేమసూత్రం - అవలంబిత - ఆశ్రయింపఁబడిన - హేమసూత్రం- బంగరుమొలనూలుగలవాఁడును - ముక్తాకలాపముకుళీకృత కాకపక్షం - ముక్తాకలాప- ముక్తావళిచేత- ముకుళీకృత- మోడ్పఁబడిన- కాకపక్షం - చిప్పకూకటిగలవాఁడును- వ్రజచరం - వ్రజ- వ్రేపల్లెయందు చరం- సంచరించుచున్నవాఁడునునగు- వసుదేవభాగ్యం - శ్రీకృష్ణమూర్తినిగూర్చి- వందామహే - నమస్కరించుచున్నాము॥ ... ... ... ... ❖

ఈశ్లోకార్థంబుశ్రీకృష్ణాష్టాక్షరీధ్యానంబని సనత్కుమారసంహితయందుఁజెప్పంబడియున్నది. ... ... ❖

శ్లో॥ పశ్చాద్ధావమానస్య యసమీక్షానందం ధావమానంవ్రజాంగణే । కింకిణీనూపురశ్రీవకణభూషోజ్జ్వలంస్మరేత్॥ ... ... ... ... ❖

చ॥ సరసనితంబమధ్యమునజాఱెడుపెన్మొలనూలుదిన్నముం। గురులుదళం బుగాఁగమిదికూర్చినముత్తెపురావిరేకయుం। గరచరణాగ్రనిక్వణితకంకణకింకిణు లొప్పనందమం। దిరమునసంచరించువసుదేవతపఃఫలమున్ భజించెదన్॥ ❖

తా॥ హస్తంబులనుబాదంబులను గంకణమంజీరంబులయొక్క చిఱుగంటలు మ్రోయుచుండ గటిపశ్చాద్భాగమధ్యంబునఁబంగరు మొలనూలు వ్రేలుచుండ మోడ్పంబడినచిప్పకూఁకటియందు రావిరేక మెఱయు వ్రేపల్లెయందు గ్రుమ్మరు శ్రీకృష్ణమూర్తిం గూర్చి మ్రొక్కెదననుట. ... ... ... ❖

శ్లో॥ బృందావనద్రుమతలేషు గవాంగణేషు వేదావసానసమయేషు చదృశ్యతే యత్। తద్వేణునాదనపరం శిఖిపింఛచూడం బ్రహ్మస్మరామి కమలేక్షణమభ్రనీలం॥ ... ... ... ... ... ౨౧

టీక॥ బృందావనద్రుమతలేషు- బృందావన - బృందావనమందలి- ద్రుమ వృక్షములయొక్క - తలేషు- ప్రదేశములయందు- గవాం - గోవులయొక్క - గణేషు- సమూహములయందు - వేదావసానసమయేషు - వేదావసాన- వేదాంతములయొక్క - సమయేషు - సిద్ధాంతములయందు- యత్- ఏబ్రహ్మము దృశ్యతే- చూడఁబడుచున్నదియో - తత్ - ఆప్రసిద్ధమైనట్టి- వేణునాదనపరం వేణు- పిల్లనఁగ్రోవియొక్క - నాదన- వాయించుటయందు- పరం- ఆసక్తమైనదియు- శిఖిపింఛ- నెమలిపురి- చూడం- శిరోభూషణముగాఁగలదియు- కమలేక్షణం - కమల- తామరరేకులవంటి- ఈక్షణం- నేత్రములుగలదియు - అభ్రనీలం- అభ్ర- మేఘమువలె- నీలం- నల్లనైనదియునగు- బ్రహ్మ - శ్రీకృష్ణాఖ్యపరబ్రహ్మమును- స్మరామి - స్మరించుచున్నాను. ... ... ❖

శా॥ బృందారణ్యతరుప్రదేశములగోబృందాంగణశ్రేణులన్। ఛందోవీధులఁగానుపించు పరమస్వచ్ఛందమౌ తేజమౌ। నందబ్రహ్మమువందనీయము రళీనాదాను మోదంబునౌ। యందున్నిల్పెదఁబింఛచూడ ముపయోజాక్షంబు మేఘాభమున్॥ ... ... ... ... ... ౨౧

తా॥ బృందావనంబుతరువులనీడలనుగోసమూహములయందును వేదాంతవీధులయందునే బ్రహ్మంబుగానంబడుచున్నదియో యట్టిప్రసిద్ధంబయి వేణునాదానందంబందు నాసక్తంబై నెమలిపురిశిరోభూషణంబుగధరియించి తామరరేకులవంటికన్నుంగవగలిగి మేఘంబుఁబోలె నల్లనై వెలుంగు శ్రీకృష్ణాఖ్యబ్రహ్మంబునుస్మరించుచున్నాననుట, ... ... ... ❖

శ్లో॥ వ్యత్యస్తపాదమవతంసితబర్హిబర్హం సాచీకృతాననినివేశితవేణురంధ్రం। తేజఃపరంపరమకారుణికం పురస్తాత్ప్రాణప్రయాణసమయే మమసన్నిధత్తామ్॥ ... ... ... ... ... ౨౨

టీక॥ వ్యత్యస్తపాదం- వ్యత్యస్త - వ్యత్యస్తములైన - పాదం చరణములు గలదియు - అవతంసితబర్హిబర్హం - అవతంసిత- శిరోభూషణముగఁ జేయఁబడిన - బర్హిబర్హం - నెమలిపురిగలదియు- సాచీకృతానన నివేశితవేణురంధ్రం- సాచీకృత- అడ్డముగాఁ జేయఁబడిన- ఆనన- ముఖమందు - నివేశిత ఉంచఁబడిన- వేణు- పిల్లనగ్రోవియొక్క - రంధ్రం- బిలముగలయదియు- పరమకారుణికం - అత్యంతదయాళువైనయదియు - పరం - ఉత్కృష్టమైనయదియునగు- తేజః తేజము - మమ - నాయొక్క - ప్రాణప్రయాణసమయే - ప్రాణప్రయాణ- మరణముయొక్క - సమయే- కాలమందు - పురస్తాత్- యెదుట-సన్నిధత్తాం- సమీపమగుఁగాక. ... ... ... ... ❁

చ॥ మొగమొకయోరఁ జేసుకొని మోవిని వేణువుఁ జేర్చి తిర్యగం। ఘ్రికవిలసిల్లమౌళితటిఁ గేకికలాపకలాపముంచిరీ। వినగనువట్టుసౌఖ్యపదవింగను వేళ మదీయసన్నిధిన్। నిగమనివాసతేజము వినిర్మలసత్కరుణాధురీణమై॥ ౨౨

తా॥ వామదక్షిణభాగంబులదక్షిణవామ పదంబులనునిచి శిరోభూషణంబుగ నెమలిపురిధరియించియోరఁగాఁ జేయబడిన నెమ్మొగంబున వేణురంధ్రంబులఁ జేర్చియత్యంతదయాళువై యుత్కృష్టంబగుచు వెలుంగు తేజంబు ప్రాణావసానకాలంబున నా యెదుటం దోఁచుఁగావుతయనుట. ... ... ... ❁

శ్లో॥ ఘోషప్రఘోషశమనాయ మథో గుణేన మధ్యే బబంధ జననీ నవనీతచోరమ్। తద్బంధనం త్రిజగతాముదరాశ్రయాణా మాక్రోశకారణమహో నితరాం బభూవ॥ ... ... ... ... ... ౨౩

టీక॥ ఘోషప్రఘోషశమనాయ- ఘోష- గొల్లపల్లియొక్క - ప్రఘోష- ఆక్రోశముయొక్క - శమనాయ- శాంతికొఱకు- జననీ - తల్లియైనయశోద- నవనీతచోరం - వెన్నదొంగయైనకృష్ణుని - మధ్యే- నడుమునందు-మథః- కవ్వముయొక్క - గుణేన- త్రాటిచేత-బబంధ- కట్టివైచెను- తద్బంధనం- ఆబంధనము- ఉదరాశ్రయాణాం - ఉదర- శ్రీకృష్ణోదరమును - ఆశ్రయాణాం- ఆశ్రయించిన- త్రిజగతాం - ముల్లోకములకును- ఆక్రోశకారణం- ఆక్రోశ-అత్యంతఘోషమునకు- కారణం- బీజము- నితరాం- మిక్కిలియు - బభూవ-ఆయెను-

శా॥ పాలున్వెన్నయుఁ ద్రుచ్చిలించెనని గోపాలాంగనల్గుయ్యిడన్। బాలిం

జెందుచుదల్లిమట్టుపలుపంజర్చించియా బాలకుఁ। రోలంగవ్వపుఁద్రాటఁగట్టిన టయాక్రోశించెదుక్కుత్రిలో। దైత్రిలోక్యంబునుదన్మహామహిమ ముగ్ధలాంఛ గానేత్రురే॥ ... ... ... ... ... ... ౨౩

తా॥ పాలువెన్నలుద్రుమ్ముచ్చిలించెనని నందవ్రజంబునందుండెడిగోపాం గనలు సెప్పుకొనుమాటలాలించియాదొంగతనంబుడుపందలంచి యశోదనవనీ తచోరుండగు కృష్ణుని గవ్వపుద్రాటనులూఖంబునగట్టి నంద దుదరంబున నున్న ముల్లోకంబులును దద్బంధనంబుననగు వేదనావశంబుననాక్రోశింపందొడంగెత ల్లియై నయాయశోద గోపికాక్రోశంబుడుపందలంచి చేయుబంధనంబెల్లలోకం బులకునుపద్రవకరంబయ్యెననుట. ... ... ... ...

శ్లో॥ శైవావయంనఖలుతత్రవిచారణీయంపఞ్చాక్షరీజపపరానితరాంతథాపి। చేతోమదీయమతసీకుసుమావభాసంస్మేరాననంస్మరతిగోపవధూకిశోరమ్॥ ౨౪

టీక॥ పంచాక్షరీజపపరాః- పంచాక్షరీ- పంచాక్షరీమంత్రముయొక్క- జప- జపమందు పరాః-ఆసక్తులమయిన-వయం-మేము- శైవాః-శివసంబంధుల ము- తత్ర-ఆవిషయమందు-విచారణీయంనఖలు-విచారింపగూడదుగదా-తథా పి- అయినప్పటికిని-మదీయం-నాసంబంధమైన చేతః-చిత్తము-అతసీకుసుమావ భాసం- అతసీకుసుమ- నల్లవిసెవుప్వయొక్క-అవభాసం-కాంతివంటికాంతిగల వాడును- స్మేరాననం- నగుమొగముగలవాడునగు- గోపవధూకిశోరం- గోప వధూ- యశోదయొక్క-కిశోరం-శిశువగుకృష్ణుని నితరాం-మిక్కిలియు - స్మరతి- స్మరించుచున్నది. ... ... ... ... ... ... ..

మ॥ అనుమానింపఁగనేమిశైవులముహేమత్యంతపంచాక్షరీమనుపారీణులమౌ మమైన నెపుడుఁ మందస్మితభ్రాజితాననచంద్రుంగపిలాతసీసుమసమానద్యో తనిస్తంద్రుకృష్ణునిగోపాలకబాలునెంచనెతలంచుంజిత్తమాసక్తితోఁ॥ ౨౪

తా॥ పంచాక్షరీమంత్రంబుజపియించుమేముశివసంబంధముగలవారలమనుట యందనుమానంబులేదైననునల్లవిసెపూవుకాంతివంటికాంతిగలనెమ్మేనుగలిగిన నెమొగంబునం దెజరిల్లుయశోదాసుతుండయిన కృష్ణునిసామునంబుగోరుచుండు ననుట. ... ... ... ... ... ... ...

శ్లో॥ రాధాపునాతుజగదచ్యుతదత్తచిత్తామన్థానమాకలయతీదధిరిక్తపాత్రే। త స్యాస్తనస్తబకచఞ్చలలోలదృష్టిర్దేవోపిదోహనధియావృషభంనిరున్ధే॥ ౨౫

టీక॥ అచ్యుతదత్తచిత్తా- అచ్యుత- శ్రీకృష్ణునియందు- దత్త-ఉంచబడిన-చి త్తా- మనస్సుగలదియై - దధిరిక్తపాత్రే దధి- పెరుగుచేత-రిక్తే-శూన్యమైన-పా

త్రే- ఘటమందు- మంథానం-కవ్వమును-ఆకలయతీ-త్రిప్పుచున్న రాధా-రాధయ నుగోపిక- జగత్- భువనమును-పునాతు-పవిత్రముగా జేయుగాక-తస్యాః-ఆరాధయొక్క- స్తనస్తబకచంచలలోలదృష్టిః - స్తనస్తబక- పూవుగుత్తులవంటిపాలిండ్లయందు- చంచల- సారెసారెకు ప్రవర్తించుచున్నయదియు- లోల-ఆసతో గూడుకొన్నయదియునగు- దృష్టిః- చూపుగలవాడయి-దోహనధియా-దోహన బుద్ధిచేత- వృషభం-వృషభమును-నిరుంధన్-కట్టుచున్న-దేవోపి-శ్రీకృష్ణుడును-జగత్ - లోకమును - పునాతు - పవిత్రముగాజేయుగాక, ... ... ◈

చ॥ భ్రమసిహరిందలంచిదధిభాండముదండవసించురిక్తభాం। డముమథియించు రాధయుమనంబునదక్షుచకుంభికుంభవి।భ్రమముదలంచియొక్కవృషభంబునుదోహనబుద్ధిగట్టున। క్రమలదళాక్షుడుంగరుణ గాతురుగాతజగద్వితానముల్॥

తా॥ శ్రీకృష్ణమూర్తియందు మనంబడినదియగుటచేదధిభాండముపొంతనుండినపెరుగులేనికుండయందుఁ గవ్వంబునిడితరువంగమకించురాధయునారాధకుచకుంభంబుల మాటిమాటికిం జంచలించుమనంబుగలవాడగుటంజేసిభ్రాంతిచేవృషభంబుంబిదుకసమకట్టు శ్రీకృష్ణుండును లోకంబుబవిత్రంబుగాజేయుదురుగాకయనుట. ... ... ... ... ... ... ◈

శ్లో॥ గోధూళిధూసరితకోమలకున్తలాగ్రంగోవర్ధనోద్ధరణకేళికృతప్రయాసమ్। గోపీజనస్యకుచకుఙ్కుమముద్రితాఙ్గంగోవిన్దమిన్దువదనంశరణంభజామః॥ ౨౬

టీక॥ గోధూళిధూసరితకోమలకుంతలాగ్రం- గోధూళి- గోసమ్మర్దనమువలనబుట్టినరేణువులచేత- ధూసరిత- ధూసరవర్ణముగలదిగాజేయబడిన-కోమల-మృదువులయిన- కున్తలాగ్రం- కేశాగ్రములుగలవాడును-గోవర్ధనోద్ధరణకేళికృతప్రయాసం-గోవర్ధన-గోవర్ధనపర్వతముయొక్క-ఉద్ధరణ-యెత్తుటయనియెడి-కేళి- విహారమందు-కృత-చేయబడిన-ప్రయాసం-ప్రయాసముగలవాడును-గోపీజనస్య-గోపికాసమూహముయొక్క-కుచకుంకుమముద్రితాంగం-కుచ- స్తనములయందలి- కుంకుమ-అంగరాగవిశేషముచేత-ముద్రిత-చిహ్నితములయిన-అంగం - వక్షముమొదలగునవయవములుగలవాడును-ఇందువదనం-ఇందు-చంద్రునివంటి- వదనం- ముఖముగలవాఁడును-శరణం-రక్షకుఁడునైన-గోవిందం-శ్రీకృష్ణమూర్తిని - భజామః - సేవించుచున్నాము. ... ... ◈

ఉ॥ గోవ్రజధూళిధూసరితకోమలకుంతలుగోపికాకుచ। స్థాపితకుంకుమాంకితవిశాలభుజాంతరుబాణిపంకజా। రోపితభూమిభృద్వరనిరూఢసుఖాస్పదనం

దగోకులుల్ । గోపకుమారునిందువదనున్మదనుగ్రహవాంఛగొల్చెదన్॥

తా॥ గోపదసమ్మర్దంబునంబొడమినపరాగంబుచేధూసరంబగుకేశగ్రంబులుగలిగిగోవర్ధనోద్ధరణంబునువిహారంబుచే జేయబడినశ్రమంబుగలిగిగోపికాకుచకుంకుమంబున లాంఛితంబగునురంబుచే దేజరిల్లుచుఁజందురుంబోలునెమ్మొగంబుననమరినాకురకుకుండైతనరుగోవిందునిసేవించుచున్నానుఁట

శ్లో॥ యద్రోమరన్ధ్రపరిపూర్తివిధావదక్షా వారాహజన్మనిబభూవురమీసముద్రాః। తంనామనాథమరవిన్దదృశంయశోదా పాణిద్వయాన్తరజలైస్స్నపయాంబభూవ॥ ... ... ... ... ... ... ౨౭

టీక॥ వారాహజన్మని వరాహావతారమందు-అమీసముద్రాః-ఈసముద్రములు-యద్రోమరంధ్రపరిపూర్తివిధౌ- యత్-ఏశ్రీకృష్ణమూర్తియొక్క-రోమ-వెంట్రుకలయొక్క- రంధ్ర- బిలముయొక్క- పరిపూర్తి-పూర్ణముయొక్క-విధౌ-చేయుటయందు-అదక్షాః-అసమర్థములు బభూవుః-అయినవియో తం-ఆ-అరవిందదృశం-పుండరీకాక్షుడైన- నాథం-శ్రీకృష్ణమూర్తిని-యశోదా-నందునిభార్య-పాణిద్వయాంతరజలైః పాణిద్వయ దోయిలియొక్క-అంతర మధ్యమందలి జలైః-ఉదకములచేత-స్నపయాంబభూవనామ-స్నానముచేయించెగదా ❖

ఉ॥ ఏయధికుండుక్రోడతవహించినినాతనిరోమరంధ్రము । న్దోయధులెల్లనించుహవణుల్గననేరకయుండెనట్టినా। రాయణుఁడక్షిణ కాకృతినిరాగిలినందవధూటిదోయిటన్।దోయముఁజల్లఁగాఁదనిసితోఁగుచున్నుండెనిదేమిచిత్రమో॥ ౨౭

తా॥ వరాహజన్మంబుననీసముద్రంబులేశ్రీకృష్ణునిరోమరంధ్రంబుబూరింపసమర్థంబులిగాకపోయినవియోయట్టి ప్రసిద్ధుండును బుండరీకాక్షుండునగు శ్రీకృష్ణమూర్తినియశోదాదేవి దోయిలిలోనినీటచే స్నానముచేయించెనిదియెట్టివిచిత్రంబోయనుట ... ... ... ... ... ❖

శ్లో॥ పరమిమముపదేశమాద్రియధ్వంనిగమవనేషునితాన్తచారఖిన్నాః। విచినుతభవనేషువల్లవీనాముపనిషదర్థములూఖలేనిబద్ధమ్॥ ... ... ౨౮

టీక॥ నిగమవనేషు - నిగమ - వేదములనియెడి వనేషు వనములయందు నితాన్తచారఖిన్నాః- నితాంత- మిక్కిలియు- చార- పరిశీలనముచేత- ఖిన్నాః- బడలిన- హేసుకృతినః-ఓవిద్వాంసులారా పరం-ఉత్కృష్టమయిన-ఇమముపదేశం- ఈయుపదేశమును- ఆద్రియధ్వం-ఆదరింపుఁడు వల్లవీనాం గోపస్త్రీలయొక్క-భవనేషు గృహములయందు-ఉలూఖలే రోటియందు నిబద్ధం-కట్టబడిన- ఉ

పనిషదర్థం - ఉపనిషత్- వేదాంతములయొక్క- అర్థం- లక్ష్యమయినకృష్ణుని. విచినుత-వెదకుండు ... ... ... ... ... ❖

ఉ॥ నిగమమహావనాంతములనే వెదకన్వలెనంచు భిన్నులై। వగవగనేలయేనొక యుపాయము జెప్పెదబోయిచూడుఁడీ। యగణితవల్లవీమణిగృహాంగణభూమి నులూఖలంబుతోఁ। డగుణనిబద్ధమై శ్రుతులడాగినభావము గానవచ్చెడున్॥ ౨౮

తా॥ వేదంబులనునరణ్యంబులం గ్రుమ్మరంబాడమినదప్పి చేనాగిలినయోవిద్వాంసులారా నావలుకొక్కండువినుండు ఉపనిషదర్థంబు గోపికా గృహంబుల ముంగిళులయందు నవనీతచౌర్యాదికంబున నైనయులూఖలబంధనంబు గలిగియున్నదిగాన వారలగృహంబుల వెదకుండుననుట, ... - ❖

శ్లో॥ దేవకీతనయపూజనపూతః పూతనారిచరణోదకధౌతః। యద్యహం స్మృతధనఞ్జయసూతః కింకరిష్యతి స మే యమదూతః॥ ... ... ౨౯

టీక॥ అహం- నేను- దేవకీతనయపూజనపూతః- దేవకీతనయ- శ్రీకృష్ణమూర్తియొక్క- పూజన- పూజచేత- పూతః- పవిత్రుడను- పూతనారిచరణోదకధౌతః- పూతనారి- శ్రీకృష్ణమూర్తియొక్క- చరణోదక- పాదోదకముచేత- ధౌతః- పరిశుద్ధుడను- స్మృతధనంజయసూతః- స్మృత- స్మరియింపబడిన- ధనంజయ- అర్జునునియొక్క- సూతః- సారథియైన శ్రీకృష్ణస్వామిగలవాడను- యది- అయినట్టులయ్యేనేని - మే- నాకు- సః- ఆప్రసిద్ధుడయిన యమదూతః- యమభటుడు- కింకరిష్యతి- యేమిచేయగలడు. ... ... ... ... ❖

మ॥ సకలప్రార్థితదేవకీతనయపూజాపూతునిం బూతనాం। తకపాదాంబుజవారిధౌతుని మనోనాళీకహేళీభవ। త్ప్రకటాటోపకిరీటిసూతునివచోరాజీవరాజన్మకుం। దకథాన్వితు నిన్ను నాశమనదూతల్సేరగాజూతురె॥ ౨౯

తా॥ దేవకీతనూజపూజనంబుచే బవిత్రుండనై పూతనాంతకుండగు శ్రీకృష్ణునిపాదోదకంబున బరిశుద్ధుండనై యెల్లప్పుడును బార్థసారథియైనకృష్ణుని స్మరించుచుండుననుయమభటు లేమిచేయగలండనుట. ... ... ❖

శ్లో॥ భాసతాం భవభయైకభేషజం మానసే మమ ముహుర్ముహుర్ముహుః। గోపవేషముపసేదుషస్స్వయం యా పికాపి రమణీయతా విభోః॥ 30

టీక॥ భవభయైకభేషజం- భవభయ- సంసారభయమునకు- ఏక- ముఖ్యమైన- భేషజ- ఔషధమైన- గోపవేషం గోపాలవేషమును- స్వయం- తాను- ఉపసేదుషః- పొందిన- విభోః- శ్రీకృష్ణమూర్తియొక్క- యాపికాపి- అనిర్వాచ్యమైన- రమ

ణీయతా॰ సౌందర్యము- మమ-నాయొక్క-మానసే-మనంబునందు-ముహుర్ము హుర్ముహుః-మాటిమాటికిని-భాసతామ్-ప్రకాశించుంగాక. ... ◆

చ॥ భవభయభేషజంబు శ్రుతిభావ్యము నైతగుగోపవేషము। త్సవముసబూనినట్టిహరిసర్వమనోహరదివ్యరూపమై। భవముమదీయభావమున భాసిలుగాత నిరంతరంబుమా। ఘనసుమణీతృణీకరణకౌశలపేశలతేజమొప్పఁగ॥ ౩౦

తా॥ సంసారభయంబనురోగంబునకు ముఖ్యౌషధంబగుగోపవేషంబుధ నంతటనంగీకరించినశ్రీకృష్ణమూర్తియొక్క యనిర్వాచ్యమైనసౌందర్యంబునా మనంబునఁబ్రకాశించుంగాకయనుట. ... ... ... ◆

శ్లో॥ కర్ణలమ్బితకదమ్బమఞ్జరీకేసరారుణకపోలమణ్డలమ్। నిర్మలంనిగమవాగగోచరంనీలిమానమవలోకయామహే॥ ... ... ... ౩౧

టీక॥ కర్ణలమ్బితకదమ్బమంజరీకేసరారుణకపోలమండలం- కర్ణ- శ్రోత్రములయందు-లంబిత-వ్రేలుచున్న-కదంబమంజరీ-కడిమిపూగుత్తులయొక్క-కేసర-కింజల్కములచేత- అరుణ-ఎఱ్ఱనైన-కపోల-గండస్థలములయొక్క-మండలం-ప్రదేశము గలవాఁడును-నిర్మలం పరిశుద్ధుఁడైనవాఁడును-నిగమవాగగోచరం-నిగమవాక్- వేదాంతవాక్యములకు- అగోచరం- విషయుఁడుగానివాఁడునునగు-నీలిమానం-నీలవర్ణుఁడగుకృష్ణుని - అవలోకయామహే- చూచుచున్నాము. ... ◆

ఈశ్లోకార్థంబు గోపాలమంత్రరాజముయొక్క మోక్షోపయోగప్రయోగంబందలి ధ్యానంబని గోపాలకల్పంబున జెప్పంబడియున్నది.

శ్లో॥ నీలోత్పలదళశ్యామంపీతవాససమచ్యుతమ్। శుద్ధస్ఫటికసఙ్కాశమథవాపురుషోత్తమమ్॥ ధ్యాత్వానిత్యంజపేన్మన్త్రం మోక్షార్థీత్రిసహస్రకమ్॥ . ◆

మ॥ చెవులఁ బ్రేలుకదంబమంజరులచేజిన్నారి చెక్కుల్జ్వల। న్నవసంధ్యారుణితాభ్రకాంతి జెలువందన్మందహాసప్రభా। లవముస్వచ్ఛలతళ్కుఁ జూపమృదులాలంకారుఁడై వేదసం। స్తవనాగోచరుఁడైనశౌరియసితచ్ఛాయన్విలోకింతుఁగ॥ ◆

తా॥ చెవులనువ్రేలుకడిమిపూవుగుత్తులకాంతిచేఁ గెంపగుచెక్కిళులుగలిగిపరిశుద్ధుండై వేదాంతగోచరుండై వెలయు శ్రీకృష్ణమూర్తిం జూచుచున్నాననుట.

శ్లో॥ సాచిసంచలితలోచనోత్పలంసాచికుఞ్చితకోమలాధరమ్। వేగవల్గితకరాంగుళీముఖంవేణునాదరసికంభజామహే॥ ... ... ౩౨

టీక॥ సాచిసంచలితలోచనోత్పలం- సాచి-అడ్డముగను-సంచలిత-చలింపఁజేయఁబడిన-లోచనోత్పలం-కలువలవంటికన్నులుగలవాఁడును-సాచికుఞ్చితకో

మోహాధరం- స్వామి- సగము-కుట్మలిత- మోడ్పబడిన కోమల-మృదువగు-అధరం- మోవిగలవాడును- వేగవల్గితకరాంగుళీముఖం- వేగ-త్వరయగునటుల-వల్గిత-సారెకునెత్తబడిన-కర-హస్తముయొక్క-అంగుళీముఖం-అంగుళాగ్రములుగలవాడునగు - వేణునాదరసికం- వేణునాద- వేణుగానముయొక్క-రసికం-సారగ్రాహియైనకృష్ణుని-భజామహే-సేవించుచున్నాను. ... ... ◈

చ॥ నిరతమునంఘ్రిమూర్పడగనిల్పియొయారపుటోరచూపుతోఁ। దరళవిలోచనంబునుముదంబలరన్ దరహాసచంద్రిక। ల్మురువగుముద్దుమోవినరమోడ్పజెలంగకరాంగుళీతతి। న్మురళినటింపజేయుసతిమోహనగానధురీణుగొల్చెదన్॥ ◈

తా ॥ ఓరగాజేయబడినకన్నులుచలించుచుండనరమోడ్చిన కోమలాధరంబువెలయవేగంబునవేణురంధ్రంబులగప్పుచువిప్పుచుంజెలంగువేణునాదరసగ్రాహియైనశ్రీకృష్ణమూర్తిని సేవించుచున్నాననుట ◈

శ్లో ॥ స్యన్దనేగరుడమణ్డితధ్వజే కుణ్డినేశతనయాధిరోపితా । కేనచిన్నవతమాలపల్లవశ్యామలేనపురుషేణనీయతే॥ ... ... ... ౩౩

టీక॥ కుణ్డినేశతయా- కుణ్డిన-కుండినపట్టణమునకు-ఈశ-ప్రభువైనభీష్మునియొక్క-తనయా-కూతురయినరుక్మిణీదేవి-గరుడమండితధ్వజే-గరుడ-గరుడునిచేత-మండిత- ప్రకాశించుచున్న- ధ్వజే- టెక్కెముగలిగిన-స్యన్దనే రథమందు-నవతమాలపల్లవశ్యామలేన- నవ-నూతనమైన-తమాలపల్లవ-నల్లకానుగచిగురువలె-శ్యామలేన-నీలవర్ణుండైన- కేనచిత్పురుషేన-ఒకానొకపురుషునిచేతననగాగృష్ణునిచేత- అధిరోపిత-అధిరోహింపబడినదియై-నీయతే-తీసుకొనిపోబడుచున్నది ◈

మ॥ కదనోర్వీశిశుపాలమాగధవిపత్తుల్మాతలాధీశదో। ర్మదనిర్భేదవినోదమొప్పగగరుత్మత్కేతుభాస్వద్రథా। స్పదపీఠంబునరుక్మిణీరమణిసిశ్శంకస్థితిం దెచ్చెనే। విదితుండట్టితమాలనీలపురుషున్విశ్వంభరుంగొల్చెదన్॥ ... ౩౩

తా ॥ కానుగుచిగురుంబోలెశ్యామలవర్ణంబగుశరీరంబుగలయొకానొకండైనపురుషుండు అనగాశ్రీకృష్ణుండుగరుడధ్వజంబుచేప్రకాశించురథంబునరుక్మిణీదేవినెక్కించికొనిపోవుచున్నాడనుట ... ... ... ◈

శ్లో॥ మాయాతపాన్థాఃపథిభీమరథ్యాదిగమ్బరఃకోపితమాలనీలః। విన్యస్తహస్తోపినితమ్బబిమ్బేధూర్తస్సమాకర్షతిచిత్తవిత్తమ్॥ ... ... ౩౪

టీక। హేపాన్థాః-ఓపథికులారా-భీమరథ్యాః-భీమరథియనునదియొక్క-పథి-

మార్గమందు. మాయాత. రాకుండుడు. తమాలనీలః. తమాల. నల్లకానుగువలెనీలః. నల్లనయినవాడును. దిగమ్బరః. దిగంబరుడయినవాడును. కోపి. ఒకానొకడైన. ధూర్తః. ధూర్తుడు. నితంబబింబే. కటిప్రదేశవిశేషమందు. విన్యస్తహస్తః. ఉంచబడిన. హస్తోపి. హస్తముగలవాడైనను. చిత్తవిత్తం. చిత్తమనియెడి. విత్తం. ధనమును. సమాకర్షతి. లెస్సగాగ్రహించుచున్నాడు.

చ॥ పథికులుపోకుఁడచ్చటికిఁబల్మఱుఁభీమరథీపథంబునం। బృథులతమాలమేచకశరీరుఁడొకండుదిగంబరాకృతిం। బ్రథితకటీతటీఘటితపాణితలుండయిప్రోష్మిషన్మనో। రథుఁడయిచిత్తవిత్తమునిరంతరము౯హరియించుధూర్తుఁడై॥ ౭౪

తా॥ ఓపథికులారా భీమరథీనదీమార్గంబున రాకుండుండేమనిన దిగంబరుండును దమాలనీలుండునునగు పురుషుండు నితంబప్రదేశంబునగరంబులునిడికొనియుండియునుధూర్తుండయిచిత్తవిత్తంబు నపహరించుంగానదత్ప్రదేశంబునకు రాకుండుడనుట ... .. .. ... ...

## రాసక్రీడాష్టకము

శ్లో॥ అఙ్గనామఙ్గనామన్తరేమాధవోమాధవంమాధవంచాన్తరేణాఙ్గనా।
ఇత్థమాకల్పితేమణ్డలేమధ్యగస్సఞ్జగౌవేణునాదేవకీనన్దనః॥ ...

టీక॥ అంగనామంగనాం. అంగనలయొక్క. అన్తరే మధ్యమందు. మాధవః. శ్రీకృష్ణమూర్తియును. మాధవంమాధవం. పుండరీకాక్షుపుండరీకాక్షులయొక్క. అంతరేణ. మధ్యమున. అంగనాచ. స్త్రీయును ఇత్థం. ఈప్రకారముగా. ఆకల్పితే. కల్పింపబడిన. మండలే. సమూహమందు. దేవకీనందనః. శ్రీకృష్ణమూర్తి. మధ్యగః. మధ్యధ్వనినిబొందినవాడగుచు. వేణునా. పిల్లనగ్రోవిచేత. సంజగౌ. లెస్సగాగానముజేసెను. ... .. ... .. ...

గ్రంథకర్తయీపద్యము మొదటలేసిమిది పద్యములవఱకుశ్రీకృష్ణునిరాసక్రీడలనువర్ణించిచెప్పుచున్నాడు. ..........................

చ॥ ఇరుదెసఁదానునిల్చితనకింతులుపార్శ్వములన్వసి వఁగాఁగరములుగంరపాళిఁజేలగ౯బలభిన్మణివిద్రుమంబుల౯గ్రుసనొనరించినట్లుసరసస్థితిమండలమధ్యవర్తియై। మురళిరవంబునరాజిలఁగుమోహనమూర్తి౯మురారిగొల్చెద౯॥

తా॥ ఇరుదెసలందానునుదనకిరుగడలనింతులు నిల్వనీతెఱంగునఁగల్పింపఁబడినమండలంబునగృష్ణుండుమధ్యమనియెడిధ్వనివిశేషమునాశ్రయించిపిల్లనగ్రోవిచేమిక్కిలియుగానంబుచేసెననుట॥ ... ... ...

శ్లో॥ కేకికేకాదృతానేకపంకేరుహాలీనహంసావళీ హృద్యతాహృద్యతా।

కంసవంశాటవీదాహదావానలస్సంజగౌ వేణునా దేవకీనందనః॥ ౩౬

టీక॥ కేకికేకాదృతానేకపంకేరుహాలీనహంసావళీహృద్యతాహృద్యతా। - నెమళులయొక్క. కేకా- ధ్వనివిశేషములయొక్క - ఆదృత- ఆదరించుట చేత- అనేక- అనేకములయిన- పంకేరుహ- కమలములనుండి- ఆలీన - లేచుచున్న- హంస- అంచలయొక్క - ఆవళి - పఙ్క్తులకు- హృద్యతా - సంతోషమును- ఆహృద్యతా- సంపాదించుచున్న- వేణునా- పిల్లనగ్రోవిచేత- కంసవంశాటవీదాహదావానలః- కంసవంశ - కంసకులమనియెడి - అటవీ. అడవియొక్క - దాహ- కాల్చుటయందు- దావానలః - వనవహ్నియైన- దేవకీనందనః- శ్రీకృష్ణమూర్తి- సంజగౌ- లెస్సగా గానముచేసెను- ... ... ◆

మ॥ తనుకాంతుల్ జలదంబటంచు శిఖిసంతానంబుఁ గేకాస్వనం। బునుమీన్నినియంచపిండులలితాంభోజాళిలోనుండిచ। య్యనలేవక భ్రమమూన్పసంతసముచేయంజాలువంశీమృదు। స్వనముంగాంచిన కంసవంశదహనజ్వాలిక్హరింగొల్చెదన్॥ ... ... ... ... ... ౩౬

తా॥ నెమ్మినిచాయందిలకించిమొగులనుచుంజెలంగునెమళుల కేకారావంబులవిని నయంతనవానతటి దొరకొనియె ననుతలంపునఁ దామరపిండుననుండి లేవనుంకించు నంచలకిదిమేఘంబుగాదుకృష్ణుండని తెలియంజేసి సంతసంబునాపాదించుపిల్లనఁగ్రోవిచేఁగంసుని కులంబనునడవికిఁ గార్చిచ్చగు శ్రీకృష్ణమూర్తి గానంబుచేసెననుట- ... ... ... ... ◆

శ్లో॥ క్వాపివీణాభిరారావిణాకమ్పితఃక్వాపివీణాభిరాకింకిణీ నర్తితః।
క్వాపివీణాభిరామాంతరంగాపితస్సంజగౌ వేణునా దేవకీనందనః॥ ౩౭

టీక॥ దేవకీనందనః- శ్రీకృష్ణమూర్తి- క్వాపి- ఒకచోటను- వీణాభిః-వీణలచేత- ఆరావిణా- గానవంతుఁడైనవానిచే- కంపితః- నాట్యము నొందింపఁబడినవాఁడగుచు- వేణునా- పిల్లనఁగ్రోవిచే- సంజగౌ - గానముచేసెను - క్వాపి ఒకచోట- వీణాభిరాకింకిణీనర్తితః- వీణాభిరా- వీణానుగుణ్యధ్వనిచేయుచున్న - కింకిణీ- చిఱుగంటలతోడ- నర్తితః -నర్తనముఁబొందింపఁబడినవాఁడగుచు- సంజగౌ- గానముచేసెను- క్వాపి- ఒకచోట- వీణాభిరామాంతరం-వీణా- వీణయొక్క - అభిరామ- మనోహరములయిన- అంతరం-గానవిశేషములుగలుగునట్టులుగా- గాపితః- గానముబొందింపఁబడినవాఁడగుచు- సంజగౌ- గానముచేసెను- ... ... ... ... ... ◆

మ॥ ఒకచో గాణలు మీటువీణె యలతుల యుక్తంబుగానాడువే। లొక

చోఁ వీణెకుఁ యశ్రాంతముఁ యొనరఁ జేయుంగింకిణీనాదమొం। డొకచో వీణెయతోఁడ బాఁడుజతగా నుత్సాహియై యట్టిసం। దడుమాంరాగ్రణి వేణునాదమునరస్వ తీజాల్లేనుల్లాసియై॥ ... ... ... -- ... ❖

తా॥ ఒకచోట గానవంతులు మీటువీణెయలరవంబులకుఁ దగునటులనా డుచు వేఱొకచోటవీణారవంబుగలసి మెలయునటులఁజిఱుగంటలుమ్రోయించు చునొకచోవీణాధ్వనివిశేషంబులకుందోడుగఁబాడుచు దేవకీసుతుండగు శ్రీకృష్ణ మూర్తి వేణువుచే గానంబుచేసెననుట. ... -- ... ❖

శ్లో॥ చారుచంద్రావళీలోచనైశ్చుమ్బితో గోపగోబృంద గోపాలికావల్ల భః। వల్లవీబృందబృందారకః కామకస్సంజగౌ వేణునా దేవకీనందనః॥ ౩౮

టీక॥ చారుచంద్రావళీలోచనైః- చారుచంద్రా-సుందరములయినభూష ణములుగలగోపికలయొక్క-ఆవళీ- పఙ్క్తు-లయొక్క -లోచనైః-నేత్రములచే త - చుంబితః- చుంబడబడుచున్నవాఁడును- గోపగోబృందగోపాలికావల్లభః. గోప- గోపాలకులయు- గో గోవులయు బృంద సమూహమునకును గోపాలి కా- స్త్రీలకును- వల్లభః. ప్రభుండైనవాఁడును-వల్లవీబృందబృందారకః-వల్లవీ బృంద- గోపికాసమూహములకు- బృందారకః దైవతమైనవాఁడును-కాము కః- గోపికాకాముకుఁడునైన- దేవకీనందనః-కృష్ణమూర్తి- వేణునా-పిల్లనఁగ్రో విచే - సంజగౌ - గానముచేసెను. ... ... ... ❖

ఉ॥ క్రేఁవులు గోపదంపతులు గేవలస్త్రీజనపసన్నరో। రూపముగల్గుస్త్రీ తలుమరుల్గొన క్రీడయొనర్చునలక్ష్యతో। స్వాపదభూషలోచనలుసాధముగం దిలకించిచూడగా। గోపకుమారుఁడొప్పెనగుంభితవేణునినాదలోలుఁడై॥ ❖

తా॥ సుందరంబులగు భూషణంబులుధరించిన గోపస్త్రీల నేత్రంబులచే జూడంబడుచు గోపికాసమూహంబులకుదైవతంబై గోపస్త్రీకాముకుండై గోపాలగోపికాగోసమూహంబులకు నాథుండై వెలయుగోపాలదేవుండు వే ణువుచే గానంబుచేసెననుట. ... .. ... ... ❖

శ్లో॥ మౌళిమాలామిళన్మత్తభృంగీలతాభీతభీత ప్రియావిభ్రమాలింగితః। స్రస్తగోపీకుచాభోగసమ్మీళితస్సంజగౌ వేణునా దేవకీనందనః॥ ... ౩౯

టీక॥ దేవకీనందనః- శ్రీకృష్ణమూర్తి మౌళిమాలామిళన్మత్తభృంగీలతాభీతభీత ప్రియావిభ్రమాలింగితః- మౌళి-సిగయందునుండిన-మాలా-పుష్పమాలికయందు- మిళిత-కూడుకొన్న-మత్తభృంగీలతా-తీఁగయలవంటిమెలఁజేటిబోఁటులవలన-భీ తభీత- భీతసదృశలయిన- ప్రియా-ప్రియురాండ్రచే-విభ్రమ-విలాసముతో గూడు

శ్లోన్నటుల-ఆలింగితః-కౌఁగిలింపఁబడినవాఁడగుచు-స్రస్తగోపీకుచాభోగసమ్మేళితః- స్రస్త- జారుచున్న వస్త్రములుగలిగిన-గోపీ-గోపికలయొక్క-కుచ-స్తనములయొక్క-ఆభోగ-పరిపూర్ణతచే-సమ్మేళితః-ఆలింగనము చేయఁబడినవాఁడగుచు- వేణునా-పిల్లనఁగ్రోవిచేత-సంజగౌ-గానముచేసెను. ... ❖

ఉ॥ మాళితటీఘటించినసుమమ్ములవెంబడివచ్చుభృంగిరా। జీలలితధ్వనింగలఁగి చేలము లూడఁగఁ గౌఁగిలించు గో। పాలకభీరుకోటికుచభారమురమ్మున నానురసక్తి। లాసమానమానసవిలాసుని వేణువినోదుఁ గాంచెదన్॥ ❖

తా॥ సిగలయందలంకరింపఁబడిన యలరులసరంబులపై ముసరు తేఁటి మ్రోతలకళికి చేలంబులూడగముతై కౌఁగిలించు గొల్లమెఱుంగుబోండ్ల పాలిండ్ల రాయిడిగడుసుమీఁఁసిద్ధంపు పెదచేఁ జెలువొందుచు వేణుగానంబు చేయు గోపాలదేవునిం గాంచెదననుట. ... ... ... ... ❖

శ్లో॥ చారుచామీకరాభాసభామావిభుర్వైజయంతీలతావాసితోరస్స్థలః।
నందబృందావనేవాసితామధ్యగస్సంజగౌ వేణునా దేవకీనందనః॥ ... ౪౦॥

టీక॥ చారుచామీకరాభాసభామావిభుః-చారు-సుందరమయిన-చామీకర-బంగారుయొక్క- ఆభాస- కాంతివంటికాంతిగలిగిన- మా- లక్ష్మీదేవికి-విభుః-ప్రభుఁడైనవాఁడును- వైజయంతీలతావాసితోరస్స్థలః- వైజయంతీలతా-తీవియవంటి వైజయంతియను వనమాలికచేత-వాసిత-పరిమళించుచున్న-ఉరస్స్థలః వక్షస్స్థలముగల-దేవకీనందనః- శ్రీకృష్ణమూర్తి-నందబృందావనేవాసితామధ్యగః- నంద- నందునియొక్క- బృందావనే-బృందావనమనువనమందు-వాసితా-నివసించెడిగోపికలయొక్క-మధ్యగః-మధ్యదేశమునుఁ బొందినవాఁడగుచు-వేణునా - పిల్లనఁగ్రోవిచేత- సంజగౌ- గానముచేసెను. ... ... ❖

మ॥ జతలై బంగరుతీఁగెజాలుసదలించంజాలు బృందావనాం। చితబిబ్బోకవతుల్యాసగములన్ సేవించి రాసక్రియా। చతురత్వంబున వైజయంతినటియించన్వే ణుగానస్వనా। మృతరాధాపతిమంజెలంగుహరి నెమ్మిం బ్రోచుమమ్మెప్పుడున్॥

తా॥ పుటపాకశోభితంబగు సువర్ణనిభంబగు శరీరకాంతిచేఁ దేజరిల్లునిందిరకు విభుఁడును వైజయంతియనియెడు వనమాలికచేఁ బరిమళించు నెదగలుగువాఁడునగు శ్రీకృష్ణమూర్తి బృందావన నివాసినులగు గోపికలమధ్యంబునం జేరి వేణుగానంబు చేసెననుట. ... ... ... ... ❖

శ్లో॥ బాలికాతాళికాతాలలీలాలయాసంగసందర్శితభ్రూలతావిభ్రమః

గోపికాగీతదత్తావధానస్స్వయంసంజగౌ వేణునా దేవకీనందనః॥ ... ❖

టీక॥ బాలికా తాళికా తాళలీలాలయాసంగసందర్శితభ్రూలతావిభ్రమః. బాలికా- గోపాలబాలికలనియెడి- తాళికా- తాళిక త్రియులయొక్క- తాళలీలా- తాళక్రియయొక్క- లయ- న్యూనాధికరాహిత్యముయొక్క- ఆసంగ- ఉద్యోగమందు- సందర్శిత- చూపఁబడిన- భ్రూలతా- తీఁగెవంటికనుబొమలయొక్క- విభ్రమః- విలాసములుగల- దేవకీనందనః- శ్రీకృష్ణమూర్తి- స్వయం- తాను- గోపికాగీతదత్తావధానః- గోపికా- గోపికలయొక్క- గీత- గానమందు- దత్త- ఉంచఁబడిన- అవధానః- తత్పరత్వముగలవాఁడగుచు- వేణునా- వేణువుచేత- సంజగౌ- గానముచేసెను. ❀

ఉ॥ తాళములుగ్గడించు పసి తాకర తాళ లయానుభావిత। భ్రూలతసాంకృపల్లవసరోజముఖీమృదుగాన వైఖరిన్। దాఁ బ్రియమెచ్చి వించుచును ధ్యానముమీఱఁగ వేణుపాణి దైయిలాలితగాన వైభవకళాసిప్రాణుం జగునా గోపికల్॥ ❀

తా॥ తాళంబులనుగ్గడించు గోపబాలికాకరతాళంబుల లయను భ్రూలీలల చే మెచ్చుచు గోపికల సంగీతంబులఁ దత్పరంబగు మనంబు గలిగి గోపాలదేవుండు వేణువుచేఁ గానంబుఁ జేసెననుట. ... ... ... ... ❖

శ్లో॥ పారిజాతం సముద్ధృత్య రాధామాధవయో రూపయామాస భాస గుణైః।
రంగణే। శీతశీతే వటే యా- మునీయే తటే సంజగౌ వేణునా దేవకీనందనః॥ ౮౨

టీక॥ దేవకీనందనః- శ్రీకృష్ణమూర్తి- రాధామాధవయోః రూపయా- రాధాదేవిఁగు వయువసౌష్ఠవమువంటి యౌవనపుసౌష్ఠవముగలిగిన యువతిస్త్రీ- గుణైః- సౌందర్యాదిగుణములచేత- మానభాసా- మా- లక్ష్మీదేవికి- సభాసా- సమానురాలయినయొకానొకయువతియొక్క- అంగణే- ముంగిలియందు- పారిజాతం- పారిజాతతరువును- సముద్ధృత్య- స్థాపించి- యామునీయే- యమునాసంబంధమయిన- తటే- గట్టునందు- శీతశీతే- శీతసదృశమయిన- వటే- భాండీరమనియెడి పేరుగలన్యగ్రోధవృక్షమందు - వేణునా - వేణువుచేత - సంజగౌ- గానముచేసెను. ... ... ... ... ... ❖

మ॥ రమతోడన్ సమమైన కాంతిగుణముల్ రాధావయోరూపవి। భ్రమముల్ గల్గినభామముంగిటను గల్పక్ష్మాజమున్నిల్పియు। య్యామునాసైకతమధ్యశీతలతలన్యగ్రోధపీఠిన్ ముదం। బమరన్ వేణువినోదనాదరతుఁడౌ నబ్జాక్షునీక్షించెదన్॥

తా॥ నిరుపమానకాంతిగుణంబులచేఁ బదాఱేండ్లప్రాయంబుచేఁ జెలఁగి ల్లునిందిరాదేవియుంబోని యొకానొకయువతిముంగిటం బారిజాతంబు నెలపు

క్రొల్విరియమునా తటంబునందుండు భాండీరవటతరువునీడయందు శ్రీకృష్ణమూ ర్తివేణుచే గానంబుచేసెననుట. ... ... ... ...

శ్లో ॥ అగ్రేదీర్ఘతరోఽయమర్జునతరుస్తస్యాగ్రతోవర్త్మనీ సాఘోషం సముపైతితత్పరిసరే దేశేకళిందాత్మజా । తస్యాస్తీరతమాలకాననతలేచక్రంగవాంఛాలయన్గోపః క్రీడతిదర్శయిష్యతి సఖేపంథానమవ్యాహతమ్॥ ౪౩

టీక ॥ ఈశ్లోకంబునకర్థంబులు రెండుగాన నీక్రింద వివరింపంబడుచున్నవి. హేసఖే - ఓయిసఖుఁడ. అగ్రే. ఎదుట. అయం. ఈకానంబడుచున్న. దీర్ఘతరః - మిక్కిలిపొడవయిన. అర్జునతరుః. కదంబవృక్షము. తస్య-ఆకదంబవరువుయొక్క - అగ్రతః. ముందరను. వర్త్మని. కాలిత్రోవ. సా. ఆకాలిత్రోవ. ఘోషం. గొల్లపల్లియను. సముపైతి. పొందుచున్నది. తత్పరిసరే. తత్.ఆవ్రేపల్లియయొక్క. పరిసరే. సమీపదేశమందు. కళిందాత్మజా. యమునానది.తస్యాః. ఆయమునానదియొక్క -తీరతమాలకాననతలే. తీర-గట్టునందు. తమాల.నల్లకానుగుచెట్లయొక్క -కానన-వనముయొక్క.తలే. ప్రదేశమందు.గవాం. గోవులయొక్క - చక్రం - సమూహమును. చారయన్. సంచరింపఁజేయుచు. గోపః - గోపాలుఁడు. క్రీడతి. విహరించుచున్నాఁడు - సః. ఆగోపాలుఁడు. అవ్యాహతం. అక్షతమైన. పంథానం. మార్గమును. త్వాం. నినుఁగూర్చి. దర్శయిష్యతి - చూపించుచున్నాఁడు (రెండవయర్థంబు) హేసఖే - ఓమిత్రుఁడా. అగ్రే. రథాగ్రమందు. దీర్ఘతరః - మహోన్నతుఁడైనవాఁడును. అయం. ఈప్రసిద్ధుఁడయిన. అర్జునతరుః - తరువువంటియర్జునుఁడు. తస్య. ఆయర్జునునియొక్క - అగ్రతః. ముందర. వర్త్మని. ఉపదేశమార్గము.సా. ఆమార్గము. ఘోషం. ఉపనిషత్తును. సముపైతి - పొందుచున్నది - తత్పరిసరే - తత్ - ఆయుపనిషత్తుయొక్క - పరిసరే. సమీపమందు. కళిందాత్మజా. యమునానది. తస్యాః - ఆనదియొక్క - తీరతమాలకాననతలే. తీర- గట్టునందుండు. తమాలకాననతలే. తమాలకానన- కానుగయడవియొక్క - తలే.ప్రదేశమందు. గవాం - ఉపనిషద్వాక్యములయొక్క - చక్రం. సమూహమును. చారయన్. అధ్యయనముచేయించుచు. గోపః. శ్రీకృష్ణమూర్తి. క్రీడతి. విహరించుచున్నాడు. సః. ఆకృష్ణుఁడు. త్వాం. నినుఁగూర్చి. అవ్యాహతం. అక్షతమైన - పంథానం - మార్గమును - దర్శయిష్యతి - చూపించుచున్నాడు॥ ఈశ్లోకార్థంబుగోపాలకృష్ణసర్వకృత్తైకాతురీమంత్రధ్యానమని సనత్కుమారసంహితయందుఁజెప్పంబడియున్నది. ... ... ... ...

శ్లో॥ పార్థేదేశస్థాగితార్థంధ్యానముద్రాలసత్కరం। రథస్థంభావయన్ జప్త్వాదశలక్షమిమంమనుం। నోచిరాల్లభతేజ్ఞానంపరమైశ్వర్యదాయకమ్॥

మ॥ అదిగోముంగల పెద్దపుద్దియటపోనాచెంత వ్రేపల్లెయు న్నది యాదండం గళిందజాతటము సందాపింధ భూజాళినా। కదుపుల్మేపుచు గోపబాలకుండునికన్ బొప్పారంగాం జెల్వుస। త్పదవింబొమ్ము సఖాసుఖాస్పదముగా భావంబు రంజిల్లెడున్॥ ... ... ... ... ... ౪౩

తా॥ ఓయిమిత్రుండా నముముందం నొకయత్యున్నతంబగు నర్జునతరువు గలదుదానికిముందొకకాఁడొంకయున్నది యామాత్రోవ వ్రేపల్లియుంగూర్చిపొందుచున్నది యప్పల్లియపొంతయమునానదీతీరంబునంబొడవగు కానుగ యడవిలోపలనాలగుంపుల మేపుచునొక గోపాలుండున్నాఁడతం డవ్యాహతంబగు మార్గంబుఁజూపుననుట. ఈయర్థంబుగాకమఱియొకతాత్పర్యవిషయీభూతంబగు నర్థంబుగలదియెట్లనినొకండు సంసారారణ్యంబునంబడి పూర్వపాపంబులచే సంపాదింపఁబడిన మార్గవిశేషంబులచేఁ బోయిపోయి పరిభ్రమించుచు వెండియు సంసారగహనంబునఁబ్రవేశించియతిదుఃఖంబగు జీవితంబుఁగూర్చి బెగడు నొకనికిం జెప్పునలవిగానిసన్మార్గంబునుపదేశించువానిం జూపుచున్నాఁడు॥ ఓయిమిత్రుండా ముందర రథాగ్రంబునం బ్రసిద్ధుండై మహోన్నతుండై బంధులంజంపఁబోవుకతంబునం బొడమిన దుఃఖంబునందరువుంబోలె జడుండైనయర్జునుండున్నాఁడతనిముందట నుపదేశమార్గంబున్నదియయ్యుపదేశమార్గంబుశబ్దప్రధానంబగునుపనిషత్తుంబొందుచున్నదియప్పట్టున యమునా తీరంబునంబుట్టినతమాల కాంతారంబుఁబోసి కాంతిపుంజంబుండునుత్తలంబున నుపనిషద్వాక్యంబులం జెప్పుచు శ్రీకృష్ణదేవుఁడు విహరించుచున్నాఁడతం డవ్యాహతంబగుమార్గంబుంజూపించుననుట. ... ... ... ... ❁

శ్లో॥ గోధూళిధూసరితకోమలగోపవేషం గోపాలబాలకశతైరనుగమ్యమానమ్। సాయంతనే ప్రతిగృహం పశుబంధనార్థం గచ్ఛంతమచ్యుతశిశుం ప్రణతోస్మి నిత్యమ్॥ ... ... ... ... ... ౪౪

టీక॥ గోధూళిధూసరితకోమలగోపవేషం. గోధూళి- గోసమ్మర్దము వలనఁబుట్టినపరాగముచే. ధూసరిత - ధూసరవర్ణముగలదిగాఁ జేయఁబడిన- కోమల- మృదువైన-గోపవేషం. గోపాలవేషముగలవాఁడును- గోపాలబాలకశతైః - అనేకులగు గోపాలబాలురచే- అనుగమ్యమానం - అనుసరింపఁబడుచున్నవాఁడును - సాయంతనే - సాయంకాలమందు- పశుబంధనార్థం- ప

షు- ఆవులయొక్క - బంధనార్థం- కట్టివేయుటకొఱకు. ప్రతిగృహం- గృహగృహముంగూర్చి- గచ్ఛంతం - పోవుచున్న- అచ్యుతశిశుం-అచ్యుత- నారాయణుడనియెడి. శిశుం- బాలునిఁగూర్చి- ప్రణతః- నమ్రుఁడను - అస్మి-అయితిని- ❖

శా॥ గోపద్ధధూళిధూసరితకోమలవేషముతోడసంచెలం। గోపకశాబకాళితనకుంగయితోడుగనింటనింటనుం। గ్రేపులఁగట్టఁగాదిరుగుకృష్ణుని దామకరాభిశోభితుఁ। గోపకుమారునిందువడనున్మదనుంగనినయ్యఁగొల్చెదన్॥ ❖

తా॥ గోవులసమ్మర్దంబునంబొడమినధూళిచేధూసరవర్ణంబగు గోపాలవేషంబుగలిగిగోపాలబాలకసమూహంబులువెంటనంటి రాత్రేపల్లియం బ్రతిగృహంబునకుందిరుగుగోపాలకృష్ణునింగూర్చిప్రణతుండనై తిననుట. ❖

శ్లో॥ నిధింలావణ్యానాంనిఖిలజగదాశ్చర్యనిలయం నిజావాసం భాసాంనిరవధికశ్రేయసరసం। సుధాధారాసారంసుకృతపరిపాకంమృగదృశాంప్రపద్యేమాంగల్యంప్రథమమధిదైవంకృతధియామ్॥ ... .... ౮౫

టీక॥ లావణ్యానాం - కాంతివిశేషములకు - నిధిం - ఆకరమయినవాఁడును. నిఖిలజగదాశ్చర్యనిలయం- నిఖిల - సమస్తమయిన - జగత్- లోకములయొక్క -ఆశ్చర్య-ఆచ్చెరువులకు-నిలయం- ఇల్లయినవాఁడును. భాసాం- కాంతులకు- నిజావాసం-నిజ స్వకీయమైన- ఆవాసం- గృహమయినవాడును- సుధాధారాసారం- సుధా- అమృతముయొక్క - ధారాసారం - జడివైన వాఁడును. మృగదృశాం - యువతులకు - సుకృతపరిపాకం- సుకృత-అదృష్టముయొక్క -పరిపాకం- ఫలస్వరూపమైన వాఁడును - కృతధియాం - విద్వాంసులయొక్క - మాంగల్యం- శుభమయినవాఁడును - అధిదైవం - దైవమయినవాఁడును- నిరవధికశ్రేయసరసం-ఆనందరసస్వరూపుఁడైనవాఁడును- ప్రథమం- జగత్కారణుండునైనకృష్ణుని- ప్రపద్యే- సేవించుచున్నాను- ❖

ఉ॥ చక్కదనంబుప్రోవురుచిసంతతిఁబొల్చినతావులోకము। మ్మక్కననుండుదంటపికచాంబుజనేత్రజనోముపంటపెం। పెక్కుడుముక్తిధామమునీశులకాధిమధామమార్యస। వ్యక్కృతసౌధవర్గ మజహర్గమునై నమురారిగొల్చెదన్॥

తా॥ కాంతివిశేషంబులకునాకరంబై యెల్లలోకంబుల యచ్చెరువులకు నిల్లయినవాఁడునుగాంతులకుఁబుట్టినిల్లయి నిరవధికానందరసస్వరూపంబై యమృతంబుజడియైయెల్లయువతుల యదృష్టఫలస్వరూపంబై జ్ఞానవంతుల కధిష్ఠానదైవతంబై సర్వశుభంబులనిక్షేపంబయి యాద్యంబగుచు వెలయు శ్రీకృష్ణ పరబ్రహ్మంబుసేవించుచున్నాననుట. ... ... ... ... ❁

శ్లో॥ ఆతామ్రపాణికమలప్రణయప్రతోదమాలోలహారమణికుండలహేమసూత్రం। ఆవిశ్శ్రమామ్బుకణమమ్బుదనీలమవ్యాదాద్యంధనంజయరథాభరణంమహోనః॥ ... ... ... ... ... ౪౮

టీక॥ ఆతామ్రపాణికమలప్రణయప్రతోదం- ఆతామ్ర- అంతటనెఱ్ఱనైన- పాణికమల- హస్తకమలంబున- ప్రణయ- ప్రేమగలిగిన- ప్రతోదం - కశావిశేషముగలయదియు- ఆలోలహారమణికుండలహేమసూత్రం- ఆలోల - చలించుచున్న- హార- హారములును- మణి- మణివికారమయిన - కుండల- కుండలములును- హేమసూత్రం - బంగరుమొలనూలుగలిగినయదియు - ఆవిశ్శ్రమాంబుకణం- ఆవిః ప్రకాశించుచున్న - శ్రమాంబుకణం - శ్రమోదకబిందువులుగలదియును- అంబుదనీలం- అంబుద- మేఘమువలె:- నీలం - నల్లనైనయదియు - ధనంజయురథాభరణం. ధనంజయ-అర్జునునియొక్క -రథ - రథమునకు- ఆభరణం- భూషణమయిన- మహః- తేజము- నః- మమ్ము- అవ్యాత్ -రక్షించుగావుత.

ఉ॥ కెంజిగురాకు కేలందులకించు ప్రతోదముచేత నాజిధా। సంజయవాజిరాజిగమనక్రియయేర్పఱు పన్గాంగంబునం। గ్రాంజెమటూఱహారమణికుండలముల్చలియింపనొప్పిన। య్యంజననీలతేజమురథాభరణంబనయంబుం బ్రోవుత॥

తా॥ కెంజిగురుంబోనికరంబునం బ్రతోదంబుమెఱయ హారంబులు కుండలంబులు మొలనూలునుంజలియింప నెమ్మొగంబునం గ్రాంజెమ్మటలూఱ నీలమేఘంబుబోలె ధనంజయునియరదంబున వెలుంగు తేజంబునన్నుం బ్రోచుగావుతయనుట.

శ్లో॥ నఖనియమితకండూన్పాండవస్యందనాశ్వానను దినమభిషించన్నంజలిస్థైః పయోభిః। అవతువితతగాత్రస్తోత్రనిష్యూతమౌళిర్దశనవిధృతరశ్మిర్దేవకీపుణ్యరాశిః॥ ... ... ... ... ౪౯

టీక॥ దశనవిధృతరశ్మిః- దశన - దంతములచేత - విధృత - ధరియింపబడిన- రశ్మిః- పగ్గములుగలవాడును- తోత్రనిష్యూతమౌళిః- తోత్ర- మునికోలతోడ- నిష్యూత - కూర్పబడిన - మౌళిః - శిరముగలవాడును - వితతగాత్రః- వితత విస్తరింపజేయబడిన - గాత్రః - శరీరముగల వాడును - నఖనియమిత కండూన్ నఖ - గోళ్లచేత - నియమిత - నివురబడిన - కండూన్ - దురదగల- పాండవస్యందనాశ్వాన్ - పాండవ- అర్జునునియొక్క - స్యందన - రథముయొక్క- అశ్వాన్- గుఱ్ఱములను- అంజలిస్థైః - దోయిటనున్న - పయోభిః - ఉదకములచేత- అనుదినం- ప్రతిదినమును- అభిషించన్ - స్నానముచేయించుచున్నవా

**మునగు** - దేవకీపుణ్యరాశిః - దేవకీ- దేవకీదేవియొక్క - **పుణ్యరాశిః** - పుణ్య యంపుట్రోవగుకృష్ణుడు- అవతు- రక్షించుగాక- ... ... ◈

మ॥ తలతోత్రంబుధరించిపర్గములు దంతశ్రేణిగీలించియు। గ్గలికన్నేసిగడిం చిపార్థరథకంఖాణంబులన్దోయిటీ। న్జలమున్సల్లినఖాళిమై నివురుచున్ రక్షిం చునాదేవకీ। లలనాపుణ్యఫలంబునన్నగరుణాలంకారుగాజేయుతన్॥ ౪౭

తా॥దంతంబులచే బగ్గంబులధరియించి మునికోలశిరంబునం బెట్టికొనపెం పంబడిన నెమ్మేనుగలవాడగుచు నర్జునునరదంపుగుఱ్ఱంబుల మేనులనివురుచుం దోయిటనీటిచే వానింగడుగుచుననుదినంబునీక్రమంబునం జేయుచున్న దేవకీపుణ్య ఫలంబగుశ్రీకృష్ణమూర్తినన్నురక్షించుగాత. ... ... ◈

శ్లో॥వ్రజయువతిసహాయేయౌవనోల్లాసికాయేసకలశుభవిలాసేకున్దమన్దారహాసే నివసతుమమచిత్తంతత్పదాయత్తవృత్తంమునిసరసిజభానౌనన్దగోపాలసూనౌ॥

**టీక॥** వ్రజయువతిసహాయే- వ్రజ- వ్రేపల్లెయందలి- యువతి- జవ్వనులకు- **సహాయే**- సహాయుండైనవాడును - యౌవనోల్లాసికాయే - యౌవన - వయ స్సుచేత- ఉల్లాసి- ప్రకాశించుచున్న - కాయే- శరీరముగలవాడును- సకలశు భవిలాసే- సకల - సమస్తమైన - శుభ - శుభములయొక్క - విలాసే- లీలలుగ లవాడును- కుందమందారహాసే- కుంద - మొల్లలవంటి - మందార - మందార పుష్పములవంటి- హాసే - నగవుగలవాడును- మునిసరసిజభానౌ - ముని- మా నులనియెడి - సరసిజ- కమలములకు - భానౌ- సూర్యుడైన - నందగోపాల సూ నౌ. శ్రీకృష్ణమూర్తియందు - తత్పదాయత్తవృత్తం - తత్- ఆస్వామియొక్క- పత్- పాదములకు- ఆయత్త- ఆధీనమైన - వృత్తం - వ్యాపారముగల- మమ- నాయొక్క - చిత్తం- చిత్తము- నివసతు - ఉండుగావుత- ... ◈

చ॥ వ్రజయువతీసహాయునతిరాజితయౌవనకాయుమానిచిత్తజలజమిత్రు విశ్వజనతానుతిపాత్రుసునీల గాత్రుధో। యజదళనేత్రుకుందనిభ హాసుశుభైకద యావిలాసునిన్।సుజనహితుందదంఘ్రిగతిజొప్పడునామతినామతించెదన్॥౪౮

తా॥ గోపస్త్రీసహాయుండై జవ్వనంబుచే దేజరిల్లునెమ్మేనుగలిగి సకలశుభ విలాసంబులుగలిగి మొల్లవిరులంబోని చిరునగవునెమ్మొగంబునంగనుపట్టమాని కమలంబులకుమార్తాండుండగు శ్రీకృష్ణమూర్తియొక్క పాదంబులకధీనంబై నామనంబుండుంగాతయనుట. ... ... ... ... ◈

శ్లో॥ అరణ్యానీమార్ద్రస్మితమధురబిమ్బాధరసుధాసరణ్యాసఙ్క్రాన్తైస్స

పదిమదయన్వేణునినదైః। ధరణ్యాసానన్దోత్పులకముపగూఢాఙ్ఘ్రికమలశ్శర
ణ్యానామాద్యస్సజయతుశరీరీమధురిమా॥ .. .. ౪౯

టీక॥ ఆర్ద్రస్మితమధురబింబాధరసుధాసరణ్యా- ఆర్ద్ర- క్రొత్తలైన - స్మిత- చి
రునగవుచేత - మధుర - మనోజ్ఞమయిన - బింబాధర - దొండపండువంటియధ
రమందలి - సుధా - అమృతముయొక్క - సరణ్యా- ప్రవాహము చేత - సం
క్రాంతైః - సంక్రమించిన- వేణునినదైః - వేణునాదములచేత- సపది- తత్కా
లమందు- అరణ్యానీం- అరణ్యమును-మదయన్- మదముగలదిగాజేయుచున్న
యదియు- ధరణ్యా- భూమిచేత - సానందోత్పులకం - సంతోషపులకాంకు
రములతోగూడినటుల- ఉపగూఢాంఘ్రికమలః- ఉపగూఢ - ఆలింగనముచేయ
బడిన- అంఘ్రికమలః - పాదకమలములుగలయదియు-శరణ్యానాం- రతుకము
లలోపల- ఆద్యః- మొదటిదైనయదియు- శరీరీ శరీరముగలిగిన - సః- ఆప్రసిద్ధ
మయిన- మధురిమా- సౌందర్యము- జయతు - సర్వోత్కృష్టముగావర్తించును-

మ॥ స్మితబింబాధరమాధురీకలితవంశీనాథమోదంబుచే। నతివిస్ఫూర్తినిగాన
నంబలరబాదాంభోజసంస్తుతిచే।క్షితిరోమాంచముగాంచెనోయనిపెత్తొంపం
బ్రవర్తించున। చ్యుతుడువ్యన్మధురాభిరూప్యమునసర్వోత్కృష్టుడై వర్తిలున్॥

తా॥ క్రొత్తయగుచిఱునగవుచేమనోహరంబగునధరబింబంబందలియమృ
తప్రవాహంబునబొడమిన వేణునినాదంబులచేనరణ్యంబలరనానందంబునైన
గగ్గురుపాటుచేవెలయుపుడమితోడ గాఢాలింగనంబుచేయు పాదకమలంబులు
గలిగిరతుకంబులలోపలనాద్యంబయినప్రసిద్ధంబయిన శరీరవంతంబగు సౌంద
ర్యంబుసర్వోత్కృష్టముగావర్తించునుట- ... ... ❖

శ్లో॥ విదగ్ధగోపాలవిలాసినీనాంసంభోగచిహ్నాఙ్కితసర్వగాత్రమ్। పవి
త్రమామ్నాయగిరామగమ్యంబ్రహ్మప్రపద్యేనవనీతచోరమ్॥ ౫౦

టీక॥ విదగ్ధగోపాలవిలాసినీనాం - విదగ్ధ - సుందరులైన - గోపాలవిలాసి
నీనాం - గోపస్త్రీలయొక్క - సంభోగచిహ్నాంకితసర్వగాత్రం - సంభోగచి
హ్న- రతిచిహ్నములచేత- అంకిత - ముద్రింపబడిన - సర్వ- సమస్తమయిన-
గాత్రం - శరీరముగలయదియు- పవిత్రం - విమలమైన- ఆమ్నాయగిరాం- వే
దాంతవాక్యములకు- అగమ్యం- పొందనలవిగానిదైన - నవనీతచోరం- నవనీ
త- వెన్నను- చోరం- దొంగిలించుచున్న- బ్రహ్మం- పరబ్రహ్మమును- ప్రప
ద్యే- భజించుచున్నాను- ... ... ... ... ❖

మ॥ నవలావణ్యవిలాసినీనికరసానాబంధసంబంధసం । భవదర్ధాంకశరీరు విశ్వపరమామ్నాయాంతవాచోవిధే। యవిహారున్నవనీతచోరునిబవిత్రాచారసంచారుని। న్భవసాధారునిశాంతసారునిమదిం బూజింతునెల్లప్పుడున్॥ ౫౦

తా॥ సౌందర్యవంతులగుగోపాలస్త్రీలయొక్క సంభోగచిహ్నంబులచే నంకితంబగుశరీరంబుగలిగి నిత్యశుద్ధంబయి వేదంబులచే దెలియనగమ్యంబయ్యు నునవనీతచోరంబై వెలయుబ్రహ్మంబుభజించుచున్నాననుట.

శ్లో॥ అన్తర్గృహే కృష్ణమవేక్ష్య చోరం బద్ధ్వా కవాటం జననీం గతైకా। ఉలూఖలే దామనిబద్ధమేనం తత్రాపి దృష్ట్వా స్తిమితా బభూవ॥ ౫౧

టీక॥ ఏకా-ఒకగోపిక- అన్తర్గృహే - లోపలియింటను- చోరం- నవనీతాదిచోరకుడైన - కృష్ణం - శ్రీకృష్ణుని - అవేక్ష్య- చూచి - కవాటం - తలుపును- బద్ధ్వా- బంధించి - జననీం - తల్లినిగూర్చి- గతా సతి - పోయినదగుచును-ఉలూఖలే - రోటియందు- దామనిబద్ధం - దామ- త్రాటిచేత- నిబద్ధం - కట్టబడిన - ఏనం- ఈశ్రీకృష్ణుని- తత్రాపి- అక్కడను - దృష్ట్వా- చూచి- స్తిమితా- నిశ్చేష్టురాలు- బభూవ- ఆయెను- ... ... ...

చ॥ నిలయములోనొకర్తునవనీతహరున్ హరిఁ గాంచి గట్టిగా। దలుపుబిగించియకొ్కడుకుతల్లికిఁ దెల్పఁగఁబోయియందుఁ లూ । ఖలగుణబద్ధుఁడౌనతనిఁగన్గొనియాఱడివచ్చిరిత్తభా। నలుగనిసారెకేకలిడవర్తిలు నాబలుదంటఁగొల్చెదన్॥

తా॥ వ్రేపల్లియయందొకగోపికలోపలియింటవెన్నదొంగిలించుచున్న శ్రీకృష్ణదేవునింగాంచియయ్యింటితలుపుమూసియశోదాదేవికింజెప్పరానక్కడరోలంగట్టఁబడియుండు శ్రీకృష్ణునింగాంచియూరడిల్లియింటికి మగుడనేతెంచివెన్నతేనికుండనుంజూచి శ్రీకృష్ణునికృత్యంబునకు వెఱగువడిమెననుట.

శ్లో॥ రత్నస్థలే జానుచరః కుమారః సఙ్క్రాన్తమాత్మీయముఖారవిన్దమ్। ఆదాతుకామస్తదలాభఖేదాద్విలోక్య ధాత్రీవదనం రురోద॥ ౫౨

టీక॥ జానుచరః - జాను - మోకాళ్లచేత - చరః - సంచరించుచున్న - కుమారః- శ్రీకృష్ణమూర్తి - రత్నస్థలే - రత్నమయప్రదేశమందు- సంక్రాంతం- ప్రతిబింబించిన- ఆత్మీయముఖారవిందం- ఆత్మీయ - తనసంబంధమైన - ముఖారవిందం - ముఖకమలమును - ఆదాతుకామః - గ్రహింపనిచ్ఛయించినవాడగుచు- తదలాభఖేదాత్- తత్- ఆ- ముఖకమలముయొక్క - అలాభ - అప్రాప్తివలననైన - ఖేదాత్ - క్లేశమువలన - ధాత్రీవదనం- ధాత్రీ - దాదియొక్క -

వదనం- ముఖమును- విలోక్య- చూచి- రురోద- ఏడిచెను. ❖

మ॥ ఘనరత్నస్థగితావనిన్నిజముఖాకారంబు పద్మాకృతిం । గనుపట్టంగనినవ్వితద్గ్రహణకాంక్షుంజిన్నికేల్సాఁచిచే। రనిఖేదంబునజానుయానముదలిర్పన్ దాదినీక్షించికా। వనుచుంబోరెడునందనందనుని మాయాడింభకుంగొల్చెదన్॥

తా॥ జానువులచేస-చరించు శ్రీకృష్ణమూర్తి మణివికారంబగు పుడమిపై క్రీడించుచునక్కడ బ్రతిబింబించినతన మొగంబుకమలంబని గ్రహింపంబోయి రాకుండినఖేదంబున దాదిముఖంబుజూచిపోరిడెననుట. ... ... ❖

శ్లో॥ ఆనందేనయశోదయాసమదనంగోపాంగనాభిశ్చిరంసాశంకం వలవిద్విషాసకుసుమైస్సిద్ధైఃపృథివ్యాకులమ్ । సేర్ష్యంగోప కుమారకైస్సకరుణం పౌరైర్జనైస్సస్మితంయోదృష్టస్సపునాతునోమురరిపుః ప్రోత్క్షిప్తగో వర్ధనః॥

టీక॥ యశోదయా - యశోదాదేవిచేత- ఆనందేన - సంతోషముతోడను- గోపాంగనాభిః - గోపస్త్రీలచేతను - సమదనం - మన్మథునితోఁగూడుకొన్నటుల - వలవిద్విషా - దేవేంద్రుని చేత - చిరం - తడవుగా - సాశంకం - శంకతోఁగూడుకొన్నయటుల - సిద్ధైః - సిద్ధులచేత- సకుసుమైః - పుష్పములతోడ- పృథివ్యా- భూమిచేత- ఆకులం- వ్యాకులమగునటుల - గోపకుమారైః- గోపాలకుమారులచేత- సేర్ష్యం- ఈసుతోఁగూడుకొన్నటుల - సకరుణైః- దయతోఁగూడినయట్టియు - పౌరైః - పురసంబంధులైన - జనైః - జనులచేత- సస్మితం- చిఱునగవుతోఁగూడుకొన్నటుల- యః - ఎవఁడు- దృష్టః - చూడఁబడియెనో- ప్రోత్క్షిప్తగోవర్ధనః- ప్రోత్క్షిప్త- ఎత్తఁబడిన- గోవర్ధనః - గోవర్ధనపర్వతముగలిగిన - సః- ఆప్రసిద్ధుఁడైన - మురరిపుః- శ్రీకృష్ణమూర్తి - నః- మమ్ము - పునాతు - పవిత్రునిఁజేయుఁగావుత- ... -- ... ❖

చ॥ ముదముననందగోపికలు మోహమునన్ జనపాళినవ్వునం। త్రిదశవిభుండు సాధ్వసమతిన్విరివానలసిద్ధపుంగవుల్ । పొదలినయాకులత్వమునభూమియుగోపకుమారులేపునన్। సదయతబౌరులున్గనర సాధరమెత్తినచక్రిప్రోవుతన్॥

తా॥ యశోదచేనానందంబునను గోపస్త్రీలచే మన్మథోద్రేకంబునను నింద్రునిచే సందేహంబునను సిద్ధులచేనలరువానలం గరుణావంతులగు పౌరజనంబులచే నవ్వునంబుడమిచే నాకులంబున గోపకుమారులచే నీసునం జూడంబడుచు నెవ్వఁడు గోవర్ధనం బెత్తెనో యట్టి శ్రీకృష్ణమూర్తి ననుఁబవిత్రుని గాఁ జేయుఁగాతయనుట. ❖

శ్లో॥ ఉపాసతామాత్మవిదః పురాణాః పరం పరస్మాన్నిహితం గుహాయాం।
వయం యశోదాశిశుబాలలీలాకథాసుధాసింధుషు లీలయామః॥ ౫౪

టీక॥ పురాణాః - పూర్వీకులయిన. ఆత్మవిదః - జ్ఞానులు - గుహాయాం. గుహయనుహృదయమందు. నిహితం. ఉంచఁబడిన - పరస్మాత్ - పరమైన కన్నను. పరం. పరమయినతత్త్వమును - ఉపాసతాం - ఉపాసింపని - వయం. మేము. యశోదాశిశుబాలలీలాకథాసుధాసింధుషు. యశోదా - యశోదాదేవియొక్క - శిశు. బిడ్డఁడయిన శ్రీకృష్ణమూర్తియొక్క - బాలలీలా. బాలక్రీడా సంబంధములయిన. కథా. కథలనియెడి. సుధాసింధుషు - అమృతనదులయందు. లీలయామః. విహరించుచున్నాము. ... ... ... ❖

మ॥ దహరాకాశనివాసమౌ పరమునాత్మజ్ఞానులీక్షించుచు । త్యహముంగాంతురుగాఁ నేమలయశోదా బాలలీలాసుధా । లహరీవీచిపరంపరం గదిసికొల్లల్గాఁగ గ్రీడించుచు । న్నహహా ప్రౌఢిఁ జెలంగు డెందమున నానందంబు సంధించెదన్॥ ౫౪

తా॥ పురాతనులగు నాత్మవిదులు దహరాకాశంబునం బరతత్త్వంబునిలిపి యుపాసింతురుగాత నేమల్లయశోదాశిశుండగు శ్రీకృష్ణుని బాలక్రీడలకథలనియెడి యమృతమునదులయందు విహరించి యానందము నొందుచున్నామనుట.

శ్లో॥ విక్రేతుకామాకిల గోపకన్యా మురారిపాదార్పితచిత్తవృత్తిః । దధ్యాదికం మోహవశాదవోచద్గోవింద దామోదర మాధవేతి॥ ... ౫౫

టీక॥ దధ్యాదికం - పెరుగు మొదలగువాని - విక్రేతుకామా - విక్రయింప వలయుననునిచ్ఛ కలిగిన - గోపకన్యా. గోపకన్యక - మురారిపాదార్పితచిత్తవృత్తిః - మురారి. శ్రీకృష్ణమూర్తియొక్క - పాద. పాదములయందు. అర్పిత. సమర్పింపఁబడిన - చిత్తవృత్తిః - చిత్తవ్యాపారముగలిగినదియై - మోహవశాత్. మోహవశమువలన - గోవిందదామోదరమాధవేతి - గోవింద - గోవిందాయనియు - దామోదర. దామోదరాయనియు. మాధవేతి - మాధవాయనియు. అవోచత్కిల - పలికెనుగదా. ... ... ... ❖

మ॥ నవలావణ్యవిలాసినీతిలకమానందంబునన్నందసం । భవపాదార్పితచిత్తవృత్తి మరలింపన్నేరకన్వీటిలో । నవనీతాదికమమ్ముచో మఱపుఁ జెందం బౌరులం గాంచి మా । ధవ గోవింద ముకుంద కృష్ణ యనుచున్ద్యన్మోహవిభ్రాంతితోన్॥

తా॥ వ్రేపల్లియయందొక్క గోపయువతి పెరుగు మొదలగువాని నమ్మబోయి శ్రీకృష్ణుని పాదంబులయందుఁ జిక్కిన మనంబు మరలింప నేరక యత్యంతమో

హంబునందగిలి పెరుగు మొదలగువానినమ్ముచుతిరిది గోవిందా- దామోదరా- మాధవా- యనియెడు నామంబులనుగ్గడించుచుందిరిగెననుట- ... *

శ్లో॥ ఉలూఖలం వా యమినాం మనో వా గోపాఙ్గనానాం కుచకుట్మలం వా। మురారినామ్నః కలభస్య నూనమాలానమాసీత్త్రయమేవ భూమౌ॥ ౫౬

టీ॥ మురారినామ్నః - మురారి- శ్రీకృష్ణుడనియెడి- నామ్నః - పేరుగలిగిన - కలభస్య- గున్నయేనుగునకు- ఉలూఖలం వా- రోలైనను- యమినాం- మునులయొక్క -మనో వా- మనముయినను- గోపాఙ్గనానాం-గోపస్త్రీలయొక్క- కుచకుట్మలం వా - కుచకుట్మలమయిన - భూమౌ- భూమియందు- త్రయమేవ- మూడే- ఆలానం- కట్టుకంబము- ఆసీత్- ఆయెను- నూనం - నిశ్చయము- ❖

చ॥ మునిజనమానసాంబురుహముం బశుపాలకబాలికామణీ। స్తనవనజాతకోరకపితానను లూఖలముల్ మురారిమో। హనకలభంబు నిల్పుటకునై నిలనిల్చినకట్టుకంబముల్। దనరెడునొండురెండునిపిడక్కధరాస్థలిఁగల్గనేర్చునే॥ ౫౬

తా॥ మునిజనంబుల మానసంబును గోపస్త్రీల మొగ్గలవంటి చన్నులపిందు నురోలునునిప్పుడమియందుశ్రీకృష్ణుండను ముప్పదియేండ్లప్రాయంబుగలగజనంబునకునిమ్మాడుంగట్టుకంబంబులయ్యెనొండొక్కటిలేదయ్యెనిదినిక్కంబనుట-

శ్లో॥ కరారవిన్దేన పదారవిన్దం ముఖారవిన్దే వినివేశయన్తమ్। వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకున్దం మనసా స్మరామి॥ ... ౫౭

టీ॥ కరారవిన్దేన - హస్తకమలములచేత- పదారవిన్దం- పాదకమలమును- ముఖారవిన్దే- ముఖకమలమందు - వినివేశయన్తం - ఉంచుచున్నవాడును- వటస్య - వటవృక్షముయొక్క - పత్రస్య - పత్రముయొక్క - పుటే- పుటమందు- శయానం- నత్తమిల్లిన - బాలం - బాలుడైన- ముకున్దం- శ్రీకృష్ణుని- మనసా- మనస్సుచేత- స్మరామి- స్మరించుచున్నాను- ... ❖

శా॥ కేలుందామరచేఁబదాబ్జమెలమిం గీలించినెమ్మోమునై। పాళిన్నిల్పినపత్రవాళిమృదుశయ్యంబోల్పుచబ్బాలునిన్। లీలాలోలవిశాలలోచనునిలాలింబెట్టిలాలించుచున్। జోలల్పాడుయశోదభాగ్యమునకేజోహారుగావించెదన్॥

తా॥ కరకమలంబునంబాదకమలంబుముఖకమలంబుపైనిడికొనివటపత్రంబునంబవ్వళించిబాలుండైవెలుగుముకుందునిమనంబునస్మరించుచున్నాననుట- ❖

శ్లో॥ శమ్భో స్వాగతమాస్యతామితయితో వామేన పద్మాసన క్రౌఞ్చారే కుశలం సుఖం సురపతే విత్తేశ నో దృశ్యసే। ఇత్థం స్వప్నగతస్య కైటభజితః శ్రుత్వా

యశోదాగిరఃకింకింబాలకజల్పసీతిరచితస్థూధూకృతంపాతునః॥ ౫౮

టీక॥ హేశంభో - ఓయిశివుఁడా- స్వాగతం - కుశలమాయేమి - హేప ద్మాసన- ఓయిపితామహుఁడా- వామేన- వామహస్తముచేత - ఆగచ్ఛ- ర మ్ము- ఇతఇతః- ఈపార్శ్వమున-ఆ- స్యతాం-కూర్చుండఁదగినది- హేక్రౌం చారే- ఓయికుమారుఁడా- కుశలం - కుశలమాయేమి - హేసురపతే- ఓయి యింద్రుఁడా- సుఖం- సుఖమాయేమి- హేవిత్తేశ- ఓయికుబేరుఁడా- నోదృశ్య సే- చూడఁబడవేమి- ఇత్థం - ఈప్రకారముగా- స్వప్నగతస్య- కలగనుచున్న కైటభజితః- శ్రీకృష్ణమూర్తియొక్క - గిరః-వాక్యములను- యశోదా- యశో దాదేవి- శ్రుత్వా- విని- హేబాలక- ఓయిశ్రీకృష్ణా - కింకింజల్పసి - ఏమేమిమా టలాడితివి- ఇతి- ఇట్లని - రచితం- చేయఁబడిన- ధూధూకృతం - ధూధూకార ము- నః- మమ్ము- పాతు- రక్షించుఁగాత- ... ... ...

మ॥ హరరారమ్ముశుభంబెడావలను భాషాధీశ కూర్చుండుమా। వరణా మంబెకుమార యింద్రసుఖమే పౌలస్త్యవీక్షింపమే । సరణిన్నిన్నఁగా య శోదవినివత్సాయేమి యేమంచుని । ద్దురమబ్బానిన కృష్ణుపైనిడిన ధూధూకార ములొప్పి వుత్౯॥ ... ... ... ... ... ౫౮

తా॥ ఓయిశివుఁడానీకుఁగుశలంబె యోపితామహుఁడాయిటవచ్చి డావ లంగూర్చుండుమోకుమారస్వామీ నీకుభద్రంబెయోయింద్రానీకుసుఖంబెయో కుబేరుఁడానీవుసూడంబడవేమియనియీరీతింగలలోననుడువు శ్రీకృష్ణునియాలా పంబులవినియశోద యేమేమిరాబాలకాయ్యుఃవ్వధంబునం బలికెదవనుచుంజేయు ధూ్ధూకారంబుననుంబ్రోచుఁగావుత- ... ... ...

శ్లో॥ మాతఃకింయదునాథదేహిఛషకంకింతేనపాతుంపయ స్తన్నాస్త్యద్య కదాస్తివానిశిసశాకావాంధకారోదయే । ఆమీల్యాక్షియుగంనిశావ్యపగతా దేహీతిమాతుర్ముహుర్వక్షోజాంశుకకర్షణోద్యతకరఃకృష్ణస్సపుష్ణాతునః॥ ౫౯

టీక॥ కవి- ఈశ్లోకంబునయశోదాశ్రీకృష్ణులయుత్తర ప్రత్యుత్తరములఁజెప్పుచున్నాఁడు-

టీక॥ హేమాతః- ఓతల్లీ - హేయదునాథ- ఓశ్రీకృష్ణా - కిం- ఏమి- ఛష కిమ్ - పానపాత్రమును- దేహి- ఇమ్ము- తేన- అపానపాత్రముచే - కిం-ఏమి- పయః- పాలను- పాతుం- పానముచేయుకొఱకు - తత్- ఆక్షీరము- అద్య-ఇ ప్పుడు- నాస్తి - లేదు - కదా-వా- ఎప్పుడు- అస్తి- కలదు- నిశి- రాత్రియందు-

నిశా- రాత్రి- కాఽపి- ఏది- అంధకారోదయే- అంధకార - చీకటియొక్క - ఉదయే- ఉత్పత్తియందు- అక్షియుగం- కనుదోయిని- అమీల్య - మూసుకొని- నిశాపి - రాత్రియును- ఆగతా - వచ్చినది - చషకం- పానపాత్రమును- దేహీ తి- ఇమ్మని - ముహుః- సారెకును - మాతుః - తల్లియైనయశోదయొక్క - వక్షోజాంశుకకర్షణోద్యతకరః - వక్షోజాంశుక - పయ్యెదయొక్క - కర్షణ- లాగుటయందు- ఉద్యతకరః- ఉద్యత- ఉద్యుక్తమైన - కరః- హస్తముగల- సః- ఆప్రసిద్ధుడైన - కృష్ణః -శ్రీకృష్ణమూర్తి-నః-మమ్ము-పుష్ణాతు - పోషించుగావుత-

ఉ॥ అమ్మయిదేమిరాయదుకులాగ్రణిగిన్నెయొసంగుమేలపా। లిమ్మనఁగ ద్రావలేదివుడదెప్పుడు రేయదియెట్టిదంధకారమ్మగునన్న గన్మొగిచి రాతిగవచ్చె నువేఁగ బాలు తే। తెమ్మని తల్లి పైటఁ జేఁదీయ్యు ముకుందుఁడు నన్ను బోవుతన్॥ ౫౯

తా॥ ఓతల్లీయోయదుకులనాథా యేమిరా యనినఁ బాలపాత్రము నిమ్మనిన దానిచే నేమనిన బాలు ద్రావననినఁ బాలిప్పుడు లేవనిన నింకెప్పుడనియె రాతిఁ కన నారాతిరియెప్పుడనియె నంధకారోదయమందనినం గన్నులు మొగిచి రాతిరివచ్చె నింకం దెమ్మని తల్లి పయ్యెద జేలగు నాకర్షింప నుద్యుక్తంబగుకరంబుగల గోపాలదేవుండు నన్ను బోషించుగాతయనుట- ... ... ...

శ్లో॥ కాళిందీపులినోదరేషు ముసలీ యావద్గతః ఖేలితుం తావత్కార్పరికం పయః పిబ హరే వర్ధిష్యతే తే శిఖా। ఇత్థం బాలతయా ప్రతారణపరః శ్రుత్వా యశోదాగిరః పాయాన్నస్స్వశిఖాం స్పృశన్ సముదితః క్షీరేఽర్ధపీతే హరిః॥ ౬౦

టీక॥ ముసలీ- బలరామస్వామి- కాళిందీపులినోదరేషు- కాళిందీ- యమునానదియొక్క - పులిన- ఇసుకదిన్నెలయొక్క - ఉదరేషు - మధ్యప్రదేశములయందు- ఖేలితుం- విహరించుటకొఱకు- యావత్- ఎంతపర్యంతము - గతః- పోయెనో- తావత్- అంతలోపలను- హేహరే- ఓశ్రీకృష్ణా - కార్పరికం- బంగరుగిన్నెయందుండిన- పయః- క్షీరమును- పిబ - పానముచేయుమా- తే- నీయొక్క - శిఖా- సిగ - వర్ధిష్యతే - వృద్ధిఁబొందుచున్నది- ఇత్థం - ఈరీతిని- బాలతయా- బాలుఁడౌటచేత- ప్రతారణపరః - ప్రతారణ- వంచనయందు- అనగా శిఖావర్ధనమందు- పరః - ఆసక్తుడగుచు- యశోదాగిరః - యశోదావాక్యములను- శ్రుత్వా- విని - ప్రమోదితః - సంతోషించినవాఁడగుచును- క్షీరే- క్షీరము- అర్ధపీతేసతి- సగముపానముచేయంబడుచుండగా - స్వశిఖాం- స్వ- స్వకీయమైన - శిఖాం - సిగను - స్పృశన్ - స్పృశించుచున్న- హరిః- శ్రీకృష్ణమూర్తి- నః- మమ్ము- పాయాత్- రక్షించుగాత- ...

ఉ॥ హేళితసూభవావులిన హేలఁ జరించుబలుండు రాకముక్‌ । బాలకపై డిగిన్నెఁ గలపాల్పైన నానుము గొప్పవెండ్రుక । ట్లీలలునటన్న నందసతి లాలన మాటలకబ్బి పాముపా । ట్లోలుచ జుంచుజూచుకొను గోపకుమారుడు నన్ను బ్రోవుతన్‌॥ ... ... ... ... ... ౬౦

తా॥ ఓయి శ్రీకృష్ణా బలరాముండు యమునానది యిసుకదిన్నెలను మంగ్రిడింపంబోయెనతండు రాకమున్నె బంగరుగిన్నెయందలి పాల ద్రావుము సిగపెరుగుననిన యశోదమాటలు విని బాల్యంబుగా నసిగ పెరుగుట యందాసక్తుండగుచు నప్పాలు సగంబు ద్రావి పెరిగినదో లేదో యని సిగ చూచుకొను శ్రీకృష్ణమూర్తి నన్ను బ్రోచుగాత యనుట. ... ... ... ... ❖

శ్లో॥ కైలాసో నవనీతతి క్షితిరియం ప్రాగ్జగ్ధమృల్లోష్టతి । క్షీరోదోపి నిపీతదుగ్ధతి లసత్స్మేరే ప్రఫుల్లే ముఖే । మాత్రాజీర్ణధియా దృఢం చకితయా నష్టాస్మి దృష్టః కయా ధూధూవత్సకజీవజీవ చిరమిత్యుక్తోవతాన్నో హరిః॥ ౬౧

టీక॥ లసత్స్మేరే- లసత్- ప్రకాశించుచున్న- స్మేరే- చిఱునగవు గలిగిన- ముఖే- శ్రీకృష్ణముఖము - ప్రఫుల్లే- వికసించినదియగుచుండగా - కైలాసః- కైలాసపర్వతము- నవనీతతి- వెన్నవలె నాచరించుచుండగా- ఇయం- ఈ- క్షితిః- భూమి- ప్రాగ్జగ్ధమృల్లోష్టతి- ప్రాగ్జగ్ధ - పూర్వమందు భక్షింపఁబడిన - మృల్లోష్టతి - మట్టియుండవలె నాచరించుచుండగా- క్షీరోదోపి- పాలకడలియును- నిపీతదుగ్ధతి - నిపీత - పానముచేయఁబడిన - దుగ్ధతి - పాలవలె నాచరించుచుండఁగా- అజీర్ణధియా- అజీర్ణబుద్ధిచేత - దృఢ - దృఢముగాను- చకితయా- భయపడినయట్టి- మాత్రా- తల్లియైన యశోదచేత - కయా- ఎవ్వరిచేతను- దృష్టః- చూడబడితివో - నష్టాస్మి- నష్టురాలనైతిని - హేవత్సక ఓయి కృష్ణ - ధూధూ ధూధూకారము- చిరం- చిరకాలము- జీవజీవ - జీవింపుము - ఇతి - ఈప్రకారము- ఉక్తః - చెప్పబడిన - హరిః- శ్రీకృష్ణమూర్తి- నః- మమ్ము- అవతాత్ రక్షించుగావుత- ... ... ... ... ...

చ॥ నఁచిన నప్పు వెన్నెమ్ముగ మునర్ధరభక్షిత మన్నుతుగాఁబయో । వనధిని తదుగ్ధసమస్థితిగా రజతాద్రి వెన్నగాఁ । గని భ్రమఁ జెల్లనే చెలువ గాంచెనొ దృగనంచు నంబడీ । వనలును ధూత్కృతుల్ నిను పవర్తిలు పావని ప్రావుగాంచెదన్

తా॥ ఒకనాఁడు యశోద కృష్ణుని నోరు చూచి యందుఁ గైలాసాదులుగను డవానిఁ వనీతాదులుగా నెంచి తనకుమారుఁడు మ్రింగిన యవియన్ని యుజీర్ణ

గాలేదు ఎవ్వతె చూచినందున దృష్టి తాఁకెనో నేనేమి సేతు చెడిపోతినని దుఃఖించి ధూధూకారపూర్వకముగా నో బాలుఁడా చిరకాలము నీవు జీవింతువు గాకయని దీవింప వెలుంగు కృష్ణుఁడు మమ్ము బ్రోచుగాక యనుట. ... ... ◈

శ్లో॥ కించిత్కుంచితలోచనస్య పిబతః పర్యాయపీతం స్తనం సద్యః ప్రస్నుతదుగ్ధబిందుమపరం హస్తేన సమ్మార్జతః। మాత్రైకాంగులిలాలితస్య చుబుకే స్మేరాననస్యాధరే శౌరేః క్షీరకణాన్వితా నిపతితా దన్తద్యుతిః పాతు నః॥ ౬౨

టీక॥ పర్యాయపీతం - పర్యాయ- వరుసగా - పీతం యథాతథా- త్రా వఁబడినట్టుగా - స్తనం- ఒక స్తనమును- పిబతః - పానము చేయుచున్నట్టివాని- కించిత్కుంచితలోచనస్య- కించిత్ - కొంచెము - కుంచిత - వంచబడిన - లోచనస్య- నేత్రములుగలయట్టివాని - సద్యః ప్రస్నుతదుగ్ధబిందుం- సద్యః- అప్పుడు- ప్రస్నుత - కాచుచున్నట్టి- దుగ్ధబిందుం- పాలబిందువులుగలిగిన - అపరం- మఱియొక స్తనమును- హస్తేన - చేతతో - సమ్మార్జతః - స్పర్శించుచున్నట్టివాని- మాత్రా- తల్లిచేత- చుబుకే- గడ్డమునందు- ఏకాంగులీలాలితస్య- ఏకాంగులి- ఒకవ్రేలిచేత- లాలితస్య- లాలింపఁబడినట్టివాని - స్మేరాననస్య- చిఱునవ్వుతోఁ గూడిన ముఖముగలయట్టి- శౌరేః - కృష్ణునియొక్క - అధరే- మోవియందు నిపతితా- పడియున్నట్టి- క్షీరకణాన్వితా - పాలబిందువులతోఁ గూడినట్టి - దన్తద్యుతిః - దంతకాంతి- నః- మమ్ము - పాతు- రక్షించుగాక- ... ◈

చ॥ ఒకకుచమాని పాలు కుడువనొక్కకుచంబు కేలఁబూనియా। ముకుళితనేత్రుఁడై జనని ముద్దుసకుంజుబుకంబు వ్రేలఁజి। ట్టకనుగ సంటమోవి ప్రకటంబగు లేనగవొప్పు శౌరిదుగ్ధకణసమేతదంతరుచితత్పరతన్నను బ్రోచుఁగావుత ॥ ౬౨

తా॥ ముందొకచన్ను ద్రాగితలువాత మఱియొకచన్ను ద్రాగునప్పుడు కన్నులను గొంచెము వంచుకొని యొకచేతితో వాత్సల్యమువలన పాలుగారుచున్నట్టియొకచన్ను స్పర్శించుచునుండగా నతఁడు తల్లియొక వ్రేలిచే గడ్డము పట్టి లాలింపగా నవ్వుచున్నట్టి చిన్నికృష్ణునియొక్క మోవియందు పాలబిందువులతోఁ దగను పడుచున్న పలునవ్వు నన్ను రక్షించవలయు ననుట. ◈

శ్లో॥ ఉత్తుంగస్తనమండలోపరిలసత్ప్రాలంబముక్తామణేరంతర్బింబితమిందునీలనికరచ్ఛాయానుకారిద్యుతేః। లజ్జావ్యాజముపేత్య నమ్రవదనా స్పష్టం మురారేర్వపుః పశ్యన్తీ ముదితా ముదేస్తు భవతాం లక్ష్మీర్వివాహోత్సవే॥ ౬౩

టీక॥ వివాహోత్సవే- వివాహరూపమయినయుత్సవకాలమందు - లజ్జా

వ్యాజం - నీగ్గనువ్యాజమును. ఉపేత్య-పొంది - నమ్రవదనా - నమ్ర-వంగియున్న- వదనా- ముఖముగలయదియై. ఉత్తుంగస్తనమణ్డలోపరిలసత్ప్రాలంబముక్తామణేః-ఉత్తుంగ-ఉన్నతములయిన-స్తన - చన్నులయొక్క - ఉపరి-పైన - లసత్- ప్రకాశించుచున్న - ప్రాలంబ-హారముయొక్క - ముక్తామణేః- ముత్యములయొక్క - అంతః - నడుమ- బింబితం - ప్రతిఫలించుచున్న - ఇంద్రనీలనికరచ్ఛాయానుకారిద్యుతేః- ఇంద్రనీల - ఇంద్రనీలమణులయొక్క - నికర - సమూహముయొక్క - ఛాయా-, కాంతిని- అనుకారి- అనుసరించుచున్న -ద్యుతిః- కాంతిగల-మురారేః- కృష్ణునియొక్క - వపుః - దేహమును- స్వచ్ఛం -స్వచ్ఛముగా - పశ్యంతి - చూచుచున్నదియు - ముదితా - సంతోషముపొందినదియునైన - లక్ష్మీః - రుక్మిణీరూపయైనలక్ష్మీదేవి- భవతాం- మీకు- ముదే-సంతోషముకొరకు- అస్తు- అగుగాక- ... ... ...

మ॥ హరినీలచ్ఛవిగేరుశౌరిమృదుదేహచ్ఛాయవక్షోరుహా। పరిముక్తామణియందుగన్పడద్రపావ్యాజంబునంబెండ్లికిన్ ౹ తురుదాగావున మోమువాంచికొనిసంతోషస్థితింజెందునిం। దిరమాకీవుతనిష్టసంపదదయాదృష్టిన్విలోకించుచున్॥

తా॥ రుక్మిణీదేవివివాహకాలమందు గృష్ణునిజూడవలయునను నభిప్రాయముగలదియైలజ్జాతిశయమువలనముఖంబునువంచుకొనునపుడు తనకంఠమందువిలసిల్లుహారవుముత్యములయందుబ్రతిబింబరూపముగాగనుపడునాకృష్ణునినీలమణిచ్ఛాయమెఱయుదివ్యమూర్తినిగనుగొనిమనోరథసిద్ధిబొందెనుఅట్టిరుక్మిణిమీకుసంతోషంబులొసంగుగాకయనుట- ... ... ...

శ్లో॥ కృష్ణే నామ్బ గతేన రన్తుమధు సామృద్భక్షితా స్వేచ్ఛయా తథ్యంకృష్ణ కఏవమాహముసలీమిథ్యామ్బ పశ్యాననమ్। వ్యాదేహీతివిదారితే శిశుముఖేదృష్ట్వాసమస్తంజగన్మాతాయస్యజగామవిస్మయపదంపాయాత్సనః కేశవః॥

టీక॥ హేఅంబ- ఓయమ్మ- రంతుం- ఆటలాడుటకు- గతేన - పోయినట్టి- కృష్ణే - కృష్ణునిచేత - స్వేచ్ఛయా- తనయిచ్ఛచేత-మృత్- మన్ను - భక్షితా- భక్షింపఁబడినది- (అనిబలభద్రుండుచెప్పఁగావిని - హేకృష్ణ - ఓయికృష్ణా - తథ్యం- యథార్థమా (అనియశోదచెప్పఁగావిని)ఏవం- ఇట్లు - కః- ఎవ్వఁడు- ఆహ- చెప్పెను- (నీకృష్ణుఁడుపలుకగానందుకు) ముసలీ- బలరాముఁడు- (అనియశోదయుత్తరముసెప్పనదివిని) మిథ్యా- అబద్ధము- ఆననం - నోటిని- పశ్య-

చూడుము- (అనికృష్ణుఁడుపలుకఁగావిని) వ్యాదేహి- తెరువుము-ఇతి- అని-(యశోదపలుకుటవిని) విదారితే- తెఱవఁబడిన- శిశుముఖే - బాలరూపుఁడైనకృష్ణునినోటియందు-సమస్తం - సకలమైన - జగత్- లోకమును- దృష్ట్వా- చూచి-యస్య- యెవ్వనియొక్క - మాతా- తల్లియైనయశోద - విస్మయపదం - ఆశ్చర్యస్థానమును - జగామ- పొందినదో- సః- అటువంటి- కేశవః- శ్రీకృష్ణుఁడు -నః- మమ్ము- పాయాత్- రక్షించుఁగాక- ... ... ...

మ॥ మనుభక్షించితె కృష్ణయెవ్వరనిరమ్మాయన్నయన్నాఁడెక। న్గొనునామోమదికల్లచూపు మనుచున్నోరెత్తపిశ్వంబులె। ల్లనుగన్పించిననింత పెళ్లదిననేలాగన్యో నాశ్చర్యమం। చునువీక్షించుయశోదఁ గాంచినగు కృష్ణుంగాంతునశ్రాంతముల్॥ ... ... ... ... ... ౮౪

తా॥ ఓయికృష్ణామన్నారగించితివాయని యశోదయడుగ కృష్ణుండమ్మాయెవ్వరట్లుచెప్పిరనియె- బలరాముఁడుచెప్పెననితల్లిచెప్పనదికల్లనోటం జూడుమనిచెప్పినసకలజగంబులకునునికిపట్టగుతనవక్త్రంబుజూపినిజమాతయగు యశోదకునచ్చెరువుకలుగంజేయుకేశవుండుమమ్ముంబ్రోచుగాతయనుట-

శ్లో॥ స్వాతీసపత్నీకిలతారకాణాంముక్తాఫలానాంజననీతిరోషాత్। సారోహిణీనీలమసూతరత్నంకృతాస్పదంగోపవధూకుచేషు॥ ౮౫

టీక॥ తారకాణాం - నక్షత్రంబులకు - సపత్నీ- సవతియైనట్టి - స్వాతీ- స్వాతీనక్షత్రము- ముక్తాఫలానామ్ - ముత్యంబులకు - జననీ - ఉత్పాదకము- ఇతి- అని- రోషాత్- రోషమువలన- సారోహిణీ - రోహిణీనక్షత్రము- గోపవధూకుచేషు- గోపవధూ- గోపస్త్రీలయొక్క - కుచేషు- గుబ్బలయందు- కృతాస్పదం - కృత- చేయఁబడిన - ఆస్పదం - స్థానముగలిగినట్టి- నీలం- నీలవర్ణమయిన - రత్నం - రత్నమును- అసూత - కనెను- ...

ఉ॥ తారలకెల్లనుల్ సవతిదానగుస్వాతిపిశుద్ధమౌక్తికో। దారమణుల్గనంగనినిజాత్మనసూయవహించిరోహిణీ। తారకగాంచెగోప వనితాకుచ కోరకహారసంగతిన్। జేసినకృష్ణనాయకమణిన్ రవికోటిఘృణిన్ముదంబునన్॥

తా॥ శ్రీకృష్ణమూర్తిరోహిణీనక్షత్రమందవతరించెను గావునదానినుత్ప్రేక్షించుచున్నాఁడు - ఎట్లనగా - స్వాతిముత్యములనుత్పాదించి ప్రసిద్ధిఁబొందెనుగదాదానికి సమానమైననేనుదానికధికమయిన ప్రసిద్ధిఁబొందవలయునని తలంచిరోహిణీనక్షత్రము శ్రీకృష్ణుఁడనునీలరత్నమునుగనెనని తోచుచున్నది - ర

త్నము స్త్రీలకుచంబులపైవిలసిల్లును అట్టులనే నీలరత్నంబును గోపికలకుచంబుల యందుఁ బ్రకాశించుచున్నది. ఇందువలన ముత్యములకంటె రత్నము విశేషము గావున స్వాతికంటె రోహిణియాధిక్యమును జెందెను. స్వాతిముత్యములను గను టకు స్వాతీప్రవేశమందుఁ గురియు వానబిందువులు ముత్యములౌనని ప్రతిపాదించుట రత్నశాస్త్రమువలన స్పష్టము. ఇదియునుంగాక - స్వాతిముక్తము క్తిఁ బొందినవా రలకు సఫలఫలము కానివారలను గనుచున్నది. ఈరోహిణియోగముక్తులకు ఫలరూ పమయిన ట్టి సిలమణిని గనుచున్నదియనియు నొకతాత్పర్యము ధ్వనించుచున్నది.

శ్లో॥ నృత్యంతమత్యంతవిలోకనీయం కృష్ణం మణిస్తమ్భగతం మృగాక్షీ। ని రీక్ష్య సాక్షాదివ కృష్ణమగ్రే ద్విధా వితేనే నవనీతమేకమ్॥ ౬౬

టీక॥ నృత్యంతం - నర్తనము చేయుచున్నవాఁడును - అత్యంత విలోకనీయం. అత్యంత - మిక్కిలి - విలోకనీయం - చూడఁదగినవాఁడును - మణిస్తంభ గతం - మణిస్తంభ - రత్నస్తంభమును. గతం. (ప్రతిబింబరూపముగ) పొందిన వాఁడునునగు - కృష్ణం - కృష్ణుని - మృగాక్షీ. యశోద. అగ్రే. ఎదుట. సాక్షాత్ యథార్థమయిన - కృష్ణమివ - కృష్ణునివలె - నిరీక్ష్య - చూచి. ఏకం - ఒకటియైన - నవనీతం - వెన్నను. ద్విధా - రెండుఖండములుగాను - వితేనే. చేసెను. ❖

మ॥ ప్రకటానందవిచిత్రనాట్యపరుఁడౌ బాలున్విలోకించుచుం। జకితాలోకకురంగలోచనమణిస్తంభంబులోనిక్కమై। నకుమారున్వలెఁ దోఁచునీడ చెలువొందంగాంచి భాగించెనా। త్మకరాంభోజమునందనున్ననవనీతం బయ్యెడన్ రెండుగన్॥ ... ... ... ... ... ... ౬౬

తా॥ యశోదకృష్ణుఁడాడుచుండఁగా వానిప్రతిబింబమును రత్నస్తంభము నందుఁ జూచి యథార్థమైన కృష్ణుఁడని తలంచి వెన్నముద్దను రెండుముద్దలు గాఁ బంచెననుట ... ... ... --- ... ❖

శ్లో॥ వత్స జాగృహి విభాతమాగతం జీవ కృష్ణ శరదాం శతం శతమ్। ఇత్యుదీర్య సుచిరం యశోదయా దృశ్యమానవదనం భజామహే॥ ౬౭

టీక॥ హేవత్స. ఓబిడ్డా - విభాతం. ప్రాతఃకాలము - ఆగతం - వచ్చెను. జాగృహి. మేల్కొనుము. హేకృష్ణ. ఓకృష్ణ. శతం. అనేకమయిన - శరదాం. సంవత్సరములయొక్క - శతం - నూటియందు - జీవ - జీవింతువుగాక. ఇతి. ఈ లాగున. ఉదీర్య. చెప్పి. సుచిరం - బహుకాలము - యశోదయా - యశోదచే త - దృశ్యమానవదనం - దృశ్యమాన - చూడఁబడిన - వదనం - ముఖము గలిగి

న - కృష్ణం - కృష్ణుని - భజామహే - భజించుచున్నాము.

ఉ॥ వెన్నయుఁ బాలుఁ ద్రాగుదువు వేగమె లెమ్ము కుమార తెల్లవా । రెన్నను గన్నతండ్రిని దురింపకు లేపది వేలయేండ్లునీ । కున్నెల యాయు వయ్యెడుము సుందయటన్న యశోదఁ జూచున । వ్వెన్నుని ముద్దునెమ్మొగము వేడుకమీర భజింతు మెప్పుడున్॥ ... ... ... ... ... ౬౭

తా॥ యశోదాదేవి పవ్వళించియున్న కృష్ణునిఁ గృష్ణా తెల్లవారెను మేలుకొనుము లేపి చిరంజీవియని దీవించి వాని ముఖముఁ జూచి. సంతోషపడెను - అట్టి కృష్ణుని ధ్యానించుచున్నాననుట. ... ... ... ...

శ్లో॥ ఓష్ఠం జిఘ్రన్ శిశురితి ధియా చుమ్బితో వల్లవీభిః కంఠం గృహ్ణన్నరుణిత పదం గాఢమాలింగితాంగః । దోర్భ్యాం లజ్జాపదమభిమృశన్నంక మారోపితాత్మా ధూర్తస్స్వామీ హరతు దురితం దూరతో బాలకృష్ణః॥ ౬౮

టీక॥ శిశురితి - బిడ్డండను - ధియా - బుద్ధిచేత - వల్లవీభిః - గోప స్త్రీలచేత. చుంబితస్సన్ - చుంబనము చేయఁబడినవాఁడై - అరుణితపదం - అరుణిత - ఎఱ్ఱగా జేయఁబడిన - పదం - ప్రదేశము గలుగునట్టులుగా - ఓష్ఠం - అధరమును - జిఘ్రన్ - సీత్కారపూర్వకముగా గ్రహించుచు - గాఢం - దృఢముగా - ఆలింగితాంగస్సన్ - ఆలింగిత - కౌఁగిలింపఁబడిన - అంగస్సన్ - దేహముగలవాఁడై - కంఠం - కంఠమును - గృహ్ణన్ - ఆలింగనము చేయుచును - అంకం - ఒడిని - ఆరోపితాత్మా - ఆరోపిత - ఎక్కింపఁబడిన - ఆత్మా సన్ - దేహముగలవాఁడై - లజ్జాపదం - లజ్జా - స్థానమును - దోర్భ్యాం - చేతితో - అభిమృశన్ - స్పృశించుచున్నవాఁడును - ధూర్తస్స్వామీ - ధూర్తః - నిటుకు - స్వామీ - అధిపతియైనవాఁడు నగు - బాలకృష్ణః - బాలకృష్ణుఁడు - దురితం - పాపమును - దూరతః - దూరమున - హరతు - హరించుగాక. ... ... ... ...

ఉ॥ బాలుఁడటంచు ముద్దులిడు బాలలఁ బట్టుక మోవినొక్కి కెం । గేలఁ దెమల్చి మన్మథని కేతనమంకము మీఁదనుంపఁ జా । ల్బాలునటంచు నెత్తికొనఁ జన్గవ బట్టుక కౌఁగిలించు గో । పాలకధూర్తశేఖరుఁడు పాపముఁ బాపి కృతార్థుఁ జేయుతన్॥ ౬౯

తా॥ గోపికలు చిన్నిబిడ్డఁడని తలఁచి ముద్దిడఁగా మహావిటునివలె వారల మోవి యెఱ్ఱగాఁ బండిగురుతు తగులునటుల జుంబనము సేయుచు బిడ్డఁడని యాలింగనము సేయు వారల నాలింగనము సేయుచు నొడియం దెత్తిపెట్టుకొనఁగా లజ్జాస్థానమగు మదనగృహముం గేలస్పృశించుచు వినోదకారియైన బాలకృష్ణుఁడు పాపము

సుఖోత్పత్తుంగాకయనుట. ... ... ... ... *

శ్లో॥ ఏతేలక్ష్మణజానకీవిరహితంమాంఖేదయంత్యమ్బుదామర్మాణీవచఘట్ట యంత్యలమమీక్రూరాఃకదమ్బానిలాః। ఇత్థంవ్యాహృతపూర్వజన్మచరితంయో రాధయావీక్షితస్సేర్ష్యాశంకితయాసనస్సుఖయతుస్వప్నాయమానోహరిః॥

టీక॥ హేలక్ష్మణ- ఓలక్ష్మణా- ఏతే- ఈ- అంబుదాః- మేఘములు- జానకీ విరహితం- జానకీ నీచేత - విరహితం - శూన్యమైన - మాంప్రతి - నన్నుగూర్చి- ఖేదయంతి - దుఃఖింపఁజేయుచున్నవి- క్రూరాః - క్రూరములైన- అమీ- ఈ- కదంబానిలాః- కడిమిపువ్వులవాయువులు-మర్మాణి - మమస్థానములను- అలం - మిక్కిలి- ఘట్టయంతీవచ-ప్రహరించుచున్నవి- ఇత్థం - ఈలాగున-వ్యాహృతపూర్వజన్మచరితంయథాతథా- వ్యాహృత - చెప్పఁబడిన- పూర్వజన్మ- పూర్వజన్మము యొక్క - చరితం - చరిత్రములుగల్గు నట్టులుగా - స్వప్నాయమానః - స్వప్నమునసుభవించుచున్నవాఁడును - సేర్ష్యాశంకితయా- సేర్ష్యా అసూయతోఁగూడినట్టులు - ఆశంకితయా - సందేహపడుచున్న - రాధయా- రాధచేత- వీక్షితః- చూడఁబడినవాఁడునగు- హరిః - కృష్ణుఁడు - నః- మమ్ము- సుఖయతు- సుఖవంతులఁగాఁజేయుఁగాత.

శా॥ అన్నాలక్ష్మణజానకీరహితునన్నంభోధరశ్రేణియీ। సన్నంపుఁ బలిగాలిమర్మములునొంచం జొచ్చెనంచుంబురా। ఖిన్నత్వంబువచింపనీసుతే జపుం గిల్యాస్సచిత్తంబుతోఁ। దన్నున్ రాధిక గాంచఁగాఁ గలవరింతంగూర్కువాఁడేలుతన్॥ ... ... ... ... ... ౭౦

తా॥ కృష్ణుఁడొకనాఁడుకలలోలక్ష్మణునిఁజూచి తనకుసీతా విరహకాలమందుమేఘములునుజల్లనిగాలియు మిక్కిలిబాధకంబులైయున్నవియని తనరామావతారచరిత్రముసెప్పవినిరాధాదేవ వేరువనితయందితనికిఁబ్రీతియధికముగనున్నదియనియోర్వలేనితనముతోఁగృష్ణునిజూచెను - అటుచూడబడినకృష్ణుఁడు మాకు సుఖముకలుగఁజేయుఁగాకయనుట. ... ... ...... *

శ్లో॥ ఓష్ఠంముఞ్చహరేబిభేమిభవతాపానైర్గతాపూతనాకణ్ఠాశ్లేషమముఞ్జహీహిదళితావాలిఙ్గనే నార్జునా। మాదేహీ చ్ఛురితంహిరణ్యకశిపుర్నీతోక్షైఃపక్షపుతామిత్థంవారితరాత్రికేళిరవతాల్లక్ష్మ్యైపహాసాద్ధరిః॥ ౭౧

టీక॥ హేహరే- వోయికృష్ణా- వోష్ఠం-అధరమును-ముంచ - విడువుమా బిభేమి- భయపడుచున్నాను- భవతా - నీచేతను - పానైః - పానములచే

పూతనా- పూతనయనురక్కసి- హతా- చంపఁబడెను- అముంకంఠాశ్లేషం- ఈకంఠాలింగనమును- జహీహి- విడువుమా - బిభేమి - భయపడుచున్నాను- ఆలింగనేన-కౌగిలింతచేత- అర్జునౌ- మద్దిచెట్లు-దళితౌ- కొట్టబడినవి- ఛురితం- నఖక్షతమును- మాదేహి- చేయకుము- బిభేమి- భయపడుచున్నాను - హిరణ్యకశిపుః- హిరణ్యకశిపుఁడు- నఖైః - గోళ్లచేత- పంచత్వాం- మృతిని- నీతః- పొందింపఁబడెను - ఇత్థం- ఈప్రకారముగా- లక్ష్మ్యా- రుక్మిణీదేవిచేత- అపహసత్- అపహాసమనుహేతువువలన- వారితరాత్రికేళిః- వారిత - నివారింపబడిన- రాత్రికేళిః- నిశాక్రీడగల- హరిః- శ్రీకృష్ణమూర్తి-అస్మాన్- మమ్మును అవతాత్- రక్షించుగావుత. ... ... ... ... ❖

ఉ॥ అమ్మకచెల్లమోవిచవియానకుపూతనసోలెఁగ్రోలఁగా। గ్రమ్మకరొమ్ము బల్మినిధగంబడెమ్మద్దులుగాసగోటిచేఁ। జిమ్మకుమీహిరణ్యకథచేమది భీతిలెనంచు దచ్చునల్। బ్రమ్మచుఁకేళిమాన్పరమబైకొనికూడినశౌరిఁగొల్చెదన్॥ ౭౧

తా॥ శ్రీకృష్ణాయోష్ఠంబువిడువుమునీవుచుంబనంబుచేసి పూతనమడిసెనాలింగనంబుచేయకుము నీయాలింగనంబునమద్దికవగూలె నఖక్షతంబుజేయకుము హిరణ్యకశిపుండునీనఖంబులచేటుబడినీలిగెగావునభయంబగుచున్నది యనుచు నపహాసంబుగాబలుకులక్ష్మీదేవింబైకొని క్రీడించు నారాయణుండు ననుంబ్రోచుంగాతయనుట. ... ... ... ... ... ❖

శ్లో॥ రామోనామబభూవహుంతదబలాసీతేతిహుంతౌపితుర్వాచాపఞ్చవటీవనేవిహరతస్తామాహరద్రావణః। నిద్రార్థంజననీకథామితిహరేర్హుంకారతశ్శృణ్వతస్సౌమిత్రేక్వధనుర్ధనుర్ధనురితిర్వ్యగ్రాగిరఃపాతునః॥ ౭౨

టీక॥ హేకృష్ణ- వోకృష్ణుఁడా- రామోనామ - రాముఁడనియెడురాజు బభూవ- ఆయెన్- (అనియశోదకథఁజెప్పఁగా) హుం - హుంకారధ్వనిచేనంగీకరించెను- తదబలా- తత్- ఆశ్రీరామునియొక్క - అబలా- భార్య - సీతేతి- సీతయనునెలత- బభూవ- ఆయెను- హుం- హుమ్మనెను- తత్పితుః- తత్- ఆశ్రీరాములయొక్క - పితుః- తండ్రియైనదశరథునియొక్క - వాచా- వాక్యముచేత- పంచవటీవనే-పంచవటీవనమందు- విహరతః - విహరించుచున్న-తాం- ఆశ్రీరామునియొక్కభార్యయైనసీతను - రావణః- రావణాసురుఁడు - ఆహరత్- హరించెను- ఇతి- ఈప్రకారముగా- నిద్రార్థం - నిద్రపుచ్చుటకొఱకు- జననీకథాం - జననీ - తల్లిచేఁజెప్పఁబడియెడు - కథాం- కథను - హుంకారతః- హుంకారమువలన- శృణ్వతః- వినుచున్న - హరేః- శ్రీకృష్ణమూర్తియొక్క -

హేసౌమిత్రే- ఓలక్ష్మణా- ధనుర్ధనుర్ధనుః- ధనస్సుధనస్సు- క్వేతి- ఎక్కడననియెడు- వ్యగ్రాః- బ్రుతోచ్చారితములయిన- గిరః- వాక్యములు-నః-మమ్ము- పాతు- రక్షించుగావుత- .. ... ... ...... [illegible]

మ॥ ఇలలోరాఘవుఁడొప్పువానిసతియయ్యెన్ సీతవారిద్దఱు। బలకుంబంచెగురుండటంచునిదురంబొందించునయ్యంబ। లుక్కులుదానూకొని రావణుండుమహిజంగొంపోయెనానుల్కి। ల్విలుజేలక్ష్మణయంచుబలుక్కహరియుద్ఘోక్తిన్ బ్రోవుతన్॥ ... ... ... ... ... [illegible]

తా॥ ఒకనాడుయశోదకొమరునినిదురవుచ్చుటకైకతజెప్పంబూనిరాముండనునొకరాజుగలడతనికిసీతయనునొకయువతిగలదు రాఘవుడుతండ్రిపనుపునయ్యంగనంగూడిపంచవటీప్రదేశంబునగుమ్మరంగనిరావణుండనువాడు సీతనపహరించెననమూకొనుచుసంభ్రమంబుననోలక్ష్మణావిల్విలు విలుదెమ్మనియెనట్టిదృతోచ్చారితంబులగుశ్రీకృష్ణవచనంబులునన్ బ్రోచుగాతయనుట. [illegible]

శ్లో॥ బాలోపిశైలోద్ధరణాగ్రపాణిర్నీలోపినీరన్ధ్రతమః ప్రదీపః। ధీరోరాధానయనావబద్ధోజారోపిసంసారహరఃకుతస్త్వమ్॥ [illegible]

టీక॥ హేకృష్ణ- ఓకృష్ణుఁడా- త్వం-నీవు- కుతః - ఎందువలన - బాలోపి బాలుఁడవైనప్పటికిని - శైలోద్ధరణాగ్రపాణిః - శైల - గోవర్ధనాచలమునెక్క - ఉద్ధరణ- ఎత్తుటయందు- అగ్ర- వ్యగ్రమయిన- పాణిః - హస్తముగవాడవైతివి- నీలోపి- నల్లనివాడవైనను - నీరంధ్రతమఃప్రదీపః - నీరంధ్ర- ట్టమయిన- తమః- అంధకారమునకు- ప్రదీపః - దీపమయినవాడవయితివి- జారోపి - జారుడవైనప్పటికిని- సంసారహరః- సంసారమునుహరించుచున్న డవయితివి- ధీరోపి- ధైర్యవంతుడవైనప్పటికిని - రాధానయనావబద్ధః - రాధా- రాధికయొక్క - నయన - నేత్రములకొఱకు - అవబద్ధః - వశుఁడవైవాడవు- అసి- అయితివి- ... ... ... ...

ఉ॥ బాలుడవయ్యుశైలమొకపాణితలంబునఁదాల్చినిల్పఁగా। జాలుట పపుంజములుజారుడవయ్యుహరించుటన్నహా। నీలతనుండవయ్యునతి నిర్భరగాతమఃప్రదీపమై। వాలుటధైర్యశాలివయిరాధకుఁజిక్కుటవింతగాహరీ॥

తా॥ బాలుండవయ్యుగోవర్ధనంబుకరాగ్రంబునందాల్చుటయునల్లనిమేనుంగలవాడవయ్యు గాఢాంధకారంబునకు దీపంబుబోలె నుండుటయు జారుండవయ్యు సంసారదుఃఖంబులబోనడంచుటయు నదియెంతయు వింతయ

మన్నదియనుట. ... ... ... ... .. ❖

శ్లో॥ బాలాయనీలవపుషే నవకిఙ్కిణీకజాలాభిరామజఘనాయ దిగమ్బరాయ।
శార్దూలదివ్యనఖభూషణభూషితాయ నన్దాత్మజాయ నవనీతముషే నమస్తే॥

టీక॥ నీలవపుషే - నీల- నల్లనయిన - వపుషే - శరీరముగలవాఁడును. నవకింకిణీకజాలాభిరామజఘనాయ - నవ - నూతనములయిన - కింకిణీక- చిఱుగంటలయొక్క - జాల- సమూహముచేత- అభిరామ- సుందరమయిన - జఘనాయ- కటిపురోభాగముగలవాఁడును- దిగంబరాయ - దిగంబరుఁడయినవాఁడును- శార్దూలదివ్యనఖభూషణభూషితాయ- శార్దూల - పులియొక్క - దివ్య- శ్రేష్ఠమయిన - నఖ - చిటికినవ్రేలిగోరనియెడి - భూషణ - సొమ్ముచేత - భూషితాయ- అలంకరింపఁబడినవాఁడును - నందాత్మజాయ - నందునికొమరుఁడయినవాఁడును- బాలాయ- బాలుఁడయినవాఁడునయిన- తే- నీకొఱకు-నమః- నమస్కారము. ... ... ... ... ... ❖

చ॥ అలరుపసిండికంకణములం దెలుమువ్వలు రావిరేకసం। కలపులిగోరుఁ డాయెతులకుప్పెఁడపున్నొలనూలుమద్దికా। యలుఁగల నందనందను దిగంబరు జారుకటీతటోజ్జ్వలు। న్నలసితనీలదేహు నవనీతహరుం డగు బాలుఁ గొల్చెదన్॥

తా॥ నల్లనయిన నెమ్మేనును జిఱుగంటతుటుము చేసోయగంబగు గొప్పపిఱుందులుంగలిగి దిగంబరుండై పులిగోరుసొమ్మునం జెలంగ వెలుంగుచు వెన్నలనపహరించుచుండు బాలుండగు నందసుతునకే నమస్కారమొనర్చెదననుట. ❖

శ్లో॥ పాణౌ పాయసభక్తమాహితరసం బిభ్రన్ముదా దక్షిణే। సవ్యే శారదచన్ద్రమణ్డలనిభం హైయ్యఙ్గవీనం దధత్। కణ్ఠే కల్పితపుణ్డరీకనఖమప్యుద్దామదీప్తిం వహన్। దేవో దివ్యదిగమ్బరో దిశతు నస్సౌఖ్యం యశోదాశిశుః॥ ౭౫

టీక॥ సవ్యే- డాపలి- పాణౌ- హస్తమునందు - ఆహితరసం - ఆహిత- ఉంచఁబడిన- రసం - మధురసముగల- పాయసభక్తం - పరమాన్నమును- ముదా- సంతోషముచేత- బిభ్రత్- భరించుచున్నవాఁడును- దక్షిణే- వలపలి- పాణౌ- కరమునందు- శారదచంద్రమండలనిభం - శారద- శరత్కాలసంబంధమైన- చంద్రమండల - చంద్రమండలముతోడ నిభం- సమానమైన- హైయ్యంగవీనం - సద్యోఘృతమును- దధత్- వహించుచున్నవాఁడును- కంఠే - గళమందు- ఉద్దామదీప్తిం - ఉద్దామ- అతిశయమయిన - దీప్తిం - కాంతిగల - కల్పితపుండరీకనఖమపి- కల్పిత- కల్పింపఁబడిన- పుండరీకనఖమపి - పులిగోరును - వహన్- వహించుచున్నవాఁడును- దివ్యదిగంబరః - దివ్యదిగంబరుఁడైనవాఁడును-య

శ్లో॥ దాశిశుః - యశోదబిడ్డడునైన - దేవః- శ్రీకృష్ణమూర్తిః- నః- మాకు- సౌఖ్యం- సుఖమును- దిశతు- ఇచ్చుగాక. ... ... ...

మ॥ అలడాకేలశరన్న ఏగాంకనిభమాహయ్యాంగవీనంబున। వ్వాలికేలఁ రసయుక్తపాయసముగ్రీవాబద్ధచామీకరో। జ్జ్వలశార్దూలనఖంబునంబరకటీచక్రంబు బెంపొందని। చ్చలుఁగ్రీడించుయశోదపట్టికరుణన్ సౌఖ్యంబు మాకీవుతన్॥ ౭౫

తా॥ డాకేలనఘగురసప్రధానంబగుపరమాన్నంబునువలకేలం గ్రొత్తయగునేతిముద్దనుధరియించిపులిగోరుగళంబునవెలుంగదిగంబరుడయి వెలయు గోపాలదేవుండెల్లసౌఖ్యంబుల నొసంగుంగాతయనుట.

శ్లో॥ కింకిణీకిణికిణీరభసైరంగణేభువిరింగణైస్సదాటంతమ్। కుంకుణుకుణుపదయుగళంకంకణకరభూషణంహరింవందే॥ ... ... ౭౬

టీక॥ కింకిణీకిణికిణీరభసైః - కింకిణీ - చిఱుగంటలయొక్క - కిణికిణీ- కిణికిణియనెడి- రభసైః- ధ్వనులుగల - రింగణైః - స్ఖలనములచేత - అంగణభువి ముంగిలియనుప్రదేశమందు- సదా - ఎప్పుడును- అటంతం - సంచరించుచున్నవాఁడును- కుంకుణుకుణుపదయుగళం- కుంకుణుకుణు - కుణుకుణనియెడిధ్వనితోఁగూడిన- పదయుగళం- పాదద్వంద్వముగలవాఁడును- కంకణకరభూషణం కంకణ - కణకణయనియెడి- కరభూషణం- కంకణములుగలవాఁడునునగు- హరిం- శ్రీకృష్ణమూర్తిఁగూర్చి- వందే - నమస్కరించుచున్నాను.

చ॥ గణనకునెక్కుడైనకరకంకణనిక్వణనంబుమీఱఁగుం। కుణుకుణునాదపదములకుండగు హేమమణీనిబద్ధకిం। కిణికిణినాద సంభ్రమము గీడ్పడదాటుఁనందుమందిరా। గణమునసంచరించునయాగారవుముద్దులబాలుగొల్చెదన్॥

తా॥ కిణికిణియనెడు నాదంబులచేఁజిఱుగంటలు మ్రోయఁగుంకుణకుణయెడిరావంబుల గాలియందియలు మ్రోయంగణకణయనియెడి నినదంబునండియంబులురవళి యొనర్పనందుని ముంగిటియందుఁ గ్రుమ్మరుహరిం గూడి మ్రొక్కెదననుట. ... ... ... ... ...

శ్లో॥ సమ్బాధేసురభీణామమ్బామాయాసయంతమనుయాంతీమ్। లమ్బాలకమవలమ్బేతంబాలంతనువిలగ్నజమ్బాలమ్॥ ౭౭

టీక॥ సురభీణాం- గోవులయొక్క - సంబాధే- సమ్మర్దమందు- అనుయాంతీం - వెంబడిగావచ్చుచున్న - అంబాం - తల్లిని- ఆయాసయంతం - ఆయాసమునొందించుచున్నవాఁడును- లంబాలకం- లంబ- వ్రేలుచున్న- అలకం- స్నిగ్ధకుంతలములుగలవాఁడును- తనువిలగ్నజంబాలం- తను- శరీరమునందు -

గ్న-కూడుకొన్న- జంబాలం - బురదగలవాఁడును-తం- ఆప్రసిద్ధుఁడయిన- బాలం- బాలకృష్ణమూర్తిని- అవలంబే- ఆశ్రయించుచున్నాను-

ఈశ్లోకార్థంబుగోపాలకృష్ణసంపత్ప్రదష్టాక్షరీమంత్ర ధ్యానమని సనత్కుమారసంహితయందుఁజెప్పంబడియున్నది. ... ...

శ్లో॥ పఞ్చప్రాయసమీశానంధావమానం వ్రజాంగణే । కింకిణీనూపురగ్రీవాకర్ణభూషోజ్జ్వలంస్మరేత్॥ ... ... ...... ౭౮

ఉ॥ బాలకకేళినాలగుమిఁబల్క ఱునాడగనంబవెంబడిం । దాలిమిలేకరాగునగునంబరువెత్తులలాటభాగలం। బాలకుఁ జక్రవాతశకటాదివిఘాలకు నంగలగ్నజం। బాలకుఁబాలకుందలఁతుఁబాలితదిక్తటలోకపాలకున్॥ ౭౭

తా॥ నెమ్మొగంబుననెఱిముంగురులువ్రేలనెమ్మేనంబురదకలయం బెరసియుండఁదనతల్లివెంటనేతేరగునగునం బరువిడుబాలకృష్ణమూర్తి నాశ్రయించుచున్నాననుట- .. ... -- ... ...

శ్లో॥ అఞ్చితపిఞ్ఛాచూడంసంచిత సౌజన్యవల్లవీవలయమ్ । అధరమణినిహితవేణుంబాలగోపాలమనిశమవలమ్బే॥ ౭౮

టీక॥ అంచితపింఛాచూడం- అంచిత- ఒప్పుచున్న- పింఛా - నెమలిపురితో గూడిన ౼ చూడం- సిగగలవాఁడును- సంచితసౌజన్యవల్లవీవలయం - సంచిత- సంగ్రహింపఁబడిన - సౌజన్య-సుజనభావముగల - వల్లవీవలయం-గోపస్త్రీ సమూహముగలవాఁడును- అధరమణినిహితవేణుం - అధరమణి - మణివంటి యధరమందు- నిహిత- ఉంచఁబడిన- వేణుం - పిల్లనగ్రోవిగలవాఁడును - గోపాలం - గోపరిపాలకుఁడైన - బాలం- బాలకృష్ణమూర్తిని - అవలంబే-ఆశ్రయించుచున్నాను. ... ... ... ... ...

మ॥ విలసత్పింఛవతంసుఁడై చిగురుమోవిన్వేణువుంచేర్చికం। దళితాలాపసుధాపరంపరలచేతంజేతనాచేతన। మ్ములకున్నిశ్చలతాచలత్వములపెంపుల్గూర్చునగ్గోపికా। లలితాంగీసుజనత్వవంచకునిగొల్వంగాంతు గోపాలకున్॥

తా॥ సిగయందలంకరింపఁబడిననెమలిపురిమెఱయ నధరమణియందుంచిన వేణువుమెలుంగ గోపస్త్రీసుజనభావంబు గ్రహించుచు గోపరిపాలకుండై వెలయుబాలకృష్ణునాశ్రయించుచున్నాననుట- ... ... ...

శ్లో॥ ప్రహ్లాదభాగధేయంనిగమమహాగుహాంతరాధేయమ్ । నరహరిపదాభిధేయంవిబుధవిధేయంమమానుసంధేయమ్॥ ౭౯

టీక॥ ప్రహ్లాదభాగధేయం. ప్రహ్లాద. ప్రహ్లాదునియొక్క - భాగధేయం. భాగ్యభూతమయినయదియు. నిగమమహాగుహాంతరాధేయం. నిగమ. వేదములనియెడి - మహాగుహా. గొప్పగుహయొక్క - అంతః. లోపలను. ఆధేయం. ప్రతిపాదింపఁదగినయదియు. నరహరిపదాభిధేయం - నరహరి. నృసింహుఁడనియెడి - పద. అభిధానమునకు. అభిధేయం. చెప్పఁదగినదియు - విబుధవిధేయం. విబుధ. దేవతులకు. విధేయం. స్వాధీనమైనయదియు. మమ - నాకు. అనుసంధేయం. అనుసంధానముచేయదగినదియునగు. వస్తు. వస్తువును. విచారయామి. భావించుచున్నాను. ఈశ్లోకము ప్రసిద్ధమని వ్యాఖ్యాతచేనుదువంబడియెనని తెలియునది. ... ... ... ... ... ❖

మ॥ యమిసంభావితరూపధేయమును బ్రహ్లాదోల్లసద్భాగధే। యమునామ్నాయమహాగుహాంతరనిశాంతాధేయముం బ్రోల్లస। త్సుమనశ్శ్రేణివిధేయమున్నరమృగాస్తోకాభిధానాభిధే। యముఁగొల్తుంగమలామనఃకమల నిత్యాధేయముంగా వేడుకన్॥ ... .. ... ... ... ౭౯

తా॥ ప్రహ్లాదునకిభాగ్యభూతంబై నిగమగుహయందుఁ బ్రతిపాదింపఁదగినదియైనరసింహుఁడనియెడుశబ్దంబునకభిధేయంబై దైవతంబులకువిధేయంబై నాచేననుసంధింపఁబడినదియైవెలయువస్తువుం దలంచెదననుట.

శ్లో॥ సంసారేకింసారంకంసారేశ్చరణకమలపరిభజనమ్। జ్యోతిఃకిమంధకారే యదంధకారేరనుస్మరణమ్॥ ... ... ... ... ౮

టీక॥ సంసారే. సంసారమందు. సారం. ఉత్కృష్టము - కిం. ఏమి. అంధకారే. అజ్ఞానమునందు. జ్యోతిః. తేజము. కిం. ఏది. ఇదిప్రశ్నము. ఇకనుత్తరము. కంసారేః - శ్రీకృష్ణమూర్తియొక్క - చరణకమలపరిభజనం. చరణకమల. పాదపంకజములయొక్క - పరిభజనం. ధ్యానమును. అంధకారేః. శివునియొక్క - అనుస్మరణం. స్మరణమును. యత్. ఎద్దియో. తత్. అది. పరం. శ్రేష్ఠమని

ఉ॥ సారముకంసవైరిపదసారసచారుతరార్చనంబు సం। సారమునందుధరసన్నుతిగాఢతమాంధకారని। స్సారమువీనికిందగిన సద్గురుసేవయు స్మరణంబుగా। కారయనింతకంటెనుశుభావహమైనవి శేషమున్నదే॥ ౮

తా॥ సంసారంబునందు శ్రేష్ఠంబెద్దియనం గంసాంతకుండగు శ్రీకృష్ణుని పాదకమలధ్యానంబు - ఇదితక్కనొండెద్దియులేదు - అజ్ఞానాంధకారాతియగు శివునికంటెసంస్మరణంబు. ఇదితక్కనొండుపాయంబులేదనుట.

శ్లో॥ కలశనవనీతచోరే కమలాదృక్కుముదచంద్రికాపూరే। విహరతునంద కుమారే చేతో మమగోపసుందరీజారే॥ ... ... ... ౮౧

టీక॥ కలశనవనీతచోరే. కలశ- కుండలయందలి. నవనీత - వెన్నను- చోరే- దొంగిలించుచున్నవాఁడును - కమలాదృక్కుముదచంద్రికాపూరే - కమలా- రుక్మిణీదేవియొక్క - దృక్కుముద - కన్నులనుగలువలకు - చంద్రికాపూరే- చంద్రికా - ప్రవాహమైనవాఁడును - గోపసుందరీజారే- గోపికావిటుఁడయిన- నందకుమారే- శ్రీకృష్ణమూర్తియందు- మమ- నాయొక్క - చేతః- చిత్తము- విహరతు- విహరించుగాత- ... ... ... ...

ఉ॥ శ్రీరమణీమణీవికచదృక్కుముదస్మితసాంద్రచంద్రికా। సారుప్రజాంగనానివహజారుజగజ్జనతామనోహరా। కారువిశుద్ధమానిహృదగారుఁబయోనవనీతచోరునా। భీరకుమారునాహృదయపీఠికయందువసింపఁజేసెదన్॥ ౮౧

తా॥ కలశంబులందలి నవనీతంబుల నపహరించుచురుక్మిణీదేవికన్నులనియెడికలువలకుఁజిఱునగవనియెడివెన్నెలయొక్క ప్రవాహమునుగలుగఁజేయుచు గోపికావిటుండై వెలయునందకుమారునందునాచిత్తంబుసంచరించుగాకయనుట.

శ్లో॥ కస్త్వంబాలబలానుజఃకిమిహతేమన్మందిరాశంకయా యుక్తంతన్నవనీతపాత్రవివరే హస్తంకిమర్థంన్యసేః। మాతఃకంచనవత్సకంమృగయితుంమాగావిషాదంక్షణా దిత్యేవంవరవల్లవీప్రతివచఃకృష్ణస్యపుష్ణాతునః॥ ౮౨

అవతరణిక. కవియీశ్లోకంబున వెన్ననపహరించుశ్రీకృష్ణునియొక్కయునొకగోపికయొక్కయును ప్రత్యుక్తిమాలికం జెప్పుచున్నాఁడు॥

టీక॥ హేబాల- ఓయిబాలుఁడా- త్వం- నీవు- కః - ఎవ్వఁడు- (ఇది గోపికవచనము) బలానుజః - బల- బలరామునియొక్క - అనుజః - తమ్ముఁడను(ఇది కృష్ణవచనము) తే- నీకు- ఇహ- ఈ-నాయింటను- కిం-ఏమిప్రయోజనము (ఇది గోపికవచనము) మన్మందిరాశంకయా- మత్- నాయొక్క - మందిర- ఇల్లనియెడి - శంకయా - సందేహముచేతను (ఇదికృష్ణవచనము)తత్- అది- యుక్తం- యుక్తము- నవనీతపాత్రవివరే- నవనీతపాత్రవిశేషమందు - కిమర్థం - ఏమినిమిత్తము- హస్తం- కరమును- న్యసేః- ఉంచినవాఁడవైతివి - (ఇదిగోపికవచనము) హేమాతః- ఓతల్లీ - కంచన- ఒకటియైన- వత్సకం దూడను - మృగయితుం- వెదకుటకొఱకు- క్షణాత్- క్షణకాలమాత్రము-విషాదం- ఖేదమును- మాగాః- పొందకుము- ఇత్యేవం - అని ఈప్రకారము - కృష్ణస్య - కృష్ణునియొ

క్క - వరవల్లవీప్రతివచః- వర- శ్రేష్ఠమయిన- వల్లవీ - గోపిక యొక్క - ప్రతివచః- ప్రత్యుత్తరము- సః- మమ్ము- పుష్ణాతు- రక్షించుగావుత- ◈

ఈశ్లోకార్థ(ం)బుగోపాలకృష్ణైకాదశాక్షరీమంత్రధ్యానమనిసనత్కుమారసంహితయందుఁ జెప్పంబడియె.................. ◈

శ్లో॥ హరంతంనవనీతాదీన్ చౌర్యేణ వ్రజయోషితామ్ । సగోబాలైర్వృతంకృష్ణంధ్యాయేన్మన్త్రంజపేదిదమ్॥ ... ... ... ◈

ఉ॥ చిన్నికుమారయెవ్వఁడవు సీగికిఁదమ్ముఁడనేలయిందురా। మన్నిలయంబటంచునిదిమంచిదె కేలటుసాచెదేటికిఁ। వెన్నపనంటిలోనజననీయొక దూడనుజూడవచ్చితిన్ । విన్నదనంబుమానుమనిప్రేతకుబల్కుము రాధిఁగోల్చెదన్॥ ◈

తా॥ ఓకృష్ణానీవెవ్వండవనిన - నేబలరామునితమ్ముఁడననవిక్కడనేమిపనియనినాయిల్లనుబుద్ధిచే వచ్చితిననియెనిది యుక్తంబకాని వెన్నపనంటిలోఁగేలుంచెదవేమనినదూడనువెదకుచున్నానునీవువతిమేమియునెంచకుమీయనియివ్విధంబునగోపికతోఁడంబలుకుశ్రీకృష్ణునివచనంబునన్నుం బ్రోచుగాతయనుట.

శ్లో॥ గోపాలాజిరకర్దమేవిహరసేవిప్రాధ్వరేలజ్జసేబ్రూషేగోకులహుంకృతైస్స్తుతిశతైర్మౌనంవిధత్సేవిదామ్ । దాస్యంగోకులపుంశ్చలీషుకురుషే స్వామ్యంనదాన్తాత్మసుజ్ఞాతంకృష్ణతవాంఘ్రిపంకజయుగప్రేమ్ణాచలం మఞ్జులమ్॥

టీక॥ హేకృష్ణ- ఓయికృష్ణుడా - గోపాలాజిరకర్దమే - గోపాల- గోపాలకులయొక్క - అజిర - ఇంటిముంగిళ్లయందలి - కర్దమే - పంకమందు - విహరసే- విహరింతువు- విప్రాధ్వరే- బ్రాహ్మణయజ్ఞమునందు - లజ్జసే - సిగ్గునొందుదువు- గోకులహుంకృతైః- గోకుల - పశుసమూహములయొక్క - హుంకృతైః - హుంకారధ్వనులతోఁటి- బ్రూషె- పలుకుచున్నావు- విదాం - జ్ఞానులకు - స్తుతిశతైః - అనేకస్తోత్రములచేత- మౌనం- మూకతను - విధత్సే- చేయుచున్నావు- గోకులపుంశ్చలీషు- గోకుల-నందవ్రజమునందలి - పుంశ్చలీషు స్వైరిణులవిషయమై- దాస్యం- దాసభావమును- కురుషే- చేయుదువు-దాన్తాత్మసు - దాంత - విషయములవలననివృత్తమయిన -ఆత్మసు- మనస్సుగలవారలవిషయమయి- స్వామ్యం- స్వామిత్వమును- నకురుషె - చేయవు- అతః-ఈహేతువువలన- మంజులం - సుందరమైన- తవ- నీయొక్క - అంఘ్రిపంకజయుగం - పాదకమలద్వంద్వము-ప్రేమ్ణా-ప్రేమచేత - మయా- నాచేత - అచలంస్థిరముగా- జ్ఞాతం - తెలియఁబడియెను. ... ... ...

మ॥ క్రతుభూమింజొరఁబోవుగోపగృహపంకంబన్న మెట్టేవుగో । తతిహుంకారమువిన్నబల్కేదవువిద్వద్గోష్ఠికింబల్కవా।సతిగావింతువుగోపజారలకుదాస్యశ్రేణిగైకోవుయో।గ్యతయేహేతువుప్రేమకారణముగాదాదేవనీచర్యకుఁ॥

తా॥ ఓకృష్ణా గోపాల గృహంబుల ముంగిళ్లబురదయందు బారలుదువు బ్రాహ్మణయజ్ఞంబులకుంబోవసిగ్గుపడియెదవుఆలగుంపుల హుంకారంబులకు మారుపల్కెదువిజ్ఞానులతోడంబలుకకుండుదువుగోప కాంతలకు దాస్యంబుసేయుదువుఆత్మవిదులకుప్రభుత్వంబునైనచేయనోపవిట్టినీచరితంబుసూడనెద్దియు గారణంబులేదుప్రేమయొక్కటియకారణంబనుట. ✦

శ్లో॥ నమస్తస్మైయశోదాయాదాయాదాయాస్తుతేజసే। యద్ధిరాధాముఖామ్భోజంభోజంభోజంవ్యవర్ధత॥ ... ... ... ౮౪

టీక॥ యత్ - ఏతేజము - రాధాముఖాంభోజం - రాధా - రాధయొక్క - ముఖాంభోజం - ముఖకమలమును - భోజంభోజం - భుజించిభుజించి - వ్యవర్ధత - వృద్ధినొందెనో - తస్మై - ఆప్రసిద్ధమయినట్టిన్ని - యశోదాయాః - యశోదయొక్క - దాయాదాయ - పుత్రుడైన - తేజసే - తేజముకొఱకు - నమః - నమస్కారము - అస్తు - అగుగాత - ... ... ... ... ✦

ఉ॥ ఏమహితప్రకాశముదయించినపిన్నటనాఁటనుండిరా। ధామధురాధరాంచిత సుధారసధారలఁ గ్రోలుచుఁ యశో। దామహనీయ దాయసము దాయముఁగాంచిప్రవృద్ధమానమౌ। నామహిమచ్ఛఁగాక హరహంబునశేషసుఖాయురున్నతుల్॥ ... ... ... ... ౮౪

తా॥ రాధాముఖకమలంబాఘ్రాణించుచుప్రవృద్ధంబైనయట్టియశోదాసుతరూపంబగుతేజంబుకొఱకునమస్కరించెదననుట. ✦

శ్లో॥ అవతారాస్సన్త్వన్యేసరసిజనయనస్యసర్వతోభద్రాః। కృష్ణాదన్యః కోవాప్రభవతిగోగోపగోపికాముక్త్యై॥ ... ... ... ౮౫

టీక॥ సరసిజనయనస్య - పుండరీకాక్షునియొక్క - సర్వతోభద్రాః - ఎల్లెడలశుభంబుగలుగ - అన్యే - కొన్నియైన - అవతారాః - అవతారములు - సన్తు - ఉండుగాత - కృష్ణాత్ - శ్రీకృష్ణావతారమునకన్నను - అన్యః - ఇతరమయినకోవా - ఏయవతారము - గోగోపగోపికాముక్త్యై - గో - గోవులయు - గోప - గోపాలకులయు - గోపికా - గోపికలయు - ముక్త్యై - ముక్తికొఱకు - ప్రభవతి -

సమర్థమగుచున్నది. ... ... ... ... ❖

మ॥ అవతారంబులు లేనిశాంకతిక కళ్యాణంబులిద్ధాత్రిలో। నవిపెక్కుల్గలవెంచగోనికరగోపాలిక గోపాంగనా। నివహ శ్రేయమొసంగజాలెనే కృపానిర్నిద్రుడై నట్టిశా। రివలె న్వేఱొకమూర్తిగావునc దదంఘ్రుoగోల్తు నెల్లప్పుడుక్॥

తా॥ తెల్లతామర రేకులుంబోలుకన్నులుగల శ్రీయఃపతి యవతారంబులెల్లెడలననేక శుభాకరంబులై యనేకంబులుండనిమ్ము గోగోపాలక గోపికా సమూహంబులముక్తికనుచుటకు శ్రీకృష్ణావతారంబుదక్కనొండొద్దియుసమర్థంబులుగావనుటపశువులు మొదలగువానికి మోక్షంబిచ్చుటకుం గృష్ణావతారంబకారణంబయ్యెననుట. ... ... ... ... ❖

శ్లో॥ మధ్యేగోకులమణ్డలంప్రతిదిశంచామ్బారవోజ్జృంభితే ప్రాతర్దోహమహోత్సవేనవఘనశ్యామంరణన్నూపురం। ఫాలేబాలవిభూషణం కటిరణత్సత్కిఙ్కిణీమేఖలం కంఠేవ్యాఘ్రనఖంచశైశవకళాకళ్యాణకార్త్స్న్యంభజే॥

టీక॥ ప్రాతర్దోహమహోత్సవే. ప్రాతర్దోహ - రేపకడబిదుకుటయనియెడి - మహోత్సవే. ఉత్సవమునందు. ప్రతిదిశం - ప్రతిదిశయందును - అంభారవోజ్జృంభితే. అంభారవ. అంభాయనియెడిధ్వనులచేత - ఉజ్జృంభితే. మిక్కిలియుప్రకాశించుచున్న - మధ్యేగోకులమండలం - గోసమూహమధ్యప్రదేశమందు. నవఘనశ్యామం - నవ. నూతనమయిన - ఘన - మేఘమువలె. శ్యామం - నల్లనయినయట్టిన్ని - రణన్నూపురం - రణత్. మ్రోయుచున్న - నూపురం - కాలియందియలుగలయట్టిన్ని. ఫాలే - నొసటియందు - బాలవిభూషణం - రావిరేకగలయట్టిన్ని. కంఠే - గళమునందు. వ్యాఘ్రనఖం - పులిగోరుగలయట్టిన్ని - కటిరణత్సత్కింకిణీ మేఖలం - కటి - పిఱుదులయందు - రణత్. మ్రోయుచున్న. సత్. శ్రేష్ఠమయిన - కింకిణీ - చిఱుగంటలుగల. మేఖలం. మొలనూలుగల - శైశవకళాకళ్యాణకార్త్స్న్యం. శైశవ - శిశుసంబంధమయిన - కళా. కళలయొక్క - కళ్యాణ - శుభములయొక్క - కార్త్స్న్యం. సర్వమును. భజే. సేవించుచున్నాను. అహం - నేను. ... ... ❖

ఈశ్లోకార్థము గోపాలకృష్ణసర్వసమ్పత్కరదష్టాక్షరీ మంత్రధ్యానమనిసనత్కుమారసంహితయందుc జెప్పంబడియున్నది .........❖

శ్లో॥ పఞ్చవహాయనమీశానంధావమానం వ్రజాఙ్గణే। కిఙ్కిణీనూపురప్రాకార భూషోజ్జ్వలంస్మరేత్॥ ... ... ... ... ❖

మ॥ మొలనూలం దెలుంగ జెలువొప్పయ జీమూతాకృతిం జేరిమంచి దలసంభా రవమెల్లెడం జెలగ బ్రాతర్గోహమీక్షింపజా। రులలాటంబున రావిరేకపులిగోరుం గంఠవీథిక్ దటి। త్తులగా ముద్దులుగుల్కు బాలకుని గాంచుక్ జీవన ప్రౌఢికిక్॥

తా॥ రేపకడం బాలుపిదుకునప్పుడం భారవంబు చెల్లకం జెలంగ వెలయునాలగుంపుల చేనొప్పెడు వ్రేపల్లెయందు గవ్వమొగులు చెన్నడంచు నెన్నెనుదనరంబులిగోరు పతకంబును జిఱుగంటల మొలనూలు గాళ్లనందియలు రావిరేకయు ను మెఱయ నెల్లవారున చ్చెరువునొందగలయం గ్రుమ్మరుచున్న కృష్ణుని చిన్ననాటి చెయ్వులందలం చి భజియించెదననుట. .... ... ...

శ్లో॥ సజలజలదనీలం దర్శితోదారలీలం కరతలధృతశైలం వేణునాదైరసాలం। వ్రజజనకులపాలం కామినీకేళిలోలం కలితలలితమాలం నౌమి గోపాలబాలమ్॥

టీక॥ సజలజలదనీలం॥ సజల. ఉదకముతోఁగూడిన. జలద. మేఘమువలె. నీలం - నల్లనయినవాఁడును. దర్శితోదారలీలం. దర్శిత - చూపబడిన. ఉదార. అధికములయిన - లీలం - పూతనావధాదివిలాసములుగలవాఁడును. కరతలధృతశైలం - కరతల - హస్తప్రదేశముచేత. ధృత - ధరియింపఁబడిన - శైలం - గోవర్ధనపర్వతముగలవాఁడును. వేణునాదైః - వేణునాదములచేత - రసాలం - రసవంతుఁడయినవాఁడును. వ్రజజనకులపాలం - వ్రజ. మందవ్రజముందలి. జనకుల - జనసమూహముయొక్క - పాలం. పరిపాలకుఁడయినవాఁడును - కామినీకేళిలోలం - కామినీ - కామపరవశులయిన స్త్రీలయొక్క - కేళి - క్రీడలయందు. లోలం. ఆసతోఁగూడికొనినవాఁడును. కలితలలితమాలం - కలిత - కూర్చుకొనినయది యు. లలిత. కోమలము లైనదియు నైన. మాలం. వనమాలికగలవాఁడును. గోపాలబాలం. గోపాలకృష్ణుని - నౌమి. నుతించుచున్నాను.

మ॥ మురళీనాదవిశాలు నీలమణిజీమూతాతసీనీలుసా। రసుహాసేక్షణశీలిలోలుహస్తజలజాగ్రన్యస్తశైలుం సదా। దరనీలుక్ ప్రజలోకపాలుఁ గరుణోదారైకలీలుక్ భుజాం। తరరాజద్వనమాలుఁ గొల్చెదవయుద్వద్గోపబాలున్మదిక్॥ ౮౬

తా॥ ఉదకంబుతోఁగూడిన మేఘంబుబోలె నల్లనగుచుఁ జూపంబడిన గంభీరంబులగు పూతనాహరణాది క్రీడలుగలిగి కేలం గీలించిన గోవర్ధనాచలంబు గలిగి వేణునాదంబున నైనయాహ్లాదంబుతోడం గూడి మందవ్రజంబునందున్నవారలం బ్రోచుచు కామవతులైనయువతులకోరికలందీర్చుచు నైపుణికియును పేరం దేజరిల్లు వనమాలికయురంబునఁ గరంబు మెఱయు వెలుంగు గోపాలదేవుని స్తుతియించుచున్నాననుట. ... ... ... ..

శ్లో॥ స్మితలలితకపోలం స్నిగ్ధసంగీతలోలం లలిత చికురజాలం చౌర్యచాతుర్యలీలమ్। శతముఖరిపుకాలం శాతకుమ్భాభచేలం కువలయ దళనీలం నౌమి గోపాలబాలమ్॥ ... ... ... ... ... ౮౮

టీక॥ స్మితలలితకపోలం - స్మిత - చిఱునగవనియెడి హేతువుచేత - లలిత- సుందరమయిన - కపోలం- చెక్కిళ్లుగలవాఁడును - స్నిగ్ధసంగీతలోలం - స్నిగ్ధ పరిశుద్ధహృదయులైన నారదాదులయొక్క - సంగీత- గానమందు - లోలం.ఆసక్తి జేయుచున్నవాఁడును- లలితచికురజాలం- లలిత- సుందరములయిన- చికుర- ముంగురులయొక్క - జాలం - సమూహము గలవాఁడును - చౌర్యచాతుర్యలీలం - చౌర్య- చోరకర్మమందు- చాతుర్య- చాతుర్యముతోఁగూడిన- లీలం.క్రియగలవాఁడును- శతముఖరిపుకాలం- శతముఖ- ఇంద్రునికి- రిపు- శత్రువులయిన రక్కసులకు - కాలం-యముఁడైనవాఁడును-శాతకుంభాభచేలం- శాతకుంభ బంగారుయొక్క -అభ-కాంతివంటికాంతిగల- చేలం-వస్త్రముగలవాఁడును కువలయదళనీలం. కువలయదళ- నల్లకలువరేకులవలె - నీలం- నల్లనైన- గోపాలబాలం - గోపాలకృష్ణుని- నౌమి నుతించుచున్నాను ... ...

మ॥ సరసస్మేరకపోలుఁగోమలమురళీసంగీత లోలుఁ శుభా। కరచామీకర చేలునీలమణిరంగత్కుంతలశ్రీవిశా। లురమాపాలునితాంతచౌర్యగుణశీలున్ దానవప్రాణహృ। త్కరవాలుంగపిలాదళోత్పల యోద్యన్నీలుగోపాలునిన్॥

తా॥ చిఱునగవుచే సుందరంబులగు చెక్కిళ్లుగలిగి నారదాదుల సంగీతం నందాసక్తుండై లలితంబులగు ముంగురులచేఁ జెజరిల్లుచు దొంగతనంబునం చాతుర్యంబు గలిగి యెల్ల రక్కసులకు నంతకుండై బంగరు చేలంబుచే నలంతుండై కువలయదళంబుంబోని నెమ్మేనిచాయచే వెలయుగోపాలకృష్ణుని నుతించుచున్నాననుట. ... ... ... ... ...

శ్లో॥ మురళినినదలోలం ముగ్ధమాయూరచూళం దళితదనుజజాలం ధన్యసౌజన్యలీలం। పరహితనవహేలం పద్మసద్మానుకూలం నవజలధరనీలం నౌమి గోపాలబాలమ్॥ ... ... ... ... ...

టీక॥ మురళినినదలోలం - మురళినినద- వేణునాదమందు - లోలం - చేయుచున్నవాఁడును - ముగ్ధమాయూరచూళం - ముగ్ధ - సుందరమైన - మయూరచూళం - నెమలిపురిగలవాఁడును- దళితదనుజజాలం- దళిత- భేదించిన - దనుజ- రక్కసులయొక్క - జాలం - సమూహముగలవాఁడును - సౌజన్యలీలం- ధన్య- కృతార్థులవిషయమయి- సౌజన్య - సుజనత్వముల

డిన- లీలం- విలాసములుగలవాఁడును- పరహితనవహేలం- పర- అన్యులకు- హిత- హితకరములయినవియు - నవ- నూతనములయినవియునగు - హేలం- విలాసములుగలవాఁడును- (మఱియొకపక్షమున) పర- శత్రువులకు- హిత-హితకరములకు - నవ- నూతనములైన- హేలం - వధాదివిలాసములుగలవాఁడును- (అనఁగా శ్రీకృష్ణునిచేఁ జేయంబడు వధాదికృత్యములైనను ముక్తిసంపాదకములగుననిభావము) పద్మపద్మానుకూలం-పద్మపద్మ- బ్రహ్మకు-అనుకూలం- అనుకూలుఁడైనవాఁడును- పక్షాంతరమున) పద్మపద్మా- లక్ష్మీదేవికి - అనుకూలం- అనుకూలనాయకుఁడైనవాఁడును- నవజలధరనీలం- నవజలధర- క్రొత్తమొగులువలెన్- నీలం - నల్లనైనవాఁడునైన - గోపాలబాలం - గోపాలకృష్ణుని- నౌమి- స్తుతియించుచున్నాను- ... ... ... ❁

చ॥ మురళినినాదలోలునతిముగ్ధశిఖావళపింఛచూళునిం। బరహితశీలురాత్రి
చరపాళిపథాలుగృతార్థలోలుఁబం। కరుహగృహానుపాలుబ్రజకంజముఖీహి
తహేలునవ్యపు। ష్కరధరనీలుఁగొల్తుశుభకాంచనచేలునిగోపబాలునిన్॥

తా॥ వేణునాదంబునందాసక్తుండై సిగయందు నెమలిపురియలంకరించియెల్లరక్కసులంజక్కడంచుచు ధన్యులయొక్క సౌజన్యంబు నెలుపుచు శత్రులకు వధాదికృత్యంబులచే మోక్షంబొసంగఁజాలుసిరికనుకూలుండై నీలమేఘునిభశరీరుండై వెలయుగోపాలబాలుని నుతియించుచున్నానని- ... ... ❁

శ్లో॥ సరసగుణనికాయం సచ్చిదానందకాయం శమితసకలమాయం సత్య
లక్ష్మీసహాయమ్। శమదమసముదాయం శాంతసర్వాంతరాయం సుహృదయ
జనదాయం నౌమి గోపాలరాయమ్॥ ... ... -- ౯౦

టీక॥ సరసగుణనికాయం- సరస- సంయుక్తములయిన- గుణ- సౌందర్యాదిగుణములయొక్క - నికాయం- సమూహముగలవాఁడును - సచ్చిదానందకాయం- సత్యజ్ఞానానందస్వరూపుఁడయినవాఁడును- శమితసకలమాయం- శమిత- శాంతిఁబొందింపఁబడిన- సకల- సమస్తమయిన - మాయం- మాయలుగలవాఁడును- సత్యలక్ష్మీసహాయం- సత్యలక్ష్మీ- సత్యభామారూపమైనలక్ష్మికి- సహాయం- సహాయుఁడైనవాఁడును- శమదమసముదాయం - శమ- బహిరింద్రియనివృత్తియొక్కయును- దమ- అంతరింద్రియనివృత్తియొక్కయును- సముదాయం- స్వరూపుఁడయినవాఁడును- శాంతసర్వాంతరాయం- శాంత-నష్టములయిన - సర్వ- సమస్తములయిన- అంతరాయం- విఘ్నములుగలవాఁడును- సుహృదయజనదాయం- సుహృదయ - నిర్మలాంతరంగులయిన- జన- జ

మమరతిరస్కృతిశమనపరస్స క్రియాత్ శ్రీకృష్ణమ్॥ ... ౯౨

టీక॥ యః- ఏకృష్ణుండు - వీర్యశాలీ - వీర్యపరాక్రమముచేత - శాలీ- ఒప్పుచున్న- వాడగుచు- యమునాం- యమునానదిని- అవతీర్య - దిగి - మదమయం- మద- ప్రచురమైన- ఉరగం- కాళీయోరగమును- అదమయత్ - మదిగించెనో- అమరతిరస్కృతిశమనపరః - అమర - దేవతలయొక్క - తిరస్కృతి- తిరస్కారముయొక్క - శమన- శాంతిచేయుటయందు- పరః- ఆసక్తుండైన- సః- ఆ- శ్రీకృష్ణమూర్తిః- మమ -నాకు- రతిం- సుఖమును- క్రియాతు- చేయుగావుత-

శా॥ కాళిందీజలముబ్బిగట్లుకెదురెక్కంజొచ్చిపకాలింపాల। జ్వాలాలీఢకరాళకాళియఫణాజాలంబునన్నృత్తక్రియం। గాలంగేలనడంచినిర్జరతిరస్కారంబు వాదించుగో। పాలస్వామికటాక్షవీక్షణము మాపాలందిరంబయ్యెడిన్॥ ౯౨

తా॥ ఏశ్రీకృష్ణమూర్తి పరాక్రమవంతుండై యమునానదిలోనం జొచ్చి మదంబుచే విజృంభిగు కాళీయోరగంబు మదంబడంచెనో యెల్లదేవతల తిరస్కారంబులం బోవమీటినయా శ్రీకృష్ణమూర్తి నాకు శుభంబుం గలుగంజేయుంగాత యనుట. ◆

శ్లో॥ మౌళౌ మాయూరబర్హం మృగమదతిలకం చారులాలాటపట్టే కర్ణద్వన్ద్వే చ తాళీదళమతిమృదులం మౌక్తికం నాసికాయామ్। హారో మందారమాలా పరిమళభరితః కౌస్తుభస్యోపకణ్ఠే పాణౌ వేణుశ్చ యస్య వ్రజయువతియుతః పాతు పీతామ్బరో నః॥ ... ... ... ... ... ౯౩

టీక॥ యస్య- ఎవ్వనికి - మౌళౌ- శిరంబున- మాయూరబర్హం- నెమలిపురియున్నదో- లాలాటపట్టే- లాలాటే- లలాటసంబంధమైన - పట్టే - ప్రదేశంబునందు- చారు- సుందరమైన- మృగమదతిలకం- కస్తూరిబొట్టున్నదో- కర్ణద్వంద్వే- కర్ణ - చెవులయొక్క - ద్వంద్వే- రెంటియందు- అతిమృదులం - మిక్కిలి మృదువైన- తాళీదళంచ - తాళపత్రంబున్నదో - నాసికాయాం - ముక్కునందు- మౌక్తికం - ముత్యంబున్నదో- కౌస్తుభస్య- కౌస్తుభమణియొక్క- ఉపకంఠే- సమీపమందు - మందారమాలాపరిమళభరితః - మందారమాలా- మందారపువ్వులదండయొక్క - పరిమళ- వాసనచేత- భరితః- సంపూర్ణమైన- హారః - హారంబును- పాణౌ- చేతియందు - వేణుశ్చ - పిల్లనగ్రోవియునున్నదో- సః- అట్టి- వ్రజయువతియుతః- వ్రజయువతి- గోపస్త్రీలతోడ - యుతః- కూడుకొనియున్న- పీతాంబరః- పీతాంబరధరుండైన శ్రీకృష్ణుడు- నః - మమ్ము- పాతు- రక్షించుగాక- ... .. ... ... ◆

మ॥ నుదుటంగస్తురిబొట్టు నాసికతుదన్ముత్యంబు కర్ణద్వయిన్। మృదుతాళీదళ

యుగ్మముఁ గమ్మురళిపాణిఁ గమ్మోవిబింబంబు పే। రెదపైఁగౌస్తుభహారకల్పసుమనో
హేమాంబరాడంబరం। బొదవన్గోపికలెల్లఁగొల్వహరిడాయుంగామమ్ము నెల్లప్పుడు

తా॥ సిగయందు నెమలిపురియు ఫాలంబునఁ గస్తూరిబొట్టును శ్రవణయుగ్మం
బున లేతయగు తాళిదళంబును ముక్కుకొనయందు ముత్తియంబును గౌస్తుభమణి
చెంగట మందారకుసుమవాసితస్వర్ణహారంబును గరంబునఁ బిల్లనగ్రోవియుఁ జె
న్నుగఁ జెన్నారఁ బీతాంబరధారియై గోపికాసమేతుండగు చిన్నికృష్ణుండు మ
మ్ముం గాపాడుఁగావుతయనుట. ... ... ... ◈

శ్లో॥ మురారిణా వారివిహారకాలే మృగేక్షణానాం ముషితాంశుకానాం।
కరద్వయం వా కచసంహతిర్వా ప్రమీలనం వా పరిధానమాసీత్॥ ౯౪

టీక॥ వారివిహారకాలే - జలక్రీడాసమయంబున - మురారిణా - కృష్ణునిచే
త - ముషితాంశుకానాం - ముషిత - అపహరింపఁబడిన - అంశుకానాం - వ
స్త్రములుగలయట్టి - మృగేక్షణానాం - స్త్రీలకు - కరద్వయంవా - కర - చేతు
లయొక్క - ద్వయంవా - రెండును - కచసంహతిర్వా - కచ - వెండ్రుకలయొ
క్క - సంహతిర్వా - సమూహంబును - నిమీలనంవా - కన్నులనుమూసుకొను
టయును - పరిధానం - వస్త్రంబుగా - ఆసీత్ - ఆయెను. ◈

ఉ॥ వారివిహారకాలమున వారిరుహాక్షుఁడు చీరలెత్తఁగా। వారిజపత్రపాళిక
చభారము కన్నులమోడ్పు చేతుల। న్వారిగమాటులై యొసఁగ వారిచరాక్షుల
కెల్లవారయి। న్వారికిమాటలేటికిన వారితమోహతమంబుఁ గ్రమ్మఁగన్॥ ౯౪

తా॥ జలక్రీడసలుపుచుండెడిగోపికలు తమ చీరెలను కృష్ణుండపహరింప
వారిలోఁ గొందరు చేతులతో నున్న కొందరు వెండ్రుకలతో నున్న గుహ్యములను
మూసికొనిరి కొందరు ముగ్ధలు తమ కన్నులను మూసుకొనఁగా తమగుహ్యంబు
లితరులకు దెలియవని యెంచుకొనిరనుట. ... ... ... ◈

శ్లో॥ యాసాంగోపాఙ్గనానాం లసదసితతరాలోలలీలాకటాక్షా। యస్యాం
సాచారుముక్తామణిరుచిరకరవ్యోమగఙ్గాప్రవాహే। మీనాయన్తేపియాసా
మతిరభసచలచ్చారునీలాలకాన్తా। భృఙ్గాయన్తే యదంఘ్రిద్వయసరసిరుహే
పాతుపీతాంబరోనః॥ ... ... ... ... ౯౫

టీక॥ యాసాంగోపాఙ్గనానాం - ఏగోపస్త్రీలయొక్క - లసదసితతరా
లోలలీలాకటాక్షాః - లసత్ - ప్రకాశించుచున్నట్టి - అసితతర - అత్యంతనీలమై
నట్టి - ఆలోల - చంచలించుచున్నట్టి - లీలా - విలాసముతో నైన - కటాక్షాః - క

దగంటిచూపులు - యన్నాసాచారుముక్తామణిరుచి నికరవ్యోమగంగా ప్రవాహే. యత్- ఎవ్వనియొక్క - నాసా. ముక్కుయొక్క - చారు- సుందరమైన- ముక్తామణి - ముత్యముయొక్క , రుచి. కాంతులయొక్క - నికర - సమూహముయ్యెడి- వ్యోమగంగా. ఆకాశగంగయొక్క - ప్రవాహే - ప్రవాహమందు. మీనాయంతే. మత్స్యములవలెనాచరించుచున్నవో. యాసాం. ఏగోపికలయొక్క - అతిరభసచలచ్చారునీలాలకాంతాః. అతిరభస- అతివేగముచేత - చలత్. చలించుచున్నట్టిన్ని- చారు-మనోహరంబయినట్టి- నీల- నీలవర్ణంబయిన- అలక - ముంగురులయొక్క - అంతాః. కొనలు. యదంఘ్రిద్వయసరసీరుహే. యత్- ఎవ్వనియొక్క - అంఘ్రి- పాదములయొక్క - ద్వయ- రెండును- సరసీరుహే. తామరపువ్వుయందు - భృంగాయంతే. తుమ్మెదలవలె నాచరించుచున్నవో- తాసాం- అట్టిగోపికలయొక్క - సంబంధమైనట్టి - సః- అటువంటి. పీతాంబరః - కృష్ణుఁడు - నః - మమ్ము- పాతు. రక్షించుఁగాక.*

మ॥ సరవిన్ మీనము లయ్యె నేవిభుని నాసామౌక్తికోద్యత్ప్రభా । మరగంగన్ వ్రజభామినీచటుల శంపాలోలదృక్పాళులే । వి పాదాంబురుహంబునందున కులై వ్యాపించెగోపాంగనా । తరళారాళవినీల కుంతళముల౦ధన్యుం డునన్ బ్రోవుతన్ ॥ ... ... ... ... ౯౫

తా॥ కృష్ణునిముక్కరముత్యపుకాంతిగంగాప్రవాహమున లెప్రసరించగా నావేడుకచూచుటవలన గోపికలచూపులందులోమత్స్యంబువలె కనఁబడుచున్న వి. అట్టిచూపులుగలగోపికలు - అంగా. మందహాసవిశేషంబోయనునట్టి ముత్యపుకాంతివెలుఁగుచుండుకృష్ణునిమొగము జూచి ప్రేమపరవశలైనగోపికలు మాఁకోరికలనెరవేర్చినమ్ము కావవలయునని వానిపాదారవిందంబులయందుముంగురులుప్రేలాడునట్లునమస్కారంబులనొనర్చెదరనుట.

శ్లో॥ యద్వేణుశ్రేణిరూపస్థితసుషిరముఖోద్గీర్ణనాదప్రభిన్నా ఏణాక్ష్యస్తత్క్షణేన త్రుటితనిజపతిప్రేమబన్ధా బభూవుః। అస్తవ్యస్తాలకాన్తస్ఖలదధరకుచద్వన్ద్వనాభిప్రదేశాః కామావేశప్రకల్ప్యప్రకటితపులకాః పాతు పీతామ్బరో నః ॥౯౬

టీక॥ యద్వేణుశ్రేణిరూపస్థితసుషిరముఖోద్గీర్ణనాదప్రభిన్నాః- యత్- యెవ్వనియొక్క - వేణు- పిల్లనగ్రోవియందు - శ్రేణిరూప - పఙ్క్తిరూపముగా- స్థిత- ఉన్నట్టి - సుషిర - రంధ్రములయొక్క - ముఖ- ముఖంబులచేత- ఉద్గీర్ణ- విడువఁబడిన- నాద - ధ్వనులచేత- ప్రభిన్నాః- భేదింపఁబడినట్టి - ఏణా

త్న్యః - స్త్రీలు. తత్ర తేన. అతనివలన. త్రుటితనిజపతిప్రేమబంధాః - త్రుటిత - తెంపఁబడిన - నిజ - తమయొక్క - పతి - మగండ్లయందుండెడి - ప్రేమ - ప్రీతివిశేషముయొక్క - బంధాః - బంధముగలిగినవారై - అస్తన్యస్తాలకాంతాః - అస్త - తిరస్కరింపఁబడిన - న్యస్త - పీడినట్టి - అలక - ముంగురులయొక్క - అంతాః - కొనలుగలవారుగానున్న - స్ఫురదధరకుచద్వంద్వనాభిప్రదేశాః - స్ఫురత్ - అదురుచున్న - అధర - మోవియును - కుచద్వంద్వ - స్తనద్వయంబును - నాభిప్రదేశాః - నాభిప్రదేశంబునుగలవారుగానున్న - కామావేశప్రకల్ప్య ప్రకటితపులకాః - కామావేశ - మన్మథావేశముచేత - ప్రకల్ప్య - దట్టముగా జేయబడినట్టి - ప్రకటిత - బయలుబడుచున్నట్టి - పులకాః - గగ్గురులుగలవారుగాను. పాతు - రక్షించుగాక. ... ... ... ... ❖

మ॥ మురళీరంధ్రవినిర్గతస్వరముచే మోహించి గోపాంగనల్ । మరుబారిన్వలుగుబ్బలుబ్బి పులకింపన్ గ్రొమ్ముడుల్వీడఁగా । తెగసొంపుల్నిగుడింప నీవియనుభర్తల్ ప్రేమముల్లా యొసఁగె । హరివెంటన్ జరియింతురట్టి సుకుమారాకారుఁగీతిఁ జేరన్ ॥ ... ... ... ... ... ౯౬

తా॥ కృష్ణునివేణునాదంబువినిగోపికలు హృదయశైథిల్యముఁబొందితమనాయకులయందుప్రేమవిడిచి - కృష్ణునివద్దఁబోవునపుడావేగమువలన జారినముంగురులనుకట్టకయుపేక్షించుచునాయధరకుచద్వంద్వనాభిప్రదేశంబులదరకామావేశంబువలనమేనెల్లగగ్గురుపాటుగలుగ వెలుగుచుండిరనుట. ❖

శ్లో॥ దేవక్యాజఠరాకరేసముదితః క్రీతోగవాంపాలినానన్దేనానకదున్దుభేర్నిజసుతాపణ్యేనపుణ్యాత్మనా । గోపాలావళిముగ్ధహారతరళో గోపీజనాలంకృతిః స్థేయాద్వోహృదిసన్తతంసమధురః కోఽపీన్ద్రనీలోమణిః॥ ౯౭

టీక॥ దేవక్యాః - దేవకియొక్క - జఠరాకరే - జఠర - గర్భమను - ఆకరే - ఖనియందు - సముదితః - ఉద్భవించినట్టి - పుణ్యాత్మనా - పుణ్యస్వరూపుడయినట్టి - నందేన - నందుడను - గవాంపాలినా - గోపాలకునిచేత - నిజసుతాపణ్యేన - నిజసుతా - తనకూతురగు పణ్యేన - మూల్యముచేత - ఆనకదుందుభేః - వసుదేవునియందుండి - క్రీతః - కొనఁబడినట్టి - గోపాలావళిముగ్ధహారతరళః - గోపాల - గొల్లవాండ్రయొక్క - ఆవలి - వరుసయను - ముగ్ధ - సుందరమయిన - హార - ముక్తాహారంబునకు - తరళః - నాయకమణియైనదియు - గో

జనాలంకృతిః - గోపీజనః - గోపికాజనంబులకు. అలంకృతిః - అలంకారంబైన దియు. మధురః - మనోజ్ఞమయినదియు. కోపి. అనిర్వచనీయంబైన - ఇంద్రనీలోమణిః. ఇంద్రనీలరత్నము. (అనఁగా) కృష్ణుఁడు - వః - మీయొక్క - హృది - హృదయమందు. సంతతం. ఎల్లప్పుడు. స్థేయాత్. ఉండుఁగాత. ❁

మ॥ వసుదేవప్రియదారగర్భఖనిజత్వంబొప్పజన్మించియు। వసుదేవుండిడ నందగోపుఁడుసుతాపణ్యంబునంగొంచురా। నసమానవ్రజమాలహారతరళం బై గోపికాకల్పమై। రసలీలాకృతియైనకృష్ణమణి నిశ్రాంతంబెదన్నిల్పెదర॥ ౯౩

తా॥ ఒకయింద్రనీలరత్నము మీ హృదయంబున - అనఁగా శ్లేషచేతఁ జొప్పునవిలసిల్లవలయు - ఆరత్నమెట్టిదనఁగా దేవకీగర్భమనుఖనియందు నుద్భవిల్లి వసుదేవుని యందుండి నందునిచేతఁ దనకూఁతు రనియెడివెలయిచ్చి కొనఁబడి గోపాలవర్గంపరయనుహారంబునకు నాయకమణియై గోపికలకు భూషణంబై దర్శనస్పర్శనాదులచేత ననుభవించువారలకత్యంతమనోహరం బయినదిఅనఁగా శ్రీకృష్ణుఁడెల్లప్పుడును మీమనంబున వర్తిల్లవలయు నని ముఖ్యతాత్పర్యము తనకూఁతురనెడువెలనిచ్చినందునిచేతఁ గొనఁబడినది - అనుటకు భగవదాజ్ఞవలనయశోదాగర్భంబున మాయా స్త్రీశిశువై పుట్టఁగా వసుదేవుఁడు దేవకీగర్భమందుదయించినట్టి కృష్ణునియశోదాశయనంబుననునిచి యాశిశువునెత్తికొనివచ్చెనను శ్రీభాగవతాదికథలప్రమాణంబులంబట్టికొన్నిశ్లోకంబులయందుబహుభావవిశేషంబులున్నవియైనను గ్రంథవిస్తరపాఠకదురూహకత్వాదిభయముల చెప్పఁబడవయ్యె. ... ... ... ... ... ❁

శ్లో॥ పీఠేపీఠనిషణ్ణబాలకగళేతిష్ఠన్సగోపాలకో యంత్రాంతస్థితదుగ్ధభాండమపకృష్యాచ్ఛాద్యఘంటారవమ్। వక్త్రోపాంతకృతాంజలిఃకృతశిరఃకంపంపిబన్యఃపయః పాయాదాగతగోపికానయనయోర్గండూషఫూత్కారకృత్॥

టీక॥ యః. ఏబాలకుఁడు. పీఠే. పీటయందు. పీఠనిషణ్ణబాలకగళే. పీఠ. పీటయందు. నిషణ్ణ - కూర్చొనియున్న. బాలక - బాలునియొక్క - గళే. కంఠమందు. అనఁగా. మూపులయందు. తిష్ఠన్. నిలచియున్నవాఁడై. యంత్రాంతస్థితదుగ్ధభాండమ్. యంత్ర. ఉట్టియొక్క - అంతః - నడుమ - స్థిత. ఉన్నట్టిదుగ్ధభాండం. పాలకడవను - అపకృష్య. వంచి - ఘంటారవం - గంటయొక్కధ్వనిని - ఆచ్ఛాద్య. నిలిపి - వక్త్రోపాంతకృతాంజలిః - వక్త్ర. నోరియొక్క -

ఉపాంత - సమీపమందు- కృత- ఉంచఁబడిన- అంజలిః- దోయిలిగలవాఁడై. కృతశిరఃకంపయథాతథా - కృత- చేయఁబడిన- శిరఃకంపయథాతథా - తలయూచుటగలుగునట్టులుగా- పయః- క్షీరంబును- పిబన్ సన్- పానముచేయుచున్నవాఁడై- ఆగతగోపికానయనయోః - ఆగత - వచ్చినట్టి- గోపికా- గోపికలయొక్క - నయనయోః- నేత్రములయందు - గండూషఫూత్కారకృత్. గండూష - నోటిపాలయొక్క - ఫూత్కార - ఉమియుటను - కృత్- చేసినట్టి. సః గోపాలకః - ఆ శ్రీకృష్ణుఁడు- పాయాత్- రక్షించుగాక- ❖

ఉ॥ తోరఁపుఁబెద్దగద్దెయులుదోంతరగానిడిబాలునాపయిన్। జేరిచివానిమూపు
నవసించుచునుట్టిప నంటివంచిఘుం। టూరుతినిల్పిపాల్కారమునందలయూచుచు
నానివచ్చినా। భీరికకన్నులందుముసిపెట్టుగదూఱినజూటుఁగొల్చెదన్॥ ❖

తా॥ ఒకగోపాంగనయొక్కగృహమందుదూఁదయొకపీటపైమఱియొకపీటనునిచివానిపయినొకబాలునిఁగూర్చుండఁజేసివానిభుజములయందునిలుచుకొనియచ్చటఁగట్టియున్నయుట్టియందుంచెడిపాలకడవనుంచి యాయుట్టియందుశబ్దించునట్టిగంటనొకచేతితోఁబట్టుకొనిమఱియొకచేతిని నోటగిన్నెవలెనునిచియాకుండనుండికారుచున్నపాలుద్రాగుచునుండునప్పుడా గోపికరాగాఁజూచిదానికన్నులయందుఁదననోటిపాలునుమిసి భ్రమింపచేసిన విలాసియైనబాలకృష్ణుఁడు మమ్ముఁ బ్రోచుగాకయనుట- ... ... ... .. ❖

శ్లో॥ యజ్ఞైరీజిమహేధనందదమహే పాత్రేషునూనంవయం వృద్ధాన్ భేజిమహేతపశ్చక్రుమ మహేజన్మాంతరేదుశ్చరమ్। యేనాస్మాకమభూదనన్యసులభాభక్తిర్భవద్వేషిణీచాణూరద్విషిభక్తకల్మషముషిశ్రేయఃపుషిశ్రీజుషి॥ ❖

టీక॥ వయం - మేము- జన్మాంతరే- జన్మాంతరమందు - యజ్ఞైః - యాగముచేత- ఈజిమహే - పూజించినవారము- పాత్రేషు- సత్పాత్రములయందు ధనం - ధనంబును- దదమహే- ఇచ్చినవారము- వృద్ధాన్ - జ్ఞానవృద్ధులను- భేజిమహే - సేవించినవారము - దుశ్చరం - కఠినమయిన - తపః - తపస్సును- చక్రుమహే - చేసినవారము - నూనం - నిశ్చయము - యేన - ఏకారణముచేత అస్మాకం - మాకు - భక్తకల్మషముషి - భక్త- భక్తులయొక్క - కల్మష - పాపములను - ముషి- అపహరించుచున్నవాఁడును- శ్రేయఃపుషి- శ్రేయః- శ్రేయస్సులను- పుషి- పోషించుచున్నవాఁడును- చాణూరద్విషి - చాణూర - చాణూరుఁడనునసురునికి - ద్విషి- ద్వేషియైనవాఁడును- శ్రీజుషి - లక్ష్మీపతియైనకృష్ణునియ

స. భవద్వేషిణీ- భవ - సంసారమునకు-ద్వేషిణీ-ద్వేషిణియైనట్టి- అనన్యసులభా-
న్యులకుసుఖముగానొందగూడనటువంటి- భక్తిః భక్తి- అభూత్- కలిగెను॥

మ॥ మునుజన్మాంతరవేళదుష్కరతపంబుల్పాత్రదానంబును। జననంసేవయు
సధ్వరంబులొనరించకుంటినిగాకున్న౯। లిని నెలోకోత్తరభక్తినాదుమదినాలో
ంపచాపావనే। జనకృష్ణ్యోపణుదుష్టభీషణబుమహాబాణాలవిద్వేషణు౯॥ ౯౯

తా॥ వేదాంతములుచెప్పినట్టులిజన్మముందుఁజేయకపోయినను బూర్వజ
న్మంబునయజ్ఞములచేభగవత్స్వరూపులయినట్టిదేవతలను బూజించియుందుము.
సత్పాత్రమందుద్రవ్యమునినియోగపఱిచియుందుముకువృద్ధసేవసేసి యుందుము
కృచ్ఛ్రచాంద్రాయణాదులననుష్ఠించియుందుము - అట్లుచేయకుండుమేనిప్పుడు
దుష్టులనిగ్రహించి భక్తులపాపములనెల్ల పోఁగొట్టిధర్మాదిసకల పురుషార్థదం
బులనొసంగునట్టిలక్ష్మీపతియైనశ్రీకృష్ణునియందునీసంసారబంధంబును చెఁగఁగొ
ట్టునట్టియసాధారణభక్తిగలుగ నేరదనుట॥ ఇచటలక్ష్మీపతియనునదియాశ్రితర
క్షణాదులయందును సర్వోత్కర్షణమందునుగారణమను నభిప్రాయముచేత
బ్రయోగింపంబడియెనని తెలియునది- ... -- ...

శ్లో॥ త్వయిప్రసన్నేమమకింగుణేనత్వయ్యప్రసన్నేమమకింగుణేన। రక్తేపి
రక్తేచవరేవధూనాంనిరర్థకఃకుంకుమపత్రభంగః॥ ౧౦౦

టీక॥ హేకృష్ణ- ఓకృష్ణ - త్వయి - నీవు- ప్రసన్నేసతి - నాయందుదయజే
యుచునుండఁగా- మమ- నాయొక్క - గుణేన- గుణముచేత-కిమ్- ఏమిప్రయో
జనము - త్వయి నీవు- అప్రసన్నేసతి - దయఁజేయకుండగాఁ - మమ - నాయొ
క్క - గుణేన- గుణముచేత- కిం- ఏమిప్రయోజనము- వరే- నాయకుఁడు - ర-
క్తేసతి- ఆశగలవాఁడై యుండినను - విరక్తేచ - ఆశలేనివాఁడై యుండినను - వ
ధూనాం - నాయికలయొక్క -కుంకుమపత్రభంగః - కుంకుమ - కుంకుమచేత జేసి
నట్టి - పత్ర - మకరికాపత్రములయొక్క -భంగః - రచన- నిరర్థకః- వ్యర్థము-

ఉ॥ నీవుప్రసన్నమైనయెడ నేరుపులేటికిన ప్రసన్నత। న్నీవుపరాకుచేసిన
నునేరుపులేమిటికెంచిచూడగ్ను। ప్లాణిభుడాదరించుసమయంబుననొల్లమిసేయు
వేళల౯। గావలెనేలతాంగులకుగై పగుకుంకుమపత్రభంగముల్॥ ౧౦౦

తా॥ వరుఁడునాయికలపై నాసగలిగియుండినను నాసలేకయుండినను గుం
కుమలిప్తమకరికాపత్రములయొక్క వ్రాతనిరర్థకమగునటులభగవంతుడుతానే
రక్షింపవలయుగానిమనస్సుయొక్కగుణదుర్గుణమువలననానికి దయపుట్టదనుట

శ్లో॥ గాయన్తి క్షణదావసానసమయే సానందమిందుప్రభారుంధత్యో నిజద న్తకాంతినివహైర్గోపాంగనా గోకులే । మథ్నత్యో దధి పాణికంకణ ఝణత్కా రానుకారం జవా ద్వ్యావల్గద్వసనాఞ్చలా యమనిశం పీతామ్బరో వ్యాత్స నః॥

టీక॥ నిజదంతకాంతినివహైః - నిజ- తమయొక్క - దంతకాంతి- దంతకాం తులయొక్క - నివహైః- సమూహములచేత - ఇందుప్రభాః - చంద్రకాంతు లను- రుంధత్యః- తిరస్కరించుచున్నట్టివై - జవాత్- వేగముచలన - వ్యావల్గద్వ సనాంచలాః - వ్యావల్గత్ - విశేషముగా చలించుచున్న - వసన- కోకలయొక్క- అంచలాః - కొనలు గలయట్టివై - పాణికంకణఝణత్కారానుకారం యథా తథా- పాణికంకణ- చేతికడియములయొక్క - ఝణత్కార - ఝణఝణయ నుశబ్దంబులను- అనుకారం యథాతథా- అనుకంపగల్గునట్టులుగా- దధి - పె రుగును- మథ్నత్యః- చిలుకుచున్నట్టి - గోపాంగనాః - గోపస్త్రీలు- గోకులే- గోకులమందు- క్షణదావసానసమయే- ప్రాతఃకాలమందు- సానందం- ఆనం దముతోడ- యం- ఎవ్వని- అనిశం- ఎల్లప్పుడును- గాయంతి- పాడుచున్నారో- సః - అట్టి పీతాంబరః- శ్రీకృష్ణుఁడు - నః - మమ్ము -అవ్యాత్ - రక్షించుగాక-

ఉ॥ ప్రాకటకంకణారవము భాసిలి పైఁ మెదకొంగు దూఁగఁగా । వేకువ మోద ముప్పన రవిందముఖుల్ పెరుగుల్ మధించుచుం। గోకవిరోధిరింగళులు గూర్చు రథద్యు తిమీఱ నే హరిన్ । గోకులవాటి బాడుదురు కోరికలా హరి యిచ్చు గావుతన్॥

తా॥ వ్రేపల్లెయందు గోపికలు చంద్రకాంతికి నతిశయించిన దంతకాంతు లు ప్రసరింపఁగాఁ గోకలకొనలసియాడం జేతికంకణముల శబ్దంబునకు సరిపడు నట్లు పెరుగు చిలుకుచు సంతోషముతోడనే కృష్ణునిం బాడుదురో ఆకృష్ణుఁడు మమ్ము రక్షింపవలయుననుట- ... ... ... ..

శ్లో॥ అంసాలమ్బితవామకుండలభరం మందోన్నతభ్రూలతం కించిత్కుఞ్చి తకోమలాధరపుటం సాచిప్రసారేక్షణమ్ । ఆలోలాంగుళిపల్లవైర్మురళికామా పూరయన్తం ముదా మూలే కల్పతరోస్త్రిభఙ్గిలలితం జానే జగన్మోహనం॥

టీక॥ అంసాలంబితవామకుండలభరం- అంస - మూఁపును- ఆలంబిత- ఆ శ్రయించినట్టి - వామ- ఎడమప్రక్కనిదైన - కుండలభరం - కుండల భారము గ లిగినవాఁడును- మందోన్నతభ్రూలతం - మంద- వంగినదియును- ఉన్నత- ఎ డవుగలదియునైన - భ్రూలతం - తీగెవంటి బొమలుగలవాఁడును - కించిత్కు ంచితకోమలాధరపుటం - కించిత్ - కొంచెము - కుంచిత- వంపఁబడిన- కోమల

మృదువైన- అధర - మోవియొక్క - పుటం - పుటముగలిగినవాఁడును- సాచిప్రసారితేక్షణం - సాచి- అడ్డముగా- ప్రసార- చూపుగల- ఈక్షణం- నేత్రముగలవాఁడును- ఆలోలాంగుళిపల్లవైః - ఆలోల- చలించుచున్న - అంగుళిపల్లవైః। చిగుళ్లవంటివ్రేళ్లచేత - మురళికాం- వేణువును - ముదా- సంతోషముతోడ- ఆపూరయంతం- పూరించుచున్నవాఁడును- త్రిభంగిలలితం - త్రిభంగి మూఁడువంపులచేత- లలితం - సుందరమయినట్టి- జగన్మోహనం - జగత్- లోకంబులను- మోహనం - మోహింపఁజేయునట్టికృష్ణుని - కల్పతరోః - కల్పవృక్షముయొక్క - మూలే- క్రిందిప్రదేశమందు- జానే - మెలఁగుచున్నాను- ◈-

ఉ॥ మూపునవామకుండలము మోవియొకించుక మోడ్పునందమునం। జూపెడునోరచూపుసొగసుం బొమనొక్కటనిక్కఁగన్పడం। గ్రేవులు సొక్క కల్పకముక్రిందద్రిభంగిగ నిల్చియంగుళీ। వ్యాపితవంశపూర్తిఁ దయి వర్తిలు మోహనమూర్తిఁ గొల్చెదన్॥ ... .. ... ... ౧౦౨

తా॥ గానకాలమందెడమప్రక్కయందుదలవంగియుండుటవలన వామకుండలముమూపునదగులగా నొకబొమవంగి యొకబొమపొడవై యుండ మోవి యొగినోడ్పున వెలుంగఁగాఁ జూపులడ్డముగాఁ బ్రసరింపఁగఁ జిగురుటాకులవంటి వ్రేళ్లచేఁ బూరించి వేణుగానముసేయుచుఁ దద్వశంబున మూఁడు వంకలతోఁగనంబడునట్టిమేనితోఁ గల్పవృక్షముక్రిందజగన్మోహనాకారుండై విలసిల్లు కృష్ణుని దలంచుచున్నాననుట- ... ... ... ... ◈

శ్లో॥ మల్లైశ్శైలేంద్రకల్పశ్శిశురితరజనైః పుష్పచాపోఙ్గనాభిర్గోపైస్తుప్రాకృతాత్మా దివిఃకులిశభృతా విశ్వకాయో ప్రమేయః। క్రుద్ధఃకంసేన కాలో భయచకితదృశా యోగిభిర్ధ్యేయమూర్తిర్దృష్టో రంగావతారే హరిరమరగణానన్దకృత్పాతుయుష్మాన్॥ ... ... ... ... ౧౦౩

టీక॥ రంగావతారే - రంగ- కంసకృతమల్లరంగమునందు - అవతారే- ఆగమనమందు- యఃహరిః - ఏశ్రీకృష్ణమూర్తి - మల్లైః- చాణూరాది మల్లులచేత- శైలేన్ద్రకల్పః - శైలేంద్ర - హిమవత్పర్వతముతోడ - కల్పః - సమానుఁడగుచు- దృష్టః - చూడంబడియెనో- ఇతరజనైః - తదితరజనులచేత - శిశుః - బాలుండగుచు - దృష్టః - చూడబడియెనో- అంగనాభిః - యువతులచేత - పుష్పచాపః - మన్మథుఁడగుచు - దృష్టః - చూడబడియెనో- గోపైస్తు - గోపాలకులచేత - ప్రాకృతాత్మా-ప్రాకృతుఁడగుచు- దృష్టః - చూడబడియెనో- దివి-అం

తరిత్రుమందు- కులిశభృతా - ఇంద్రునిచేత - విశ్వకాయః - విశ్వ - ప్రపంచమయమయిన - కాయః - శరీరముగల - అప్రమేయః - ప్రేమావిషయుండుకాని వాఁడగుచు - దృష్టః - చూడబడియెనో- భయచకితదృశా - భయ - భయముచేత - చకిత - సంచలించుచున్న- దృశా - దృష్టిగల - కంసేన - కంసునిచేత - కృతః- కోపవంతుఁడయిన - కాలః - యముఁడగుచు - దృష్టః - చూడబడియెనో- యోగిభిః- యోగులచేత- ధ్యేయమూర్తిః - ధ్యేయ - ధ్యానముఁజేయఁదగిన- మూర్తిః - స్వరూపముగలవాఁడగుచు - దృష్టః - చూడబడియెనో - సః - ఆ ప్రసిద్ధుఁడయిన- అమరగణానందకృత్- అమరగణ- దేవసమూహములకు-ఆనందకృత్- సంతసముఁజేయుచున్నకృష్ణుఁడు - యుష్మాన్ - మిమ్ము- పాతు-రక్షించుఁగావుత- ... ... ... ... ...

చ॥ సిగమని జెట్లుపావఁడని నాగరికుల్మరుఁడంచుఁగాంతలు । భ్యపగతివిశ్వరూపుఁడని ప్రాకృతుఁడంచు సుగోప బాలురుఁ । గ్రగతిఁ దనర్చు మృత్యువని కంసుఁడుయోగులు స్వామిగాఁగనం । దగిసుర లుబ్బరంగమున దార్కొను దేవుఁడుమిమ్ము బ్రోవుతన్॥ ... ... ... ... ౧౦౩

తా॥ మల్లరంగంబునంగంసు పురోభాగంబుననిలిచినప్పుడే హరిచాణూరాదిమల్లులచేఁబర్వతసమానుండగుచుతరులచే బాలుండగుచు దరుణులచేమరుండగుచుగోపాలకులచేతందమబోటి ప్రాకృతుండగుచునాకాశంబుననింద్రునిచే విశ్వమయుండగుచు భయభ్రాంతుండగుకంసునిచే గాలుండగుచు యోగులచే ధ్యానార్హుండగుచునేహరిచూడంబడియెనోయట్టిసర్వదేవతానందకరుండగుచుశ్రీకృష్ణమూర్తిమిమ్ముంబ్రోచుఁగాతయనుట-

శ్లో॥ సంవిష్టో మణివిష్టరేఙ్కతలమధ్యాసీనలక్ష్మీముఖే కస్తూరీతిలకం ముదా విరచయన్ హర్షాత్కుచౌ సంస్పృశన్ । అన్యోన్యస్మితచంద్రికాకిసలయైరారాధయన్మన్మథం గోపీగోపపరీవృతో యదుపతిః పాయాజ్జగన్మోహనః॥

టీక॥ మణివిష్టరే- మణి - మరకతమణి వికారమయిన - విష్టరే- ఆసనమందు- సంవిష్టః - కూర్చున్నవాఁడును- అంకతలమధ్యాసీనలక్ష్మీముఖే- అంకతల- తొడమీదను- అధ్యాసీన - కూర్చున్న- లక్ష్మీ- లక్ష్మీదేవియొక్క - ముఖే - నెమ్మొగమునందు- కస్తూరీతిలకం - కస్తూరీ - కస్తూరీమయమయిన - తిలకం - బొట్టును- ముదా - సంతోషముచేత- విరచయన్ - దిద్దుచున్నవాఁడును- హర్షాత్- సంతోషమువలన - కుచౌ - స్తనములను - సంస్పృశన్ - స్పృశించుచున్నవాఁడును

అన్యోన్యస్మితచంద్రికాకిసలయైః - అన్యోన్య - పరస్పరమును - స్మిత - చిఱున గవనియెడి - చంద్రికా - వెన్నెలయొక్క - కిసలయైః - చిగుళ్లచేత - మన్మథం- మన్మథుని- ఆరాధయన్- ఆరాధించుచున్నవాడును- గోపీగోపపరివృతః-గోపీ - గోపస్త్రీలచేతను- గోప- గోపకులచేతను - పరివృతః - పరివేష్టింపఁబడి నవాడును- జగన్మోహనః- జగన్మోహనుఁడగు - యదుపతిః - శ్రీకృష్ణమూర్తిన్- నః- మమ్ము- పాయాత్- రక్షించుఁగావుత- ... ..

చ॥ చెలువగురత్నపీఠమున శ్రీసతినంకముజేర్చికస్తురిం । దిలకముదిద్దిదిద్దితమిదీరకవెంటనగుబ్బలంటుమో । మొలదళుకొత్తుసవ్వడిమొత్తములన్నరుపూజసేయున! చ్చెలువయువల్లవప్రకరసేవితమోహనమూర్తిఁ బ్రోవుతన్ ॥ ౧౦౪

తా॥ మరకతమణివికారంబగునాసనంబునం గూర్చుండి తొడపైనిడుకొన్న రుక్మిణీదేవినెమ్మొగంబునం గస్తూరిబొట్టుదిద్దినఁ దనతిమితనకచన్నుం గవనంటు చుంబరస్పరంబుచిఱునగవు వెన్నెలచిగుళ్లచే మారునారాధించుచుం గోపగోపీపరివృతుండై జగన్మోహనుండై నెగడుయాదవశ్రేష్ఠుఁడగుకృష్ణదేవుఁడు నన్నుం బ్రోచుఁగాతయనుట. ... ... ... ..

శ్లో॥ ఆకృష్టే వసనాంచలే కువలయశ్యామాం త్రపాధీకృతా దృష్టిస్సంవలితా రుచా కుచయుగే స్వర్ణప్రభే శ్రీమతీ। బాలః కశ్చన చూతపల్లవ ఇతి ప్రాంతస్మితాస్యశ్రియం శ్లిష్యంస్తామథ రుక్మిణీం నతముఖీం కృష్ణస్స పుష్ణాతు నః॥

టీక॥ యస్యాః - ఏరుక్మిణీదేవియొక్క - వసనాంచలే - పయ్యెదచెఱఁగు- ఆకృష్టే- అపహరింపఁబడుచుండఁగా- అథ- అనంతరము- త్రపాధీకృతా- త్రపా- సిగ్గుచేత- అధీకృతా - క్రిందుగాఁజేయఁబడిన - కువలయశ్యామా-కువలయ- నల్లకల్వలవలె- శ్యామా - నల్లనయిన - దృష్టిః - చూపు- రుచా- కాంతిచేత - స్వర్ణప్రభే- స్వర్ణ - బంగారుయొక్క - ప్రభే- కాంతివంటికాంతి గలదియగు- శ్రీమతి- సౌందర్యయుక్తమైన - కుచయుగే - చందోయియందు- సంవలితా- లగ్నమయినదియో- తాం- ఆలజ్జాయుక్తురాలయినదియును - నతముఖీం- నత- నమ్రమయిన- ముఖీం- మొగముగలదియు- బాలః - లేతయయిన - కశ్చన- ఒకానొకటియయిన - చూతపల్లవ ఇతి - మామిడిచిగురను హేతువు వలన- ప్రాంతస్మితాస్యశ్రియం- ప్రాంత- సమీపమున- స్మిత- చిఱునగవుగల- ఆస్యశ్రియం- ముఖకాంతిగల- రుక్మిణీం- రుక్మిణీదేవిని- శ్లిష్యన్- ఆలింగనము చేయుచున్న - సః- ఆప్రసిద్ధుఁడయిన - కృష్ణః - శ్రీకృష్ణమూర్తిన్ - నః- మమ్ము- పుష్ణాతు - పోషించుఁగాత- ... ... ... ...

మ॥ అలరుంబయ్యెదకొంగు దియ్యఁ దపనీయ శ్రీఁ దంబించు గుబ్బలపైసిబ్బితిఁ గబ్బి చూపు నెలకొల్పం దద్వ్యతిన్ మ్రాన్పడు చూ। తలఁ తాఁ పల్లవరీతి గాంచి స్మిత వక్త్ర ప్రౌఢయా రుక్మిణీ। లలనం గౌఁగిటఁ గారవించు హరికల్యాణంబు మాకీవుతన్ ॥౧౦౫

తా॥ పైటచెఱంగు దొలంగం జేయు బంగరు జిగి నెలకొను సిబ్బెపుగుబ్బిగుబ్బలపై సిబ్బితిచేన ధోముఖియై చూపు నెలకొల్ప నచ్చ్ఛపు నుంజన్నులపై మెఱయు బంగరు జిగియును గలయం బెరయ మావి చిగురుం బోని యచ్చెఁ బెంజూచి యెలనూవియగు రేలకొనా చన్నుంగవపైనున్నదియని భ్రాంతిం జెందిన యవ్వ రుక్మిణిని గౌఁగిటం జేర్చి చిసుఖియించు కృష్ణుండు నన్నుం బ్రోచుగాత యనుట. ◈

ఈ శ్లోకము రుక్మిణీకృష్ణసంవాదముగఁ గవి సెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఉర్వ్యాం కోపి మహీధరో లఘుతరో దోర్భ్యాం ధృతో లీలయా తేన త్వం దివి భూతలే చ సతతం గోవర్ధనో గీయసే। త్వాం త్రైలోక్యధరం వహామి కుచయోరగ్రే న తద్గణ్యతే। కిం వా కేశవ భాషణేన బహునా పుణ్యైర్యశో లభ్యతే॥

టీక॥ హే కేశవ- ఓకృష్ణా- ఉర్వ్యాం- భూమియందు- కోపి- ఒకానొకటిమైన- లఘుతరః- మిక్కిలియుఁ జులకనైన- మహీధరః- గోవర్ధనపర్వతము- దోర్భ్యాం- హస్తములచేత- లీలయా- విలాసముగా- ధృతః- ధరియింపఁబడియెను- తేన- ఆహేతువుచేత- త్వం- నీవు- దివి- స్వర్గమందును- భూతలే చ- భూతలమునందును- సతతం- ఎల్లప్పుడును- గోవర్ధనః- గోవర్ధనపర్వతముధరియించినవాఁడవనుచు- గీయసే- చెప్పఁబడుచున్నావు- త్రైలోక్యధరం- త్రిలోకధురంధరుఁడవయిన- త్వాం- నిన్ను- కుచయోః- స్తనములయొక్క- అగ్రే- తుదను- వహామి- వహించుచున్నాను- తత్- ఆవహనము- నగణ్యతే- లెక్కింపఁబడలేదు- బహునా- అనేకవిధమయిన- భాషణేన- పలుకుచేత- కిం- ఏమిప్రయోజనము- పుణ్యైః- పుణ్యములచేత- యశః- కీర్తి- లభ్యతే- పొందఁబడుచున్నది- .... ... ... ... ◈

మ॥ ధరణిం జేతులనొక్కచిన్నగిరి యెత్తన్నిన్న గోవర్ధనో। ద్ధరణుం డంచు నుతించెఁ నీదశదిశల్ త్రైలోక్య ధారేయ సిర్। నురువక్షోజములన్ భరింపనను బేరొక్కరెవ్వరుం బుణ్యవి। స్ఫురణం గీర్తి చెలంగుఁ బెక్కువచనంబుల కృష్ణ యింకేటికిన్॥ ... ... ... - ... ◈

తా॥ ఓకృష్ణా యిప్పుడమియందునతిసులభంబగు నొక్కచిన్నకొండం జేతులనొకసివెత్తినందుకై గోవర్ధనోద్ధరణుడని యెల్లదెసలం బొగడంగాంచితివి ము

శ్లోకంబులధరియించునినుజన్మోనంధరియించిననాకట్టిపొంగ డ్రలేదయ్యో నేరికింబు ణ్యవిశేషంబులచేతందక్కనితరకజనంబులచేతంగీతంగాంచ నలవిగాదనుట. ✿

శ్లో॥ సంధ్యావందనభద్రమస్తుభవతేభోస్నానతుభ్యంనమో భోదేవాఃపి తరశ్చతర్పణవిధౌనాహంక్షమఃక్షమ్యతామ్। యత్రక్వాపినిషద్యయాదవకులో త్తంసస్యకంసద్విషస్స్మారంస్మారమఘంహరామితదలంమన్యేకిమన్యేనమే॥

టీక॥ హేసంధ్యావందన- ఓసంధ్యావందనమా- భవతే- నీకొఱకు-భద్రం మంగళము- అస్తు- అగుఁగాత - భోస్నాన- ఓస్నానమా - తుభ్యం-నీకొఱకు- నమః - నమస్కారము. భోదేవాః- ఓదేవతలారా-భోపితరః- ఓపితరులారా- తర్పణవిధౌ- తర్పణ- తృప్తియొక్క - విధౌ - చేయుటయందు - నక్షమః- అశ క్తుఁడను- క్షమ్యతాం - క్షమియింపఁదగినది- యత్రక్వాపి- ఎక్కడనైనను- ని షద్య- కూర్చుండి యాదవకులోత్తంసస్య- యాదవకుల- యదువంశమునకు- ఉత్తంసస్య- శేఖరుండగు- కంసద్విషః - కృష్ణమూర్తిని- స్మారంస్మారం- స్మ రించిస్మరించి- అఘం - పాపమును- హరామి- పోఁగొట్టుచున్నాను - తత్- ఆకంసవిరోధిస్మరణము- అలం - పాపనివృత్తికిఁజాలునని - మన్యే- తలంచుచు న్నాను- అన్యేన- ఇతరమైనదానిచే- కిం - ఏమిప్రయోజనము

చ॥ సతతమునుసంధ్యకుశోభనమగుస్నానజపాదికిన్నమస్కృతిగాగా। తతినికిక్రము కృ దేవపితృతర్పణచర్యకుశక్తుఁడనుగాను నీవు క్షమింపుడు। స్మరణచేయుచు నే కృష్ణుని తలఁచుచుంటి కంసరి పుఁ యదువంశపుముదమెల్ల కల్గఁగ మరియేమి కావలెనసత్యకర్మతన్॥

తా॥ సంధ్యావందనంబునకుశుభంబగుస్నానంబునకు మ్రొక్కెదను దేవపి తరులారామీకు దర్పణంబు చేయుటకు క్షమియింపుఁడు నేను కంసరిపుండగు శ్రీకృష్ణునిస్మరించిపాపంబు లడంచెదనిదియునాకుఁజాలు నింకనన్యంబుచే నేమి ప్రయోజనంబనుట. ... ... ... ... ... ✿

శ్లో॥ హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే హేకంసాంతక హేగజేంద్రకరుణాపారీణ హేమాధవ। హేరామానుజ హేజగత్త్రయగురో హేపుండరీకాక్షమాం హేగోపీజననాథపాలయపరం జానామిన త్వాంవినా॥

టీక॥ హేకృపాజలనిధే - ఓదయాసముద్రుఁడా - హేసింధుకన్యాపతే-ఓ లక్ష్మీపతీ- హేగజేంద్రకరుణాపారీణ- గజేంద్ర - గజశ్రేష్ఠునివిషయమైన - క రుణా- కరుణకు - పారీణ- పారంగతుఁడయినవాఁడా - హేమాధవ- ఓయి మాధవుఁడా- హేరామానుజ- రామబలరామస్వామివారికి- అనుజ - తమ్ము డవయినవాఁడా- హేపుండరీకాక్ష - ఓయిపుండరీకాక్షుఁడా - హేగోపీజన

నాథ- గోపీజన- గోపికాసమూహమునకు-నాథ- ప్రభుండవయినవాఁడ- హే గోపాలక-ఓయిగోపాలకృష్ణా- మామ్- నన్ను- పాలయ-రక్షింపుమా-త్వాం వినా - నిన్నుఁదక్క - పరం- అన్యదైవమును- నజానామి- ఎఱుంగను-

శా॥ ఓకారుణ్యసముద్రయోకరటిరక్షోదీక్షయోమాధవా। యోకంసాంతకయోరమాసహచరాయోవల్లవీకింకరా। యోకంజేక్షణయోజగద్గురుమణీయోరౌహిణేయానుజా। మీకన్నన్యులనన్యునే నెఱుఁగజుమ్మీనన్నురక్షింపుమీ॥ ౧౦౮

తా॥ దయాసముద్రుఁడవై లక్ష్మీపతివియైకంసధ్వంసకుండవై గజేంద్రునిపిరక్షయమయిన దయకుఁబారంగతుఁడవయి బలరామునికిఁదమ్ముండవై లోకత్రయంబునకునుగురుఁడవయి గోపికాసమూహంబులకుఁబ్రభుండవై పుండరీకాక్షుండవై నయోశ్రీకృష్ణానీకన్ననితరునినెఱుంగనునుంబ్రోవుమీయనుట.

శ్లో॥ కస్తూరీతిలకంలలాటఫలకేవక్షస్స్థలేకౌస్తుభం నాసాగ్రేనవమౌక్తికంకరతలేవేణుంకరేకంకణమ్। సర్వాంగేహరిచందనంచకలయన్ కంఠేచముక్తావళింగోపస్త్రీపరివేష్టితోవిజయతేగోపాలచూడామణిః॥ ౧౦౯

టీక॥ లలాటఫలకే- లలాటప్రదేశమందు - కస్తూరీతిలకం - కస్తూరిబొట్టును- వక్షఃస్థలే - ఱొమ్మునందు- కౌస్తుభం - కౌస్తుభమణియు- నాసాగ్రే-ముక్కుతుదయందు- నవమౌక్తికం- క్రొత్తముత్తియమును- కరతలే- హస్తప్రదేశమునందు- వేణుం- పిల్లనగ్రోవియు - కరే- హస్తమునందు-కంకణం- కడియమును- కంఠే- గళమందు- ముక్తావళిం - ముత్తియంపుసరమును - సర్వాంగే- సర్వశరీరమందును- హరిచందనం- శ్రీచందనమును- కలయన్- యథాయోగ్యముగా వహించుచున్నవాడును - గోపస్త్రీపరివేష్టితః - గోపస్త్రీ- గోపికలచేత - పరివేష్టితః - పరివేష్టింపఁబడినవాఁడునగు - గోపాలచూడామణిః - గోపాల- గోపాలకులలోపల- చూడామణిః- శిరోరత్నమగుశ్రీకృష్ణమూర్తి- విజయతే సర్వోత్కృష్టుఁడగుంగాక- ... ... ... ...

మ॥ నుదుటంగస్తురిబొట్టునాసికతుదన్ముత్తెంబుశ్రీగంధసం। వదనెమ్మేనగరంబులంగటకముల్వంశంబుహస్తాగ్రమం। దెదపైనిస్తులకౌస్తుభంబునయుతేక్షశృంగారహారంబునిం।పొదవంగృష్ణుడుగోపికావృతుడుసర్వోత్కృష్టుడైవర్తిలున్

తా॥ నుదుటంగస్తురిబొట్టునుముక్కుతుదంగ్రొత్తముత్తియంబునునెమ్మేహరిచందనంబునుంగరంబులంగడియంబులును హస్తాగ్రంబునవేణువునువక్షమునంగౌస్తుభంబును గళంబునముత్తియములహారంబును మెఱయగోపికాపరి

తుఁడైనకృష్ణుఁడుసర్వోత్కృష్టుండయి వెలయుంగాతయనుట. ❖

శ్లో॥ లోకానున్మదయన్ శ్రుతీర్ముఖరయన్ క్షోణీరుహాన్ హర్షయన్। శైలాన్విద్రవయన్మృగాన్వివశయన్గోబృందమానందయన్। గోపాన్సమ్భ్రమయన్మునీన్ముకుళయన్సప్తస్వరాన్జృమ్భయన్నోంకారార్థ ముదీరయన్విజయతేవంశీనినాదశ్శిశోః॥ ... ... ... .. ౧౧౦

టీక॥ లోకాన్-లోకములను-ఉన్మదయన్-మదింపఁజేయుచున్నవాఁడును-శ్రుతీః- వేదములను- ముఖరయన్-ధ్వనింపఁజేయుచున్నవాఁడును- క్షోణీరుహాన్- వృక్షములను - హర్షయన్ - చిగురింపఁజేయుచున్నవాఁడును - శైలాన్ - పర్వతములను-విద్రవయన్ - కరఁగఁజేయుచున్నవాఁడును -మృగాన్ - మృగములను-వివశయన్-పరవశముజేయుచున్నవాఁడును-గోబృన్దం - గోసమూహమును- ఆనన్దయన్-సంతోషింపఁజేయుచున్నవాఁడును- గోపాన్ - గోపాలకులను - సమ్భ్రమయన్ - భ్రమియింపఁజేయుచున్నవాఁడును- మునీన్ - మునులను - ముకుళయన్ - మోడ్పుఁగేలుగలవారలఁగాఁజేయుచున్నవాఁడును - సప్తస్వరాన్ - సరిగమపదనిసలనుస్వరములను - జృమ్భయన్-ప్రకాశింపఁజేయుచున్నవాఁడును - ఓంకారార్థం-ప్రణవార్థమును- ఉదీరయన్ - ప్రతిపాదించుచున్నవాఁడునుసగు - శిశోః - శ్రీకృష్ణమూర్తియొక్క -వంశీనినాదః-వేణునాదము - విజయతే - సర్వోత్కృష్టమయియుండుఁగాక. ... ... ❖

మ॥ మృగములుసొక్క భ్రమాకులిగురింపఁగ శాలుగరంగ మ్రోయఁగా । నిగమములావులుబ్బగమునిచ్చటప్రహ్వపుగోప్రులాడఁగా । జగము సెలంగ నోంకృతి యొసంగఁగసప్తవిధస్వరాంగుళు । ల్నిగుడఁగ డంగెబాల మురళీనినదంబు ముదంబెసంగఁగన్॥ ... ... ... ... ... ౧౧౦

తా॥ మృగంబులుసొక్క శాలుగరఁగ మ్రాకులు చిగురింపఁగ వేదంబులు మ్రోయఁగా గోవులు సంతసంబునొంద మునీంద్రులు ముకుళితకరులై నిల్వఁగా గోపకులుసంభ్రమింపలోకంబులు సెలఁగ ప్రణవార్థంబగుపరబ్రహ్మంబువెలుంగ సప్తస్వరంబులు ప్రకాశింప శ్రీకృష్ణుని వేణుధ్వని సర్వోత్కృష్టమయి వర్తిల్లెననుట. ... ... ... ... ... ❖

మాలినీవృత్తము॥ సతతవినుతభీమా సచ్చిదానందసీమా । శతముఖనుతనామా సాధుమానిప్రణామా । దితిజకులవిరామా దేవతాసార్వభౌమా । వితతతపనధామా వేంకటాహార్యధామా॥ ... ... ❖

మ॥ ఇది శ్రీకృష్ణాశ్రయయోగిపుంగవకృపావిష్టాంతసారస్వతాభ్యుదయ శ్రీవిభవప్రసిద్ధచిదచిద్భేదక్షమాశాస్త్రిసత్సదయాభూషణ వెల్లపూడిమణి పెద్దామాత్య వెంగాగ్రణీగదితాశ్వాసము వాల్కు రెండవదియై కర్ణామృత శ్రీకృతిన్॥ ❖

శ్రీకృష్ణకర్ణామృతము - ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.



శ్రీకృష్ణకర్ణామృతము — తృతీయాశ్వాసము.

శ్లో॥ అస్తి స్వస్త్యయనం సమస్తజగతామభ్యస్తలక్ష్మీస్తనం వస్తుధ్వస్తరజస్తమోభిరనిశం న్యస్తం పురస్తాదివ। హస్తోదస్తగిరీంద్రమస్తకతరుప్రస్తారవిస్తారితప్రస్తస్వస్తరుసూనసంస్తరలసత్ప్రస్తావి రాధాస్తుతమ్॥ ... ... ౧

టీక॥ సమస్తజగతాం - నిఖిలలోకములకు - స్వస్త్యయనం - రక్షకమయ్యినయదియు - అభ్యస్తలక్ష్మీస్తనం అభ్యస్త - బహువారసంబంధములయిన - లక్ష్మీ రమాదేవియొక్క - స్తనం - కుచములుగలదియు - ధ్వస్తరజస్తమోభిః - ధ్వస్త - నష్టములయిన - రజస్తమోభిః - రజస్తమోగుణముచేత - అనిశం - ఎపుడును - పురస్తాత్ - ఎదుట - న్యస్తమివ - ఉంచినదానివలెనున్నయదియు - హస్తోదస్తగిరీంద్రమస్తతరుప్రస్తారవిస్తారితప్రస్తస్వస్తరుసూనసంస్తరలసత్ప్రస్తావి రాధాస్తుతం - హస్త - హస్తములచేత - ఉదస్త - ఎత్తంబడిన - గిరీంద్ర - గోవర్ధనపర్వతముయొక్క - మస్తక - శిఖరములయందలి - తరు - వృక్షములయొక్క - ప్రస్తార - సమూహములయందు - విస్తారిత - వికసించినయదియు - ప్రస్త - జారుచున్నయదియునగు - స్వస్తరు - కల్పవృక్షములయొక్క - సూన - పుష్పములయొక్క - సంస్తర - సమూహములచేత - లసత్ - ప్రకాశించుచున్నదియును - ప్రస్తార - నుతియించుచున్న - రాధా - రాధచేత - స్తుతం - స్తోత్రము జేయంబడుచున్నయదియునగు - వస్తు - శ్రీకృష్ణాఖ్యవస్తువు - అస్తి - కలదు. ❖

శా॥ హస్తోదస్తగిరీంద్రమస్తకతరువ్యాత్యస్తవిస్తారిత। ప్రస్తస్వస్తరుసూనసంస్తరలసత్ప్రస్తారమభ్యస్తప। ద్మాస్తోకస్తనమస్తకల్మషపురోన్యస్తంబును ద్వజ్జగ। త్స్వస్తిశ్రీదము రాధికాస్తుతము౯ జంచద్వస్తు వెంతేతగు౯॥ ... ❖

తా॥ ఎల్లలోకంబులకు వారలకు రక్షకంబై మాటిమాటికి సిరిచన్నులంటుచు

న్నదియైశుద్ధసత్త్వగుణంబునకు నెలవై యెల్లప్పుడును గరతలామలకంబుగ నెదుట దోఁచుచున్నదియై కరంబున నెత్తబడిన గోవర్ధనం బందలితరుల నుండిజారుచున్న పువ్వులచేతను గల్పతరు ప్రసూనంబులచేతను దేజరిల్లుచు రాధికచేనుతియింపంబడుచున్న వస్తువొకం డుకలదు॥ ... ... ... ౨

శ్లో॥ రాధారాధితవిభ్రమాద్భుతరసం లాలిత్యరత్నాకరం సాధారణ్యపదవ్యతీతసహజస్మేరాననామ్భోరుహం। ఆలమ్బేహరినీలగర్వగురుతాంసర్వస్వనిర్వాపణం బాలం వైణవికం విముగ్ధమధురం మూర్ధాభిషిక్తం మహః॥ ౨

టీక॥ రాధారాధితవిభ్రమాద్భుతరసం - రాధా - రాధచేత - ఆరాధిత - బహుమానింపఁబడుచున్న - విభ్రమ - విలాసముచేత - అద్భుత - ఆశ్చర్య సంపాదకములయిన - రసం - శృంగారరసము మొదలగు రసములు గలయదియు - సాధారణ్యపదవ్యతీతసహజస్మేరాననాంభోరుహం - సాధారణ్యపద - సామ్యమార్గమును - వ్యతీత - అతిక్రమించినయదియు - సహజ - స్వభావ సిద్ధమయిన స్మేర - చిఱునగవుతోఁగూడిన - ఆననాంభోరుహం - ముఖకమలముగలయదియు - హరినీలగర్వగురుతాం - హరినీల - ఇంద్రనీలమణులయొక్క - గర్వగురుతాం - అహంకారాతిశయములయొక్క - సర్వస్వనిర్వాపణం - సర్వస్వ - సమస్తపదార్థములయొక్క - నిర్వాపణం - నాశకమయినయదియు - లాలిత్యరత్నాకరం - లాలిత్య - సౌందర్యమునకు - రత్నాకరం - సముద్రమయినయదియు - వైణవికం - వేణునాదవ్యక్తమయినయదియును - విముగ్ధమధురం - విముగ్ధ - మిక్కిలి సుందరముగలవారిలోపల - మధురం - సుందరమయినయదియు - మూర్ధాభిషిక్తం - శ్రేష్ఠమయినయదియు - బాలం - లేతదైనదియునగు - మహః - తేజమును - ఆలంబే - ఆశ్రయించుచున్నాను. ... ... ... ❁

శా॥ సాధారణ్యశరణ్యలితదరహాసశ్రీముఖాంభోజునకై। మాధుర్యైకనిధానుకై మరకతాశ్మప్రౌఢిగర్వచ్ఛటే। వైధుర్యావహతేజుకై సరస నిర్వ్యాజాంగశృంగారుకై। రాధారాధితుకై నవైణవిక మూర్ధన్యున్ సదింగొల్చెదన్॥

తా॥ రాధికచేత బహూకరింపఁబడిన విలాసంబులచే నాశ్చర్యంబును సంపాదించుచున్న శృంగారాది రసంబులకు దానకంబగుచు సౌందర్యంబను గత్నంబునకుఖనియై నిరుపమానంబై స్వభావ సిద్ధంబగు మందహాసంబుతోడం గూడిన నెమ్మోము దామరగలిగి యింద్రనీలంబులగర్వంబు నపహసించు నదియై

సుంధరంబుగలవారలలోన సుందరంబై శ్రేష్ఠంబగుచు వెలయు తేజంబునాశ్రయించుచున్నాననుట. ... ... ... ... ... ❀

శ్లో॥ కరిణామలంఘ్యగతివైభవం భజే కరుణావలంబితకిశోరవిగ్రహం। యమినామనారతవిహారిమానసే యమునావనాన్తరసికం పరం మహః॥ ౩

టీక॥ కరిణాం. ఏనుగులచేత. అలంఘ్యగతివైభవం-అలంఘ్య. అతిక్రమింపనశక్యమైన - గతివైభవం- గమనసంపదగలయదియు - కరుణావలంబితకిశోరవిగ్రహం. కరుణా. దయచేత. అవలంబిత - స్వీకరింపఁబడిన- కిశోరవిగ్రహం. బాలకశరీరముగలయదియును. యమినాం. ఋషులయొక్క - మానసే. మనములయందు. అనారతవిహారి. అనారత. ఎల్లప్పుడును.విహారి. విహరించుచున్నయదియు. యమునావనాంతరసికం. యమునా - యమునానదియందలి- వనాంత. వనమధ్యమునందు. రసికం. సరససంచారయుక్తమునయినయదియును. పరం. ఉత్కృష్టమైనదియునగు. మహః. తేజమును - భజే. సేవించుచున్నాను. ❖

ఉ॥ అల్లనమందయానమునఁ గాఁవలిగోంగఁమోసివాసనో। త్ఫుల్లసరోజపాళిబదముత్సెలఁగ౯ యమునాతరంగిణీ। సల్లలితాంబుపూరములు సారవయస్యలమీఁదఁజిమ్ముచుం। జల్లనిచూపులెల్లగరుణఁజల్లెడునల్లనిబాలుఁగొల్చెద౯॥ ౩

తా॥ మదపుటేనుంగులచేతం గోరందగిన మందయానంబుగలిగి వసుదేవాదులయందలి కరుణచే బాలస్వరూపంబునం జెలువొంది మొల్లమునుల మనంబులం దేజరిల్లుచు యమునయందలియుదకంబులం జల్లు ప్రౌఢసరసంబైన - తేజంబును సేవించుచున్నాననుట. ... ... ... -- ❖

శ్లో॥ నియన్త్రితత్సకలజగద్వ్రజాంగనానియన్త్రితంవిపులవిలోచనాజ్ఞయా। నిరన్తరంమమ హృదయే విజృమ్భతాంసమన్తతస్సరసతరంపరంమహః॥ ౪

టీక॥ యత్. ఏతేజము. సకలజగత్. సమస్తలోకమును - నియంత్రి- నియమించుచున్నదియో. విపులవిలోచనాజ్ఞయా - విపుల. విశాలములయిన. విలోచన - నేత్రములయొక్క - ఆజ్ఞయా. ఆజ్ఞచేత. వ్రజాంగనానియంత్రితం. వ్రజాంగనా. గోపస్త్రీలచేత. నియంత్రితం. నియమింపఁబడినయదియో. సమన్తతః- అంతటను. సరసతరం. మిక్కిలియు సరసమయినయదియో. పరం. ఉత్కృష్టమయినదియో. తత్. ఆప్రసిద్ధమయిన - మహః. తేజము. మమ - నాయొక్క. హృదయే. ఎదయందు. నిరన్తరం- ఎల్లప్పుడును. విజృంభతాం. ప్రకాశించుగావుత॥

ఉ॥ లోకములన్నియుందనకులోనుగఁగానియమేలుమేటియై। స్తోకమనోహ

విదగ్ధలీలం। అమృష్టయౌవనమనష్టకిశోరభావమాద్యంమహః కిమపి మాద్యతి మానసే మే॥ ... ... ... ... ... ౬

టీక ॥ అముక్తమానుషం - అముక్త - కొంచెముగా విడువఁబడిన - మానుషం - మనుష్యభావముగలదిగనుక - అముక్తనిజానుభావం - అముక్త - విడువఁబడని - నిజ - స్వకీయమయిన - అనుభావం - అనుభవముగలదియు - అగూఢవిగ్రహం - అగూఢ - స్వీకరింపఁబడిన - విగ్రహం - శరీరముగలయదియు - ఆగూఢవిదగ్ధలీలం - ఆగూఢ - ప్రకాశించుచున్న - విదగ్ధ - ప్రౌఢములయిన - లీలం - విలాసములుగలయదియు - అమృష్టయౌవనం - అమృష్ట - ఈషద్విలాసయుతమయిన - యౌవనం - జవ్వనముగలయదియు - అనష్టకిశోరభావం - బాల్యముగలయదియు - కిమపి - వాచామగోచరమైనయదియు - ఆద్యం - జగత్కారణమైనదియునైన - మహః - తేజము - మమ - నాయొక్క - మానసే - మనమునందు - మాద్యతి - ప్రకాశించుచున్నది. .. ... ... ... ౬

ఉ ॥ మానవలీలయున్నిరుపమానమహామహిమానుభావము న్మానినివిగ్రహంబుమితిమీఱిన ప్రౌఢియుబాల్య చాపలా । నూనవిలాసమున్న వమనోహరయౌవనముం జెలంగనెం । తేనియుహృద్గవిస్మయముచిచ్చుఁ జెలంగవెలుంగునామదిఁ ॥ ... ... ... ... ... ౬

తా ॥ మనుష్యభావంబునుబూతనాసంహారాదినిజానుభావంబునుశరీరపరిగ్రహంబునుమితిమీరినమహాప్రౌఢియును బాల్యంబునుయౌవ్వనంబునువిలసిల్లవెలుంగుతేజంబునామదిఁబ్రకాశించుచున్నదియనుట. ... ... ౬

శ్లో॥ తేతేభావాస్సకలజగతీలోభనీయప్రభావానానాతృష్ణాసుహృదిహృదిమేకామమావిర్భవన్తు। వీణావేణుక్వణితలసితస్మేరవక్త్రారవిందాన్నాహంజానేమధురమధురంనందపుణ్యాంబురాశేః॥ ... ... ... ౭

టీక॥ సకలజగతీలోభనీయప్రభావాః- సకల - సమస్తమయిన- జగతీ- లోకములను- లోభనీయ- కోరుచున్న- ప్రభావాః - సామర్థ్యములుగల - తేతే-ఆయాప్రసిద్ధములయిన- భావాః- భావములు-నానాతృష్ణాసుహృది - నానా-పుత్రవిత్తాదివిషయికములయిన - తృష్ణా- ఆసలకు- సుహృది - మిత్రమైన- మేనాయొక్క - హృది - మానసమునందు- కామం- మిక్కిలియును- ఆవిర్భవంతు-ప్రకాశించుగావుత- వీణావేణుక్వణితలసితస్మేరవక్త్రారవిందాత్- వీణా- వీణవలెనున్న- వేణు- పిల్లనగ్రోవియొక్క - క్వణిత - ధ్వనిచేత - లసిత- ప్రకాశించుచున్న - స్మేర-చిఱునగవుతోఁగూడిన- వక్త్రారవిందాత్-ముఖకమలములవల

న- నందపుణ్యాంబురాశేః- నంద- నందునియొక్క- -పుణ్య- పుణ్యమనియెడి-అం బురాశేః- సముద్రమునకన్నను- మధురం- మృద్యమైన- అపరం- మఱియొకవస్తువును- అహం- నేను- నజానే- ఎఱుంగను- ... ... ... ❖

మ ॥ అమితాశావశమౌమదిన్నిఖిలలోకాశాస్యహా పెక్కుభా । వము లెన్నేనియునిబ్బంగాకవిలసద్వంశీనినాదానుమో । దముసుందస్మితసుందరంబగుయశోదానందపుణ్యాంబుపూ । రముకన్నన్మధురంబులేదొకటిచర్చ ల్సేయనింకేటికిన్ ॥ ... ... ... ... ... ... ౭

తా ॥ నిఖిలలోకంబులం గోరుభవంబు లెల్లను బుత్రమిత్ర విత్తాదులగు నానలకు - మిత్రంబగునాయెద నిట్లుగాక నిట్లునేమి పీడయుంబోలె ప్రమోయుచున్న వేణువుచే సుందరంబగుచు చిఱునగవుతోడం గూడిన మోము దామరగల యశోదానందుల పుణ్యంబను ప్రవాహంబుంబోని శ్రీకృష్ణుని కన్నన్యం బెఱుంగ హృద్యంబు గాదనుట. .. ... ... ... ❖

శ్లో ॥ సుకృతిభిరావృతే సరసవేణునినాదసుధారసలహరీవిహారనిరవగ్రహకర్ణపుటే । వ్రజవరసుందరీముఖసరోరుహసన్మధుపే మహసి కదానుమజ్జతి మదీయమిదంహృదయమ్॥ ... ... ... .. ౮

టీక ॥ సుకృతిభిః - పుణ్యాల చేత- ఆవృతే - ఉపలాలింపఁబడినయదియు - సరసవేణునినాదసుధారసలహరీవిహారనిరవగ్రహకర్ణపుటే - సరస - రసయుక్తమయిన - వేణునినాద - వేణుధ్వనియనియెడి - సుధారస - అమృతరసముయొక్క - లహరీ - ప్రవాహమునందు - విహార - విహరించుటయందు - నిరవగ్రహ - అప్రతిబంధకమయిన - కర్ణపుటే - శ్రోత్రప్రదేశముగలయదియు - వ్రజవరసుందరీముఖసరోరుహసన్మధుపే - వ్రజ - వ్రేపల్లెయందున్న - వర - శ్రేష్ఠలైన - సుందరీ - గోపస్త్రీలయొక్క - ముఖసరోరుహ - ముఖకమలములకు - సన్మధుపే - శ్రేష్ఠషట్పదమయిన - మహసి - తేజమునందు - మదీయం - నాసంబంధమయిన - ఇదం - ఈ-హృదయం - నెమ్మనము - కదా - ఎప్పుడు - అనుమజ్జతి - మునుంగుచున్నది, ... ... ... ... ... ❖

చ ॥ విమలతపోసనామృతనువేణురవామృతసారపూరకమ । శ్రమపదనన్నగోళము వ్రజప్రమదాముఖపద్మచంచరీ । కముకమనీయనారసపుకోమలనావనమైనదివ్యతే । జమునమునుంగుటన్నడోకొంచల్లగనుల్లమునల్లవింపఁగన్ ॥

తా ॥ పుణ్యాలచేనుపలాలింపఁబడుచున్నదియై వేణునాదంబనుసమృతప్రవాహంబునందమ్మకులేకలోలంబులావేడు - శ్రోత్రప్రదేశంబుగలిగి వ్రజాంగనానే

ణునాదము నందాసక్తంబైనదియనుట) ఇట్టి తేజంబున నా నెమ్మనం బెప్పుడును నుంగునోయనుట, ... ... ... ... ... ❖

శ్లో ॥ తృష్ణాతురే చేతసి జృమ్భమాణం ముష్ణన్మముర్మోహమహాంధకారం।
పుష్ణాతు నః కృణ్యదయైకసిన్ధోః కృష్ణస్య కారుణ్యకటాక్షకేళిః॥ ౯

టీక॥ పుణ్యదయైకసిన్ధోః - దయాసముద్రుండైన - కృష్ణస్య - శ్రీకృష్ణస్వామియొక్క - కారుణ్యకటాక్షకేళిః - కారుణ్యకటాక్ష - దయాప్రధానదృష్టియొక్క - కేళిః - విహారము - తృష్ణాతురే - తృష్ణా - ఆసచేత - ఆతురే - ఆతురమయిన - మమ - నాయొక్క - చేతసి - చిత్తమునందు - ముహుః - సారెకు - జృంభమాణం - వృద్ధినొందుచున్న - మోహమహాన్ధకారం - మోహ - మోహమనియెడి - మహాంధకారం - కటికిచీఁకటిని - ముష్ణన్ - విహరించుచు - నః - మమ్ము - పుష్ణాతు - పోషించుఁగావుత. ... ... -- ... ❖

మ ॥ అమితాశావశమైన నామదిక వశ్యంబైన మోహాంధకా । రము గారుణ్యకటాక్షవీక్షణవిభారాశిన్విపాళించి నే।యమ్మునం బ్రోచుదయాపయోధిఘన బృందారణ్యకమండిబృం । దమునోలాలోచనసాధుసేవధి ప్రమోదంబొప్ప నెల్లప్పుడున్ ॥ ... ... ... ... ... ... ౯

తా ॥ దయాసముద్రుండగు శ్రీకృష్ణదేవునిదయాదృష్టివిహారము తృష్ణాతురంబగు నామనంబున నతిశయిల్లు మోహాంధకారంబుఁబోవనడంచుచు నన్నుఁబ్రోచుగాతయనుట. ... ... ... ... ... ❖

శ్లో॥ నిఖిలనిగమమౌళిలాలితం పదకమలం పరమరహస్యస్య తేజసః। వ్రజభువి బహుమన్మహే తరాం సరసకరీషవిశేషరూషితమ్ ॥ ... ౧౦

టీక ॥ నిఖిలనిగమమౌళిలాలితం - నిఖిల - సమస్తమయిన - నిగమ - వేదములయొక్క - మౌళి - శిరములచేత - లాలితం - లాలింపఁబడినయదియు - వ్రజభువి - వ్రజ - వ్రేపల్లియయొక్క - భువి - భూమియందు - సరసకరీషవిశేషరూషితం - సరస - రసయుక్తమయిన - కరీష - విశేష - రేణముచేత - రూషితం - పూయఁబడిన - పరమరహస్యస్య - అతిరహస్యమయిన - తేజసః - తేజముయొక్క - పదకమలం - పాదకమలమును - బహుమన్మహేతరాం - మిక్కిలియు బహూకరించుచున్నాను.

మ ॥ సిరికేలమ్ములనొత్తఁగా శ్రుతివధూసీమంతసిందూరసుం । దరమై యొప్పుసలారయందముగ మందన్నందగోపాలమం । దిరశాలాంతకరీషరూషితసోదీణంబులౌ పాదము । ల్పరమానందముఁ జేయు నామదికి నుల్లాసంబుగల్పించుచున్ ॥ ... ... ... ... ... ... ౧

తా ॥ వేదాంతంబుచే లాలింపంబడుచున్నందవ్రజంబున రేణంబునం బూయంబడినదియై వెలయు తేజముగల శ్రీకృష్ణుని పాదకమలంబుల బహుకరించుచున్నాననుట. ... ... ... ... ... ◆

శ్లో ॥ ఉదారమృదులస్మితవ్యతికరాభిరామాననం ముదా ముహురుదీర్ణయా మునిమనోమ్బుజామ్రేడితం । మదాలసవిలోచనవ్రజవధూమదాస్వాదితం కదా నుకమలేక్షణం కమపి బాలమాలోకయే॥ ... ... ౧౧

టీక॥ ఉదారమృదులస్మితవ్యతికరాభిరామాననం- ఉదార - గంభీరములయిన - మృదులస్మిత - మందహాసములయొక్క - వ్యతికర - సమూహముచేత అభిరామ - సుందరమయిన - ఆననం - ముఖముగలవాఁడును - ముహుః - సారెకును - ఉదీర్ణయా - పుట్టుచున్న - ముదా - సంతోషముచేత - మునిమనోంబుజామ్రేడితం - ముని - మునులయొక్క - మనోంబుజ - మనఃకమలములచేత - ఆమ్రేడితం మాటిమాటికిని విచారింపఁబడుచున్నవాఁడును:- మదాలసవిలోచనవ్రజవధూమదాస్వాదితం - మద - మదముచేత - అలస - మందములయిన - విలోచన - నేత్రములుగల - వ్రజవధూ - గోపస్త్రీలచేత - మద - మదముచేత - ఆస్వాదితం - అనుభవింపఁబడుచున్నవాడును - కమలేక్షణం - కమల - తామరరేకులవంటి - ఈక్షణం - నయనములుగలవాఁడును - కమపి - వాచామగోచరుండైన - బాలం - బాలుని - కదాను - ఎప్పుడు - ఆలోకయే - చూచుచున్నాను. ... ◆

ఉ॥ కన్నులకొద్దిచూచి వ్రజకాంతలు వేడుకముద్దులాడఁగా । సన్నపునవ్వువెన్నెలలు సల్లఁగఁజల్లఁగ నెల్లమౌనులుల్ । సన్నుతమానసాబ్జముల సారెకు సారెవహింపమించున । కృష్ణులవండువైనముఖకంజము రంజిలు బాలుఁగాంచెదన్॥

తా ॥ గంభీరంబులయిన మందహాసంబుల చేసుందరంబగు ముఖంబుగలిగి సారెసారెకును బొడమెడుసంతోషంబున మౌనులచేత ధ్యానంబుచేయఁబడుచున్నవాఁడై మదంబుచే నలసంబులగు గోపికల చేమదంబున ననుభవింపఁబడుచున్నవాఁడై పుండరీకాక్షుండై వాచామగోచరుండై వెలయుబాలు నెన్నటికిం గాంచెదనోయనుట. ... ... ... ... ◆

శ్లో ॥ వ్రజజనమదయోషిల్లోచనోచ్ఛిష్టశేషీకృతమతిచపలాభ్యాం లోచనాభ్యాముభాభ్యామ్ । సకృదపి పరిపాతుం తే వయం పారయామః కువలయదళనీలం కాంతపూరం కదాను॥ ... ... ... ... ౧౨

టీక ॥ వ్రజజనమదయోషిల్లోచనోచ్ఛిష్టశేషీకృతం - వ్రజజన - గోపాలకులయొక్క - మదయోషిత్ - మదముతోఁగూడినస్త్రీలయొక్క - లోచన - నేత్ర

ములచేత-ఉచ్ఛిష్టఉచ్ఛిష్టమాత్రము - శేషీకృతం- మిగిలినదిగా జేయబడిన కువల యదళనీలం - కువలయ - నల్లకలువల యొక్క - దళ - రేకులవలె - నీలం - నల్లనైన కాంతిపూరం - కాంతిప్రవాహమును - తే - అప్రసిద్ధులమయిన- వయం - మేము - అతిచపలాభ్యాం - మిక్కిలి చంచలములయిన - ఉభాభ్యాం - రెండైన - లోచ నాభ్యాం - నేత్రములచేత సకృదపి ఒకానొకప్పుడైనను - పాతుం - పానము చేయుటకొఱకు - కదాను- ఎప్పుడును। పారయామహే సమర్థులమగుచున్నాము.

మ ॥ కొమరుంబ్రాయపు మబ్బుగుబ్బతిలఁ గోర్కెల్ జొబ్బిలన్ వల్లవ । ప్రమద ల్గన్నుల నానియానిడిగు పారణశేషంబైన పెంపొప్పునా । రమణీయోత్పలకాంతిపూ రమె దృగ్ద్వారానొక్కనాడైనఁ బ్రాం । కముగా నీకనుదోయి నానఁగల భాగ్యం బె న్నఁడొకో కల్గెడున్ ॥ ... ... ... ... ... ౧౨

తా ॥ మదించిన గోపస్త్రీలు చూడఁజూడ మిగిలియున్న నల్లకలువ రేకు లఁ గ్రొమ్మించుచుండు దేహదు కాంతిప్రవాహరూపుండగు బాలకృష్ణమూర్తిని జంచ లంబులగు నీ రెండుకన్నులచే నొకపరియైనఁ జూచుభాగ్యం బెన్నటి కబ్బునో కో రుచునుట. ... ... ... ... ...

శ్లో ॥ ఘోషయోషిదనుగీతయౌవనం కోమలస్తనితవేణునిస్వనమ్ । సార భూతమభిరామసమ్పదాం ధామ తామరసలోచనం భజే ॥ ... ౧౩

టీక ॥ ఘోషయోషిదనుగీతయౌవనం - ఘోష - వ్రేపల్లియయందున్న - యోషిత్ - యువతులచేత - అనుగీత - అనుసరించి గానము చేయఁబడుచున్న - యౌవనం - జవ్వనముగలదియు - కోమలస్తనితవేణునిస్వనం - కోమల - లేత యైన- స్తనిత-ఉరుముపంటి - వేణునిస్వనం వేణునాదముగలయదియు - అభి రామసంపదాం - సౌందర్యసంపదలకు - సారభూతం - శ్రేష్ఠభూతమయిన యదియు - తామరసలోచనం - తామరస - కమలములవంటి - లోచన - నేత్ర ములుగలయదియునైన - ధామ - తేజమును - భజే - సేవించుచున్నాను.

ఉ ॥ వ్రేజవరాంగ్రముజవ్వనపుపిన్న నువుంగొనియాడఁగాముఖాం । భో జమునందు లేతయురుముంబోని రవంబున వేణువొప్పరా । రాజితకాంతిసంపద లరాశియనన్వెలుఁగొందుశారదాం । భోజదళాత్ముడై పతవిభుం ద్రిజగత్పతి నాశ్రయించెదన్ ॥ ... ... ... ... ౧౩

తా ॥ వ్రేపల్లియయందుండిన గోపికలచే గానంబు చేయుంబడుచున్న జవ్వ నంబు గలిగి లేతయురుమునుంబలె నున్న వేణునాదంబు నెలుంగ సౌందర్యంబుల శ్రే

సధికంబై పుండరీకలోచనంబయి వెలయు తేజంబును సేవించెదననుట.

శ్లో ॥ లీలయాలలితయావలమ్బితంమూలగేహమివమూర్తిసమ్పదామ్। నీరదవికాసవిభ్రమంబాలమేవవయమాద్రియామహే॥ ... ౧౪

టీక ॥ లలితయా - సుందరమయిన - లీలయా - విలాసముచేత - అవలంబితం - ఆశ్రయింపఁబడినవాఁడును - మూర్తిసంపదాం - శరీరసంపదలకు - మూలగేహమివ - ప్రధానగృహముపలెనున్నవాఁడును - నీలనీరదవికాసవిభ్రమం - నీలనీరద - నీలమేఘముయొక్క - వికాస - ప్రకాశముయొక్క - విభ్రమం - విలాసములవంటివిలాసములుగలవాడునైన - బాలమేవ - బాలకృష్ణుని - వయం - మేము - ఆద్రియామహే - ఆదరించుచున్నాము. ... ... ❖

శా ॥ బాలున్మోహనవేషలీలుమురళీపాండిత్యశీలుఁ దయా। లోలుఁ గ్సాంద్రఘనాఘనావళివినీలుంగోపకన్యానుత। శ్రీలావణ్యవయోవిలాసునవనీరేజాయతాక్షిప్రభా। జాలుఁ సర్వకళాలవాలు నతివాంఛన్గొల్తునానెమ్మదిన్॥

తా ॥ సుందరంబగువిలాసంబులచేనాశ్రయింపబడిశరీరసంపదలకుప్రధానగృహంబై నీలమేఘంబువిలాసంబులుగలిగివెలుంగుబాలునాశ్రయించెదననుట.

శ్లో ॥ వన్దేమురారేశ్చరణారవిన్దద్వన్ద్వందయాదర్శితశైశవస్య। వన్దారుబృన్దారకబృన్దమౌళిమన్దారమాలావినిమర్దభీరు॥ ... ... ౧౫

టీక॥ దయాదర్శితశైశవస్య - దయా - దయచేత - దర్శిత - చూపబడిన - శైశవస్య - బాల్యముగలిగిన - మురారేః - శ్రీకృష్ణమూర్తియొక్క - వందారుబృందారకబృందమౌళిమందారమాలావినిమర్దభీరు - వందారు - నమస్కరించుచున్న - బృందారక - దేవతలయొక్క - బృంద - సమూహములయొక్క - మౌళి - శిరములయందున్న - మందారమాలా - కల్పతరుప్రసూనమాలికలయొక్క - వినిమర్ద - సమ్మర్దమువలన - భీరు - భయపడుచున్న - చరణారవిందద్వన్ద్వం - అడుగుదామరదోయినిగూర్చి - వందే - నమస్కరించుచున్నాను. ... ❖

మ ॥ దితిజానీకముద్రుంపమానితతివర్తి పటీయశ్శోదాదరయో। దితిజైశోరకళావిలాసుఁడగునాదేవాదిదేవోత్తము। న్నతబృందారకబృందమౌళివిలసన్మందారమాలాతరం। గితధారాళ మరందవభీతు మృదులాంఘ్రిద్వంద్వ స్సేవించెదన్॥ ... ... ... .. ... ౧౫

తా ॥ దయచేబాల్యంబునొందినశ్రీకృష్ణమూర్తియొక్కదేవతాసమూహంబులశిరంబులం జెలువొందుకల్పతరుప్రసూనమాలికలసమ్మర్దంబువలనభ

ద్యుంబొందుపాదకమలద్వంద్వంబుఁగూర్చినమస్కరించుచున్నానసట.

శ్లో॥ యస్మిన్నృత్యతియస్యశేఖరభరైః క్రౌఞ్చద్విషశ్చన్ద్రకీయస్మిన్నృత్యతి యస్యఘోషసురభింజిఘ్రన్స్వవృషోధూర్జటేః । యస్మిన్సజ్జతియస్యవిభ్రమగతిం వాఞ్ఛన్ హరేస్సిన్ధుర స్తద్బృన్దావనకల్పకద్రుమవనంతంవాకిశోరంభజే॥

టీక ॥ క్రౌంచద్విషః - కుమారస్వామియొక్క - చంద్రకీ - నెమలి - యస్య - ఏశ్రీకృష్ణుఁయొక్క - శేఖరభరైః - శేఖర - సిగయందుఁజుట్టిననెమలిపురిదండలయొక్క - భరైః - సమూహములచేత - యస్మిన్ - ఏవనమునందు - నృత్యతి - నటించుచున్నదియో - ధూర్జటేః - శివునియొక్క - వృషః - వృషభము - యస్య - ఏశ్రీకృష్ణమూర్తియొక్క - ఘోషసురభిం - ఘోష - వ్రేపల్లియయందున్న - సురభిం కామధేనువును - జిఘ్రన్ - యోనిదేశమునాఘ్రాణించుచున్నదినై - యస్మిన్ ఏవనమునందు - నృత్యతి - గర్వించుచున్నదియో - హరేః - ఇంద్రునియొక్క - సింధురః - ఐరావతము - యస్య - ఏకృష్ణునియొక్క - విభ్రమగతిం - విలాసగమనమును - వాంఛన్ - ఇచ్ఛయించినదగుచు - యస్మిన్ - ఏవనమునందు - సజ్జతి ఆసక్తిగలదియగుచున్నదియో - తద్బృందావనకల్పకద్రుమవనం - తత్ - ప్రసిద్ధమయిన - బృందావన - బృందావనమునను - కల్పకద్రుమ - కల్పవృక్షములయొక్క - వనం - వనమునైనను - తం - ప్రసిద్ధుడైన - కిశోరంవా - బాలకృష్ణమూర్తినైనను - భజే - సేవించుచున్నాను. ... ...

శా॥ ఎంతేనెవ్వనమౌళిఁగాంచిగుహవాజీంద్రంబునర్తించుఁదా । నెంతేనెవ్వనియానరీతి హరిమత్తేభంబుఁగాంక్షించుఁదా । నెంతే నెవ్వని మందమర్గోకనుచుభూతేశాశ్వముంబొంగునా । బృందారణ్య సురద్రుసాంద్రవని కృష్ణున్మదింగొల్చెదన్॥ ... ... ... ...

తా॥ సకలజగత్పతియగు శ్రీకృష్ణమూర్తిని సేవించుకొఱకుఁ గుమారస్వామియునుహరుండునింద్రుండునుగామధేనువునేతెంచినయెడ నేవనంబున నేకృష్ణునియొక్క సిగయందునలంకరింపఁబడిన నెమలిపురిదండలంజూచి కుమారుని మయూరంబు నృత్యంబుఁజేయునో యేవనంబునందు నే శ్రీకృష్ణునిగమనవిలాసమెఱింగికొన నింద్రునియైరావతంబుగాంచి యుండునో యేవనంబున నేకృష్ణు మందకడఁగామధేనువుయోనిదేశంబునాఘ్రాణించుచు శివునివాహనంబగు వృషభంబుగర్వించియుండునోయట్టిబృందావనంబునుగల్పకతరు వనంబును స

కృష్ణుని సేవించుచున్నాననుట. ... ... ... ...

శ్లో॥ అరుణాధరామృతవిశేషితస్మితంవరుణాలయానుగతవర్ణవైభవం। కరుణారవిందదళదీర్ఘలోచనంకరుణామయంకమపిబాలమాశ్రయే॥ ౧౭

టీక॥ అరుణాధరామృత - విశేషితస్మితం. అరుణ. ఎఱ్ఱనైన - అధరామృత - అమృతమువంటియధరముచేత - విశేషిత - అతిశయింపఁబడిన - స్మితం. చిఱునవ్వుగలవాడును - వరుణాలయానుగతవర్ణవైభవం - వరుణాలయ - సముద్రముతోడను. అనుగత - అనుకరింపఁబడుచున్న - వర్ణవైభవం. కాంతిసంపదగలవాఁడును. కరుణామయం - కరుణాస్వరూపుఁడయినవాఁడును - కమపి. వాచామగోచరుఁడయినవాఁడునైన - బాలం. బాలకృష్ణుని. ఆశ్రయే. ఆశ్రయించుచున్నాను. ... ... ... ... ...

ఉ॥ చల్లనివాని నవ్వు వెదఁజల్లెడువాని దయారసంబుజో। బ్బిల్లెడువానిఁ గెంపుఁజిగిఁ బెంపుఁ జెలంగెడు మోవివానిసం। ఫుల్లసరోజ నేత్రములఁ బొల్చినవానిఁ బయోధివీచికా। వెల్లితనీలనీరదనవీనత నుద్యుతివానిఁ గాంచెదన్॥ ౧౭

తా॥ అమృతంబుబోలెమధురంబగుచు నెఱ్ఱనైన మోవిపై నెగడు చిఱునగవుచే దేజరిల్లుచు సముద్రంబు ననుకరించు కాంతిసంపదగలిగి విరిసిన లేదామరలం దెగడు కన్నులుగలిగి దయా స్వరూపుఁడై వాచామగోచరుండై వెలయు బాలకృష్ణునాశ్రయించుచున్నాననుట. ... ... .. ...

శ్లో॥ లావణ్యవీచీరచితాఙ్గభూషాంభూషాపదారోపితపుణ్యబర్హామ్। కారుణ్యధారాళకటాక్షమాలాంబాలాంభజేవల్లవవంశలక్ష్మీమ్॥ ౧౮

టీక॥ లావణ్యవీచీరచితాంగభూషామ్. లావణ్య. కాంతివిశేషముయొక్క. వీచీ. అలలచేత - రచిత - చేయబడిన. అంగభూషాం. అవయవభూషణములుగలయదియు. భూషాపదారోపితపుణ్యబర్హాం. భూషాపద - అలంకారప్రదేశమందు. ఆరోపిత. ఉంచఁబడిన - పుణ్య. పవిత్రమయిన - బర్హాం. నెమలిపురిగలయదియు. కారుణ్యధారాళకటాక్షమాలాం - కారుణ్యధారాళ. దయాసారముతోఁగూడిన - కటాక్ష - కడకంటిచూపులయొక్క - మాలాం. సమూహముగలయదియు - బాలాం - లేతప్రాయముగలయదియునగు. వల్లవవంశలక్ష్మీం - వల్లవవంశ - గోపవంశముయొక్క - లక్ష్మీం. సకలసౌభాగ్యసంపాదకమైనలక్ష్మిని. భజే. భజించెదను. ... .. ...

చ॥ మెఱుఁగులకేమిచక్కదనమేవదిలక్షలుసేయుమాయురే। నరుచిరపింఛదామకమెసొమ్ములలోఁ వెలలేనిసొమ్మగు। బరమకృపాకటాక్ష సుమమాలికబా

పు రెనందమంది రేం। దిరమురి పెంపు శైశవముస్సీటులుమీ లెనయా రేకంటి ...

తా ॥ కాంతివిశేషంబులచేనవయవంబులభూషణంబులకువన్నియంగల్పించుభూషణప్రదేశంబునందలంకరింపంబడిన నెమలిపురిగలిగి దయాప్రవాహంబుగ్రుమ్మరించుకడకంటిచూపులుగలిగి బాలస్వరూపంబై వెలయు గోపాలవంశలక్ష్మీనిభజియించుచున్నానుట. ... ... ... ... ❁

శ్లో॥ మధురైకరసంవపుర్విభోర్మధురావీధిచరంభజామహే। నగరీమృగశాబలోచనానయనేందీవరవర్షవర్షితమ్॥ ... ... ... ౧౯

టీక॥ మధురావీధిచరం - మధురా - మధురాపట్టణము యొక్క - వీధి - వీధులయందు - చరం - సంచరించుచున్న యదియు - మధురైకరసం - మధుర - సౌందర్యముయొక్క - ఏకరసం - ముఖ్యరసమైనయదియు - నగరీమృగశాబలోచనానయనేందీవరవర్షవర్షితం - నగరీ - మధురయందలి - మృగశాబ - లేడిపిల్లయొక్క - లోచనా - కన్నులవంటికన్నులుగల స్త్రీలయొక్క - నయన - నేత్రములనియెడి - ఇందీవర - కలువలయొక్క - వర్ష - వృష్టిచేత - వర్షితం - వర్షింపఁబడుచున్న - విభోః - శ్రీకృష్ణమూర్తియొక్క - వపుః - శరీరమును - భజామహే - సేవించుచున్నాను. ... ... ... ... ❁

మ॥ అమరన్ సాహిణులెల్ల నల్లసిలగానార్ట కంఖాణముం। దుమికించం దిశలందుఁ గ్రేళ్లుఱుకుమాధుర్యైకకాంతుల్ ఘన। భ్రమచేయన్మధురావధూచపలనేత్రవ్రాత నీలాబ్జవ। ర్షణముపైఁ గ్రమ్మఁగఁ జిత్రమై చెలఁగు కృష్ణస్వామి నీక్షించెదన్॥ ... ... ... ... ... ౧౯

తా॥ ఘనీభూతంబగుసౌందర్యంబుకరణిఁ దేజరిల్లుచు మధురావీధులయందుఁజరించుచునక్కడనుండెడియువతుల చపలనేత్రంబులనుకలువలవానచేముంపంబడి వెలుంగుశ్రీకృష్ణునియొక్క విగ్రహంబును మేము సేవించుచున్నామనుట.

శ్లో ॥ పర్యాకులేననయనాంతవిజృంభితేనవక్త్రేణకోమలమదస్మితవిభ్రమేణ। మందేనమంజులతరేణచజల్పితేననందస్యహంతతనయోహృదయందినోతి॥

టీక ॥ పర్యాకులేన - చంచలములయిన - నయనాంతవిజృంభితేన - నయనాంత - కడకన్నులయొక్క - విజృంభితేన - అతిశయముచేతను - మందేన - మందమయిన - మంజులతరేణ - మిక్కిలిహృద్యమయిన - జల్పితేనచ - మాటలచేతను - కోమలమదస్మితవిభ్రమేణ - కోమల - మృదువైన - మద - మదయుక్తమైన - స్మిత - మందహాసముయొక్క - విభ్రమేణ - విలాసముచేతను - నందస్య - నందునియొక్క

ర- సాంద్రమైన- పరిష్వంగ- ఆలింగనముయొక్క - ప్రసంగ- ప్రసక్తివలన- అధికప్రీతే- మిక్కిలిసంతుష్టమయినయదియును- గీతివిభంగసంగతల సద్వేణుప్రణాదామృతే- గీతి- గానభేదములయొక్క - విభంగ - వచనములయొక్క - సంగత - స్వసౌష్ఠవప్రయుక్తకలహముచేత- లసత్- మనోజ్ఞమైన - వేణుప్రణాదామృతే అమృతమువంటివేణునాదముగలయదియును- లలితస్మేరే- లలిత - మనోహరమైన - స్మేరే- మందహాసముగలయదియును - మాధుర్యైకరసే- మాధుర్య- సౌందర్యమనియెడి- ఏకరసే- ముఖ్యరసముగలయదియును- రాధాలోచనలాలితస్య- రాధా- రాధయొక్క - లోచన - కన్నులచేత- లాలితస్య - ఉపలాలింపఁబడిన- మురారేః- శ్రీకృష్ణమూర్తియొక్క - ముఖేందుకమలే- చంద్రకమలములవంటిముఖమునందు- మదీయం- నాసంబంధమయిన- మనః- మనస్సు- మగ్నం- మునిగెను- ... ... .. ... ❖

మ॥ లలితాలోకతరంగసంగతములీలామందహాసప్రభా। ప్రులినంబున్మురళీరవామృతరసంబుల్ రాధికాలోచనో। త్పలసంభావితమాధురీగుణమునై భాసిల్లుశ్రీకృష్ణని। ర్మలవక్త్రాంబురుహాకరంబునరమింపంగోరెదన్నామదిన్॥

తా॥ విలాసంబుచేగంభీరంబులగు నపాంగదృష్టులచేవశలయి తమంతటనవచ్చిగోపికలయాలింగనప్రసంగంబుచేసంతుష్టంబగుచు గానభేదంబుల వచనంబులపరస్పరస్వసౌష్ఠవకలంబునమనోజంబగునమృతంబుబోని వేణురవంబుగలిగి సౌందర్యరసంబునకాధారంబై మనోహరంబగుమందహాసంబునకు నెలవై మెఱయుశ్రీకృష్ణుని నెమ్మొగంబున నామనంబులగ్నంబయ్యెననుట- ❖

శ్లో॥ శరణాగతవజ్రపంజరే శరణే శార్ఙ్గధరస్య వైభవే। కృపయా ధృతగోపవిగ్రహే కిమియదన్యన్మృగయామహే వయమ్॥ ౨౩

టీక॥ శరణాగతవజ్రపంజరే - శరణాగత - శరణుపొందినవారలకు - వజ్ర అభేద్యశిలావిశేషనిర్మితమయిన- పంజరే - యంత్రవిశేషమయిన వాఁడును- కృపయా- దయచేత- ధృతగోపవిగ్రహే - ధృత - ధరియింపఁబడిన - గోపవిగ్రహే - గోపాలశరీరముగలవాఁడునునగు- శార్ఙ్గధరస్య- శ్రీకృష్ణమూర్తియొక్క - వైభవే - వైభవము- శరణే - రక్షకమగుచునుండ- అన్యత్ -ఇతరమయిన- కియత్- ఏపదార్థము- వయం- మేము- మృగయామహే- వెదుకుచున్నాము

ఉ॥ ఇవ్వలనవ్వలన్వెదకనేటికినన్యులమాటిమాటికిం। దవ్వులనుండిదైనగరుణావరుణాలయగోపమూర్తియై। నవ్వుచుడాయవచ్చియదనన్ శరణాగతవ

వ్రజపంజరుఁ డవ్వనజాతనేత్రుఁడనయంబునయంబు నెలంగఁబ్రోవఁగన్॥ ౨౩

తా॥ శరణంబునొందినవారలంబ్రోవవ్రజపంజరుండై యుండుంగానగృప చేగోపాలశరీరంబుఁదాల్చిరక్షకుండయి శార్ఙ్గధరుఁడైన శ్రీకృష్ణమూర్తి మెఱయుచుండనితరుల వెదుకఁగా మేమిచ్చగింపమనుట. ... ... ❖

శ్లో॥ జగత్త్రయైకాంతమనోజ్ఞభూమిచేతస్యజస్రంమమసన్నిధత్తామ్। రమాసమాస్వాదితసౌకుమార్యం రాధాస్తనాభోగరసజ్ఞమోజః॥ ౨౪

టీక॥ జగత్త్రయైకాంతమనోజ్ఞభూమి-జగత్త్రయ - లోకత్రయమునందును- ఏకాంత - మిక్కిలినైన - మనోజ్ఞ- సౌందర్యమునకు - భూమి- ప్రదేశమైనయదియు- రమాసమాస్వాదితసౌకుమార్యం- రమా- రుక్మిణీదేవిచేత-సమాస్వాదిత- అనుభవింపఁబడిన - సౌకుమార్యం - సౌందర్యముగలయదియు- రాధాస్తనాభోగరసజ్ఞం - రాధా- రాధయొక్క - స్తనాభోగ - కుచపరిపూర్తియొక్క - రసజ్ఞం - రసమునెఱింగినయదియునగు - ఓజః - తేజము - మమ- నాయొక్క - చేతసి - చిత్తమునందు- అజస్రం- ఎల్లప్పుడును - సన్నిధత్తాం- సన్నిధానముచేయుఁగావుత. ... ... -- ... ❖

ఉ॥ సామదినానతింతుభువనత్రయమోహనరూపధేయురా। ధామదిరేక్షణాపరిణతస్తనభారవిధేయుభోజక। న్యాముహనీయవిభ్రమరసాస్వదవిగ్రహసౌకుమార్యుఁ। లాముధురాధరస్మితకలాపుగశౌగురువర్యునెప్పుడున్॥

తా॥ ముల్లోకంబులంగల సౌందర్యంబునకునాధారప్రదేశంబై లక్ష్మ్యంశసంభూతురాలగురుక్మిణీదేవిచేననుభవింపంబడిన సౌందర్యరసంబుగలిగి రాధాస్తనంబులవిస్తారంబు నెఱింగియుండెడి తేజంబునామదినెప్పుడును సన్నిధానముఁజేయుంగాతయనుట. ... .. ... ... ❖

శ్లో॥ వయమేతేవిశ్వసిమః కరుణాకరమూర్తేః కింవదంత్యాంగే। అపిచవిభో తవలలితే చపలతరామతిరియం బాల్యే॥ ... ... ... ౨౫

టీక॥ హేవిభో - వ్యాపకుఁడవైన యోకృష్ణా- అంగే - రూపవంతుఁడవైన నీయందు-కరుణాకరమూర్తేః - కరుణ- దయకు - ఆకర - గనియనియెడి- మూర్తేః - మూర్తియొక్క - కింవదంత్యా- లోకప్రవాదచేత- ఏతే- ఈసంసారనిమగ్నులమైన - వయం - మేము - విశ్వసిమః - విశ్వాసముఁజేయుచున్నాము- అపిచ - మఱియును- తవ- నీయొక్క - లలితే- కోరదగిన - బాల్యే- బాల్యమందు- ఇయంమతిః- ఈబుద్ధి - చపలతరా- మిక్కిలియు చపలమైయున్నది- ❖

చ॥ అనిశము లోకమెల్ల గరుణాకరమూర్తి వటించు చెల్వఁగా। జననిపరంప రల్గడవి సౌఖ్యము నొందుదు నంచు గృష్ణ నా। మనమును నమ్మినాడ ననుమాత్రము కా దుభవత్కృపాశీలా। జనితకథాసుధారసము సారెకు గ్రోలగ దా తరించెదన్॥ ౨౫

తా॥ సర్వవ్యాపకుండవైన యో కృష్ణా- శ్రీకృష్ణుండు దయాకరుండని చెప్పె డు లోకుల ప్రవాదంబు వినినీయందు విశ్వాసంబు చేయుచుందు మింతియ కాదు నీ యతిమనోహరంబగు బాల్యంబున బుద్ధి యతిచపలంబయ్యెం గావున నాయందు గ రుణించుట కార్యంబనుట- ... ... ... ... ❁

శ్లో॥ వత్సపాలచరః కోఽపి వత్సః శ్రీవత్సలాంఛనః। ఉత్సవాయ కదా భావి త్యుత్సుకే మమ లోచనే॥ ... ... ... ...... ౨౬

టీక॥ వత్సపాలచరః- వత్స- దూడలను- పాల - పరిపాలించుచున్నవార లలో- చరః - సంచరించుచున్నయట్టియు ( ఇచ్చట - వత్సవాటచరః- అనిపా ఠాంతరము గలదు- కలిగినప్పుడు - వత్సవాట - దూడలనిమిత్తమయి యొనర్పం బడిన గృహములయందు- చరః - సంచరించుచున్న యనియర్థము) శ్రీవత్సలాం ఛనః- శ్రీవత్స- శ్రీవత్సమనియెడి- లాంఛనః - చిహ్నముగలవాఁడునగు - కో పి- చెప్పనలవిగాని - వత్సః- బాలుఁడు- ఉత్సవాయ- సంతోషముకొఱకు - క దా- ఎప్పుడు - భావి- అయ్యెనని- ఇతి- ఈప్రకారము- మమ- నాయొక్క - లోచ నే- నేత్రములు- ఉత్సుకే- ఉద్యుక్తములైయున్నవి- ... ... ❁

శా॥ శ్రీవత్సాంకితవక్షుఁ డుల్లసితనీరేజాక్షుఁ డంభోధికన్యావక్షోరుహకుం భికుంభయుగళాఢ్యత్పుండ్రబహ్వర్పణో। భ్యావిర్భావవిధానదక్షుఁడగువాఁడా నందపుత్రాకృతిన్। గోవత్సంబుల మేపఁగన్గొనుచు జక్షుః శ్రీతివాటించెదన్॥ ౨౬

తా॥ గోపాలబాలురం గలసి గోవత్సంబుల మేపు శ్రీవత్సలాంఛనుండగు బా లకృష్ణమూర్తి నెప్పుడు గాంచెదనో యని చూచుచుండెద ననుట- ❁

శ్లో॥ మధురిమభరితే మనోభిరామే మృదులతరస్మితముద్రితాననేందౌ। త్రి భువననయనైకలోభనీయే మహసి వయం వ్రజభాజి లాలసాస్మః॥ ౨౭

టీక॥ మధురిమభరితే - మధురిమ - సౌందర్యములయొక్క - భరితే- సంజా తాతిశయము గలయదియు- మనోభిరామే- హృదయాభిరామమైనయదియు- మృదులతరస్మితముద్రితాననేందౌ - మృదులతర - మిక్కిలియు మృదువైన - స్మి త - చిఱునగవుచేత - ముద్రిత - చిహ్నముగలదిగాఁ జేయఁబడిన- ఆననేందౌ- చంద్రునివంటి ముఖముగలయదియు - త్రిభువననయనైకలోభనీయే- త్రిభువన

మల్లోకముల యొక్క - నయనే. నేత్రముల చేత - ఏక - ముఖ్యముగా - లోభనీయే. ఆస జేయుదగినయదియు. వ్రజభాజి. వ్రజ - నందవ్రజమును. భాజి - పొందినయదియునగు. మహసి. తేజమునందు. వయం. మేము. లాలసాః. ఆసక్తులము - స్మః. అయితిమి. ... ... ... ... ❁

మ॥ రమణీయస్మితమాధురీకలితముద్రాముద్రితంబై సుధా। సమసల్లాపకలాసమై త్రిజగతీసంమోహనాకారమై। కమలానేత్రమనోభిరామరుచియై కన్పట్టు పత్త్రిందుబిం। బమునన్మీఱి వెలుంగు గోపగృహసౌభాగ్యంబు నే గోరెదః॥ ౭౮

తా॥ అతిశయంబగు సౌందర్యసంపదకాకరంబై హృదయాభిరామంబై యాస్వాదితమ్రుదులంబగు వరహాసము చేఁజిహ్నితంబగు చంద్రునివంటి నెమ్మొగంబుగలిగి లోకంబులచే నాశింపఁబడుచున్నదియైన నందవ్రజంబుఁ బొందియున్న తేజంబునందాసక్తుండనగుచున్నాననుట. ... ... ... ❁

శ్లో॥ ముఖారవిందే మకరందబిందునిష్యందలీలా మురళీనినాదే। వ్రజాంగనాపాంగతరంగభృంగసంగ్రామభూమౌ తవ లాలసాస్మః॥ ౭౮

టీక॥ మకరందబిందునిష్యందలీలామురళీనినాదే - మకరంద - పుష్పరసము యొక్క - బిందు. ప్రవాహమువలె. లీలా. విలాసార్థమయిన - మురళీనినాదే. వేణునాదముగల యాదియు - వ్రజాంగనాపాంగతరంగభృంగ సంగ్రామభూమౌ. వ్రజ. వ్రేపల్లియందలి. అంగనా. స్త్రీలయొక్క - అపాంగ - కటాక్షములయొక్క - తరంగ. అలలనియెడి - భృంగ - తుమ్మెదలయొక్క - సంగ్రామ. యుద్ధమునకు. భూమౌ. అధికరణభూమియైనదియునగు. తవ - నీయొక్క - ముఖారవిందే. ముఖకమలమునందు - లాలసాః - ఆసక్తులము - స్మః. అయితిమి. ... ... ... ... ... ... ❁

మ॥ మురళీగానమరందబిందుకృతసమ్మోదభ్రమద్వల్లకీ। సరసాపాంగతరంగభృంగపటలీసంగ్రామరంగస్థలీ। సరణిం జెల్వగు నీముఖాంబుజమునం జంచన్మనః పంకజా। కరమధ్యంబునఁ బాదు కొల్పుటకు నాకాంక్షింతు నెల్లప్పుడుః॥

తా॥ మకరందప్రవాహంబుం బోలి విలాసార్థంబైన వేణునాదంబునను ప్పుచు గోపాంగనల కడకన్నుల చూపుల యలలని యెడి తుమ్మెదలగుంపులకలహంబులకు నధికరణప్రదేశంబయిన నీముఖకమలంబునందు నెల్లప్పుడు లాలసులమైతిమనుట. ... ... ... ... ... ❁

శ్లో॥ ఆతామ్రమాయుతలోచనాంశులహరీలీలాసుధాప్యాయితైర్గీతామ్రేడి

తదివ్యకేళిభరితైస్స్మితంవ్రజస్త్రీజనైః। స్వేదాంభఃకణభూషితేనకిమపిస్మేరేణ వక్త్రేన్దునా పాదాంభోజమృదుప్రచారసుభగంపశ్యామిదృశ్యంమహః॥ ౭౯

టీక॥ ఆతామ్రాయతలోచనాంశులహరీలీలాసుధాప్యాయితైః - ఆతామ్రా- కొంచెము నెఱ్ఱనయినవియు-ఆయత- దీర్ఘములయినవియునైన. లోచన- నేత్రములయొక్క - అంశు- కిరణములయొక్క - లహరీ - ప్రవాహముయొక్క - లీలా- విలాసమనియెడి- సుధా-అమృతముచేత- ఆప్యాయితైః- ఆప్యాయమానములయినవియు - గీతామ్రేడితదివ్యకేళిభరితైః- గీత- గానములచేత- ఆమ్రేడిత - పునరుక్తములయిన - దివ్య- అతిరమణీయములయిన - కేళి - నర్తనావిశేషములయొక్క - భరితైః- అతిశయములుగల యదియునగు. వ్రజస్త్రీజనైః గోపికాజనములతోఁగూడిన - పాదాంభోజమృదుప్రచారసుభగం- పాదాంభోజ - పాదకమలములయొక్క - మృదు- మృదువయిన- ప్రచార - సంచారముచేత- సుభగం - సుందరమైనయదియు - స్వేదాంభఃకణభూషితేన- స్వేద- చెమటయొక్క - అంభః- ఉదకముయొక్క - కణ- బిందువులచేత - భూషితేన- అలంకరింపఁబడినయదియు - స్మేరేణ - మందహాసముతోఁగూడిన - వక్త్రేందునా - ముఖచంద్రునిచేత - స్మితం - హృద్యమైనయదియు - దృశ్యం- చూడఁదగినదియు- కిమపి - వాచామగోచరమైనయదియునగు - మహః- శ్రీకృష్ణాఖ్యతేజమును - పశ్యామి- చూచుచున్నాను.

ఈశ్లోకార్థంబు శ్రీగోపాల కృష్ణమంత్రరాజధ్యానంబని గోపాలకల్పంబునఁ జెప్పంబడియున్నది... ... ... ...

శ్లో॥ గోపీనాంపాణిపద్మాని గృహీత్వా సహనృత్యతః। ధ్యాయేల్లక్షంజపంస్త్వైవకన్యకాముద్వహేచ్ఛుభామ్॥ ... ... ...

మ॥ మురిపెంపుంజిఱునవ్వుగెంజెమటసొంపున్నింపునెమ్మోముపై। సరసాలోకసుధాతరంగములుమించన్వేణుగానధ్వను। ల్దరువైరంజిలజొక్కి గోపికలుగొల్వన్నృత్యలీలాయత। స్ఫురణన్మెల్లనసంచరించుహరినంభోజాక్షునీక్షించెదన్

తా॥ కొంచెముగనెఱ్ఱనైపొడవులయినకన్నులకాంతి ప్రవాహవిలాసంబనునమృతంబుననాప్యాయమానంబులై గానంబులంబునరుక్తంబగు నభినయాదిదివ్యకేళుల యతిశయంబుగలిగిన గోపయువతులతోడంగూడి మృదులంబులగు పాదకమలంబులచేనతిసుందరంబుగనర్తించుచునాయాసంబునం బొడమినచెమటలచేతంజిఱునగవుచేత నతిసుందరంబగు నెమ్మొగంబుచే నతిహృద్యం బం

వాచామగోచరంబయి వెలయు శ్రీకృష్ణాఖ్యంబగు తేజంబు జూచుచున్నాననుట.

శ్లో॥ పాణౌ వేణుః ప్రకృతిసుకుమారాకృతౌ బాల్యలక్ష్మీః పార్శ్వే బాలాః ప్రణయసరసాలోకితాపాంగలీలాః। మౌళౌ బర్హం మధురవదనాంభోరుహే మౌగ్ధ్యముద్రేత్యార్ద్రాకారం కితవకిమపి జ్యోతిరన్వేషయామః॥ ౩౦

టీక॥ పాణౌ- హస్తమునందు- వేణుః - పిల్లనగ్రోవియును - ప్రకృతిసుకుమారాకృతౌ- ప్రకృతి - స్వభావముచేత - సుకుమార- సుందరమయిన - ఆకృతౌ- ఆకారమునందు- బాల్యలక్ష్మీః- బాల్యసంపదయును - పార్శ్వే- ప్రాంతమున- ప్రణయసరసాలోకితాపాంగలీలాః- ప్రణయ- ప్రేమచేత - సరస-రసయుక్తములయిన- ఆలోకిత - చూపులుగల - అపాంగలీలాః - కటాక్షవిలాసములుగల- బాలాః - బాలురును- మౌళౌ- సిగయందు - బర్హం - నెమలిపురియును - మధురవదనాంభోరుహే - మధుర - హృద్యమైన - వదనాంభోరుహే ముఖకమలమునందు- మౌగ్ధ్యముద్రా - సౌందర్యచిహ్నమును - ఇతి- ఈహేతువుచేత- ఆర్ద్రాకారం- ఆర్ద్ర- శ్రోత్రమైన- ఆకారం- ఆకృతిగలయదియు- కితవం - ధూర్తమైనయదియు - కిమపి - వాచామగోచరమైనదియునగు - జ్యోతిః- శ్రీకృష్ణాఖ్యతేజమును- అన్వేషయామః - వెదుకుచున్నాము- ❖

ఈశ్లోకార్థంబు శ్రీగోపాలకృష్ణ కాదశాక్షరీ మంత్రధ్యానంబనిసనత్కుమారసంహితయందుఁ జెప్పంబడియున్నది- ... ❖

శ్లో॥ హరన్తం సవనే తాభిశ్చౌర్యేణ క్రజయోషితామ్। గోపబాలైర్వృతం కృష్ణం ధ్యాయేన్నస్త్రరుచిమంజరీమ్॥ ... ... ... ❖

మ॥ సరసాపాంగవినోదవాక్యములు మించన్బాలకుల్గొల్వఁగా। మురళింగేలనమర్చి పింఛమకుటంబున్మోము శైల్యంబునుం। దనవేషంబును బాల్యకాలము దయార్ద్రస్వాంతముంగల్గుచి। త్తరపుంధూర్తశిఖామణిన్వెదకి హృత్పద్మంబునన్నిల్పెదన్॥ ... ... ... ... ... ౩౦

తా॥ కరంబునఁబిల్లనగ్రోవియును స్వభావసిద్ధంబగు సుకుమారంబుగలశరీరంబునఁబాల్యసంపదయును బార్శ్వంబునఁ బ్రేమచేసరసంబులగుచూపులుగలయపాంగ విలాసంబులునుగల గోపబాలురును సిగయందు నెమలిపురియును హృద్యంబగుముఖకమలంబున సౌందర్యముద్రయునినుచుం గ్రొత్తయగునాకారంబుఁగలిగిధూర్తంబై వాచామగోచరంబై వెలయుశ్రీకృష్ణాఖ్యంబగు తేజంబు

నువేడుకుచున్నాననుట- ... ... ... ... ❖

శ్లో॥ ఆరూఢవేణుతరుణాధరవిభ్రమేణ మాధుర్యశాలివదనాంబుజము ద్వహంతీ। ఆలోక్యతాంకిమనయావనదేవతావః కైశోరకేవయసి కాపిచ కాంతియష్టిః॥ ... ... ... ... ... 30

టీక॥ హేవనదేవతాః- ఓవనదేవతలారా - వః - మీకు - అనయా - ఈవ్యర్థక్రియచేత- కిం - ఏమిప్రయోజనము - కైశోరకే - కిశోరసంబంధమయిన- వయసి - వయస్సునందు- ఆరూఢవేణుతరుణాధరవిభ్రమేణ- ఆరూఢ- ఉంచఁబడిన- వేణు - పిల్లనగ్రోవిగల - తరుణ- లేతయయిన - అధర - అధరోష్ఠముయొక్క - విభ్రమేణ- విలాసముచేత-మాధుర్యశాలివదనాంబుజం - మాధుర్య-సౌందర్యముచేత- శాలి- ఒప్పుచున్న- వదనాంబుజం - ముఖకమలమును-ఉద్వహంతీ - వహించుచున్నయదియు-కాపి- వాచామగోచరమైనయదియునగు-కాంతియష్టిః - యష్టివంటికాంతి- దృశ్యతాం - చూడఁబగినది. ... ❖

ఉ॥ దాపకవంశమింపొదవఁదానధరంబున మోపినాఁడునం। ప్రాపితమందహాసమధురాననుఁడై మహనీయతేజుఁడై। శ్రేష్ఠులమేపమీపొదలక్రేవనెపావదునిల్చినాఁడమీ। రోపికిఁ జేసిపట్టుడికనోవనదేవతలార తెల్పితిఁ॥ ❖

తా॥ ఓవనదేవతలారామీకీవ్యర్థక్రియచేనేమి ప్రయోజనంబువయస్సునందెయధరంబున వేణువుమ్రోయించుచునతివిలాసంబున సౌందర్యంబుచేనొప్పెడిముఖకమలంబును వహించినదియైవాచామ గోచరంబై వెలయుకాంతిచేతంజూడందగినదియనుట. ... ... ... ... ❖

శ్లో॥ అనన్యసాధారణకాంతికాంత మాక్రాంతగోపీ నయనారవిందమ్ పుంసఃపురాణస్యవనంవిలాసంపుణ్యేనపూర్ణేనవిలోకయిష్యే॥ 3.

టీక॥ అనన్యసాధారణకాంతికాంతం-అనన్యసాధారణ- ఇతరులకందని - కాంతి- కాంతిచేత- కాంతం- మనోహరమైనయదియు - ఆక్రాంతగోపీయనారవిందం- ఆక్రాంత- ఆక్రమింపఁబడిన- గోపీ - గోపికలయొక్క - నయనారవిందం - కమలములవంటికన్నులుగలయదియునగు- పురాణస్యపుంసః- దివ్యపురుషుఁడైననారాయణునియొక్క - నవం- నూతనమయిన - విలాసం- కృష్ణరూపవిలాసమును- పూర్ణేన - తక్కువగాని- పుణ్యేన - పుణ్యముచేత - విలోకయిష్యే- చూచుచున్నాను- ... ... ... ...

• చ॥ ఇతరులకందరానిజగదేక మనోహరకాంతియుక్తసమా। గతనవయౌ

పములయినయవియునగు। పురుషాయుషేషు- జీవితకాలములయందు। సపీష-
అప్రసిద్ధములయిన- శుఃశోపి। క్షణామే- గణ్యాః। లెక్కింపదగినయదియని- మన్యే-
తలంచుచున్నాను।యత్ర- ఏక్షణమందు। కయాపి- అనిర్వాచ్యములయిన-భక్త్యా-
భక్తిచేత। నీలస్య- నీలవర్ణుఁడైన। బాలస్య- బాలకృష్ణునియొక్క - నిజం। స్వ
కీయమైన- చరిత్రం।చరితము- ఆస్వాద్యతే- అనుచింతింపఁబడుచున్నదియో-స
ఏవక్షణః- ఆక్షణమే- గణ్యాః। లెక్కింపదగినదియని-మన్యే- తలంచుచున్నాను-
అనియన్వయము. ... ... ... ... ... ❖

ఉ॥ ఏమిటికింబుజాక్షుమదినెంచనియాయువులెక్కఁబెట్టఁగా । బామరవృత్తి
నైనమజిభక్తివిధంబున నైనబాలలీలామహనీయుఁడౌహరిఁదలంచునిమేషములు
న్మహార్థముల్। జాములులెక్కకెక్కనటుసల్పనికాలములెల్లవ్యర్థముల్॥ ౩౪

తా॥ ప్రవాహరూపంబుగఁబోవునీజీవితకాలంబునఁనేరూపంబగుభక్తిచే
తనైననునీలవర్ణుండగు బాలకృష్ణునిసుచరిత్రంబుచింతింపఁబడుచున్నక్షణకాలం
బైననులెక్కింపవనహంగంబులేనిచో నేమిటికనుట. ... ... ❖

శ్లో॥ నిసర్గసరసాధరంనిజదయార్ద్రదివ్యేక్షణంమనోజ్ఞముఖపఙ్కజంమ
ధురసార్ద్రమందస్మితమ్ । రసజ్ఞహృదయాస్పదంరమితవల్లవీలోచనంపునఃపు
నరుపాస్మహేభువనలోభనీయంమహః॥ ... ... ౩౫

టీక॥ నిసర్గసరసాధరం- నిసర్గ- స్వభావముచేత-సరస। రసయుక్తమై
న- అధరం- అధరోష్ఠముగలయదియు। నిజదయార్ద్రదివ్యేక్షణం- నిజ। నిత్యమ
యిన- దయా- దయచేత - ఆర్ద్ర- ప్రసన్నములయిన। దివ్య- దివ్యములయిన-
ఈక్షణం। నేత్రములుగలయదియు- మనోజ్ఞముఖపంకజం। మనోజ్ఞ- సుందరమ
యిన। ముఖపంకజం - కమలమువంటిముఖముగలయదియు। మధురసార్ద్రమం
దస్మితం- మధురస। హృద్యరసముచేత - ఆర్ద్ర- సరసమయిన - మందస్మితం-
చిఱునగవుగలయదియు - రసజ్ఞహృదయాస్పదం। రసజ్ఞ- బ్రహ్మజ్ఞులయొక్క -
హృదయ- హృదయములే- ఆస్పదం- అవస్థానముగఁగలయదియు। రమితవల్ల
వీలోచనం- రమిత। సంతోషింపఁబడిన। వల్లవీ- గోపికలయొక్క - లోచనం। నే
త్రములుగలయదియు- భువనలోభనీయం। భువన-లోకములచేత। లోభనీయం
ఆశింపఁదగినయదియునైన- మహః। శ్రీకృష్ణాఖ్యతేజమును- పునఃపునః। సా
రెకును- ఉపాస్మహే- సేవించుచున్నాము. ... ...

ఉ॥ కన్నులనిత్యనైవానజడిగ్రమ్మెడుమోవిసుధారసమ్ములంబిమ్మెడుతేఁటనవ్వ

యుఁజిప్పిలుచూపులు మోముదమ్మిచే। ల్వెన్నునుగోపికల్గనిహాళాహాళిఁజెందర న్నుతెల్లలో। కమ్ములుగాంచనోర్క్కనవకంబగుతేజముఁగొల్చెదన్మదిన్॥ 3౫

తా॥ స్వభావంబుచే సుందరంబగునధరంబునుదయచే సరసంబులైదివ్యంబులైన నేత్రంబులును మనోహరంబగు ముఖకమలంబునుహృద్యరసంబున సరసంబగుచిఱునగవును గలిగి యెల్లలోకంబులచే నాశింపఁదగినదియై పరబ్రహ్మంబనెఱింగినవారల హృదయంబులాస్పదంబుగనుండుచు గోపికల నయనంబులకు సంతసంబుఁ జేయుచు వెలుఁగు శ్రీకృష్ణాఖ్యతేజంబును సారెసారెకు నేను సేవించుచున్నాననుట. ... ... ... ... ...

శ్లో॥ సకోపిబాలస్సరసీరుహాక్షః స్సాచవ్రజస్త్రీజనపాదధూళిః। ముహు స్త్రదేతద్యుగళంమదీయే మోహాముహ్యామానేసిమనస్యదేతు॥ 3౬

టీక॥ సః- ప్రసిద్ధుఁడయినవాఁడును। కోపి - వాచామగోచరుండైనవాఁడును - సరసీరుహాక్షః- పుండరీకాక్షుఁడయినవాఁడునైన- బాలః। బాలుఁడును। సా- ఆప్రసిద్ధమయిన- వ్రజస్త్రీజనపాదధూళిశ్చ- వ్రజస్త్రీజన। గోపికాజనములయొక్క - పాదధూళిశ్చ - పాదధూళియును। తదేతద్యుగళం-ఆయీరెండును- మదీయే। నాసంబంధమయిన- మనసి। చిత్తము - మోముహ్యామానే పి- మోహమునొందినదైనప్పటికిని। ముహుః - మాటిమాటికి - ఉదేతు। స్ఫురింపదమునొందుంగాత॥ ... ... ... ...

చ॥ అలఘువిమోహభామునననల్కుచుఁగుయ్యాదునన్నుఁబ్రోవఁగా। లలితవిశాలలోచనము ఁబాఁదించుచువాయువేగుదై। దులదులవచ్చుబాలుఁడునుదోడనెకొనసియాడనాతసెం। గలిసికొనంగవచ్చువ్రజకాంతలపాదరజంబు గాంచెదన్॥

తా॥ ప్రసిద్ధుఁడై వాచామగోచరుండై తెల్లదామరలుం బోనిలోచనంబులుగల బాలకృష్ణుండును వానివెంటనంటివచ్చు గోపికలపాదరజంబును మిక్కిలియుభ్రాంతంబగునామనంబునఁగాంచుచున్నాననుట. . ... ...

శ్లో॥ మయిప్రయాణాభిముఖేచ వల్లవీ స్తనద్వయీదుర్గళితస్సబాలకః। శనైశ్శనైశ్శ్రావితవేణునిస్వనో విలాసవేషేణపురఃప్రతీయ తామ్॥ 3౭

టీక॥ మయి। నేను- ప్రయాణాభిముఖేచ- ప్రయాణ। లోకాంతరప్రయాణమునకు- అభిముఖేచ - ఉన్ముఖుఁడనగుచుండఁగా। వల్లవీస్తనద్వయీదుర్గళితః- వల్లవీ। గోపస్త్రీలయొక్క - స్తనద్వయీ స్తనద్వంద్వముల చేత। దుర్గళితః- శ్రాంతుఁడైన- సః - ఆప్రసిద్ధుఁడైన - బాలకః। బాలకృష్ణమూర్తి- శనైశ్శ

నైః- మెల్లమెల్లన- శ్రావిత వేణునిస్వనః- శ్రావిత। శ్రవణమార్గమునొందింపఁబడిన- వేణునిస్వనః। వేణునాదముగలవాఁడగుచు - విలాసవేషేణ। విలాస- విలాసార్థమైన। వేషేణ- అలంకారముచేత- పురః - ఎదుట। మమ - నాకు- ప్రతీయతాం- తోఁచుఁగావుత. ... ... ... ... ◈

ఉ॥ గొల్లమిటారిఁ పూఁపఁచనుఁగుత్తులహత్తినవింతలాఁగుతోఁ। జల్లనిఁచూపుతోవదలిసారెకుజారెడుపీలిదండతో। నల్లపరాకుఁదెల్పుటకునై విలసిల్లినపిల్లఁగ్రోవితో। నల్లనిఁబాలుఁడొక్కరుఁడు నాసయనంబుననిల్చుఁగాతను॥ ౩౭

తా॥ నేనులోకాంతరంబునకుఁ బోవసమకట్టినప్పుడుగోపికలచన్నులరాయిడినలింగిన శరీరంబుగల వాఁడామగోచరుండగు బాలుండు మెల్లమెల్లన వేణుగానంబు నాచెవ్వులసించుచు నాముందట విలాసయుతంబగు వేషంబుచేనిల్చుంగావుతయనుట. ... ... ... ... ... ◈

శ్లో॥ అతిభూమిమభూమిమేవ వా వచసాం వాసితవల్లవీస్తనమ్। మనసామపరంగసాయనం మధురాద్వైతముపాస్మహే మహః॥ ... ౩౮

టీక॥ వచసాం- వచనములకును। మనసాం వా - మనస్సులకును - అతిభూమిం। మిక్కిలియువిషయమయినయదియు- అభూమిం- అవిషయమయినయదియు, సగుణత్వమునవిషయమనియు। నిర్గుణత్వమునన విషయమనియునుదాత్పర్యము. అపరం- ప్రసిద్ధమయినయదియు। రసాయనం। రసాయనస్వరూపమయినయదియు। మధురాద్వైతం- మధుర। సౌందర్యముచేత- అద్వైతం- అద్వితీయమయినయదియు। వాసితవల్లవీస్తనం - వాసిత। నివాసముగఁజేయఁబడిన- వల్లవీస్తనం- గోపికాస్తనములుగలయదియునగు। మహః ఏవ -' తేజమునే - ఉపాస్మహే- సేవించుచున్నాము. ... ... ... ... ◈

చ॥ పలుకఁగోలందిగానియనుభావముఁగాంచియునద్వితీయమై। పొలుపువహించినెమ్మదికళ్యాణరసాయనమైమహోన్నతిం। దొలికెడుఁదివ్యతేజముమనోహరవల్లవపల్లవాధరీ। లలితపయోధరాంతరవిలాసనివాసముగాంచెఁగంటిరే॥ ౩౮

తా॥ పలుకందరంబుగానియనుభావంబుచేనద్వితీయంబైమనంబునకురసాయనంబైనెగడుదివ్యతేజంబుగోపికలచన్నులపైనివాసంబుసేసెనట్టితేజంబునేడపకయుపాసించుచున్నాననుట. ... ... ... ◈

శ్లో॥ జననాన్తరేపి జగదేకమణ్డనే కమనీయధామ్ని కమలాయతేక్షణే। వ్రజసున్దరీజనవిలోచనామృతే చపలాని సన్తు సకలేన్ద్రియాణి మే॥ ... ౩౯

టీక॥ జగదేకమండనే। జగత్-లోకములకు- ఏక।ముఖ్యమైన- మండనే-అలంకారమైనవాడును।కమనీయ-ధామ్ని- కమనీయకోరదగిన। ధామ్ని- తేజముగలవాడును।కమలాయతేక్షణే- కమల। తామరరేకులవలె- ఆయత।విశాలములయిన- ఈక్షణే। నేత్రములుగలవాడును- వ్రజసుందరీజనవిలోచనామృతే-వ్రజ-వ్రేపల్లెయందున్న- సుందరీజన- స్త్రీజనములయొక్క- విలోచన। నేత్రములకు- అమృతే- అమృతప్రాయుఁడైనవాఁడునైన శ్రీకృష్ణమూర్తియందు। జనసాంతరే హి। జన్మాంతరమునందు। మే। నాయొక్క- సకలేంద్రియాణి। చక్షురాదులగునెల్లయింద్రియములు- చపలాని- ఆసక్తములు।సంతు- అగుంగాక. ... ❖

మ॥ శతపత్రోజ్వలపత్రనేత్రు వ్రజకంజాతాననాలోకనామృతధారాధరచారుగాత్రుభువనోత్కృష్టైకభూషాసను । న్నుతచారిత్రుబవిత్రుగోల్పియనుజన్మంబుల్లోలేంద్రియ। ప్రతతుల్సౌఖ్యమునొందుగాతనిజచాపల్యంబుల్ దేరఁగన్॥

తా॥ జగములకుముఖ్యముగనలంకారభూతుండునుగోరందగినమహనీయతేజంబునకాశ్రయుండును బుండరీకాక్షుండును గోపికలనేత్రంబులకమృతంబుబోలెసుఖంబు జేయువాడునగు శ్రీకృష్ణుచేష్టనందు బ్రతిజన్మంబుననునాసకలేంద్రియంబులాసక్తంబులంయిసుఖంబునొందుంగాతయొసుట. ... ✻

శ్లో॥ మునిశ్రేణీవంద్యం మదభరలసద్వల్లవవధూస్తనశ్రోణీబింబస్తిమితనయనాంభోజసుభగమ్ । పునస్తోమాన్తోమాంపులకితగిరాంనైగమగిరాంఘనశ్యామంవన్దేకిమపిమహనీయాకృతిమహః॥ ... ... ... ౪౦

టీక॥ మునిశ్రేణీవంద్యం। ముని- మునీశ్వరులయొక్క- శ్రేణి । పంక్తులచేత। వంద్యం - నమస్కారముచేయఁబడుచున్నదియు । మదభరలసద్వల్లవవధూస్తనశ్రోణీబింబస్తిమితనయనాంభోజసుభగం । మదభర - మదభారముచేత।లసత్- ప్రకాశించుచున్న- వల్లవవధూ-,ఆభీరస్త్రీలయొక్క- స్తన। స్తనములయొక్కయు- శ్రోణి। పిరుదులయొక్కయు- బింబ- ప్రదేశములవిషయమయి-స్తిమిత। నిశ్చలమైనటువంటి- నయనాంభోజ । తామరరేకులవంటికన్నులచేతను- సుభగం। సుందరములయినదియు- పునః। మెండియు- పులకితగిరాం। పులకిత- సంజాతపులకములుగల।గిరాం- వాక్యములుగల। నైగమగిరాం- వేదాంతవాక్యములకు । స్తోమాస్తోమామిం - కొనియాడఁదగినభూమియైనదియు-ఘనశ్యామం। ఘన- వారిదమువలె।శ్యామం- నల్లనయినదియు।మహనీయాకృతిం- మహనీయ। స్పృహణీయమయిన--ఆకృతిం। స్వరూపముగలదియు-

ఽమపి। చెప్పనలవిగానిదియునగు- మహః- శ్రీకృష్ణుఁడనుతేజస్సునుగూర్చి-వందే. నమస్కారముచేయుచున్నాను- ... ... ... ❖

చ॥ పులకలుగ్రమ్మమౌనిజనములశ్రుతివాక్యములన్నుతింపఁగాఁజలదమనోహరాకృతిమెసంగమదాలసవల్లవాంగనా। లలితపయోధరాంతరవిలాసకటీపటలోలలోచనంబులఁదనరారునందకృతఁపుణ్యనిధానమునన్నుఁబ్రోవుతన్॥ ౪౦

తా॥ మునిపుఙ్గవులచే నమస్కరింపబడుచుమహాతిశయంబున బ్రకాశించుగోపికలకుచనితంబ ప్రదేశంబులం జెలంగుకను దామరలచే సుందరంబయియుపనిషద్వచనంబులకు బ్రతిపాద్యవిషయంబై నీలమేఘంబుఁబోలె సల్లనైయతిమనోహరాకారంబుగలిగి వాచామగోచరంబై వెలుంగు తేజంబునాశ్రయించుచున్నాననుట. ... ... ... ... ... ❖

శ్లో॥ అనుచుమ్బతామపిచ లేనచేతసామనుజాకృతేర్మధురిమశ్రియంవిభోః। అయిదేవకృష్ణదయితేతిజల్పతామపినోభవేయురపినామతాదృశాః॥ ౪౧

టీక॥ చలేనాపి। చలించుచున్నటువంటి - మనసా । మనస్సుచేత - మనుజాకృతేః- మనుష్యాకారమువంటియాకారముగలశ్రీకృష్ణస్వామియొక్క - మధురిమశ్రియం- మధురిమ। సౌందర్యముయొక్క - శ్రియం। సంపదను - అనుచుంబతాం। తలంచుచున్నవారలకు - యాదృశాః- ఏదినములు- అభూవన్- అవుచున్నవియో- అయిదేవ- దేవుడైనవాడవును। దైత - ఇష్టుడవైనవాడవునునగు హేకృష్ణ- ఓయికృష్ణా- ఇతి - ఈప్రకారము। జల్పతాం- చెప్పుచునున్న-నోపి. మాకును। తాదృశాః- అటువంటిదినములు । భవేయుః- అయ్యెడుమా- ❖

ఉ॥ మానుషవేషధారియగుమాధవుమోహనకాంతిచంచలంబైనటియించుచిత్తమునసానుచుఁగృష్ణముకుందయంచుస। న్మానముమీఱఁగాఁబలుకమాకౌనఁగూడెడుఁగాతవీదృశ । ధ్యానవిశేషయుక్తసనకాదిమహామునిభాగ్యసంపదల్॥

తా॥ చంచలంబైనచిత్తంబుచే మానుషమూర్తిఁగైకొనిన శ్రీకృష్ణునిసౌందర్యసంపదధ్యానంబు జేయువారలకునేదినంబులుపురుషార్థంబై చెల్లునో- ప్రియ- కృష్ణ - ముకుంద - యనునాలాపంబులాడుమాకునట్లుసుదినంబులుపురుషార్థంబులయ్యెడుమనుట. ... ... ... ... ... ❖

శ్లో॥ కిశోరవేషేణకృశోదరీదృశాంవిశేషదృశ్యేనవిశాలలోచనం। యశోదయాలబ్ధయశోనవామ్బుధేస్నశ్యామమేనీలనిశాకరంకదా॥ ... ౪౨

టీక॥ కృశోదరీదృశాం- కృశోదరీ। కృశించిననడుములుగలగోపికలయొక్క -

దృశాం। కన్నులచేతను- విశేషదృశ్యేన। విశేష- మిక్కిలియగునట్లుగా।దృశ్యేన- చూడఁదగిన। కిశోరవేషేణ- బాల్యవేషముచేత - ఉపలక్షితం। చూడబడినవాఁడును- విశాలలోచనం। విశాల- వెడలుపులైన। లోచనం- కన్నులుగలవాఁడును। యశోదయా- యశోదాదేవిచేత। లబ్ధయశోనవాంబుధేః - లబ్ధ। పొందబడిన- యశః। కీర్తియను- నవ। నూతనమైన- అంబుధేః। ఉదధికి - నీలనిశాకరం- నీల। నల్లని- నిశాకరం। చంద్రుడైన।శ్రీకృష్ణస్వామిని- కదా। యెప్పుడు- నిశామయే- చూచుచున్నాను. ... ... ... ... ❖

శా॥ లీలాలోలవిశాలలోచనునిఁగేళీశైశవాలంకృతు।న్బాలున్బాలితలోకపాలుఁవ్రజకాంతల్సొక్కుచుం జెక్కుచం। దాలంగన్నులకొద్దికన్గానుయశోదాకీర్తిరత్నాకర। ప్రాలేయాంశునినీలనీరదతనుఁభావింతునెల్లప్పుడున్॥ ౪౨

తా॥ వ్రేపల్లెయందలిగోపికలనేత్రంబులచేఁ జూడఁబడుచున్నవిలాసాథకంబుగ నంగీకరింపఁబడిన బాలవేషంబుగలిగివిశాలంబులగు లోచనంబులచేతంచేజరిల్లుచు యశోదాకీర్తిసముద్రంబునకుఁ జంద్రుడై నీలవర్ణుండైన గోపాలదేవునెప్పుడుచూచుచున్నానని తా. ... ... ... ❖

శ్లో॥ ప్రకృతిరవతునోవిలాసలక్ష్మ్యాః ప్రకృతిజడస్సృణతాపరాధవీథ్యాం। సుకృతికృతపదంకిశోరభావేసుకృతిమనః ప్రణిధానపాత్రమోజః॥

టీక॥ కిశోరభావే - బాలభావమందు- విలాసలక్ష్మ్యాః - విలాసనంపదకు ప్రకృతిః - మూలకారణమైయినయదియు - ప్రణతాపరాధవీథ్యాం- ప్రణత- భక్తులయొక్క - అపరాధ- అపరాధములయొక్క - వీథ్యాం - పరంపరావిషయమై- ప్రకృతిజడం- స్వభావముచేతజడమైనయదియు - సుకృతిమనఃప్రణిధానపాత్రం - సుకృతి - పుణ్యపురుషులయొక్క - మనః - మనస్సులయొక్క - ప్రణిధానపాత్రం- ఏకాగ్రవిషయమైనవాఁడును - సుకృతికృతపదం - సుకృతి- పుణ్యపురుషులయందు- కృత - చేయఁబడిన - పదం - స్థానముగలవాఁడునునగు- ఓజః - తేజస్సు- నః- మమ్ము- అవతు - రక్షించుగాత। ❖

చ॥ హితజనతాపరాధములనెన్నెడుపట్లజడస్వభావమై। కృతమతులాత్మలోనఁబరికింపఁగఁబాత్రమునైకిశోరతా। కృతపదమైవిలాసమ్మునరీతికిహేతువునై మనోహరా। కృతిగనుపించునాసుకృతిగేవలతేజముమమ్ముబ్రోవుతన్॥ ౪౩

తా॥ బాల్యంబునవిలాససంపదకు మూలకారణంబై భక్తులయపరాధవీథివిషయమైస్వభావసిద్ధంబుగజడంబై విద్వాంసుల మనంబుల నేకాగ్రపాత్రంబు

సుకృతులయుండుటంజేయంబడినసివాసంబుకలిగివెలుంగు తేజంబుమమ్మునంబ్రోచుం గావుతయనుట. ... ... ... ... ... ◈

శ్లో॥ అపహసితసుధామదావలేపైరధికమనోహరమార్ద్రమందహాసైః। వ్రజయువతివిలోచనావలేహ్యం రమయతు ధామ రమావరోధనం నః॥ ౪౪

టీక॥ అపహసితసుధామదావలేపైః - అపహసిత - యెగతాళిచేయంబడిన - సుధా- అమృతముయొక్క - మద- మదహేతుకమైన- అవలేపైః - గర్వముగలిగిన- ఆర్ద్రమందహాసైః - ఆర్ద్ర- రసయుక్తమైన-మందహాసైః - చిఱునగవులచేతను- అధికమనోహరం- అతిశయముమైన మనోహరమైన - వ్రజయువతివిలోచనావలేహ్యాం- వ్రజయువతి - ఆభీరస్త్రీలయొక్క - విలోచన - కన్నులచేత- అవలేహ్యాం- అత్యాదరణచేజూడందగిన - రమావరోధనం - రమా - లక్ష్మీదేవికి- అవరోధనం- అంతఃపురమైన- ధామ- కాంతి - నః - మమ్ము నం- రమయతు- ఆనందమునుబొందింపంజేయుగాత. ... ... ◈

చ॥ నవసుధగ్రొవ్వునవ్వుచిఱునవ్వులు మోమున గోముజూపవ। ల్లవలలనావిలోచనవిలాసవిలేహ్యము నై రమామణీ। భవనభుజాంతర స్థితనిభాసిలునందతేపః ప్రభావసం। భవఫలమైన ధామము శుభంబులభంగురభంగినీవుతన్॥

తా॥ నవామృతంబుగర్వంబు నవహసించుమందహాసంబు మోమునంగ్రొత్తనవ్వునంజూపగోపికలవిలోచనంబుచేమిక్కిలియుంజూడంబడుచున్నదియై శ్రీమహాలక్ష్మికినిల్లయివెలుంగు తేజంబుమమ్ము సంతోషింపంజేయుగాక॥ ◈

శ్లో॥ అంకూరితస్మేరదశావిశేషైరశ్రాంతహర్షామృతవర్షమక్ష్ణోః। సంక్రీడతాం చేతసిగోపకన్యాధన్యస్తనస్వస్త్యయనం మహో నః॥ ౪౫

టీక॥ అంకూరితస్మేరదశావిశేషైః- అంకూరిత- అంకురించిన - స్మేరదశావిశేషైః - మందహాసదశావిశేషములచేతను - అక్ష్ణోం - నేత్రములకు - అశ్రాంతహర్షామృతవర్షం- అశ్రాంత- అవిచ్ఛిన్నమైన- హర్షామృత- ఆనందామృతముయొక్క - వర్షం। వర్షమైనయదియు- గోపకన్యాధన్యస్తనస్వస్త్యయనం। గోపకన్యా - గోపకన్యలయొక్క - ధన్య- ధన్యములైన। స్తన- స్తనములయొక్క - స్వస్త్యయనం। మంగళాయతనమయినయదియునైన - మహః। కాంతి - నః। మాయొక్క - చేతసి। మనమునందు - సంక్రీడతాం। లెస్సగాగ్రీడించుగాక. ... ... ... ... ... ◈

చ॥ అతులితమందహాసరుచిరాననముల్విలసిల్లదర్శనో। ద్యతజనతావలా

కఘనహార్ష సుధామయవర్ష రూపమై। సతతముగోపికాఘనకుచస్థలనిస్తులదివ్య మంగళా। యతనమునైనధామమునిరంతరముంజరియించునామదిన్॥ ౭౫

తా॥ పులకలెత్తుచున్న చిఱునగవుచేతంజూపఱులకన్నులకు సంతోషామృతంబునవర్షించుచుగోపకన్యకలకుచములకుమంగళాయతనంబై వెలయుతేజంబునామనంబునంజరియించుంగాతయనుట. ... ... ❁

శ్లో॥ మృగమదపంకసంకరవిశేషితవన్యమహాగిరితటగండగైరికఘనద్రవవిద్రుమితమ్ । అజితభుజాంతరంభజతహేవ్రజగోపవధూస్తనకలశస్థలీఘుసృణమర్దనకర్దమితమ్॥ ... ... ... ... ౭౬

టీక॥ మృగమదపంకసంకర విశేషితవన్యమహాగిరితటగండగైరికఘనద్రవవిద్రుమితం- మృగమద- కస్తూరియొక్క - పంక। బురదయొక్క - సంకర। సంబంధముచేత- విశేషిత। మిక్కిలియతిశయింపబడిన- వన్య - అడవియందుబుట్టిన- మహాగిరి। గొప్పపర్వతముయొక్క - తట। చరియందలి - గండ। స్థూలోపలములయొక్క - గైరిక। గైరికాదివిశేషములయొక్క - ఘన। సాంద్రమయిన - ద్రవ। ద్రవముచేత - విద్రుమితం। పవడముగఁజేయఁబడినదియు- వ్రజగోపవధూస్తనకలశస్థలీఘుసృణమర్దనకర్దమితం - వ్రజ। నందునివ్రేపల్లియందలి- గోపవధూ। గోపస్త్రీలయొక్క - స్తనకలశ।కలశములవంటిస్తనములయొక్క - స్థలీ। ప్రదేశమందలి - ఘుసృణ। కుంకుమగంధముయొక్క -మర్దన- ఒరియుటచేత। కర్దమితం - బురదగలిగినదిగాఁజేయఁబడినదియునగునటువంటి- అజితభుజాంతరం- అజిత- శ్రీకృష్ణస్వామియొక్క -భుజాంతరం-భుజమధ్యమును। భజత- సేవింపుఁడు. , ... ... ... ❁

చ॥ మృగమదపంకసంకరగిరిస్థితగైరికధాతుగర్భిమున్ । దొరగనువహించివల్లవవధూపృథులస్తనకుంకుమంబునన్ । బ్బగుణితకాంతివస్తుతగునీయమహోత్సుగ్రపాకటాత్మునిం । వగిలిభజింపసిల్వ్యమమందంబునుత్తములారచిత్తముల్॥ ౭౬

తా॥ కస్తూరీకర్దమముయొక్క సంబంధముచే నతిశయింపఁబడినగిరిప్రదేశంబుగండశిలయందలి ధాతువిశేషముయొక్క యతిశయంబగు ద్రవంబుచే నరుణంబై వ్రేపల్లియందలి గోపికలకుచంబుల యుంగరాగవిశేషంపుమర్దనంబుచేఁబంకిలంబగుశ్రీకృష్ణునివక్షంబుసేవింపుఁడనుట. ... ❁

శ్లో॥ ఆపూరాలపల్లవితలీలమపాంగజాలైరాసించతీభువనమాదృతగోపవేషా । బాల్యాకృతిర్మృదులముగ్ధముఖేందుబింబమాధుర్యసిద్ధిరవతాన్మధువిద్విషోనః॥ ... ... ... ... ... ౭౭

టీక॥ ఆమూలపల్లవితలీలం. ఆమూల। మూలపర్యంతము. పల్లవిత। చిగిరించినటువంటి. లీలం। లీలలుగలుగునట్టులుగా. అపాంగజాలైః. అపాంగ. క్రీగంటిచూపులయొక్క - జాలైః। సమూహములచేత. భువనం। లోకములను. ఆసించతీ - తడుపుచున్నయదియు. ఆదృతగోపవేషా. ఆదృత. ఆదరణచేయఁబడిన। గోపవేషా - గోపాలకవేషముగలయదియు। మృదులముగ్ధముఖేందుబింబా. మృదుల। కోమలమయినయదియు - ముగ్ధ। సుందరమయినయదియునగు। ముఖేందుబింబా। చంద్రబింబముతో సమానమయినముఖముగలయదియు - మాధుర్యసిద్ధిః। మాధుర్య - మధురత్వముయొక్క - సిద్ధిః. ప్రాప్తిమైనయదియునగు. మధుద్విషః. శ్రీకృష్ణమూర్తియొక్క - బాల్యాకృతిః। బాల్య - బాలభావమందలి. ఆకృతిః। రూపము. నః। మమ్ము. అవతాత్। రక్షించుఁగాత. ... ❀

చ॥ కరుణనుబాదుకొల్పినజగంబుఁగటాక్షసుధారసాప్తిచేఁ। బరిణతపల్లవప్రసవపక్వఫలంబునుగా నొనర్చుచుం। జిరుతమిటారిప్రాయమునఁ జెల్వగుచక్కఁదనాల పంటన। మ్మురహరుఁబూర్ణచంద్రముఖు మోహనవల్లవవేషుఁ గొల్చెదన్॥ ... .. ... ... ... ౪౭

తా॥ మొదలంటఁజిగిర్చిన విలాసంబులుగలుగునటుల నపాంగనిరీక్షణంబులజగంబుంజూచుచున్నదిమైకోమలంబునుసుందరంబునై చంద్రబింబంబుబోలిననెమ్మొగంబుగలిగియందఱుచేనంగీకరింపఁబడిన గోపాలాలంకారంబుగలిగిసౌందర్యంబులకాటపట్టయి వెలయునట్టి శ్రీకృష్ణునిబాలభావంబునందలియాకారంబుమమ్ము రక్షించుఁగావుత. ... ... ... .. ❀

శ్లో॥ విరణన్మణినూపురంవ్రజే చరణాంభోజముపాస్వశార్ఙ్గిణః। సరసే సరసిశ్రియాశ్రితం కమలం వాకలహంసనాదితమ్॥ ... ... ౪౮

టీక॥ వ్రజే - నందునిగొల్లపల్లియందు। విరణన్మణినూపురం - విరణత్. ధ్వనిచేయుచునున్న. మణి। మణిమయములయిన - నూపురం. అందెలుకలయదియు। సరసే - రసయుక్తమైన। సరసి - సరస్సునందు. శ్రియా। కాంతిచేత. శ్రితం ఆశ్రయింపఁబడినయదియు - కలహంసనాదితం। కలహంస - రాజహంసలచేత। నాదితం - ధ్వనికలవిగాఁజేయఁబడినటువంటి। కమలం. కమలములవలెనున్నదియునగు। శార్ఙ్గిణః. శ్రీకృష్ణస్వామియొక్క - చరణాంభోజం। కమలములవంటిపాదములను. ఉపాస్వ. సేవింపుము. ఇచటచరణాంభోజం. అనుపదమునుదద్విశేషణపదములును - జాత్యేకవచనముగాఁబ్రయోగింపబడియె. ❀

ఉ॥ సారసరోమరాళవరసారససన్నిభనూత్నరత్నమం। జీరవిలాసపాదములచేఁజరియించుచువీధిలేఁగలం। బారఁగదోలివెంబడినె పర్వ్వులువారుచుఁ జేరిపట్టుచుం। గేరినటించుచిన్నియదుకేసరినామదినాశ్రయించెదన్॥ ❖

తా॥ సారవంతంబగుస్వరంబునమరాళధ్వనితోడంగూడిన కమలంబుకరణి యందియలమ్రోతచేరవణించు శ్రీకృష్ణునికాంతియుతంబగు పాదకమలంబును సేవింపుమనుట. ... ... ... ... ... ❖

శ్లో॥ శరణమశరణానాంశారదామ్భోజనేత్రం నిరవధిమధురిమ్ణానీలవేషేణరమ్యమ్। స్మరశరవరతన్త్రస్మేరనేత్రామ్బుజాభిర్వ్రజయువతిభిరవ్యాద్బ్రహ్మసంవేష్టితంనః॥ .. ... ... ... ... ౪౯

టీక॥ అశరణానాం- రక్షకులులేనివారలకు। శరణం- రక్షకమైనయదియు- శారదాంభోజనేత్రం - శారద। శరదృతుసంబంధములయిన - అంభోజ - కమలములవంటి। నేత్రం - కన్నులుగలయదియు। నిరవధిమధురిమ్ణా - నిరవధి- అవధిలేని। మధురిమ్ణా - సౌందర్యాతిశయముగల। నీలవేషేణ - నల్లనివేషముచేత। రమ్యం - మనోహరమయినయదియు। స్మరశరపరతంత్రస్మేరనేత్రాంబుజాభిః - స్మరశర। మన్మథబాణములచేత - పరతంత్ర। పరాధీనులైనవారును- స్మేర। వికసించిన- నేత్రాంబుజాభిః। పద్మములవంటికన్నులుగలవారునునగు- వ్రజయువతిభిః - గొల్లపల్లెయందలిస్త్రీలచేత। వేష్టితం - చుట్టుబడిన - బ్రహ్మ- శ్రీకృష్ణుడనెడుపరబ్రహ్మము। నః - మమ్ము- అవ్యాత్ - కాపాడుగావుత. ❖

మ॥ శరదంభోరుహనేత్రునిస్తులకళాసౌందర్యపాత్రున్మనో।హరపౌరందరనీలగాత్రుఁగుసుమాస్త్రావేశజాతస్మితాం। కురనందవ్రజసుందరీపరివృతుంగోపాంగనాలింగితు।న్శరణత్రాణసమున్నతున్వరదయాసారోన్నతుంగొల్చెదన్॥

తా॥ రక్షకంబులేనివారలకు రక్షకంబై శరత్కాలంబున విరిసిన తెల్లదామరరేకులంబోలినకన్నుగవగలిగినిరవధికసౌందర్యంబుగల్గి నీలవర్ణంబుచే నతిమనోహరంబై మన్మథబాణంబులచేబడలికతంబున బరాధీనంబులైనలోచనకమలంబులుగలగోపయువతులచేతంబరివేష్టింపంబడియున్న శ్రీకృష్ణరూపంబగుపరబ్రహ్మంబుమమ్ముఁబ్రోచెడుమనుట ... ... ... ❖

శ్లో॥ సువ్యక్తకాన్తిభరసౌరభదివ్యగాత్రమవ్యక్తయౌవనపగీతకిశోరభావమ్। గవ్యానుపాలనవిధావనుశిష్టమవ్యాదవ్యాజరమ్యమఖిలేశ్వరవైభవంనః॥ ౫౦

టీక॥ సువ్యక్తకాంతిభరసౌరభదివ్యగాత్రం - సువ్యక్త- ప్రకాశించుచున్న-

కాంతి। కాంతులయొక్క - భర- అతిశయముగలిగినదియు । సౌరభ - పరిమళయుక్తమైన । దివ్య గాత్రం- దివ్యమంగళవిగ్రహముగలయదియు - అవ్యక్తయౌవనపరీతకిశోరభావం- అవ్యక్త- అస్ఫుటమయిన । యౌవన- జన్మనముచేత। పరీత। వ్యాప్తమైన- కిశోరభావం। బాల్యముగలయదియు- గవ్యానుపాలనవిధా- గవ్య - గోసమూహముయొక్క - అనుపాలన । రక్షణముయొక్క - విధా విధానమందు- అనుశిష్టం- శిక్షితమైనయదియు - అవ్యాజరమ్యం - అవ్యాజ- ఉపాధిరహితముగా రమ్యం- మనోహరమైనయదియునగు - అఖిలేశ్వరవైభవం. అఖిలేశ్వర। నారాయణునియొక్క - వైభవం- శ్రీకృష్ణాఖ్యవైభవము। నః- మమ్ము- అవ్యాత్ రక్షించుగాక ... ... ... ... ✿

చ॥ ప్రకటితకాంతి సౌరభకదంబితగాత్రము యౌవనాకృతిన్ । చకితకిశోరభావము సగబ మనోహరరూపమైనదై । సకల జగన్నియంతయగు శౌరిమహత్త్వముగొల్లపల్లెచా । యొక యుంటనంచనులసారసి మేపెసిడె మిచిత్రమై ॥ ౫౦

తా॥ ప్రకాశమానంబగు కాంత్యతిశయంబుగలిగి పరిమళయుతంబగు దివ్యమంగళశరీరంబును మొలకలెత్తుజవ్వనంబుచే వ్యాప్తంబును నగు బాల్యంబునుంగలిగి గోపరిపాలనవిధియందు సుశిక్షితంబయిన శ్రీకృష్ణాఖ్యవైభవంబు మమ్ము బ్రోచుగావుతయనుట ... ... ... .. ✿

శ్లో॥ అనుగతమమరీణామంబరాలంబినీనాం నయనమధురిమశ్రీనర్మనిర్మాణసీమ్నామ్ । వ్రజయువతివిలాసవ్యాపృతాపాంగమవ్యాత్ త్రిభువనసుకుమారం దైవతం కైశోరకం నః॥ ... ... ... . ౫౧

టీక॥ అంబరాలంబినీనాం - ఆకాశమునాశ్రయించియున్నట్టువంటివియు । నయనమధురిమశ్రీనర్మనిర్మాణసీమ్నాం - నయన। కన్నులయొక్క - మధురిమశ్రీ - సౌందర్యసంపత్సంబంధమునైన - నర్మనిర్మాణ - విలాసచేష్టలయొక్క - సీమ్నాం- మర్యాదలుగల- అమరీణాం। దేవతాస్త్రీలచేత- అనుగతం అనుసరింపఁబడుచున్నయదియు - వ్రజయువతివిలాసవ్యాపృతాపాంగం- వ్రజయువతి । నందునిగొల్లపల్లియందలి గోపికాస్త్రీలయొక్క - విలాస విలాసములయందు । వ్యాపృత- ఉన్నట్టి- అపాంగం। కటాక్షములుగలయదియు - త్రిభువనసుకుమారం- త్రిభువన। మూడులోకములకును - సుకుమారం । సుందరమైనయదియునైన । దైవతకైశోరకం। దైవ - శ్రీకృష్ణమూర్తియొక్క - కైశోరక బాల్యభావము- నః। మమ్ము- అవ్యాత్। పాలించుగాక ... ...

మిక్కిలివ్యాకులమయిన । బృందావనమృగదృశాం- బృందావనంబునందలిగోపికా స్త్రీలయొక్క - ప్రణయచపలాపాంగవీచీతరంగైః- ప్రణయ- ప్రేమాతిశయముచేత । చపల- మిక్కిలిచంచలమయిన- అపాంగ - క్రేగంటిచూపులయొక్క - వీచీ- ఊర్ములయొక్క - తరంగైః।సంతతులచేతను-దిష్ట్యా-దైవముచేతను - పులకముకుళాభోగభూషావిశేషం - పులకముకుళ - మొగ్గలవంటిగగురుపాటులయొక్క - ఆభోగ। విశ్రాంతమనియెడి - భూషావిశేషం- అలంకారములుగలుగునట్టులుగా - ప్రత్యాసన్నం - ప్రత్యక్షమైనదానివలెనున్నయది యు- లక్ష్మీలీలాకువలయదళశ్యామం । లక్ష్మీ- శ్రీతమాదేవియొక్క - లీలాకువలయ- విలాసముగాధరించినన ల్లకలువలయొక్క - దళ । రేకులవలె - శ్యామం. నల్లనైన - ధామ। కాంతి- వః। మీయొక్క - కామాన్।మనోరథములను-పుష్ణియాత్- పోషించుగాక. ... ... ... ... ❖

మ॥ విరహోష్మన్ వ్రజభామినుల్గరఁగియుప్పొంగు భాగ్యంబునం। దరళాపాంగతరంగ సంతతుల సేద్దల్ దేర్చుచున్వచ్చిని । గ్భరరోమాంచ విశేషభూషుడగుగోపాలుండుపద్మాలయా । కరలీలోత్పలనీలవర్ణుడొసగుం గళ్యాణపారంపరన్॥ ... ... ... ... ... ౫౩

తా॥ అక్రూరుండుగంసునిపంపునం గృష్ణునిమధురకుందోడ్కొనిపోవ శ్రీకృష్ణనియోగంబున మన్మథబాణపీడితలైన గోపస్త్రీలకుఁ బ్రేమచేతంజంచలంబులగునపాంగదృష్టిసంతతులచేదైవయోగంబున మొగ్గలవంటిగగ్గురులనియెడియలంకారవిశేషంబుగలుగునటులగోపికలనిధిధ్యాసంబున బ్రత్యక్షంబైనదానివలెనుండినదియైలక్ష్మీదేవికరంబునవిలాసార్థంబుగధరియించిననల్లకలువరేకులవలెనీలవర్ణంబైనతేజంబు మీమనోరథంబులనిచ్చుఁగాకయనుట- కృష్ణుండుదూరంబుననుండియుసుగోపికలనిదిధ్యానంబున బ్రత్యక్షంబైయెకరణినుండుననుట. ❖

శ్లో॥ జయతిగుహాశిఖీన్ద్రపిఞ్ఛమాళిస్సురగిరిగైరికకల్పితాంగరాగః । సురయువతివికీర్ణసూనవర్షస్నపితవిభూషితకున్తలఃకృష్ణః॥ ... ౫౪

టీక॥ గుహాశిఖీంద్రపింఛమాళిః- గుహా। షణ్ముఖస్వామియొక్క - శిఖీంద్ర నెమలియొక్క - పింఛ- నెమలిపురి। మాళిః- సిగయందుఁగలవాఁడును। సురగిరిగైరికకల్పితాంగరాగః । సురగిరి - దేవస్థానమయిన మేరుపర్వతముయొక్క - గైరిక। గైరికాదిధాతువిశేషములచేత - కల్పిత। కల్పింపఁబడిన- అంగరాగః అనులేపముగలవాడును - సురయువతివికీర్ణసూనవర్షస్నపితవిభూషితకు

లః- సురయువతి - దేవతాస్త్రీలచేత। వికీర్ణ- వెదచల్లఁబడిన - సూనవర్ష స్నపితభూషిత కుంతలః - పుష్పవర్షము చేతఁదడుపఁబడి నటువంటియు నలంకరింపఁబడిన కేశములుగల- కుమారః -శ్రీకృష్ణస్వామి। జయతి- సర్వోత్కృష్టుఁడై వర్తించుచున్నాఁడు. .. ... ... ... ❋

మ॥ సురకన్యాకరముక్తకల్పకుసుమస్తోమంబులొయ్యారఁగప్పం। దరుచుం బెన్నెఱిగుంపుపైనిలిపి చెంతం దానెంతుల్సొట్టిని। గ్గరధాత్రీధరధాతుధారఁ జెలువారంబూని సేనానిపా। వురపుంబించపుతావళంబమరు దేవుండొప్పుబాల్యోన్నతిన్॥

తా॥ కుమారస్వామి వాహనంబయిన మయూరశ్రేష్ఠపింఛంబు సిగయందలంకరించి మేరుగిరియందలి ధాతువిశేషంబుగలిగి దేవస్త్రీలు గ్రుమ్మరించు కల్పతరుప్రసూనవర్షంబుచే స్నానంబు చేయించుటవలన నలంకరింపబడిన శిరోజంబులు గలిగి వెలుంగు శ్రీకృష్ణదేవుండు సర్వోత్కృష్టుఁడై యుండు ననుట. ❖

శ్లో॥ మధురమందశుచిస్మితమంజులం వదనపంకజమంగజ వేల్లితమ్। విజయతాం వ్రజబాలవధూజన స్తనతటీవిలుఠన్నయనం విభోః॥ ౫౫

టీక॥ మధురమందశుచిస్మితమంజులం - మధుర - మనోహరమయినయదియును- మంద- కొంచమైనదియు- శుచి- శుద్ధమైనదియునగు - స్మిత- నవ్వుచేత మంజులం - సుందరమైనయదియు- అంగజవేల్లితం- అంగజ- మన్మథునిచేత- వేల్లితం - చలింపబడుచున్నదియును - వ్రజబాలవధూజనస్తనతటీ విలుఠన్నయనం - వ్రజ- వ్రేపల్లియయందున్న- బాలవధూ- గోపబాలికలయొక్క - స్తనతటీ- స్తనప్రదేశములయందు- విలుఠత్- తిరుగుచున్నటువంటి- నయనం- నేత్రములుగలదియునగు- విభోః - శ్రీకృష్ణమూర్తియొక్క - వదనపంకజం- ముఖకమలము- విజయతాం - సర్వోత్కర్షముతో నుండుగాక. ❖

మ॥ ముసిపెంపుంజిఱునవ్వువెన్నెలలు కెమ్మోవిన్ సుధాబిందువుల్। గురియం జొక్కపుమోముఁజిత్తజుని సౌకుమార్య సత్కేళిగాదీర్చిన। బ్బురపుం బ్రాయము గొల్లపల్లెకులుకుంబూబోండ్ల పాలిండ్లపై। తిరవుంగన్నులఁ జూచు చూపుగల నూతన్ స్వామి నెల్లప్పుడుం గొల్తున్॥ ... ... ... ... ౫౫

తా॥ హృద్యంబై స్వల్పంబై పరిశుద్ధంబై నగవుచే సుందరంబయి మన్మథావిష్టంబయి వ్రేపల్లియయందలి బాలికల కుచప్రదేశంబులం బరిభ్రమించుచున్న నయనంబులు గలిగి తేజరిల్లు శ్రీకృష్ణుని మోముదామర సర్వోత్కృష్టంబయి యుండు ననుట॥ ... ... ... ... ... ❖

వబోధితత్రాసారూఢదృఢోపగూహనఘనా స్సామ్రాజ్యసాంద్రశ్రియః॥

టీక॥ రాధాకేళికటాక్షవీక్షితమహావక్షస్థలీమండనాః - రాధా। రాధయొక్క - కేళి। లీలాయుతమైన - కటాక్ష। క్రేగంటిచూపులచేత - వీక్షిత జూడఁబడుచున్న - మహావక్షస్థలీ। విశాలమైనఱొమ్మును - మండనాః - అలంకరించుచున్నవియు - క్రీడాంతే। సురతాంతమందు - ప్రతిసుప్తదుగ్ధతనయాముగ్ధావబోధితత్రాసారూఢదృఢోపగూహనఘనాః - ప్రతిసుప్త। మిక్కిలినిదురించుచున్న - దుగ్ధతనయా। లక్ష్మ్యంశసంభూతురాలైనరుక్మిణీదేవియొక్క - ముగ్ధ। సుందరమైన - అవబోధిత - నిద్రావస్థనుండిమేల్కొనిన - త్రాస। భీతివలన - ఆరూఢ - ఆవిర్భవించిన - దృఢోపగూహన - గాఢమయినయాలింగనముచేత। ఘనాః స్థూలములయినయవియు - సామ్రాజ్యసాంద్రశ్రియః - సామ్రాజ్య - మిక్కిలియునతిశయమయినయదియు - సాంద్ర - దినదినాభివృద్ధినొందునదియునగు - శ్రియః। కాంతులుగలయవియు - త్రిభువనస్వాదీయసః - త్రిభువన। మూడులోకములకు - స్వాదీయసః। ప్రీతివిషయమయినయవియునగు - తేజసః - శ్రీకృష్ణరూపతేజస్సుయొక్క - అంకురాః - మొలకలు। జియ్యాసుః - జలశీలనములయి వర్తించుచుండుగావుత.

మ॥ రతికేళిం దమిదీఱంగా నలసి నిద్రం జెందు స్వప్నంబునన్ । నతిభీకరముగా
గిలింపనిబిడంబై రాధికాపాంగవీక్షితవక్షస్స్థలని స్సలాభరణమై చెన్నొందు గో
ఖాంచనం । తతసామ్రాజ్యగమానుభూతిపరమానంద్రాస్సుఖేశా శౌరికిన్॥ ౫౭

తా॥ స్వామియొక్క విలాసంబులతోడం గూడిన కడగంటిచూపులచేఁ జూడఁబడుచున్నవక్షస్స్థలంబు నలంకరించుచున్నట్టియు నిద్రించుచున్న రుక్మిణీదేవిస్వప్నంబు కాంతిభీతింబొంది కౌగిలింపనిబిడంబులైనయతిశయకాంతులచే దేజరిల్లుచు త్రిలోకప్రీతివిషయకంబగు శ్రీకృష్ణునిపులకాంకురంబులు సర్వోత్కృష్టంబులై వర్తించుననుట.

... ... ... ... ...

శ్లో॥ స్మితస్నుతసుధాధరా మదశిఖండిబర్హాంకితా విశాలనయనాంబుజా
వ్రజవిలాసినీవాసితాః । మనోజ్ఞముఖపంకజా మధురవేణునాదద్రవాఙ్ఘయ స్సిము
మచేతసస్ఫురిగముపాసితావాసనాః॥ ... ... ... ౫౮

టీక॥ స్మితస్నుతసుధాధరాః । స్మిత - నవ్వునదియే - స్నుత। జారుచున్న - సుధా - అమృతమువలెనున్న - అధరాః - ఓష్ఠములుగలయవియు - మదశిఖండిబర్హాంకితాః - మదశిఖండి। మదించిననెమళ్లయొక్క - బర్హ। పింఛముచేత - అంకితాః - చిహ్నితములైనయవియు - విశాలనయనాంబుజాః। వెడల్పులయి

సనేత్రపంకజములుగలయవియు - వ్రజవిలాసినివాసితాః। రేపల్లెయందలి స్త్రీ
లయందునివాసముచేసియున్న యవియు - మనోజ్ఞముఖపంకజాః మనోహర
ములయినముఖకమలములుగలయవియు- మధురవేణునాదద్రవాః। మనోజ్ఞముల
యినవేణుగానగతులుగలయవియు- మమ।నాయొక్క - చేతసః। చిత్తమునకు-చి
రం- బహుకాలము. ఉపాసితాః। సేవ్యంబులగునవియునగు-వాసనాః-శ్రీకృష్ణ
రూపకసంస్కారములు- జయంతి। సర్వోత్కృష్టములైవర్తించుచున్నవి.

చ॥ చెలువగుమోముతోదళుకుచెక్కులతో మధురాధరంబుతో। సలువ
గునవ్వుతోసొలపుఁజూపులతోవ్రజబాలికాళితో। లలితకలాప భూషణవిలాస
ముతోమురళీరవంబుతో। బలుమఱుమీఱుగాకమధుభంజనవాసనలెల్లదిక్కులకు।

తా॥ చిఱునగవనియెడు నమృతంబుచేఁజెలువగు కెమ్మోవియునేపారునె
మలిపురిచిన్నెయువిశాలంబులగు కనుదామరలుం గలిగిగోపికలతోడం గూడివే
ణునాదగతులు విస్తరిల్లనాచిత్తంబుచేసేవింపబడుచున్నశ్రీకృష్ణరూపసంస్కా
రంబులుసర్వోత్కృష్టములయియతిశయిల్లుచున్నది. ... ...

శ్లో॥ జీయాదసౌశిఖిశిఖండకృతావతంసాసాం సిద్ధికీసరసకాంతి సుధాసమృ
ద్ధిః।యద్బిందులేశకణికాపరిమాణభాగ్యసౌభాగ్యసీమపదమంచతిపంచబాణః॥

టీక ॥ పంచబాణః - మదనుఁడు। యద్బిందులేశ కణికా పరిమాణభాగ్య
సౌభాగ్యసీమ। యత్- ఏయతిశయముయొక్క - బిందు - బిందువులయొక్క-
లేశ। కణములయొక్క - కణికా। సూక్ష్మావయవముయొక్క - పరిమాణ। పరి
మితియనియెడి- భాగ్య- భాగ్యమువలననైన।సౌభాగ్య- సౌందర్యముయొక్క
సీమ - స్థలమయిన। పదం- స్థానమును- అంచతి। పొందుచున్నాఁడో.-అసౌ.-ఈ
శిఖిశిఖండకృతావతంసా - శిఖి। మయూరమయొక్క - శిఖండపింఛముచేత-
కృత- చేయబడిన - అవతంసా। శిరోభూషణముగలయదియు - సాంసిద్ధికీసర
సకాంతిసుధాసమృద్ధిః। సాంసిద్ధికీ - స్వభావసిద్ధమయిన। సరస - రసయుక్తమ
యిన। కాంతిసుధాసమృద్ధిః - కాంతియనునమృతాతిశయము। జీయాత్ - స
ర్వోత్కృష్టమైవర్తించుగాక. ... ... ... ..

మ॥ అవతంసంబగుపింఛదామకముసెల్వొందంబ్రభాసంపదు। ద్భవలీలా
మృతధారలెల్లదెసలంభాసిల్లఁగై త్రైలోక్యమో। హవిహారాస్పద రూపధేయ
మకుమారాంశప్రభావంబులో। లవమాత్రంబొదవన్స్మరుండుజగమెల్లంగెల్పు
లీలాగతిన్॥ ... ... ... ... ... ౫౯

తా॥ మదనురఁడేసమృద్ధియొక్క బిందులేశంబులోనొకభాగంబుమాత్రవు సౌందర్యపదంబునొందెనోయట్టి యూరుయుగుపడుచున్నయదియు నెమలిపురిచే తంజేయంబడిన శిరోభూషణంబు గలిగి స్వభావసిద్ధంబై వెలయు నదియునగు కాంత్యమృతసమృద్ధిసర్వోత్కృష్టమైవర్తించుచున్నవి. ... ... ❖

శ్లో॥ ఆయామే సదృశోర్విశాలతరయోరక్షయ్యమార్ద్రస్మితచ్ఛాయావర్షితశారదేన్దులలితంచాపల్యమాత్రంశిశోః। ఆయాసానపరాన్విధూయరసికైరాస్వాద్యమానంముహుర్జీయాదున్మదవల్లవీకుచభరాధారంకిశోరంమహః॥ ౬౧

టీక॥ విశాలతరయోః - మిక్కిలివెడల్పులైన। దృశోః - కన్నులయొక్క - ఆయామేన- పొడవుచేత- అక్షయ్యం- క్షయరహితమయినయదియు - ఆర్ద్రస్మితచ్ఛాయావర్షితశారదేందులలితం - సరసమైనచిఱునగవుయొక్క కాంతిచే తదిరస్కరింపఁబడినశరత్కాలసంబంధచంద్రసౌందర్యముగల। శిశోః - బాలునియొక్క - చాపల్యమాత్రం- చపలసర్వస్వభూతమైనయదియు-అపరాన్- అన్యములయిన- ఆయాసాన్ - ప్రయాసములను। విధూయ- విడిచి। రసికైః- విద్వాంసులచేత- ముహుః। మాటిమాటికిని - ఆస్వాద్యమానం - ఆస్వాదింపబడుచున్నయదియు- ఉన్మదవల్లవీకుచభరాధారం- ఉన్మద - అధికమదముగల- వల్లవీ- గోపికలయొక్క - కుచభర - స్తనాతిశయమే- ఆధారం- ఆశ్రయముగాగలయదియునగు - కిశోరంమహః- బాలతేజము। జీయాత్ - సర్వోత్కృష్టమై వర్తించుంగాక. ... ... ... ... ... ❖

ఉ॥ క్రొన్ననబోండ్లుగబ్బివలిగుబ్బలనానుచుగారవింపగా। వెన్నెలనవ్వునవ్వులరవిందముచందముగ్రించుచేయువా। గన్నులబాల్యచాపలవిలాసముమీఱ రసజ్ఞలోకమీ।యన్నియునుజ్జగింపహృదయంగమమైనవెలుంగుగాంచెదన్॥ ౬౦

తా॥ విశాలంబులగునేత్రంబులదైర్ఘ్యంబుచే సుందరంబైసరసంబగుచిఱునగవుకాంతిచేతందిరస్కరింపఁబడిన శరత్కాలచంద్ర సౌందర్యంబు గలిగిచపలసర్వస్వంబైయన్యప్రయాసంబుమానిరసజ్ఞులచేత ధ్యానంబుచేయంబడుచున్నదిమైయతిశయమదంబుగలగోపికలకుచభారంబ యాశ్రయంబుగగలిగివెలుంగుబాలతేజంబుసర్వోత్కృష్టంబైవర్తించుననుట. ... ... ❖

శ్లో॥ స్కంధావారసదంప్రజాః కతిపయే గోపాంగనాసాన్వంగనాస్స్కంధాలంబినివత్సదామ్నిధనదా గోపాస్సహాయాదయః। శృంగారాగిరి

గైరికంశివశిఖ శ్రీమన్తిబర్హాణి వాశ్శృంగగ్రాహికయాతథాపితదిదం ప్రాహు స్త్రిలోకేశ్వరమ్॥ ... ... ... ... ... ౬౧

టీ॥ గోష్ఠం। గొల్లపల్లియు - స్కంధావారసదం - స్కంధావార। పాళెముయొక్క - సదం- ఆస్థానమండపమును ( ఈకారణంబునమంచియిల్లయినను లేదనిసూచింపంబడియెను) గోపాంగనాః - గోపస్త్రీలు। స్వాంగనాః - స్వకీయులయినభార్యలు - ఈ హేతువువలన। భార్యలైనను మంచివారలు లేరనిసూచింపఁబడియెను - ధనదాః। పన్నులిచ్చుచున్న- ప్రజాః- ప్రజలు। కతిపయె- కొందఱు (దీనిచేనందఱుపన్నిచ్చుసంగమినిధనసంపదయైనను విస్తారము లేదనిసూచింపబడియెను) వత్సదామ్ని - వత్సబంధనరజ్జువిశేషము। స్కంధాలంబిని-భుజశిఖరమునాశ్రయించియుండగా- గోపాః। గోపాలురు - సహాయాదయః।భటులు మొదలయినవారలు ( ఈ హేతువుచేతఁబరివారసంపత్తియును లేదనిసూచింపబడియెను) శృంగారక- అలంకారములు। గిరిగైరికం - పర్వతమందలిగైరికాదిధాతువిశేషములు- శ్రీమన్తిబర్హాణివా- శ్రీమంతి। కాంతిగలిగిన। బర్హాణివా పింఛములేయునియు (ఈ హేతువువలనభూషణసంపత్తియును లేదనిసూచింపబడియె ) తథాపి- అటులయినప్పటికిని। శృంగగ్రాహికయా - చిన్నగ్రహణముచేత - తత్- ఆప్రసిద్ధమైన- ఇదం- ఈవస్తువు- త్రిలోకేశ్వరం। విష్ణుదేవునిగాను- వృద్ధాః। పెద్దలు-వదంతి।చెప్పుచున్నారు. ... ... ✦

ఉ॥ చానశుభ్రైనగోపకులుబంధులు పాళెముగొల్లపల్లెము। త్యాలసరాలు దామెనలుదారలుఁగోపికలంగరాగముల్। శైలవిటంకధాతువులుచారువిభూషలుపింఛదామముల్। పోలిననైనవిష్ణుఁడనిబుద్ధినెఱుంగుదురెల్లపెద్దలున్॥ ౬౧

తా॥ గోష్ఠంబుస్కంధావారంబు - గోపకులుభటాసులు। గోపాంగనలుభార్యలు- పన్నిచ్చువారలల్పజనంబులు- అలంకారంబుగైరికంబుభూషణంబులునెమలిపురిదండలు - ఇట్టివిగలదినైనను। నీతేజంబుసర్వలోకేశ్వరుండగువిష్ణునిగానాకానాకయుభిజ్ఞానంబువబుధులెఱుంగుదురనుట. ... ✦

శ్లో॥ శ్రీమద్బర్హిశిఖండమండనజుషే శ్యామాభిరామత్విషే లావణ్యైకరసాపసిక్తవపుషే లక్ష్మీసరఃప్రావృషే। లీలాకృష్టరసజ్ఞధర్మమనసే లీలామృతస్రోతసే కేవానస్పృహయాన్తిహాస్తమహసే గోపీజనప్రేయసే॥ ... ౬౨

టీక॥ శ్రీమద్బర్హిశిఖండమండనజుషే - కాంతిగలిగిన నెమలిపురియలంకారమునుబొందినటువంటిదియు - శ్యామాభిరామత్విషే। నల్లనయిమనోహరమై

నకాంతిగలయదియు - లావణ్యైకరసావసిక్తవపుషే - కాంతియనియెడిముఖ్యమైనరసముచేతఁదడుపఁబడినశరీరముగలయదియు - లక్ష్మీసరఃప్రావృషే । లక్ష్మియనియెడిసరస్సునకు వర్షర్తువైనయదియు - లీలాకృష్టరసజ్ఞధర్మమనసే - విలాసముచేతనాకర్షింపబడినవిద్వాంసులయొక్క ధర్మప్రధానములైనమనస్సులు గలయదియు - లీలామృతస్రోతసే । విలాసమనియెడియమృతప్రవాహమయిన యదియు। గోపీజనప్రేయసే గోపికాజనులకు బ్రియతరమైన యదియునగు । మహసే - తేజముకొఱకు । కేవా - యెవ్వరు । నస్పృహయంతి - ఆసచేయరు. హంత - ఆశ్చర్యము. ... .... — ... ... *

శా॥ లావణ్యామృతసేవగందలితలీలారామలక్ష్మీశరః । ప్రావృద్ధామునిఁ దాంతసంయమితబ్రహ్మశ్రీసముద్ధాముఁరా । దావిర్భూతవయోభిరామువిలసద్ధారాధరశ్యామునిన్ । సేవిం[illegible]దిగోరరేంసికులాసీమాఖిలప్రేమునిన్॥ ౬౨

తా॥ కాంతియుతంబ[illegible]ులిపురయలంకారంబుగధరియించి కాంతివిశేషంబనురసంబుచేతందడుపంబడిన దివ్యమంగళవిగ్రహంబుగలిగి సిరియనుసరంబునకుఁ బ్రావృట్కాలంబయి రసజ్ఞులమనంబుల నఖిలవిలాసంబుల చేనాకర్షించుచువిలాససుధాప్రవాహంబై గోపీజన ప్రియతరంబై వెలయు తేజంబుకొఱకు నెవ్వారలాసంశేయరు - అంగానందము నాసంజేయుదురనుట. *

శ్లో॥ ఆపాటలాధరమధీరవిలోలనేత్రమామోదనిర్భరితమద్భుతకాన్తిపూరమ్ । ఆవిస్మితామృతమనస్మృతిలోభనీయం మాముద్రితాననమహో మధురం మురారేః॥ ... . ... .. ... ౬౩

టీక॥ ఆపాటలాధరం - అంతటనెఱ్ఱనయినమోవిగలదియు - అధీరవిలోలనేత్రం - చంచలములై తృష్ణాయుక్తములైననేత్రములుగలయదియు - ఆమోదనిర్భరితం - పరిమళముయొక్క - సంజాతాతిశయముగలయదియు - అద్భుతకాంతిపూరం - ఆశ్చర్యకరమైనకాంతి ప్రవాహముగలయదియు - ఆవిస్మితామృతం - ప్రకాశించుచున్న యమృతమువంటి యునగవుగలయదియునగు - మురారేః - శ్రీకృష్ణమూర్తియొక్క - మధురం - సుందరమగు - అముద్రితాననం - కొంచెము మోడ్పుబడినకన్నులుగల మొగము - అనస్మృతిలోభనీయం - విఛంతరస్మరణచేతనాసజయదగినదిగా - భవతి - అగుచున్నది - అహో - ఆశ్చర్యము.

మ॥ అతులానందరసామృతారవమపాంగాభంగరంగత్తరంగతతింబాంఘుచుగెంపుఁబ్రహ్మావినరిదాకందత్సుధాబిందువుల్ । స్మితలీలన్వెలిసిగ్గెసంచుజనముల్

చిత్రంబులఁ జెప్పిన । ద్భుతశృంగారరసైకతముద్రితముఖాంభోజుఁ హరిం గొల్చెదఁ॥ ... ... ... ... ... ౬౩

తా ॥ ప్రకాశించుచున్న చిఱునగవను నమృతంబుఁజొబ్బిలంజేయుకెమ్మోవి యుఁ జలిచపలంబులై క్రేతలంబాడనాసంజేయు కన్నులునతిశయంబైనపరిమళం బునఁ జ్బెరువగు కాంతి ప్రవాహంబు నొక్కొక్క పరియరమోద్పు కన్నుగవ యునుగలిగి సుందరంబై వెలుంగువెనుని నెమ్మొగం బెప్పుడును ధ్యానంబు చే యుందగినదియనుట. ... ... ... ... ... ❖

శ్లో ॥ జాగృహిజాగృహిచేతశ్చిరాయచరితార్థతాభవతః । అనుభూయ తామిదమిదంపురస్థితంపూర్ణనిర్వాణమ్॥ ... ... ... ౬౪

టీక॥ హేచేతః- ఓచిత్తమా- భవతః॥ నీయొక్క - చరితార్థతా - కృతా ర్థత్వము॥ చిరాయ- తడవుగా । సంజాతా- అయినది-జాగృహిజాగృహి। మో హముమువిడువుము- ఇదమిదంపురస్థితం- ఈ[illegible]దున్న - పూర్ణనిర్వాణ - శ్రీ కృష్ణరూపనిరతిశయసుఖము- అనుభూయతాం - అనుభవింపఁదగినది- ❖

చ॥ వెనుకటివేళలందనుభజించినజన్మశతంబులట్లనే। దునుభవ్రమమోసపోవ కగడుం దెలివొందుముఁడెందమాచిరం । తనతపముల్ఫలించి పురతస్థలినున్నదికృ ష్ణరూపమై । యనవరతానుచింతనసుధారసవీచులనోలలాడుమీ॥ ౬౪

తా ॥ ఓమనంబాయనేకకాలంబునఁ నీకృతార్థత్వంబుఫలియించెనికనజ్ఞా నంబుబోవనడిచి యీముందుగానంబడుచున్న శ్రీకృష్ణరూపనిరతిశయసుఖంబ నుభవింపుమాయనుట- ... ... ... ... ❖

శ్లో ॥ చరణయోరరుణంకరుణార్ద్రయోః కచభరేబహుళంవిపులందృశోః। వపుషిమంజులమంజనమేచకేవయసిబాలమహోమధురంమహః॥ ౬౫

టీక॥ అహో! ఓజనులారా - చరణయోః-పాదములయందు - అరుణం- ఎఱ్ఱనైనదియు- కచభారే- శిగయందు- బహుళం- విస్తారమయినయదియు - క రుణార్ద్రయోః- కరుణా- దయచేత- ఆర్ద్రయోః - తడిపిన - నయనయోః- నే త్రములయందు- విపులం- విశాలమయినయదియు - అంజనమేచకే- కాటుకవ లెనల్లనైన - వపుషి - శరీరమందు - మంజులం - సొగసైనయదియు - వయసి- ప్రాయంబున- బాలం- కిశోరమైనయదియునగు- మహః - శ్రీకృష్ణాఖ్యతేజము- మధురం- హృద్యము- ... ... ... ... ... ❖

ఉ॥ మేనుఘనాఘన ప్రతిభమించియుబాదపయోరుహంబుగెం। పూనెవి లోలమయ్యెనుదయోజితమయ్యెనుగన్నుదోయితే। జోనిధియయ్యె హృత్సరసి శోభితుడయ్యెబురాణుడయ్యెనా। రానెఱులందునల్పు నెలప్రాయముగాంచుట వింతయెంతయున్॥ ... ... ... ... ... ౬౫

తా॥ పాదంబులనరుణంబై కృపారసంబుదొలుకుకన్నుంగవయందుఁజాలం బై సిగయందునధికంబై నీలమేఘంబుదెగడుశరీరంబున సుందరంబై ప్రాయంబు నబాల్యంబయివెలయుశ్రీకృష్ణుని తేజంబతిమనోహరంబోజనులారాయనుట. ❖

శ్లో॥ మాలాబర్హమనోజ్ఞకుంతలభరాం వన్యప్రసూనోక్షితాం శైలేయద్రవ క్లృప్తచిత్రతిలకాం శశ్వన్మనోహారిణీమ్। లీలావేణురవామృతైకరసికాం లావణ్య లక్ష్మీమయీం బాలాం బాలతమాలనీలవపుషం వందే పరాం దేవతామ్॥ ౬౬

టీక॥ మాలాబర్హమనోజ్ఞకుంతలభరాం - మాలా - వనమాలికల చేత ను. బర్హం. నెమలిపింఛముచేతను. మనోజ్ఞ - సొగసైన - కుంతలభరాం. కే శములయొక్క భారాతిశయముగలయదియు. వన్యప్రసూనోక్షితాం - వన్య-వ నమందుబుట్టిన - ప్రసూన - పుష్పములచేత. ఉక్షితాం - తడుపబడినయదియు. శైలేయద్రవక్లృప్తచిత్రతిలకాం. ధాతువిశేషములయొక్క ద్రవములచేత జేయ బడినచిత్రమయినతిలకముగలయదియు. శశ్వన్మనోహారిణీం. అంతటనుమనోహా రమయినయదియు - లీలావేణురవామృతైకరసికాం - విలాసార్థమైన - వేణు రవామృతముచేతముఖ్యముగారసికమైనదియు. లావణ్యలక్ష్మీమయీం - కాంతి విశేషసంపద్వికారమ్మయిన యదియు. తమాలనీలవపుషం - కానుగుపువ్వువలె నల్లనైనశరీరముగలయదియు. బాలాం - బాల్యముగలయదియునగు. పరాం దే వతాం. పరదేవతనుగూర్చి. అహం. నేను. వందే. నమస్కరించెదను. ❖

ఉ॥ పింతలుగాగలాపములు వేసలిజుట్టియువన్యమాలికా। సంతతిజుట్టిజేగు రురసంబునదొంతరబొట్టుపెట్టిచె। ల్వంతయురాశిచేసిన క్రియన్మురళీతరళీకృ తామృతా। భ్యంతరసారమైపరగునాఁవిభుమేచకధాముగొల్చెదన్॥ ౬౬

తా॥ వనంబునంబొడమినపువ్వులదండలు నెమలిపురిదండలుంజుట్టిన సిగ యునుజేగురురసంబునందొంతరలుగనిడిన తిలకంబులుసుంగలిగివన్య ప్రసూనత షణంబుచేతంగప్పబడిమిక్కిలియు మనోహరంబై వేణురవామృతంబునసరసం బై లేతకానుగుంబోలెనల్లనైనశరీరంబుగలిగిసౌందర్యసంపదచే దేజరిల్లుపరదై వంబుంగూర్చిమ్రొక్కుచున్నాను. ... ... ... ... ❖

ఒకఁడైనకృష్ణునిగూర్చి - నమస్తాత్ । నమస్కరించుచున్నాను. ... ❖

ఉ॥ అందముగోరఁగాదగినయౌవనకాంతిని రూఢిచందమున్ । జెందికటాక్షవీక్షణముచేవలపించుచుబిల్లఁగ్రోవిచే । డెందముసల్లగాసుధగడించిజడిన్నిగుడించుచున్నహో । నందనిధానమైచెలఁగునందసమాంతరగాంబ్రముక్కొదన్ ॥ ౬౮

తా॥ ఎల్లవారిచే నాశ్రయణీయంబగు యౌవనంబుచే నధికంబగుసౌందర్యంబునొంది వేణునాదంబులచేసు ధనతిశయంబుగ వషించుచుం బాడవ్రుల గు కడకన్నులచే నాశ్రితులంజూచుచు నిరతిశయానంద స్వరూపుండై వెలయు శ్రీకృష్ణునింగూర్చినమస్కరించుచున్నాను . ... ... ... ❖

శ్లో॥ లసద్బర్హాపీడంలలితస్మేరవదనంభ్రమత్క్రీడాపాంగంప్రణతజనతానిర్వృతిపదమ్ । నవాంభోదశ్యామంనిజమధురిమాభోగభరితంపరందేవం వందేపరిమళితకైశోరకరసమ్॥ ... ... ... ౬౯

టీక॥ లసద్బర్హాపీడం - ప్రకాశించుచున్న నెమలిపురి భూషణంబుగాఁగలిగినవాఁడును - లలితస్మేరవదనం। మిక్కిలిసుందరమైన - చిఱునగవుతోఁగూడినముఖంబుగలవాఁడును - భ్రమత్క్రీడాపాంగం - చలించుచున్న విలాసప్రధానములైన కడకంటిచూపులుగలవాఁడును - ప్రణతజనతానిర్వృతిపదం । నమ్రమయిన జనసమూహముయొక్క సుఖమునకుగారణమయినవాఁడును - నవాంభోదశ్యామం - నూతనమయిన మేఘమువలెనల్లనైనవాఁడును। నిజమధురిమాభోగభరితం - స్వకీయమయిన సౌందర్యము యొక్క పరిపూర్ణతయొక్క సంపూర్ణతయముగలిగినవాఁడును । పరిమళితకైశోరకరసం - వ్యాప్తములైన కైశోరసంబంధములైన శృంగారాదిరసములుగలవాఁడును - పరం - ఉత్కృష్టుఁడైనవాఁడునైన - దేవం - శ్రీకృష్ణమూర్తినిగూర్చి - వందే। నమస్కరించుచున్నాను. ... ❖

మ॥ పటుధారాధరశోభితాంగుఁ లసద్బర్హోత్తమాంగుఁడున్ సము । త్కటమందస్మితసుందరున్వలదపాంగ శ్రేణికాడంబరున్ । స్ఫుటకైశోరకలాపుమోహనకళాభోగిస్స్వరూపున్వశం । కటసంసేవకనిర్వృతిప్రద శుభాకారాస్పదుం గొల్చెదన్॥ ... .. .. ... .. ౬౯

తా॥ ప్రకాశించుచున్న నెమలిపురి సిగయందలంకరించి మిక్కిలిసుందరంబగు చిఱునగవుతోడంగూడిన మొగంబుగలిగి సంచలించుచున్న విలాసప్రధానంబులైన కడకన్నులుగలిగినమ్రులగు జనంబులకుసుఖంబులీయుకారణుండైవర్షాకాలమేఘంబుబోలె నీలవర్ణంబుమెఱయుస్వకీయంబయిన సౌందర్యపరిపూర్ణ

త్వంబున నతిశయిల్లి వ్యాపించుచున్న బాల్యంబుచేతం దేజరిల్లుచు నుత్కృష్టం బగు శ్రీకృష్ణమూర్తిని గూర్చి నమస్కరించుచున్నాను. ... ... ✤

శ్లో॥ సారస్యసామగ్య్రమివాననేన మాధుర్యచాతుర్యమివస్మితేన। తారుణ్యకారుణ్యమివేక్షితేన చాపల్యసాఫల్యమిదం దృశోర్మే॥ ... ౭౦

టీక॥ ఆననేన- ఈముఖముచేత। సారస్యసామగ్య్రమివ-సారస్య-సౌందర్యముయొక్క - సామగ్య్రమివ।పూర్తివలె - స్మితేన।చిఱునగవుచేత-మాధుర్యచాతుర్యమివ। మాధుర్య - మనోహరభావముయొక్క - చాతుర్యమివ। చమత్కారమువలెను- ఈక్షితేన। చూపుచేత - తారుణ్య కారుణ్యమివ।తరుణభావముగలదయవలెను - ఇదం। ఈకానంబడుచున్న శ్రీకృష్ణాఖ్యవస్తువు। మే. నాయొక్క - దృశోః-నేత్రములయొక్క - సాఫల్యం.ఫలసంబంధమయినది. ✤

చ॥ మరిపెపునవ్వుగాదిదివి మోహరసాస్పదరాశిగానిబి। త్తరమగుచూవుగాదిదిని తాంతదయానిధిగాని మోముదా। మరయిదిగాదఖండరసమాధురిగాని వ్రజాలయాంగణాం। తరమిదిగాదునాదు నయనంబులభాగ్యముకానిచూడగన్।

తా॥ సౌందర్యసంపూర్తిగల నెమ్మోమునుమనోహరత్వంబుచే జతురం బైనచిఱునగవును దరుణభావంబుగలదయచేవెలయు వీక్షితంబుగలిగి యీకానంబడుచున్న శ్రీకృష్ణరూపంబగువస్తువు నాకన్నుల చాపల్యంబునకు ఫలంబయియున్నది. ... ... ... ... ... ✤

శ్లో॥ యత్రవాతత్రవాదేవయదివిశ్వసిమస్త్వయి। నిర్వాణమపిదుర్వారమర్వాచీనానికింపునః॥ ... ... ... .. ౭౧

టీక॥ హేదేవ- ఓకృష్ణా-యత్రవా - బ్రాహ్మణజన్మమందైనను। మఱియొకజన్మమందయినను - తత్రవా - ప్రసిద్ధంబగు గార్హస్థ్యాశ్రమంబుననైనను-మఱియొకయాశ్రమంబుననైనను (పక్షాంతరంబున - యత్రవా - శ్రీకృష్ణావతారవ్యతిరిక్తావతారమందైనను- తత్రవా- కృష్ణావతారమందైననుఅనియుంగలదు) త్వయి- నీయందు। విశ్వసిమోయది-విశ్వాసముజేయువారలమైనట్లులయ్యేనేని। నిర్వాణమపి ముక్తియును। దుర్వారం - వారింపనశక్యమైనది- అర్వాచీనాని। మోక్షవ్యతిరిక్తధర్మాదిపురుషార్థములు - కింపునః- ఏమిచెప్పను. ✤

మ॥ క్రతుహవ్యాదివిశిష్టభావనలధారావాక్యసుజ్ఞానసం। తతినెట్లైననువిశ్వసించినిను నాత్మం గొల్వమోక్షుంబనా। వృతమైవర్తిలునీకృపారసలసద్వీక్షాప్తి చేసట్టినను। వ్రతముంగాంచుమహాత్మకోటికిలనర్వాచీనముల్ బ్రాంతియే॥ ౭౧

తా॥ ఏజన్మంబున నేయాశ్రమంబున నేని శ్రీకృష్ణావతారంబున మఱియొకయవతారంబున నీయందవిశ్వసించితిమయినట్టులయ్యేనేని మోక్షంబు స్వతస్సిద్ధం బైతోచు ధర్మాదిపురుషార్థంబులు లభించుటకేమియు చెప్పెరువ ననుట. ... ❖

శ్లో॥ రాగాన్ధగోపీజనవన్దితాభ్యాం యోగీన్ద్రభృఙ్గేన్ద్రనిషేవితాభ్యామ్।
ఆతామ్రపఙ్కేరుహవిభ్రమాభ్యాం స్వామిన్పదాభ్యామయమఞ్జలిస్తే॥ ౭౨

టీ॥ హేస్వామిన్- ఓకృష్ణా - రాగాంధగోపీజనవందితాభ్యాం - రాగ- అనురాగముచేత-అంధ। అంధులయిన - గోపీజన - గోపికాస్త్రీజనులచేత- వందితాభ్యాం - నమస్కరింపబడుచున్నవియు। యోగీంద్రభృంగేంద్రనిషేవితాభ్యాం - యోగీశ్వరులనియెడిభ్రమరశ్రేష్ఠములచేత సేవింపబడుచున్నయదియు- ఆతామ్రపంకేరుహవిభ్రమాభ్యాం - ఆతామ్ర- అంతటనెఱ్ఱనైన-పంకేరుహ - కమలములయొక్క - విభ్రమాభ్యాం - విలాసములవంటివిలాసములుగలవియునగు। తే। నీయొక్క - పదాభ్యాం- పాదములకొఱకు-అయం-అంజలిః- ఈనమస్కారము- కృతః। చేయుబడియెను. ... ... ❖

మ॥ అరుణాంభోజవిలాసమై ప్రబలమోహావేశగోపీమన। స్సరసీశోభితమైమునీంద్రజనచంచచ్చంచరీకవ్రజా। కరమై హంసకనాదమేదురము నైకన్పట్టుపాదాబ్జయుగ। కరయుగ్మంబుననంటియంటితుదసోకన్వ్రీకనోలాద్భుదన్॥ ౭౨

తా॥ ఓకృష్ణాయనురాగంబున నితరంబుమఱచి సేవించు గోపికాజనంబులచేనమస్కరింపబడుచు యోగీశ్వరులను చంచరీకశ్రేష్ఠంబులచే సేవింపబడుచునెఱ్ఱతామరల విలాసంబులవంటి విలాసంబులుగలిగి మెఱయు నీపదంబులకొఱకు నమస్కరించుచున్నాను. ... ... ... ... ... ❖

శ్లో॥ అర్ధానులాపాన్వ్రజసుందరీణామకృత్రిమాణాంచ సరస్వతీనామ్।ఆర్ద్రాశయేన శ్రవణాంచితేన సమ్భావయంతంతరుణంగృణీమః॥ ౭౩

టీక॥ వ్రజసుందరీణాం- గోపికాస్త్రీలయొక్క- అకృత్రిమాణాం - కపటరహితములయిన। సరస్వతీనాం - వాక్యములయొక్క - అర్ధానులాపాన్ - అర్ధములయొక్కయేకదేశపునరుచ్చారణములను - శ్రవణాంచితేన - శ్రోత్రములయొక్కప్రాంతములచేత - ఆర్ద్రాశయేనచ। సరసహృదయముచేతను- సంభావయంతం। బహూకరించుచున్న - తరుణం- యౌవనవంతుండైనకృష్ణమూర్తిని- గృణీమః- ఉచ్చరించుచున్నాను. ... ... ... ❖

చ॥ చులికితమైన చూపులొకచోట నెఱుంగనివువ్వుబోండ్లమేల్। సొలపుమిటా

రిచూపులరసాక్క సెలంగెడు తేటమాటలు । స్వలపులు తోపగావినిమనంబునను
వ్విళులూరుచు చెల్వనరా । లలితనయోవిలాసునినవారతమున్మతియింపఁ జెల్లదే॥

తా॥ గోపికలకుటిలంబులగు వాక్యంబులవుడు పునరుచ్చారణంబులఁ జెవి
కింపు గనుమనంబున్కనుకూలంబుగనువినుచు బహూకరించుచున్న యావనవం
తుండగుశ్రీకృష్ణునిస్మరించుచున్నాను. ... ... ... ❖

శ్లో॥ మనసిమమసన్నిధత్తాంమధురముఖామన్దరాపాంగా । కరకలితలలిత
వంశా కాపికిశోరాకృపాలహరీ॥ ... ... ... ౭౪

టీక॥ మధురముఖా - సుందరమైన ముఖముగలయదియు । మందరాపాం
గా- మందర- అలసములయిన- అపాంగా- క్రేగంటిచూడ్కులుగలయదియు-
కరకలితలలితవంశా- కర । హస్తముచేత - కలిత । కూడుకొన్నటువంటిదియు-
లలిత- సుందరమైనట్టిదియునగు- వంశా । వేణువుగలయదియు। కాపి- వాచామ
గోచరమయినయదియు - కిశోరా । బాల్యముగలయది యునగు - కృపాలహరీ-
దయాతిశయము- మమ। నాయొక్క - మనసి । మనము నందు - సన్నిధత్తాం- స
న్నిధిచేయుగాక- ... ... ... ... ... ❖

ఉ॥ అందమునొందునెమ్మొగమునందుగృపామృతవృష్టిపైపయిం। గ్రందుకొ
నంగనొప్పుకడకన్నులుసొన్నలరంగ వేణువం । దందగరంబులం జెలగనంగజమో
హనమూర్తియైకరం।బున్దనరారుబాలకుడుపోల్చుమ్మదీయహృదంతరంబునన్॥

తా॥ సౌందర్యంబుచేతం దేజరిల్లునెమ్మొగంబుగలిగియలసంబులగునపాం
గంబుగలిగికరంబుల వేణువలరం జెప్పనలవికానిదియై బాల్యంబుచేమెలగుదయా
తిశయము నామనంబునందోచుగాకయనుట. ... ... ❖

శ్లో॥ రక్షన్తునస్శిక్షితపాశుపాల్యాబాల్యావృతాబర్హిశిఖావతంసాః।ప్రా
ణప్రియప్రస్తుతవేణుగీతాశ్శీతాదృశోశ్శీతలగోపకన్యాః॥ ... ౭౫

టీక॥ శిక్షితపాశుపాల్యాః- అభ్యసింపబడినగోరక్షణముగలయదియు।బా
లావృతాః- బాలురచేతబరివేష్టింపబడినయదియు- బర్హిశిఖావతంసాః। నెమలి
పురిశిరోభూషణముగాగలయదియు- ప్రాణప్రియప్రస్తుతవేణుగీతాః ప్రాణ
ములకునిష్టమయినవేణుగానముగలయదియు । దృశోః- నేత్రములకుశీతాః - గ్ర
హింపదగినదియు- శీతలగోపకన్యాః- సమీచీనలయినగోపకన్యలుగలయదయు
నగు- లీలాః- శ్రీకృష్ణవిలాసములు। నః- మమ్ము।రక్షన్తు- రక్షించుగాక. ❖

మ॥ పాలపొందన్వ్రజబాలకల్లొలువ రేపుల్ గ్రేపులన్మేపిమూ। పులుగుంజా
మణిపుంజరంజితకరాంభోజంబుతోబింఛభూషలతో జల్లనిచూపుల్తోమ్రధురవం

ఆలంబనగుణాయథా.

శ్లో॥ యౌవనంరూపలావణ్య సౌందర్యాణ్యభిరూపతా।
మార్దవంసౌకుమార్యంచే త్యాలంబనగతాగుణాః॥ ౭౬

తా॥ యౌవనము, రూపము, లావణ్యము, సౌందర్యము, అభిరూపత్వము, మార్దవము, సౌకుమార్యము, ఇవిఆలంబనగుణములు. ... *

యౌవనంనిరూప్యతే.

శ్లో॥ సర్వాసామపినారీణాం యౌవనంత్రివిధంమతం।
ప్రతియౌవనమేతాసాం చేష్టితానిపృథక్పృథక్॥ ౭౭

తా॥ సమస్తస్త్రీలకునుయౌవనముమూడుతెఱఁగులౌను. ఆయాయౌవనమునచేష్టలు వేర్వేరుగనుండును.

ప్రథమయౌవనలక్షణం.

శ్లో॥ ఈషచ్చపలనేత్రాంతం స్మరస్మేరముఖాంబుజం। సగర్వజరజోగంధమసమగ్రారుణాధరం॥ ౭౮॥ లావణ్యోద్భేదరమ్యాంగం విలసద్భావసౌరభం। ఉన్మీలితాంకురకుచం అస్ఫుటాంగికసంధికం॥ ౭౯॥ ప్రథమం యౌవనంతత్ర వర్తమానామృగేక్షణా। అపేక్షతేమృదుస్పర్శం సహతే నోచ్చతాంరతేః॥ ౮౦॥ సఖీకేళిరతాస్వాంగ సంస్కారకలితాదరా। నకోపహర్షౌ భజతే సపత్నీదర్శనాదిషు॥ ౮౧॥ నాతిలజ్జావతీకాంత సంభోగేకింతుశఙ్కతే। ... ... *

తా॥ కించిచ్చపలములైనకడకంట్లనుగలదిగాను, మన్మథునిచేవికాసమునొందినముఖపంకజముగలదిగాను, గర్వమువలనగలిగినరజోగంధముతోఁగూడినదిగాను, నిండుఎఱుపులేనిపెదవులుగలదిగాను, లావణ్యముయొక్క ప్రకాశమువలనమనోహరమైనదేహముగలదిగాను, వెలయుచుండుభావసౌరభముగలదిగాను, వృద్ధిఁబొందుమొలకచన్నులుగలదిగాను, చక్కఁగానేర్పడనిఅంగములసంధులుగలదిగానునుఉండునదిప్రథమయౌవనమనఁబడును. ఈయౌవనముగలనాయిక మృదుస్పర్శమునపేక్షించును. ఉచ్చరతిని సహింపదు. సఖులతోనాడుటయందుప్రియము. తన్నుతానలంకరించుకొనుటయందు ప్రియము. సవతినిజూచుటమొదలైనకార్యములందు కోపసంతోషములులేనిదిగానుండుట, ప్రియునియందుఅధికమునిగ్గులేకుండుట, రతియందుభయము, ఈగుణములుగలిగియుండును. ... ... ... *

ద్వితీయయౌవనలక్షణం.

శ్లో॥ స్తనాపీనాతనుర్మధ్యః పాదేపాణౌచరక్తిమా॥ ౮౨॥ ఊరూకరికరాకారా అంగంవ్యక్తాంగసంధికం। నితంబోవిపులోనాభి గంభీరాజఘనంఘనం॥ ౮౩॥ వ్యక్తరోమావళిస్స్నిగ్ధ మంగప్రత్యంగసౌష్ఠవం। ద్వితీయంయౌవనంతత్ర వర్తమానాసులోచనా॥ ౮౪॥ సఖీషుస్వాశయజ్ఞాసు స్నిగ్ధాప్రాయేణభామినీ। నప్రసీదత్యసునసన్ సపత్నీష్వభ్య

సూయినీ॥ ౮౫॥ నాపరాధాన్విషహతే ప్రణయేర్ష్యాకషాయితా। రతి
కేళిష్వనిభృతా చేష్టతే గర్వితా రహః॥ ౮౬

తా॥ గొప్పచన్నులును, సన్నమైననడుమును, ఏటుపుగలచేతులుకాళ్లును, ఏనుగు తొండమువంటితొడలును, వ్యక్తాంగసంధియగుదేహమును, విపులమైననితంబమును, గంభీరమైననాభియు, ఘనమయినజఘనప్రదేశమును, ప్రకాశమైనరోమావళినిగనిగయును, అంగప్రత్యంగములచక్కదనమునుగలదై యుండునది ద్వితీయయౌవనమనబడును. ఈయౌవనముగలనాయిక తనమనోభావము తెలిసినసఖులయందు తరుచుగా ప్రీతికలది గాను, సమాధానపుమాటలచేత్రప్తిపడనిదిగాను, చవతులయందుఅసూయగలదిగాను, అపరాధములనుఓర్వనిదిగాను, ప్రణయకలహమందు ఈర్ష్యకలదిగాను, రతికేళులయందు స్తిమితగాక ఏకాంతమందు గర్వించి వ్యాపరించునదిగాను నుండును.

### తృతీయయౌవనలక్షణం.

శ్లో॥ అస్నిగ్ధతా నయనయోర్గండయోర్మ్లానకాంతితా। విచ్ఛాయతాఖర
స్పర్శో ప్యంగానాం శ్లథతా మనాక్॥౮౭॥ అథ రేమస్పృణారాగః తృతీయే
యౌవనేభవేత్। తత్రస్త్రీణామియం చేష్టా రతితంత్రవిదగ్ధతా॥౮౮॥వ
ల్లభస్యాపరిత్యాగః తదాకర్షణకౌశలం। అనారోపోపరాధేషు సపత్నీ
ష్వప్యమత్సరః॥ ౮౯

తా॥ నేత్రములయందు తేటమాఱినదియు, చెక్కిళ్లయందు వాడినదియు, దేహచ్ఛాయ తప్పినదిగాను, కఠినమైనస్పర్శముగలదిగాను, కొంచెము దేహపటుత్వము తప్పినదిగాను, పెదవులయెఱుపుమీఱినదిగాను, ఉండునది తృతీయయౌవనమనబడును, ఈయౌవనముగలనాయిక వ్యాపారములు, రతితంత్రములయందు విశేషచాతుర్యము, నాయకునివిడవకయుండుట, నాయకునిస్వాధీనపఱుచుకొను పాండిత్యము, నాయకాపరాధములయందు అసూయలేక యుండుట, సవతులయందు మాత్సర్యములేక యుండుట మొదలయినవి. ... ...

శ్లో॥ తత్రశృంగారయోగ్యత్వం రసాహ్లాదనకారణం।
ఆద్యద్వితీయయోరేవ నతృతీయస్యవర్ణ్యతే॥౯౦

తా॥ ఈమూడువిధములయౌవనములయందును మొదటిరెండుయౌవనములకే రసములచే సంతోషపఱుచుటకు కారణమైనశృంగారయోగ్యత కలదు. మూడవయౌవనమునకు ఈయోగ్యతలేదు॥

### రూపలక్షణం.

శ్లో॥ అంగాన్యభూషితాన్యేవ ప్రక్షేపాద్యైర్విభూషణైః।
యేనభూషితవద్భాతి తద్రూపమితి కథ్యతే॥౯౧

తా॥ అంగములుతగినభూషణములచే అలంకరింపబడకయే అలంకరింపబడినట్లు దేనిచేతశోభించునో యది రూపమనబడును. ... ...

లావణ్యలక్షణం.

శ్లో॥ ముక్తాఫలేషు ఛాయాయా స్తరళత్వమివాంతరే।
ప్రతిభాతియదంగేషు తల్లావణ్యమిహోచ్యతే॥ ౫౨

తా॥ ముత్యములయందుండుఛాయయొక్క తరళత్వమువలెనే అవయవములయందు ఏకాంతిప్రకాశించుచున్నదో యదిలావణ్యమని చెప్పఁబడును.

సౌందర్యలక్షణం.

శ్లో॥ అంగప్రత్యంగకానాంయో స్సన్నివేశో యథోచితం।
సుస్నిగ్ధసంధిబంధస్స్యా త్తత్సౌందర్యమితీర్యతే॥ ౫౩

తా॥ అంగప్రత్యంగములయొక్క చక్కని సంధిబంధముగల యథోచితసన్నివేశము సౌందర్యమనబడును. ... ... ...

అభిరూప్యలక్షణం.

శ్లో॥ యదాత్మీయగుణోత్కర్షై ర్వస్త్వన్యన్నికటస్థితం।
సారూప్యంనయతిప్రాజ్ఞై రాభిరూప్యంతదుచ్యతే॥ ౫౪

తా॥ ఆత్మీయగుణాధిక్యమువలనతనసమీపమునయుండువస్తువునకుతనసారూప్యమునుగలుగఁజేయునదియాభిరూప్యమనబడును. ... ...

మార్దవలక్షణం.

శ్లో॥ స్పృష్టంయత్రాంగమస్పృష్ట మివస్యాన్మార్దవంహితత్।

తా॥ దేహముఅంటబడియుఅంటబడనిదానివలెనుండునదిమార్దవమనబడును.

సౌకుమార్యలక్షణం.

శ్లో॥ యాస్పర్శాసహతాంగేషు కోమలస్యాపివస్తునః॥ ౫౫
తత్సౌకుమార్యంత్రేధాస్యా దుత్తమాదిప్రభేదతః।

తా॥ అంగములయందుకోమలమైనవస్తువుయొక్కయైనను స్పర్శమునుసహింపమిసౌకుమార్యము. ఆసౌకుమార్యముఉత్తమ-మధ్యమ-అధమ-భేదములవలనమూఁడగుచున్నది.

ఉత్తమసౌకుమార్యలక్షణం.

శ్లో॥ అంగంపుష్పాదిభిస్స్పర్శా సహంయేనతదుత్తమం॥ ౫౬

తా॥ ఏగుణముచేతఅంగముపుష్పాదుల స్పర్శమునుగూడసహింపదో యదిఉత్తమ సౌకుమార్యము. ... ...

మధ్యమ సౌకుమార్యలక్షణం.

శ్లో॥ ససహేతకరస్పర్శం యేనాంగంమధ్యమంహితత్।

తా॥ ఏగుణముచేతఅంగముకరస్పర్శమునుసహింపదోయదిమధ్యమసౌకుమార్యము.

అధమసౌకుమార్యలక్షణం.

శ్లో॥ యేనాంగమాతపాదీనా మసహంతదిహాధమం॥ ౫౭

తా॥ ఏగుణముచేతదేహముఎండమొదలగువానినిసహింపతోయుదిఅధమసాత్కార్యము.

చేష్టా యథా.

శ్లో॥ చేష్టాస్తుయౌవనోద్భూత కటాక్షాదయఈరితాః॥ ౯౮

తా॥ యౌవనవ్యాప్తిచేతగలుగుకడకంటిచూపులు మొదలైనవిచేష్టలు.

అలంకృతిర్యథా.

శ్లో॥ చతుర్థాలంకృతిర్వాసో భూషామాల్యానులేపనైః॥ ౯౮

తా॥ అలంకృతి. వస్త్రములు, భూషణములు పుష్పములు, పైపూతలు, ఈవిధములచేనలుదెఱగులౌను. తటస్థాయథా.

శ్లో॥ తటస్థాశ్చంద్రికాధార గృహచంద్రోదయాదయః। కోకిలాకులమాకంద మందమారుతషట్పదాః॥ ౯౯ ॥ లతామంటపభూగేహ దీర్ఘికాజలదారవాః। ప్రాసాదగర్భసంగీత క్రీడాద్రిసరిదాదయః॥ ౧౦౦ ॥ ఏవమూహ్యాయథాకాల ముపభోగోపయోగినః। ... *

తా॥ చంద్రికాధారములైనగృహములు, చంద్రోదయము మొదలైనవి, కోవెలలు నిండియుండురసాలవృక్షము, మందమారుతము, భ్రమరములు, పొదరిండ్లు, భూగేహము, దీర్ఘికలు, మేఘనాదము. ప్రాసాదమధ్యము, సంగీతము, క్రీడాదులు, సెలయేఱులు మొదలైనవి ఉపభోగోపయోగవస్తువులు తటస్థోద్దీపనములు - ఇవికాలోచితములుగనూహించుకోవలసినవి. అథ అనుభావలక్షణం.

శ్లో॥ భావంమనోగతంసాక్షా త్స్వహేతుంవ్యంజయంతియే॥ ౧౦౧
తేనుభావాఇతిఖ్యాతా భ్రూవిక్షేపస్మితాదయః।
తేచతుర్ధాచిత్తగాత్ర వాగ్బుద్ధ్యారంభసంభవాః॥ ౧౦౨

తా॥ స్వహేతువైనమనోగతాభిప్రాయమును ప్రత్యక్షమువలెనేబయలుపఱచునవియనుభావములు. ఇవి చిత్తజానుభావములు, గాత్రజానుభావములు, వాగారంభానుభావములు, బుద్ధ్యారంభానుభావములు, అనినలుదెఱగులౌను. *

చిత్తజానుభావాలక్ష్యంతే.

శ్లో॥ తత్రచభావోహావో హేలాశోభాచకాంతిదీప్తిచ।
ప్రాగల్భ్యంమాధుర్యం ధైర్యౌదార్యేచచిత్తజాభావాః॥ ౧౦౩

తా॥ ఆనలుదెఱంగులఅనుభావములయందు భావము, హావము, హేల, శోభ, కాంతి, దీప్తి, ప్రాగల్భ్యము, మాధుర్యము, ధైర్యము, ఔదార్యము, ఇవిచిత్తజానుభావములనబడును. భావలక్షణం.

శ్లో॥ నిర్వికారస్యచిత్తస్య భావస్స్యాదాద్యతువిక్రియా।
గ్రీవారేచకసంయుక్తో భ్రూనేత్రాదివిలాసకృత్॥ ౧౦౪

తా॥ వికారములేనిమనసుయొక్కనిక్రియభావమనఁబడును, అదిగ్రీవారేచకసంయుక్తమై భ్రూనేత్రాదులయందువికాసమునుగలుగఁజేయును. ... *

హావలక్షణం.

శ్లో॥ భావఈషత్ప్రకాశోయః సహావఇతికథ్యతే।

తా॥ ఆభావమునేత్రాదులవలన నించుకప్రకాశపడెనేని యది హావమనబడును.

హేలాలక్షణం.

శ్లో॥ భావఏవభవేద్ధేలా లలితాభినయాత్మికః॥౧౦౫

తా॥ ఆభావమేలలితాభినయరూపమగునపుడు హేలయనబడును.

శోభాలక్షణం.

శ్లో॥ సాశోభారూపభూషాద్యైర్యత్స్యాదంగవిభూషణం।

తా॥ రూపభూషాదులచే దేహమునలంకరించుకొనుట శోభయనబడును.

కాంతిలక్షణం.

శ్లో॥ శోభైవకాంతిరాఖ్యాతా మన్మథాప్యాయనోజ్జ్వలా॥౧౦౬

తా॥ ఆశోభయే మన్మథవిషయతృప్తిజేయుటయందు ప్రకాశించెనేనియది కాంతి యనబడును.

దీప్తిలక్షణం.

శ్లో॥ కాంతిరేవవయోభోగ దేశకాలగుణాదిభిః।
ఉద్దీపితాతివిస్తారం యాతాచేద్దీప్తిరుచ్యతే॥౧౦౭

తా॥ ఆకాంతియేవయోభోగదేశకాలగుణాదులచే మిక్కిలి యధికమాయెనేనియది దీప్తియనబడును.

ప్రాగల్భ్యలక్షణం.

శ్లో॥ నిశ్శంకత్వంప్రయోగేషు ప్రాగల్భ్యంపరికీర్తితం।

తా॥ ప్రయోగములయందునిశ్శంకవృత్తిప్రాగల్భ్యమనబడును.

మాధుర్యలక్షణం.

శ్లో॥ మాధుర్యంనామచేష్టానాంసర్వావస్థాసుమార్దవం॥౧౦౮

తా॥ సర్వావస్థలయందును వ్యాపారములయొక్క మృదుత్వమే మాధుర్యమనబడును.

ధైర్యలక్షణం.

శ్లో॥ స్థిరాచిత్తోన్నతిర్యాతు తద్ధైర్యమితిసంజ్ఞితం।

తా॥ దృఢమైనచిత్తవృత్తిధైర్యమనబడును.

ఔదార్యలక్షణం.

శ్లో॥ ఔదార్యంవినయంప్రాహుఃసర్వావస్థానుగంబుధాః॥౧౦౯

తా॥ సర్వావస్థలయందు ననుసరించినవినయమును ఔదార్యమని చెప్పుదురు.

అథ గాత్రజానుభావానిరూప్యంతే.

శ్లో॥ లీలావిలాసోవిచ్ఛిత్తిఃవిభ్రమఃకిలికించితం।
మోట్టాయితంకుట్టమితం బిబ్బోకంలలితంతథా॥౧౧౦
విహృతంచేతివిజ్ఞేయాః స్త్రీణాంతుదశగాత్రజాః।

తా॥ లీల, విలాసము, విచ్ఛిత్తి, విభ్రమము, కిలికించితము, మోట్టాయితము, కుట్టమితము, బిబ్బోకము, లలితము, విహృతము, ఈపదియు స్త్రీలగాత్రజానుభావములనబడును.

లీలాలక్షణం.

శ్లో॥ ప్రియానుసరణంయత్తు మధురాలాపపూర్వకైః॥౧౧౧
చేష్టితైర్గతిభిశ్చాపి సాలీలేతినిగద్యతే।

తా॥ మధురాలాపముమొదలైనచేష్టలచేనాయకుని ననుసరించుటలీలయనబడును.

విలాసలక్షణం.

శ్లో॥ ప్రియసంప్రాప్తిసమయే భ్రూనేత్రాననకర్మభిః॥౧౧౨
తాత్కాలికోవిశేషోయః సవిలాసఇతీరితః।

తా॥ నాయకుడువచ్చెడిసమయమందుకనుబొమలు, కన్నులు, ముఖము, వీనిచేనప్పుడుగలుగువిశేషమెదో, యదివిలాసమనబడును. ... ... *

విచ్ఛిత్తిలక్షణం.

శ్లో॥ ఆకల్పకల్పనాకల్పావిచ్ఛిత్తిరతికాంతికృత్॥౧౧౩

తా॥ అలంకారవిన్యాసములకుసమానమైమెరయుచునుండునదివిచ్ఛిత్తియనబడును.

విభ్రమలక్షణం.

శ్లో॥ ప్రియాగమనవేళాయాం మదనావేశసంభ్రమాత్।
విభ్రమోగంధహారాది భూషాస్థానవిపర్యయః॥౧౧౪

తా॥ ప్రియుడువచ్చెడిసమయమందుమన్మథావేశసంభ్రమముచే గంధము, హారము, మొదలైనభూషణస్థానవిపర్యయమువిభ్రమమనబడును. ... *

కిలికించితలక్షణం.

శ్లో॥ శోకరోషాశ్రుహర్షాదేస్సంకరఃకిలికించితం।

తా॥ శోకము, కోపము, కన్నీరు, సంతోషము, వీనికూడికకిలికించితమనబడును. *

మోట్టాయితలక్షణం.

శ్లో॥ స్వాభిలాషప్రకటనం మోట్టాయితమితీరితం॥౧౧౫

తా॥ తనకోరికనుబయలువఱచుటమోట్టాయితమనబడును. ... *

కుట్టమితలక్షణం.

శ్లో॥ కేశాధరాదిగ్రహణే మోదమానాపిమానసే।
దుఃఖితేనబహిఃకుప్యే ద్యదికుట్టమితంభవేత్॥౧౧౬

తా॥ రతికాలమందుఉవిద కొప్పుఅధరము మొదలైన వానియొక్క గ్రహణమందుమనసులోసంతోషముగలదై యుండిన బయటికి దుఃఖితురాలువలెనేకోపించుటకుట్టమితమనబడును.

బిబ్బోకలక్షణం.

శ్లో॥ ఇష్టేప్యనాదరోగర్వాత్ మనాక్ బిబ్బోకఇష్యతే।

తా॥ గర్వముచేత ప్రియవస్తువందుకొంచెము అనాదరణముబిబ్బోకమనబడును. *

లలితలక్షణం.

శ్లో॥ విన్యాసభంగిరంగానాం భ్రూవిలాసమనోహరా॥౧౧౭
సుకుమారాభవేద్యశ్చేత్ లలితంతదుదీరితం।

తా॥ అంగవిన్యాసచమత్కారములు, మనోహరభ్రూవిలాసములు, సుకుమారము లౌచుండిన అదిలలితమనబడును.

విహృతలక్షణం.

శ్లో॥ ఈర్ష్యయామానలజ్జాభ్యామదత్తంయోగ్యముత్తరం॥౧౧౮
క్రియయావ్యజ్యతేయత్ర విహృతంతదుదీరితం।

తా॥ ఈర్ష్యచేతగాని, కోపముచేతగాని, సిగ్గుచేతగాని, తగుపాటియుత్తరమియ్యక క్రియలచే దెలుపబడెనేని అదివిహృతమనబడును.

వాగారంభానుభావానిరూప్యంతే.

శ్లో॥ ఆలాపశ్చవిలాపశ్చ సల్లాపశ్చప్రలాపకః॥ ౧౧౯॥ అనులాపోపలాప
శ్చ సందేశశ్చాతిదేశకః। నిర్దేశశ్చాపదేశశ్చ వ్యపదేశోపదేశకౌ॥౧౨౦
ఏవంద్వాదశధాప్రోక్తావాగారంభావిచక్షణైః।

తా॥ ఆలాపము, విలాపము, సల్లాపము, ప్రలాపము, అనులాపము, అపలాపము, సందేశము, అతిదేశకము, నిర్దేశము, అపదేశము, వ్యపదేశము, ఉపదేశము, ఈపండ్రెండును వాగారంభానుభావములనబడును.

ఆలాపవిలాపలక్షణే.

శ్లో॥ తత్రాలాపఃప్రియోక్తిస్స్యాద్విలాపోదుఃఖజంవచః॥౧౨౧

తా॥ అందుసంతోషపుమాటఆలాపమౌను. దుఃఖముచేగలుగుపలుకువిలాపమౌను.

సల్లాపలక్షణం.

శ్లో॥ ఉక్తిప్రత్యుక్తిమద్వాక్యం సల్లాపఃపరికీర్తితః।

తా॥ ఉక్తిప్రత్యుక్తిగలమాటసల్లాపమనబడును.

ప్రలాపానులాపలక్షణే.

శ్లో॥ వ్యర్థాలాపఃప్రలాపస్స్యాదనులాపోముహుర్వచః॥౧౨౨

తా॥ ఉపయోగములేనిమాటప్రలాపమనబడును. చెప్పినమాటలనేచెప్పట అనులాపమనబడును.

అపలాపలక్షణం.

శ్లో॥ అపలాపస్తుపూర్వోక్తస్యాన్యథాయోజనంభవేత్।

తా॥ మొదటచెప్పినమాటనువేఱువిధముగాత్రిప్పటఅపలాపమౌను.

సందేశలక్షణం.

శ్లో॥ సందేశస్తుప్రోషితస్య స్వవార్తాప్రేషణంభవేత్॥౧౨౩

తా॥ ఊరికిపోయియుండునాయకునికి తనసంగతులనుసఖులముఖముగదెలుపుట సందేశమనబడును.

అతిదేశలక్షణం.

శ్లో॥ సోతిదేశో మదుక్తాని తదుక్తానీతి యద్వచః॥

తా॥ నేను చెప్పినమాటలే అతడు చెప్పినమాటలనుట అతిదేశమనబడును.

నిర్దేశలక్షణం.

శ్లో॥ నిర్దేశస్తు భవేత్సోయ మహమిత్యాదిభాషణం॥౧౨౪

తా॥ వాడు, వీడు, వాడు, నేను, మొదలైనపలుకులు నిర్దేశమనబడును.

అపదేశలక్షణం.

శ్లో॥ అన్యార్థకథనం యత్ర సోపదేశ ఇతీరితః॥

తా॥ అర్థాంతరమును తెలియపలుకు పలుకు అపదేశమనబడును.

ఉపదేశలక్షణం.

శ్లో॥ యచ్ఛిష్యార్థం తు వచన ముపదేశస్స ఉచ్యతే॥౧౨౫

తా॥ శిష్యులకొఱకు ఆచార్యులచే జెప్పబడు పలుకు ఉపదేశమనబడును.

వ్యపదేశలక్షణం.

శ్లో॥ వ్యాజేనాత్మాభిలాషోక్తి ర్యాసా స్యాద్వ్యపదేశకః॥

తా॥ ఇతరవ్యాజముగ తనకోరికను దెలుపుట వ్యపదేశమనబడును.

అథ బుద్ధ్యారంభానుభావా నిరూప్యంతే.

శ్లో॥ బుద్ధ్యారంభా స్తథా ప్రోక్తా రీతివృత్తిప్రవృత్తయః॥౧౨౬

తా॥ ఈ బుద్ధ్యారంభానుభావములు రీతియనియు, వృత్తియనియు, ప్రవృత్తియనియు, ముత్తెఱంగులగును. ... ...

శ్లో॥ ప్రబంధాదిషు తేజ్ఞేయా భావశాస్త్రవిచక్షణైః॥

తా॥ ఇవి ప్రబంధము మొదలైనవానియందు భావశాస్త్రజ్ఞులచే ఎఱుగదగినవి.

---

అథ సాత్త్వికభావా నిరూప్యంతే.

శ్లో॥ అన్యేషాం సుఖదుఃఖాది భావేషు కృతభావనం॥౧౨౭॥ ఆనుకూల్యేన య
చ్చిత్తం భావకానాం ప్రవర్తతే। తత్సత్త్వమితి విజ్ఞేయం ప్రాజ్ఞైస్సత్త్వో
ద్భవానిమాః॥౧౨౮॥ సాత్త్వికా ఇతి జానంతి భరతాద్యా మహర్షయః॥
తే స్తంభస్వేదరోమాంచ స్స్వరభేదశ్చ వేపథుః॥౧౨౯॥ వైవర్ణ్యమ
శ్రుప్రళయ ఇత్యష్టౌ సాత్త్వికామతాః॥ ...

తా॥ ఇతరులయొక్క సుఖదుఃఖములు మొదలైన భావములయందు ఆనుకూల్యముతో కృతభావనమైయుమనసు ప్రవర్తించుచున్నదో యది సత్త్వమనబడును. అందునుండి కలుగుభావములు సాత్త్వికములౌను. అవి స్తంభమనియు, రోమాంచమనియు, స్వరభేదమనియు, వేపథువనియు, వైవర్ణ్యమనియు, అశ్రువనియు, ప్రళయమనియు, ఈయెనిమిది సాత్త్వికభావములనబడును. ... ...

స్తంభలక్షణం.

శ్లో॥ స్తంభో హర్ష భయామర్ష విషాదాద్భుతసంభవః॥౧౩౦
అనుభావో౽భవేదత్ర నిష్క్రియాంగత్వమేవహి।

తా॥ స్తంభమనుసాత్త్వికభావము సంతోషము, భయము, కోపము, విషాదము, అద్భుతము, వీనిచేగలుగును నిష్క్రియాంగత్వము. ... ... ... *

స్వేదలక్షణం.

శ్లో॥ నిదాఘహర్ష వ్యాయామ శమక్రోధభయాదిభిః॥౧౩౧
స్వేదస్సంజాయతే తత్ర త్వనుభావాభవంత్యమీ।
స్వేదాపనయవాతేచ్ఛా వ్యజనగ్రహణాదయః॥౧౩౨

తా॥ ఎండ, సంతోషము, వ్యాయామము, శ్రమము, క్రోధము, భయము, మొదలైనవానిచేత స్వేదము అనగా చెమటకలుగును. అప్పుడు చెమటను తుడుచుకొనుట, గాలిని ఇచ్ఛించుట, వ్యజనగ్రహణము మొదలైన అనుభావములు కలుగును. *

రోమాంచలక్షణం.

శ్లో॥ రోమాంచో విస్మయోత్సాహ హర్షాద్యైస్తత్ర విక్రియాః।
రోమోద్గమాద్యాః కథితా విక్రియా స్తత్రకోవిదైః॥౧౩౩

తా॥ ఆశ్చర్యము, ఉత్సాహము, సంతోషము, మొదలైనవానిచేత రోమాంచము కలుగును అందు గగుర్పొడుచుట మొదలయిన వికారములు కలుగును. *

స్వరభేదలక్షణం.

శ్లో॥ స్వరభేదస్సుఖాద్యైస్తు తత్ర స్స్యుర్గద్గదాదయః।

తా॥ సుఖాదులచే స్వరభేదము గలుగును. ఇందు డగ్గుత్తుక మొదలైనవి గలుగును. *

వేపథులక్షణం.

శ్లో॥ వేపథుర్హర్ష సంత్రాస జ్వరక్రోధాదిభిర్భవేత్॥౧౩౪
అత్రానుభావాః స్మరణ గాత్రకంపాదయోమతాః।

తా॥ సంతోషము, బెదరించుట, జ్వరము, కోపము, మొదలైనవానిచే వేపథువుగలుగును ఇందు స్మరించుట, దేహము వణకుట, మొదలైనవి గలుగును. *

వైవర్ణ్యలక్షణం.

శ్లో॥ విషాదపరరోషాద్యై ర్వైవర్ణ్యముపజాయతే॥౧౩౫
ముఖవర్ణపరావృత్తిః కార్శ్యాద్యాస్తత్రవిక్రియాః।

తా॥ విషాదము, ఇతరులయందు గలరోషము, మొదలైనవానిచే వైవర్ణ్యము గలుగును- ఇందు ముఖతేజస్సు మాయుట, చిక్కిపోవుట, మొదలైనవి గలుగును. *

అశ్రులక్షణం.

శ్లో॥ విషాదరోషసంతోష ధూమాద్యై రశ్రువిక్రియాః॥౧౩౬
బాష్పబిందుపరిక్షేప నేత్రసమ్మార్జనాదయః॥

తా॥ వ్యసనము, కోపము, సంతోషము, భూతము, మొదలైనవానిచే అశ్రువుగలుగుట. ఇందు కన్నీరు విడిచుట, కన్ను లనుతుడుచుకొనుట, మొదలయినవి కలుగును.

ప్రళయలక్షణం.

శ్లో॥ ప్రళయస్సుఖదుఃఖాద్యైః శ్చేతసస్త్వవిసంజ్ఞతా॥౧౩౭

తా॥ ప్రళయమనగా సుఖదుఃఖాదులచే గలుగు ప్రజ్ఞాభంగము.

శ్లో॥ ఏతేషాంసత్వమూలత్వాత్ భావానాంసాత్వికప్రథా।
అనుభావాశ్చకథితాః భావసంసూచనాదయః॥౧౩౮
ఏవంద్వైవిధ్యమేతేషాం దర్శితంభావకోవిదైః।

తా॥ సత్వమూలములైనవి గనుక వీనికి సాత్వికభావములని పేరు. భావసంసూచనాదులు అనుభావములనబడును. ఇట్లు అనుభావములు రెండు విధములు గలిగియుండును.

శ్లో॥ విభావా అనుభావాశ్చ తేభవంతి పరస్పరం॥౧౩౯
కార్యకారణభావాశ్చ జ్ఞేయాభావవిశారదైః।

తా॥ విభావానుభావములు ఒకటికొకటి కార్యకారణభావములుగాను భావజ్ఞులచే నెఱుగదగినవి.

... ... ... ...

ఇత్యనుభావాస్సమాప్తాః.

---

అథవ్యభిచారిభావానిరూప్యంతే.

శ్లో॥ వ్యభీఇత్యుపసర్గాద్వా విశేషాభిముఖత్వయోః॥ ౧౪౦
విశేషేణాభిముఖ్యేనచరంతిస్థాయిసంప్రతి।
వాగంగసత్వయుక్తాయె జ్ఞేయాస్తేవ్యభిచారిణః॥౧౪౧

తా॥ పలుకు, దేహము, సత్వము, వీనితోగూడినవై స్థాయికి విశేషాభిముఖములుగా దిరుగు భావములు వ్యభిచారిభావములని యెఱుగవలయును.

శ్లో॥ విచారయంతివాసమ్య గితిసంచారిణోపితే।

తా॥ అవి స్థాయులను బాగుగ చరింపజేయుచున్నవి గనుక సంచారులనియును జెప్పబడును.

... ...

శ్లో॥ ఉన్మజ్జంతోనిమజ్జంత స్థాయిన్యంబునిధావివ॥౧౪౨
ఊర్మివద్వర్ధయంత్యేనం యాంతితద్రూపతాంచతే।

తా॥ ఏ భావములు స్థాయియందు సముద్రమందుండు నలలవలె దానిని వృద్ధిబొందించి తద్రూపతను బొందుచున్నవో అవి వ్యభిచారిభావములనబడును.

నిర్వేదాదయోనిరూప్యంతే.

శ్లో॥ నిర్వేదగ్లానిశంకాశ్చ తథాసూయామదశ్శ్రమః॥౧౪౩॥ ఆలస్యంచైవదైన్యంచ చింతామోహోధృతిస్స్మృతిః। వ్రీడాచపలతాహర్ష ఆవేగో

జడతా తథా ॥ ౧౪౪ ॥ గర్వో విషాద ఔత్సుక్యం నిద్రాపస్మార ఏవ చ ।
సుప్తిర్విబోధోఽమర్షశ్చాప్యవహిత్థమథోగ్రతా ॥ ౧౪౫ ॥ మతిర్వ్యాధిస్త
థోన్మాదః తథా మరణమేవ చ । త్రాసశ్చైవ వితర్కశ్చ విజ్ఞేయా వ్యభి
చారిణః ॥ ౧౪౬ ॥ త్రయస్త్రింశదమీ భావాః సమాఖ్యాతాస్తు నామతః ।

తా॥ నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమము, ఆలస్యము, దైన్యము, చింత, మోహము, ధృతి, స్మృతి, వ్రీడ, చపలత, హర్షము, ఆవేగము, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తి, విబోధము, అమర్షము, అవహిత్థ, ఉగ్రత, మతి, వ్యాధి, ఉన్మాదము, మరణము, త్రాసము, వితర్కము, ఈముప్పదిమూడును వ్యభిచారిభావములని చెప్పబడును. ... *

నిర్వేదలక్షణం.

శ్లో॥ తత్త్వజ్ఞానాచ్చ దారిద్ర్యా దాపదో విప్రలంభతః ॥ ౧౪౭
దుఃఖాదేరపి నైష్ఫల్య మతిర్నిర్వేద ఉచ్యతే ।

తా॥ తత్త్వజ్ఞానము, పేదఱికము, సంకటము, వియోగము, దుఃఖము మొదలైనవానిచేఁగలుగు ఫలాభావమతి నిర్వేదమనబడును. ... *

గ్లానిలక్షణం.

శ్లో॥ ఆధివ్యాధిజరాతృష్ణా వ్యాయామసురతాదిభిః ॥ ౧౪౮
నిష్ప్రాణతా గ్లానిరత్ర క్షామాంగవచనక్రియాః ।
కలానుత్సాహవైవర్ణ్య నయనభ్రమణాదయః ॥ ౧౪౯

తా॥ మనోవ్యాధి, రోగము, ముసలితనము, దప్పి, వ్యాయామము, సురతము, ఇవి మొదలైనవానిచేఁగలుగు దౌర్బల్యము గ్లానియగును. ఇందు- దేహము చిక్కుట, సన్నపలుకులు, మెల్లనపనులు, కళావిషయములయందు ఉత్సాహము లేకయుండుట, దేహవైవర్ణ్యము, గుడ్లుతిరుగుట, ఇవి మొదలైన వికారములు గలవు. ... *

శంకాలక్షణం.

శ్లో॥ శంకా చౌర్యాపరాధాద్యైః స్వానిష్టోత్ప్రేక్షణం మతం ।
తత్ర చేష్టా ముహుః పార్శ్వవీక్షణం ముఖశోషణం ॥ ౧౫౦
అవకుంఠనవైవర్ణ్య కంఠసాదాదయోఽపి చ ।

తా॥ చౌర్యాపరాధాదులచేఁ దనకహితము నుత్ప్రేక్షించుట శంకయనబడును. ఇందు మాటిమాటికి పార్శ్వములను చూచుట, మోము వాడుట, ముసుఁగిడుట, వైవర్ణ్యము, కంఠగద్గదము, మొదలైన చేష్టలు గలవు. ... ... *

శ్లో॥ ద్వివిధా చేయ మాత్మోత్థా పరోత్థా చేతి భేదతః ॥ ౧౫౧ ॥ స్వకార్యజనితా
స్వోత్థా ప్రాయోవ్యంగ్యేయమింగితైః । ఇంగితానితు పక్ష్మభ్రూతారకా
దృష్టివిక్రియాః ॥ ౧౫౨ ॥ పరోత్థాతు పరస్వేదః పరస్యాకారతో భవేత్ ।

ప్రాయేణాకారచేష్టాద్యైః తాభ్యామనుభావయేత్ ॥౧౫౩॥ ఆకారస్సా
త్త్వికశ్చేష్టా త్వంగప్రత్యంగజాః క్రియాః॥ ... *

తా॥ ఈశంక ఆత్మోత్థశంకయనియు, పరోత్థశంకయనియు, ఇరుదెఱగులౌను. స్వకార్యమువలనకలుగునది స్వోత్థశంక. ఇందుగల ఇంగితములు రెప్ప, కనుబొమలు, నల్లగ్రుడ్లు, చూపు, వీనియందుగలుగువికారములు. ఇతరులఆకారమువలనగలుగుచెమట పరోత్థశంకయనబడును. వరుసగా నాకారచేష్టాదులచే ఈ రెండువిధములశంకను ఊహింపవచ్చును. ఆకారము, సాత్త్వికము, చేష్టలు, అంగప్రత్యంగములయందుగలుగుక్రియాభేదములు.

అసూయాలక్షణం.

శ్లో॥ పరసౌభాగ్యసంపత్తి విద్యాశౌర్యాదిహేతుభిః ॥౧౫౪
గుణేపిదోషారోపస్స్యా దసూయాత్రవిక్రియాః।
ముఖాపవర్తనంగర్హా భ్రూభేదానాదరాదయః॥౧౫౫

తా॥ ఇతరులసౌభాగ్యము, సంపత్తి, విద్య, శౌర్యము, మొదలగుహేతువులచే గుణమందుగూడదోషారోపణముజేయుట అసూయయనబడును. ఇందు మోమునుద్రిప్పుట, నిందించుట, భ్రూభేదము, ఉపేక్ష, ఇవిమొదలయినక్రియలుగలవు. *

మదలక్షణం.

శ్లో॥ మదస్స్యానందసమ్మోహ సంభ్రమో మదిరాదిజః।
సత్రిధాతరుణోమధ్యో పకృష్టశ్చేతిభేదతః॥౧౫౬

తా॥ మదమనునది మద్యముమొదలయినవానిచేగలుగుఆనందసమ్మోహములమొక్క సంభ్రమము. ఆమదము-తరుణమదమనియు, మధ్యమదమనియు, అపకృష్టమదమనియు, మూడువిధములు. ... ... ... *

శ్లో॥ దృష్టిస్స్మేరాముఖేరాగః సస్మితాకులితంవచః।
లలితావిద్ధగత్యాద్యా శ్చేష్టాస్స్యుస్తరుణేమదే॥౧౫౭

తా॥ తరుణమదమందు గర్వపుజూపులు, ముఖమందుఎఱుపు, చిఱునగవును సంభ్రమమునుగలపలుకు, ఒయారపునడ, ఇవిమొదలయినచేష్టలుగలుగును. *

శ్లో॥ మధ్యమేతుమదేవాచి స్ఖలనంఘూర్ణనందృశోః।
గమనేవక్రతాబాహ్వో ర్విక్షేపస్స్రస్తతాదయః॥౧౫౮.

తా॥ మధ్యమమదమందు వాక్కునతడబాటు, గుడ్లుతిరుగుట, వంకరగనడచుట, చేతులనాడించుట, వ్రేలవేయుట, మొదలయినచేష్టలుగలవు. • ... *

శ్లో॥ అపకృష్టేతుచేష్టాస్స్యు ర్గతిభంగోవిసంజ్ఞతా।
నిష్ఠీవనంముహుశ్శ్వాసో హిక్కాఛర్ద్యాదయోమతాః॥౧౫౯

తా॥ అపకృష్టమదమందు గతిభంగము, మూర్ఛిల్లుట, తెలివితప్పియుండుట, ఉమియుట, వెక్కిళ్లు, వాంతి, మొదలైనచేష్టలుగలుగును. ... *

శ్లో॥ ఉత్తమప్రకృతిస్స్వేతి మధ్యోహసతిగాయతి।
అధమప్రకృతిస్త్వేతు పరుషం వక్తిరోదితి॥ ౧౬౦

తా॥ ఉత్తమమదమునుగలవాడు పండుకొనియుండును. మధ్యమమదమునుగలవాడు నవ్వుచు పాడుచునుండును. అధమమదమునుగలవాడు క్రూరముగను వికారముగను మాటలాడుచును దుఃఖించుచునుండును. ... ... •

శ్రమలక్షణం.

శ్లో॥ శ్రమోమానసఖేదస్స్యాత్ అధ్వస్నృత్తరతాదిభిః। అంగమర్దననిశ్వాస పాదసంవాహనానిచ॥ ౧౬౧ ॥ జృంభణంమందయానత్వం ముఖనేత్రవికూణనం। సీత్కృతిశ్చేతివిజ్ఞేయా అనుభావాశ్శ్రమోద్భవాః॥ ౧౬౨

తా॥ త్రోవనడచుట. నృత్తమాడుట, క్రీడమొదలైనవ్యాపారములచేగలుగుమానసఖేదముశ్రమమనబడును. ఇందు అంగమర్దనము,నిట్టూర్పు, కాళ్లపిసుకుట, ఆవలింత, మందముగనడచుట, ముఖమునుకన్నులనువంకరచేసికొనుట, సత్కారముచేయుట, ఈఅనుభావములుగలుగును. ... ... •

ఆలస్యలక్షణం.

శ్లో॥ స్వభావభయసౌహిత్య గర్వనిర్భయతాదిభిః। కృచ్ఛాత్ప్రవృత్తిరాత్మకృత్యం యత్తదాలస్యమిహక్రియాః॥ ౧౬౩ ॥ అంగభంగక్రియాద్వేషజృంభణాక్షివిమర్దనాః। శయ్యాసనైకప్రియతా తంద్రీనిద్రాదయోపిచ॥ ౧౬౪

తా॥ స్వభావము,భయము,తృప్తి,గర్వము,భయములేకయుండుట, మొదలగువానివలనవిళంబనముగపనులను యత్నించుట ఆలస్యమనబడును. ఇందు అంగభంగము, క్రియాద్వేషము, ఆవలింత, నేత్రములునలుపుట, పండుకొనుటయందును కూర్చుండుటయందును ముఖ్యముగాప్రియముగలుగుట, కన్నులుమూతలుపడుట, నిదురమొదలైనక్రియలుగలుగును.

దైన్యలక్షణం.

శ్లో॥ హృత్తాపదుర్గతత్వాద్యైరనౌద్ధత్యంహిదీనతా।
అత్రానుభావామాలిన్య గాత్రస్తంభాదయోమతాః॥ ౧౬౫

తా॥ మనస్తాపము, పేదఱికము, మొదలయినవానిచేగలుగు అణకువదైన్యమనబడును. ఇందుమాలిన్యదేహస్తంభాద్యనుభావములుగలుగును. ... •

చింతాలక్షణం.

శ్లో॥ ఇష్టవస్త్వపరిప్రాప్తైశ్వర్యభ్రంశనాదిభిః।
చింతాధ్యానాత్మికాతస్యా మనుభావాభవంత్యమీ। ౧౬౬
కార్శ్యాధోముఖ్యసంతాపనిశ్వాసోచ్ఛ్వసనాదయః॥

తా॥ ప్రియవస్తువులులభింపనందువలన ఐశ్వర్యభ్రంశనము మొదలయినవానిచేతగలుగుధ్యానముచింతయనబడును. ఇందు మేనుచిక్కుట, తలవంపు, సంతాపము,నిట్టూర్పు, మొదలైనవిగలుగును. ... ... •

## భరతరసప్రకరణమ్.

### మోహలక్షణం.

శ్లో॥ ఆపత్భీతివియోగాద్యైర్మోహశ్చిత్తస్యమూఢతా।
విక్రియాస్తత్రవిజ్ఞేయాఇంద్రియాణాంచశూన్యతా॥౧౬౭
నిశ్చేష్టతాంగభ్రమణపతనాఘూర్ణనాదయః।

తా॥ ఆపత్తు, భయము, వియోగము మొదలైనవానిచేమనస్సునకేమియుదెలియక పోవుటమోహమనబడును. ఇందు ఇంద్రియములుశూన్యముగనుండుట, చేష్టలులేక యుండుట, దేహముదిరుగుట, పడుట, గ్రుడ్లుగిరగిరలాడుట,ఇవిమొదలైనవిక్రియలు గలుగును.

### ధృతిలక్షణం.

శ్లో॥జ్ఞానవిజ్ఞానగుర్వాదిభక్త్యైర్నానార్థసిద్ధితః॥౧౬౮॥ లజ్జాదిభిశ్చచిత్తస్య నైస్పృహ్యంధృతిరుచ్యతే। అత్రానుభావావిజ్ఞేయా ప్రాప్తార్థానుభవస్తథా॥౧౬౯॥ అప్రాప్తాతీతనష్టార్థానభిసంశోభణాదయః।

తా॥ మోక్షవిషయకజ్ఞానము, శాస్త్రజ్ఞానము, గురుభక్తి,నానావిషయములసిద్ధి, సిగ్గు, మొదలైనవానిచేతమనస్సునకు ఇచ్ఛలేకయుండుట ధృతియనబడును. ఇందు లభించినదానిని అనుభవించుట, పొందబడనివిషయములు కడచినవిషయములు నష్టవిషయములు వీనికిగామనస్సునచింతలేకయుండుట, మొదలయినవిగలుగును.

### స్మృతిలక్షణం.

శ్లో॥స్వతశ్చిత్తదృఢాభ్యాసాత్ సదృశాలోకనాదిభిః॥౧౭౦
స్మృతిఃపూర్వానుభూతార్థప్రతీతిస్తత్రవిక్రియాః।
కంపనోద్వేపనేమూర్ధ్నోభ్రూవిక్షేపాదయోపిచ॥౧౭౧

తా॥ మనోభ్యాసబలముచేతతనంతటను సమానవస్తువులచూపు మొదలైనవానిచేగలుగుపూర్వానుభూతార్థజ్ఞానముస్మృతియనబడును. ఇందు శిరస్సునుఆడించుట, ఊచుట, కనుబొమలవిక్షేపములుమొదలైనవిగలుగును.

### వ్రీడాలక్షణం.

శ్లో॥అకార్యకరణావజ్ఞా స్తుతినూతనసంగమైః। ప్రతికారక్రియాద్యైశ్చవ్రీడాత్వనతిధృష్టతా॥౧౭౨॥ తత్రచేష్టానిగూఢోక్తిరాధోముఖ్యవిచింతనే। అనిర్గమోబహిర్వాపి దూరాదేవావకుంఠనం॥౧౭౩॥ నఖానాంకృంతనంభూమి లేఖనంచైవమాదయః।

తా॥ అకార్యముజేయుట, అవమానము, స్తోత్రము, నూతనసంగమము, ప్రతికారక్రియమొదలైనవానిచేత అతిధార్ష్ట్యములేకయుండుట వ్రీడయనబడును. ఇందు మఱుగుగమాటాడుట, తలవంపు, యోచించుట, బయటరాకుండుట, దూరముగానే ముసుగిడుట, గోళ్లుగిల్లుట, నేలగీరుట, ఇవిమొదలైనవిగలుగును.

### చపలతాలక్షణం.

శ్లో॥ రాగద్వేషాదిభిశ్చిత్తే లాఘవంచాపలంభవేత్॥౧౭౪

చేష్టా స్తత్రావిచారేణ పరిరంభావలోకనే।
నిష్కాసనోక్తిపారుష్య తాడనాజ్ఞాపనాదయః॥౧౭౫

తా॥ ఆస్యద్వేషము, మొదలైనవానిచేమనస్సులోగలుగులాఘువము చాపలమగును. అందు యోచింపకకౌగిలించుకొనుట, చూచుట, వెళ్లమనుట, కఠినపుమాటలు, కొట్టుట, ఆజ్ఞాపించుట, మొదలైనచేష్టలుగలుగును. ...

హర్షలక్షణం.

శ్లో॥మనోరథస్యలాభేన సిద్ధియోగ్యస్యవస్తునః। మిత్రసంగాచ్చదేవాదిప్రసాదేనచకల్పితః॥ ౧౭౬ ॥ మనఃప్రసాదోహర్షస్స్యాద్ధత్రనేత్రాస్యఫుల్లతా। ప్రియభాషణమాశ్లేషః పులకానాంప్రరోహణం॥౧౭౭॥స్వేదోద్గమశ్చహస్తేన హస్తసంతాడనాదయః। ...

తా॥ మనోరథముయొక్కసిద్ధి యోగ్యమైనవస్తువుయొక్కలాభముచేతను, మిత్రులసంగముచేతను, దేవతాదులప్రసాదముచేతనుగలిగింపబడినమనఃప్రసాదము హర్షమనబడును. ఇందు ముఖము కన్నులు వికసించుట, ప్రియభాషణము, ఆశ్లేషము, పులకరింపు, చెమటగలుగుట, చేతులుతట్టుటమొదలైనవిగలుగును. ...

ఆవేగలక్షణం.

శ్లో॥చిత్తస్యసంభ్రమోయస్స్యాదావేగోయంసచాష్టధా।౧౭౮
ఉత్పాతవాతవర్షాగ్ని మత్తకుంజరదర్శనాత్।
ప్రియాప్రియశ్రుతేశ్చాపి శాత్రవవ్యసనాదపి॥౧౭౯

తా ॥ మనసుయొక్కతడబాటుఆవేగమగును. అయావేగము ఉత్పాతావేగమనియు, వాతావేగమనియు, వర్షావేగమనియు, అగ్న్యావేగమనియు, మత్తకుంజరదర్శనావేగమనియు, ప్రియశ్రవణావేగమనియు, అప్రియశ్రవణావేగమనియు. శాత్రవవ్యసనావేగమనియు, కారణానుసారముగానెనిమిదివిధములగును.

ఉత్పాతావేగోయథా.

శ్లో॥ తత్రోత్పాతస్తుశైలాది కంపకేతూదయాదయః।
తజ్జస్సర్వాంగవిస్రంసోవైమనస్యాపసర్పణె॥౧౮౦

తా॥ అందు కొండమొదలైనవికదలుట, ధూమకేతువుదయమగుట, మొదలైనవి ఉత్పాతమగును. దీనివలనగలిగిన సర్వాంగవిస్రంసము, వైమనస్యము, అపసర్పణము, ఇవిఉత్పాతావేగమనబడును. ... ...

వాతావేగోయథా.

శ్లో॥త్వరయాగమనంవస్త్ర హరణంచావకుంఠనం।
నేత్రావమార్జనాద్యాశ్చ వాతావేగభవాఃక్రియాః॥౧౮౧

తా॥ వేగముగనడచుట, వస్త్రములనుతీసికొనుట, కప్పుకొనుట, కన్నులునుతుడుచుకొనుట, మొదలైనవిపెద్దగాలివేగముగుక్రియలు. ...

వర్షా వేగోయథా.

శ్లో॥ఛత్రగ్రహాంగసంకోచ బాహుస్వస్తికభావనే।
ధన్యాశ్రయణమిత్యాద్యా వర్షావేగభవాఃక్రియాః॥౧౮౨

తా॥ గొడుగునుగ్రహించుట, దేహముచిన్నదవుట, చేతులనుభుజమూలములయందు జేర్చుట, పాఱుట, గుప్తస్థలమునాశ్రయించుట, మొదలైనవివర్షావేగముచేగలుగుక్రియలు.

అగ్న్యావేగోయథా.

శ్లో॥అగ్న్యావేగభవాశ్చేష్టా వీజనంచాంగధూననం।
వ్యత్యస్తపాదవిక్షేప నేత్రసంకోచనాదయః॥౧౮౩

తా॥ అగ్న్యావేగమందుగలుగుచేష్టలు వీజనము, అంగధూననము, వ్యత్యాసము గనడుగులుంచుట, నేత్రసంకోచము, ఇవిమొదలైనవి. ... *

మత్తకుంజరదర్శనావేగోయథా.

శ్లో॥ఆవేగేకుంజరోద్భూతే సత్వరంవాపసర్పణం।
విలోకనంముహుఃపార్శ్వే త్రాసకంపాదయోపిచ॥౧౮౪

తా॥ ఏనుగుచేగలుగునావేగమందుత్వరగాపరుగెత్తిపోవుట, వెనుకప్రక్కతిరిగితిరిగిచూచుట, భయము, వణకు, మొదలైనవిగలుగును. ... *

ప్రియశ్రవణజా వేగోయథా.

శ్లో॥ప్రియశ్రవణజేప్యస్మి న్నభ్యుత్థానోపగూహనే।
ప్రీతిదానంప్రియంవాక్యం రోమహర్షాదయోపిచ॥౧౮౫

తా ॥ ఈప్రియశ్రవణజావేగమందు అభ్యుత్థానము, ఆలింగనముజేసికొనుట, ప్రీతిపురస్సరముగవస్త్రాభరణాదులనిచ్చుట, ప్రియమైనవాక్యము, రోమాంచముమొదలైనవిగలుగును.

అప్రియశ్రవణావెగోయథా.

శ్లో॥అప్రియశ్రుతిజేప్యస్మి న్విలాపఃపరిలుంఠనం।
ఆక్రందితంచపతనం పరితోభ్రమణాదయః॥౧౮౬

తా ॥ అప్రియశ్రవణావేగమందు ఏడుపు, పొరలాడుట, మొరపెట్టుట, క్రిందబడుట, నాలుగుప్రక్కలదిరుగుట, మొదలైనవిగలుగును. ... . *

శాత్రవవ్యసనా వెగోయథా.

శ్లో॥ చేష్టాస్స్యుశ్శాత్రవావేగె వర్మశస్త్రాదిధారణం।
గజవాజిరథారోహ సహసావిక్రమాదయః॥౧౮౭
ఏతేస్యురుత్తమాదీనా మనుభావాయథోచితం।

తా॥ శాత్రవావేగమందు కవచము ఆయుధము మొదలైనవస్తువులనుధరించుట, ఏనుగ అశ్వము రథము వీనినెక్కుట, త్వరగావిక్రమించుట, మొదలైనవిగలుగును. ఇవి ఉత్తమాధులకుయథోచితముగగలుగును. ... *

## జడతా లక్షణం.

శ్లో॥ జాడ్యమప్రతిపత్తిస్స్యా ద్దిష్టానిష్టార్థయోశ్శ్రుతేః॥౧౮౮
వృష్టేర్వావిరహాదిభ్యః క్రియా స్తత్రానిమేషతా।
అశ్రుతిః పారవశ్యంచ తూష్ణీంభావాదయోపిచ॥౧౮౯

తా॥ ఇష్టార్థము అనిష్టార్థము వీనివినికివలనగాని, వర్షమువలనగాని, విరహముమొదలైనవానివలనగాని, కలుగుఅజ్ఞానము జాడ్యమౌను. ఇందు రెప్పపాటులేకయుండుట, చెవులువినకయుండుట, పరవశుడౌట, ఊరకయుండుట, మొదలగుచేష్టలుగలుగును. •

## గర్వలక్షణం.

శ్లో॥ ఐశ్వర్యరూపతారుణ్య కులవిద్యాబలైరపి। ఇష్టలాభాదినాన్యేషా మవజ్ఞాగర్వఉచ్యతే॥౧౯౦॥ అనుభావాభవంత్యత్ర గుర్వాద్యాజ్ఞావ్యతిక్రమః। అనుగ్రహప్రదానంచ వైముఖ్యాభాషణాదయః॥౧౯౧॥ విభ్రమాపహ్నుతీవాక్య పారుష్యమనవేక్షణం। ఆవేక్షణంనిజాంగానా మంగభేదాదయోపిచ॥౧౯౨ ... ... •

తా॥ ఐశ్వర్యము, రూపము, యౌవనము, కులము, విద్య, బలము, ఇష్టలాభముమొదలైనవానిచేత నొరులనవమానించుట గర్వమనబడును. ఇందు అహంభావము, ఆజ్ఞోల్లంఘనము, అనుగ్రహప్రదానము, మోముత్రిప్పుకొనుట, మాటలాడకయుండుట, మొదలైనవియు, పరుషముగమాటలాడుట, చూడకయుండుట, తనఅవయవములను జూచుకొనుట, ఒడలువిఱుచుకొనుట, మొదలైనయనుభావములుగలుగును. •

## విషాదలక్షణం.

శ్లో॥ ప్రారబ్ధకార్యానిర్వాహా దిష్టాప్రాప్తేర్విపత్తితః। అపరాధపరిజ్ఞానా దనుతాపస్తుసోభవేత్ ॥౧౯౩॥ విషాదఇతివిఖ్యాతో భరతార్ణవపారగైః। సవిషాదస్త్రిధాజ్యేష్ఠ మధ్యమాధమసంశ్రయాత్ ॥౧౯౪

తా॥ తానారంభించినపనిసాగకుండుట, ఇష్టపదార్థాప్రాప్తి, విపత్తు, తప్పునెఱుగుట, వీనివలనగలుగుననుతాపము విషాదమనబడును. ఆవిషాదము- ఉత్తమ, మధ్యమ, అధమములయాశ్రయమువలనమూడుతెఱగులుగలదియగును. ... •

## జ్యేష్ఠవిషాదోయథా.

శ్లో॥ సహాయాన్వేషణోపాయ చింతాద్యాఉత్తమేస్మృతాః।

తా॥ ఉత్తమునివిషాదమందు సహాయమునువెతకుట, ఉపాయచింతమొదలైనవ్యాపారములుగలుగును. ... ... •

## మధ్యమవిషాదోయథా.

శ్లో॥ అనుత్సాహశ్చవైచింత్యం వైక్లబ్యమవిలోకనం॥౧౯౫
విషాదేమధ్యమేప్రోక్తా భ్రాంత్యాద్యాశ్చైవవిక్రియాః।

తా॥ మధ్యమునివిషాదమందు ఉత్సాహములేకయుండుట, మిక్కిలిచింతించుట,

కార్యాకార్యములు తెలియకయుండుట, ఎవరినితలయెత్తిచూడకుండుట, భ్రమించుట, మొదలైనక్రియలుగలుగును.

అథమవిషాదోయథా.

శ్లో॥ రోదనశ్వసితధ్యాన ముఖహూణాదయోధమే॥౧౯౬

తా॥ అథమునివిషాదమందు రోదనము, నిట్టూర్పు, ధ్యానము, ముఖమువంకరమొదలైనవిగలుగును.

ఔత్సుక్యలక్షణం.

శ్లో॥ కాలాక్షమత్వమౌత్సుక్యం అభిలాషాదిహేతుజం।
త్వరయాగమనంశయ్యా స్థితేరుత్థానచింతనే॥౧౯౭
శరీరగౌరవాద్యాశ్చ అనుభావాఇహస్మృతాః।

తా॥ ఆసమొదలైనవానిచేగలుగుజాగును తాళలేకయుండుట ఔత్సుక్యమనబడును. ఇందు వేగముగనడచుట, పడకలోనుండిలేచుట, చింతించుట, శరీరముబరువగుట, మొదలైనవిగలుగును.

నిద్రాలక్షణం.

శ్లో॥ మందస్వభావవ్యాయామ నిశ్చింతత్వసమాధిభిః॥ ౧౯౮॥ మనోనిమీలనంనిద్రా చేష్టాస్తత్రాస్యగౌరవం । ఆఘూర్ణమాననేత్రత్వ మంగానాంపరివర్తనం ॥ ౧౯౯ ॥ నిశ్వాసోచ్ఛ్వసితేగాత్ర స్వేదోనేత్రనిమీలనం । శరీరస్యతుసంకోచో జాడ్యంచేత్యేవమాదయః॥ ౨౦౦

తా॥ మందస్వభావము, వ్యాయామము, నిశ్చింతత, సమాధి, వీనిచేగలుగుమనోనిమీలనమునిద్రయనబడును. ఇందు ముఖగౌరవము, కన్నులుజాలాయించుట, అంగములపరివర్తనము, ఉచ్ఛ్వాసనిశ్వాసములు, దేహమందుచెమటపోయుట, నేత్రములుమూతపడుట, దేహసంకోచము, తెలివిలేకయుండుట, ఇవిగలుగును.

అపస్మారలక్షణం.

శ్లో॥ ధాతువైషమ్యదోషేణ భూతావేశాదినాకృతః । చిత్తక్షోభస్త్వపస్మారః తత్రచేష్టాఃప్రకంపనం॥ ౨౦౧ ॥ ధావనంపతనంస్తంభో భ్రమణం నేత్రవిక్రియా । స్ఫోటదంశభుజాక్షేప లాలాఫేనాదయోపిచ ॥ ౨౦౨

తా॥ వాతపిత్తశ్లేష్మధాతువులహెచ్చుతక్కువ, దోషము, దయ్యముసోకుట, మొదలైనవానిచేత జేయబడినమనస్సుయొక్కక్షోభము అపస్మారమనబడును. ఇందు వణకుట, పరుగెత్తుట, పడుట, స్తంభము, తిరుగుట, నేత్రములవిక్రియ, స్ఫోటము, పండ్లుకొఱుకుట, చేతులువిసరుట, నోటజొల్లుకారుట, నురుగుగలుగుట, మొదలైనవిగలుగును.

సుప్తిలక్షణం.

శ్లో॥ ఉద్రేకఏవనిద్రాయాః సుప్తిస్సాస్యాత్తత్రవిక్రియాః।
ఇంద్రియోపరతిర్నేత్ర మీలనంస్రస్తగాత్రతా॥ ౨౦౩
ఉత్స్వప్నాయితనైశ్చల్య శ్వాసోచ్ఛ్వాసాదయోపిచ।

తా॥ నిదురయొక్కఆధిక్యమేసుప్తియనబడును. ఇంద్రియములుఉపరతినిబొందు

యుండుట, కన్నులుమూసియుండుట, గాత్రముస్తబ్ధమైయుండుట, కలగనుట, దీర్ఘకాలముకదలకయుండుట, ఉచ్ఛ్వాసనిశ్వాసములుమొదలైనవిగలుగును.

విబోధలక్షణం.

శ్లో॥ విబోధశ్చేతనావాప్తిశ్చేష్టాస్తత్రాక్షిమర్దనం ॥ ౨౦౪
శయ్యాయామోక్షణంబాహు విక్షేపోంగుళిమోటనం।
శిరఃకండూయనంచాంగ వలనంచైవమాదయః॥ ౨౦౫

తా॥ నిదురమేలుకొనుట విబోధమనబడును. ఇందు కన్నులునలుపుకొనుట, పడకనువిడుచుట, బాహువిక్షేపము, అంగుళిమోటనము, తలనుగోకుకొనుట, దేహమునుద్రిప్పుట, మొదలైనవిగలుగును. ... ... ...

అమర్షలక్షణం.

శ్లో॥ అధిక్షేపావమానాద్యైః క్రోధోమర్ష ఇతీరితః।
తత్రస్వేదశ్శిరఃకంప అధోముఖ్యవిచింతనే॥ ౨౦౬
ఉపాయాన్వేషణోత్సాహ వ్యవసాయాదయఃక్రియాః।

తా॥ తక్కువజేయుట, అవమానముజేయుట, మొదలయినవానిచేతగలుగుక్రోధము అమర్షమనబడును-అందు స్వేదము, శిరఃకంపము, తలవంచుకొనుట, చింతించుట, ఉపాయములనువెతకుట, ఉత్సాహము, వ్యవసాయము మొదలయినవిగలుగును.

అవహిత్థాలక్షణం.

శ్లో॥ అవహిత్థాకారగుప్తిః ధైర్యప్రాభవనీతిభిః॥ ౨౦౭॥ లజ్జాసాధ్వసదాక్షిణ్యప్రాగల్భ్యపజయాదిభిః।అన్యథాపాదశంమిథ్యా ధైర్యమన్యత్రవీక్షణం॥ ౨౦౮॥ కథాభంగాదయోప్యస్యా అనుభావాభవంత్యమీ।

తా॥ ధైర్యము, ప్రాభవము, నీతి, సిగ్గు, సాధ్వసము, దాక్షిణ్యము, ప్రాగల్భ్యము, అపజయము, ఇవిమొదలయినవానిచేగలుగు ఆకారగుప్తి అవహిత్థయనబడును. ఇందు వేరుగజెప్పుట, అబద్ధపుధైర్యము, మఱియొకప్రక్కజూచుట, కథాభంగము, మొదలయినవిగలుగును.

ఉగ్రతాలక్షణం.

శ్లో॥ అపరాధాపమానాభ్యాం చౌర్యనిగ్రహణాదిభిః॥ ౨౦౯॥ అసత్ప్రలాపనాద్యైశ్చ కృతంతూర్ణత్వముగ్రతా। క్రియాస్తత్రాస్యనయన రాగోబంధనతాడనే॥ ౨౧౦॥ శిరసఃకంపనంస్వేద వర్ధనంభర్త్సనాదయః।

తా॥ అపరాధము, అవమానము, దొంగతనము, నిగ్రహము, అసత్ప్రలాపము, మొదలయినవానిచేజేయబడీనత్వరఉగ్రతయనబడును. అందు కన్నులు ముఖముఎఱ్ఱనౌట, బంధనముజేయుట, కొట్టుట, తలయాడించుట, చెమటపోయుట, బెదరించుట, మొదలయినవికలుగును. ... ...

మతిలక్షణం.

శ్లో॥ నానాశాస్త్రార్థకథనా దర్థనిర్ధారణంమతిః ॥ ౨౧౧

అత్ర శేషాస్తు కర్తవ్య కరణం సంశయచ్ఛిదా।
శిష్యోపదేశో భ్రూక్షేప ఊహాపోహాదయోపి చ॥౨౧౨

తా॥ అనేకశాస్త్రార్థములను చెప్పుటవలన గలుగు అర్థనిర్ణయము మతియనబడును. ఇందు యుక్తమగుపనులను జేయుట, సంశయమును పోగొట్టుట, శిష్యోపదేశము, కనుబొమలనాడించుట, ఊహాపోహములు మొదలయినవి గలుగును.

వ్యాధి లక్షణం.

శ్లో॥ దోషోద్రేకవియోగాద్యైః జ్వరాత్మా వ్యాధిరుచ్యతే। గాత్రస్తంభశ్లథాంగత్వం కూజితం ముఖకూణనం॥౨౧౩॥ వృథాకృతాంగవిక్షేపా నిశ్వాసాద్యాస్తు విక్రియాః। సశీతో దాహయుక్తశ్చ ద్వివిధః పరికీర్తితః॥

తా॥ దోషోద్రేకము చేతను, వియోగాదులచేతను, గలుగుజ్వరము వ్యాధియనబడును. ఇందు దేహము స్తంభించుట, అంగము బిగితగ్గిపోవుట, అఱచుట, ముఖము వంకరపోవుట, వ్యర్థమగు అంగవిక్షేపము జేయుట, నిట్టూర్పు మొదలయినవి గలుగును. ఆజ్వరము శీతజ్వరమని, దాహజ్వరమనిన్ని ఇరుదెరంగులౌను. ...

శీతజ్వరవ్యాధిర్యథా.

శ్లో॥ శీతజ్వరేతు చేష్టాస్స్యుస్సంతాపశ్చాంగసాదనం।
హనుసంచలనం బాష్పః సర్వాంగోత్కంపకూజితే॥౨౧౪
జానుకంపన రోమాంచ ముఖశోషాదయోపి చ।

తా॥ శీతజ్వరమందు తాపము, దేహముచిక్కుట, చెక్కిళ్లుచలించుట, కన్నీరు, సర్వాంగమునువణకుట, అఱచుట, మోకాళ్లువణకుట, పులకరింపు, ముఖము వాడుట, మొదలయినవి గలుగును.

దాహజ్వరో యథా.

శ్లో॥ దాహజ్వరేతు విద్వేషో యాశ్శీతమాల్యాదిధారణం॥౨౧౬
పాణిపాదపరిక్షేప ముఖశోషాదయోపి చ।

తా॥ దాహజ్వరమందు చల్లనిపూలదండ మొదలయినవానిని ధరించుట, చేతులు కాళ్లు ఎత్తివేయుట, మొగము వాడిపోవుట, మొదలయినవి గలుగును.

ఉన్మాదలక్షణం.

శ్లో॥ ఉన్మాదశ్చిత్తవిభ్రాంతిః వియోగాదిష్టనాశతః॥౨౧౭

తా॥ వియోగము, ఇష్టనాశనము, వీనివలన గలుగు చిత్తవిభ్రమము, ఉన్మాదమనబడును.

వియోగజోన్మాదో యథా.

శ్లో॥ వియోగజేతు చేష్టాస్స్యుర్ధావనం పరిదేవనం।
అసంబద్ధప్రలపనం శయనం సహసోత్థితిః॥౨౧౮
అచేతనైస్సహాలాపో నిర్నిమిత్తస్మితాదయః।

తా॥ వియోగజోన్మాదమందు పరుగెత్తుట, పరిదేవనము, సంబంధములేనిపలుకులు

పలుకుట, పండుకొనియుండుట, త్వరగాలేచుట, ప్రాణములేనివానితోమాటలాడుట, కారణములేకనవ్వుట, మొదలయినవిగనుగుసు. ... ✱

ఇష్టనాశోన్మాదో యథా.

శ్లో॥ఇష్టనాశకృతోన్మాదె భస్మాదిపరిలేపనం॥ ౨౧౯

నృత్తగీతాదిరచనా తృణాదేర్మాల్యధారణం।

అత్రోన్మాదెపిసకలా ప్రాగుక్తావిక్రియామతాః॥౨౨౦

తా॥ ఇష్టనాశోన్మాదమందుభస్మము మొదలయినవానినిబూసికొనుట,నృత్తము గీతము మొదలయినవిచేయుట, తృణము మొదలయినవానిదండలనుధరించుట,ఇవియునువియోగజోన్మాదమందుజెప్పినక్రియలునుగలుగును. ... ✱

మరలక్షణం.

శ్లో॥వారొర్ధనంజయస్యాపి విప్రయోగోమహాత్మనః।

శరీరావచ్ఛేదవతో మరణంనామతద్భవేత్॥౨౨౧

ఏతచ్చద్వివిధంప్రోక్తం వ్యాధిజంచాభిఘాతజం।

తా॥ సర్వాంగవ్యాపిగానుండుధనంజయవాయువుయొక్కనిర్గమముమరణమనబడును. ఈమరణము వ్యాధిజమని,అభిఘాతజమని,ఇరుదెఱగులౌను. ✱

వ్యాధిజమరణంయథా.

శ్లో॥ఆద్యేత్వసాధ్యహృచ్ఛూలా విషూచ్యాదిసముద్భవె॥౨౨౨॥అనుభావా అమీప్రోక్తా అవ్యక్తాక్షరభాషణం। వివర్ణగాత్రతామంద శ్వాసోక్తిస్తంభమీలనాః॥౨౨౩॥హిక్కాపరిజనాపేక్షా నిశ్చేష్టేంద్రియతాదయః।

తా॥ అసాధ్యమైనహృద్రోగమువిషూచిమొదలయిన వానిచేతగలుగువ్యాధిజమరణమందుకొతుకుచుమాటలాడుట,దేహకాంతిమాఱిపోవుట, మెల్లగాశ్వాసమువిడుచుట, మాటనిలిచిపోవుట, నేత్రమీలనము,హిక్క,పరిజనములనపేక్షించుట,ఇంద్రియచేష్టలణగుట,మొదలయినవిగలుగును. ... ... ✱

అభిఘాతమరణంయథా.

శ్లో॥ద్వితీయంఘాతపతన దేహోద్బంధవిషాదిజం॥ ౨౨౪॥ తత్రఘాతభవే భూమి పతనక్రందనాదయః।విషంతువత్సనాభాద్య మష్టావేతాస్తదుద్భవాః॥౨౨౫॥కార్శ్యకంపోదాహో హిక్కాఫేనశ్చకంధరాభంగః। జడతామృతిరితిఢిఠితాః పతనాద్యభిఘాతజాశ్చేష్టాః॥ ౨౨౬ ✱

తా॥ ఘాతము, పడుట, దేహబంధనము, విషము, వీనిచేగలుగునదియభిఘాతజమరణము. అందు ఘాతజమందునేలబడుట, ఏడ్చుట, మొదలయినవి. వసనాభిమొదలయినదివిషము. పతనాదులయినయభిఘాతమువలనగలుగుచేష్టలు చిక్కిపోవుట, వణకుట, తాపము, హిక్క,ఫేనము,కంధరాభంగము, జడత,మరణము,మొదలయినవి. ✱

త్రాసలక్షణం.

శ్లో॥ త్రాసస్స్యాచ్చిత్తచాంచల్యం విద్యుత్క్రవ్యాదగర్జితైః। తథాభూతభుజంగాద్యైర్వీక్షేయా స్తత్రవిక్రియాః॥ ౨౨౬ ॥ ఉత్కంపగాత్రసంకోచ రోమాంచ స్తంభగద్గదాః। ముహుర్నిమేషోవిభ్రాంతి పార్శ్వస్థాలంబనాదయః॥ ౨౨౭ ... ... *

తా॥ మెఱపు, రాక్షసులు, ఉరుము, పిశాచము, సర్పము మొదలైనవానిచే గలుగు చిత్తచాంచల్యము త్రాసమనబడును. ఇందు ఉత్కంపము, దేహసంకోచము, రోమాంచము, స్తంభము, గద్గదము, అడుగడుగునకు ఱెప్పపాట్లు, భ్రమ, ప్రక్కనుండువారి నిపట్టుకొనుట, మొదలైనవి గలుగును. ... ... *

వితర్కలక్షణం.

శ్లో॥ ఊహోవితర్కస్సందేహ విమర్శప్రత్యయాదిభిః।
జనితోనిర్ణయోర్థస్య అసత్యస్సత్యఏవచ॥ ౨౨౮
అత్రానుభావాస్స్యురమీ భ్రూశిరఃకంపనాదయః।

తా॥ సందేహము, నిశ్చయము, మొదలైనవానిచే గలుగు ఊహాత్మకమును సత్యాసత్యనిర్ణయము, వితర్కమనబడును. దీనియందు కనుబొమలెగురవేయుట, తలయూడించుట మొదలయిన యనుభావములు గలుగును. ... ... *

శ్లో॥ ఉత్తమాధమమధ్యేషు సాత్వికవ్యభిచారిణః॥ ౨౩౦
విభావాఅనుభావాశ్చ వర్ణనీయాయథోచితం।

తా॥ ఉత్తమ అధమ మధ్యమ స్వభావముగలవారియందు విభావానుభావసాత్వికభావవ్యభిచారిభావములు యథోచితముగ వర్ణింపదగినవి. ... *

శ్లో॥ స్వాతంత్ర్యాత్పారతంత్ర్యాచ్చ ద్వివిధావ్యభిచారిణః॥ ౨౩౧
పరపోషకతాంప్రాప్తాః పరతంత్రాఇతీరితాః।
తదభావేస్వతంత్రాస్స్యుః భావాఇతిచతేస్మృతాః॥ ౨౩౨

తా॥ వ్యభిచారిభావములు స్వాతంత్ర్యపారతంత్ర్యములవలన ఇరుదెఱగులౌచున్నవి. ఇతరపోషణమును బొందినపుడు పరతంత్రములనియును, అటులేకున్నపుడు స్వతంత్రములనియును జెప్పబడును. ... ... *

వ్యభిచారిభావానాందశాచతుష్టయలక్షణం.

శ్లో॥ ఉత్పత్తిసంధిశాబల్య శాంతయోవ్యభిచారిణాం। దశాశ్చతస్రస్స్యుస్తేషాముత్పత్తిర్భావసంభవః॥ ౨౩౩ ॥ సరూపమసరూపంవా భిన్నకారణకల్పితం। భావద్వయంమిళతిచేత్సంధిరిత్యభిధీయతే ॥ ౨౩౪ ॥ శబళత్వంహిభావానాం సంమర్దస్స్యాత్పరస్పరం। అత్యారూఢస్యభావస్య విలయశ్శాంతిరుచ్యతే॥ ౨౩౫ ... ... *

తా॥ ఉత్పత్తియని, సంధియని, శాబల్యమని, శాంతియనియు, వ్యభిచారిభావముల

కు నాలుగవస్థలుగలవు. ఇందు ఉత్పత్తియనునదిభావముగలుగుట. సరూపములైనను, అసమానరూపములైనను, భిన్నకారణములచేతకల్పితములైనరెండుభావములుచేరెనేని సంధియనబడును. భావములుఒకదానినొకటియొరయుట శబళత్వమనబడును. అత్యారూఢమైనభావముయొక్క లయముశాంతియనబడును. *

శ్లో॥ ఆభాసతాభవేదేషా మనౌచిత్యప్రవర్తనం।
అసత్యత్వాదయోగ్యత్వా దనౌచిత్యంద్విధామతం॥ ౨౩౬

తా॥ ఈభావములకుఅనౌచిత్యప్రవర్తనముఆభాసతయనబడును. ఆయనౌచిత్యము అసత్యానౌచిత్యమనియు,అయోగ్యానౌచిత్యమనియు,ఇరుదెఱగులౌను. *

అనౌచిత్యద్వితయలక్షణం.

శ్లో॥ అసత్యత్వకృతంతత్స్యా దచేతనగతంతుయత్।
అయోగ్యత్వకృతంప్రోక్తం నీచతిర్యగ్జదాశ్రయం॥ ౨౩౭

తా॥ అచేతనగతమైయుండునది అసత్యముచేతజేయబడినదియగును. నీచతిర్యగ్జదాశ్రయమైయుండునది అయోగ్యత్వకృతమనిచెప్పబడును. *

అథస్థాయినోనిరూప్యంతే.

శ్లో॥ సజాతీయైర్విజాతీయై ర్భావైర్యేత్వతిరస్కృతాః। క్షీరాబ్ధివన్నయం
త్యన్యాన్ స్వాత్మత్వంస్థాయినోహితే॥ ౨౩౮॥ తేత్వష్టావితివిజ్ఞేయా
స్థాయినోమునిసంమతాః। రత్యుత్సాహౌచశోకశ్చ విస్మయశ్చతతః
పరం॥ ౨౩౯ ॥ హాసోభయజుగుప్సేచ క్రోధోనాట్యేప్రకీర్తితాః।

తా॥ సజాతీయవిజాతీయభావములచేత అతిరస్కృతములై క్షీరసముద్రమువలెనే ఇతరభావములనుస్వాత్మత్వమునుబొందించుకొనునవిస్థాయిభావములు. అవియెనిమిదివిధములని ఋషులచేనొప్పబడినవి. వానిపేళ్లువివరింపబడుచున్నవి. రతి,ఉత్సాహము, శోకము, విస్మయము,హాసము,భయము,జుగుప్స,క్రోధము- ఇవినాట్యమందుజెప్పబడినవి.

రతిస్థాయిలక్షణం.

శ్లో॥ యానోరన్యోన్యవిషయా స్థాయినీచ్ఛారతిర్భవేత్॥ ౨౪౦॥ నిసర్గేణాభియోగేన సంసర్గేణాభిమానతః। ఆత్మోపమాదివిషయై రేతాస్స్యు
స్తత్రవిక్రియాః॥ ౨౪౧॥ కటాక్షపాతభ్రూక్షేప ప్రియవాగాదయోపిచ।

తా॥ స్వభావము, సహవాసము,సంబంధము, అభిమానము, ఆత్మోపమాదివిషయములు.వీనిచేతనాయికానాయకులమనసునగలుగుఅన్యోన్యవిషయమైన ఇచ్ఛావిశేషము రతిస్థాయియగును. అందు కడగంటిచూపు, కనుబొమలెగురవేయుట,ప్రియవాక్యముమొదలైనవిగలుగును. ... ... *

శ్లో॥ అంకురపల్లవకలికా ప్రసూనఫలభావభాగయంక్రమశః॥ ౨౪౨
ప్రేమామానఃప్రణయః స్నేహోరాగోనురాగఇతి।

తా॥ వరుసగమొలక, చిగురు,మొగ్గ,పుష్పము, ఫలమును, పోలిస్థాయిభావము-

ప్రేమయని, మానమని, ప్రణయమని, స్నేహమని, రాగమని, అనురాగమనియు, ఈపే ళ్లనుబొందుచున్నది.

ప్రేమలక్షణం.

శ్లో॥ సప్రేమా ప్రేమసహితం యూనోర్యద్భావబంధనం॥ ౨౪౩

తా॥ నాయికానాయకులప్రీతిసహితమైనమనస్సులకలయిక ప్రేమయనబడును.

మానలక్షణం.

శ్లో॥ యత్తుప్రేమానుబంధేన స్వాతంత్ర్యాద్ధృదయంగమం।
బధ్నాతిభావకౌటిల్యం సమానఇతిగీయతే॥ ౨౪౪

తా॥ నాయికానాయకులకు ప్రేమబంధముచేతిస్వాతంత్ర్యమువలనగలుగు భావ కౌటిల్యముమానమనబడును. ... ...

ప్రణయలక్షణం.

శ్లో॥ బాహ్యాంతరోపచారైర్యస్తే ప్రేమమానోపకల్పితైః।
బధ్నాతిభావవిస్రంభం సోయంప్రణయఉచ్యతే॥ ౨౪౫

తా॥ నాయికానాయకులమానోపకల్పితములైన బాహ్యాంతరోపచారములచేతభా వవిస్రంభమునుగలగజేయుప్రేమప్రణయమనబడును.

స్నేహలక్షణం.

శ్లో॥ విస్రంభేపరమాంకాష్ఠా మారూఢేదర్శనాదిభిః।
యత్రద్రవత్యంతరంగం సస్నేహఇతికథ్యతే॥ ౨౪౬
సత్రేధాకథ్యతేప్రౌఢ మందమధ్యమభేదతః।

తా॥ నాయికానాయకులవిస్రంభముచూపుమొదలైనవానిచేతపూర్ణముకాగాఏద శయందుమనసుకఱగుచున్నదో యదిస్నేహమనబడును. ఆస్నేహము ప్రౌఢస్నేహమ నియు, మందస్నేహమనియు, మధ్యస్నేహమనియు, ము త్తెఱగులజెప్పబడినవి.

ప్రౌఢస్నేహలక్షణం.

శ్లో॥ ప్రభోనాదిభిరజ్ఞాత చిత్తవృత్తౌప్రియేజనే॥ ౨౪౭
ఇతరక్లేశకారీయః సప్రౌఢస్నేహఉచ్యతే।

తా॥ తోఁచుటమొదలైనవానిచేతనెఱుగబడనిచిత్తవృత్తిగలనాయకునియందు ఇత రక్లేశకారియైనస్నేహము ప్రౌఢస్నేహమనబడును. ...

మందస్నేహలక్షణం.

శ్లో॥ ద్వయోరన్యస్యమానాదౌ తదన్యస్యకరోతియః॥ ౨౪౮
నైవాపేక్షాంనచోపేక్షాం సస్నేహోమందఉచ్యతే।

తా॥ నాయికానాయకులలోఒకరికికోపము మొదలైనదికలిగియున్నప్పుడు రెండవ వారికిఉపేక్షాపేక్షలనుజేయకయుండునదిమందస్నేహమనబడును.

మధ్యస్నేహలక్షణం.

శ్లో॥ ఇతరానుభవాపేక్షా మీక్షతేయస్సమధ్యమః॥ ౨౪౯

తా॥ ఇతరానుభవాపేక్షనుయెదురుచూచుచున్నదిమధ్యమస్నేహమనబడును.

రాగలక్షణం.

శ్లో॥దుఃఖమప్యధికంచిత్తే సుఖత్వేనైవరజ్యతే।
యేనస్నేహప్రకర్షేణ సరాగఇతికథ్యతే॥ ౨౫౦
కుసుంభనీలమాంజిష్ఠ రాగభేదేనసత్రిధా।

తా ॥ ఏస్నేహాతిశయమువలనమనసునదుఃఖమునుసుఖమువలెనేతోచుచున్నదో యదిరాగమనబడును. ఆరాగము కుసుంభరాగమనియు, నీలరాగమనియు, మాంజిష్ఠరాగమనియు,ము త్తెఱగులౌను. ...

కుసుంభరాగలక్షణం.

శ్లో॥కుసుంభరాగస్సక్షిప్రమో యశ్చిత్తేరజ్యతేక్షణాత్ ॥ ౨౫౧
అతిప్రకాశమానోపి క్షణాదేవవినశ్యతి।

తా॥ ఏరాగముమనసునక్షణకాలమునసేకలుగునదియును,అధికముగప్రకాశించుచున్నదైనను,తత్క్షణమేమాఱునదియగునో,అదికుసుంభరాగమనబడును.

నీలరాగలక్షణం.

శ్లో॥నీలరాగస్తుయస్సక్తో నాపైతినచదీప్యతే॥ ౨౫౨

తా॥ ఏది మనసునసక్తమై మాఱకుండను,ప్రకాశించకుండను,ఉన్నదో యది నీలరాగమనబడును.

మాంజిష్ఠరాగలక్షణం.

శ్లో॥అచిరేణైవసంసక్త శ్చిరాదపిననశ్యతి।
అతీవభాసతేయోసౌ మాంజిష్ఠారాగఉచ్యతే॥ ౨౫౩

తా॥ఏది చిత్తమందుత్వరగసంసక్తమైయెన్నటికినిమాఱక ప్రకాశించుచున్నదో యది మాంజిష్ఠరాగమనబడును. ... ...

అనురాగలక్షణం.

శ్లో॥రాగఏవస్వసంవేద్య దశాప్రాప్త్యాప్రకాశితః।
యావదాశ్రయవృత్తిశ్చే దనురాగఇతీరితః॥ ౨౫౪
అన్యేప్రీతింరతేర్భేద మామనంతిమనీషిణః।

తా ॥ ముందుచెప్పినరాగమేతనసంవేద్యదశనుపొందుటచేతప్రకాశితమై ఆశ్రయముందువఱకుఉండెనేని యది అనురాగమనబడును. కొందఱుప్రీతినిరతిభేదమనిచెప్పుదురు.

ఉత్సాహస్థాయిలక్షణం.

శ్లో॥శక్తిధైర్యసహాయాద్యై శ్శీలశ్లాఘ్యేషుకర్మసు॥ ౨౫౫॥ సత్వరామానసీవృత్తి రుత్సాహస్తత్రవిక్రియాః। కాలాద్యవేక్షణంధైర్య త్యాగారంభాదయోపిచ ॥ ౨౫౬ ॥ సహజాహార్యభేదేన సద్విధాపరికీర్తితః।

తా॥శీలశ్లాఘ్యములైనకార్యములయందు శక్తి, ధైర్యము, సహాయము, మొదలైనవానిచేతత్వరగాప్రవర్తించుమనోవ్యాపారము – ఉత్సాహస్థాయియగును. అందుస

మయమును చూచుట, ధైర్యము, త్యాగము, ఆరంభము, మొదలైనవి గలుగును. ఇది సహజోత్సాహస్థాయియనియు, ఆహార్యోత్సాహస్థాయియనియు, ఇరుదెఱగులౌను.

శోకస్థాయిలక్షణం.

శ్లో॥ బంధువ్యాపత్తిదౌర్గత్య ధననాశాదిభిఃకృతః ॥ ౨౫౭
చిత్తక్లేశకరశ్శోక స్తత్రచేష్టావివర్ణతా।
బాష్పద్రమోముఖశోష స్తంభనిశ్వసితాదయః॥ ౨౫౮

తా॥ బంధువిషయమైనవిపత్తు, దుర్గతి, ధననాశము, మొదలైనవానిచేగలుగు చిత్తక్లేశకరమైనవృత్తి శోకస్థాయియనబడును. అందు దేహకాంతిమాఱుట, కన్నీరుకలుగుట, ముఖమువాడుట, స్తంభము, నిట్టూర్పు మొదలైనవిగలుగును.

విస్మయస్థాయిలక్షణం.

శ్లో॥ లోకోత్తరపదార్థానా మపూర్వాలోకనాదిభిః।
విస్తారశ్చేతసోయస్తు విస్మయస్సనిగద్యతే॥ ౨౫౯
క్రియాస్తత్రాక్షివిస్తారో సాధూక్తిపుళకాదయః।

తా॥ లోకోత్తరమైనపదార్థములను అపూర్వముగజూచుట, వీనిచేగలుగుమనోవిస్తారము విస్మయస్థాయియనబడును. ఇందు నేత్రవైశాల్యము, శ్లాఘించుట, పులకరింపు మొదలైనక్రియలుగలవు. ... ...

హాసస్థాయిలక్షణం.

శ్లో॥ భాషణాకృతివేషాణాం క్రియాయాయాశ్చవికారతః॥ ౨౬౦ ॥ లౌల్యాదేవపరస్థానా మేషామనుకృతెరపి। వికారశ్చేతసోహాస స్తత్రచెష్టాస్సమీరితాః॥ ౨౬౧॥ దృష్టేర్వికాసోనాసోష్ఠ కపోలస్పందనాదయః।

తా॥ పలుకులు ఆకారము వేషము పని వీనివికారముచేతను, ఇవిపరస్థశవాసులవైనయెడసహజముగాఁ ఉండినను, వెక్కిరించుటచేతను, గలుగుమనోవికారము హాసస్థాయియనబడును. ఇందు వికారపుచూపు, ముక్కు పెదవి, చెక్కిళ్లు వీనికదలిక, మొదలైనవిగలుగును. ...

భయస్థాయిలక్షణం.

శ్లో॥ భయంతుమంతునాఘోర దర్శనశ్రవణాదిభిః ॥ ౨౬౨॥ చిత్తస్యాతీవ చాంచల్యం తత్ప్రియోనీచమధ్యయోః। ఉత్తమస్యతుజాయేత కరణైరతికారణైః॥ ౨౬౩ ॥ అనుభావోభవేత్కంప ముఖసంశోషణాదిభిః।

తా॥ ఆకస్మికముగాభయంకరవస్తువులనుజూచుట వినుట మొదలైనవానిచేతను, తప్పిదముచేతను, గలుగు మిక్కిలిచిత్తచాంచల్యము భయస్థాయియనబడును. ఇది ఉత్తమ మధ్యమ నీచాశ్రయమైయుంటే ౩ తెఱగులౌను. దీనిని వణకుట, ముఖమువాడుట, మొదలైనవానిచే నెఱుగవచ్చును. ... ...

జుగుప్సాస్థాయిలక్షణం.

శ్లో॥ అహృద్యానాంపదార్థానాం దర్శనశ్రవణాదిభిః॥ ౨౫౪॥ మనస్సంకోచనంయత్సా జుగుప్సాతత్రవిక్రియాః। నాసాపిధానంత్వరితా గతిరాస్యవిఘూర్ణనం॥ ౨౫౫॥ సర్వాంగధూననంకుత్సా ముహుర్నిష్ఠీవనాదయః।

తా॥ అరోగ్యవస్తువులను చూచుట వినుట మొదలైనవానిచేగలుగుమనస్సంకోచముజుగుప్సాస్థాయియనబడును. ముక్కుమూసికొనుట, వేగముగబోవుట, ముఖమునువంకరచేసికొనుట, సర్వాంగధూననము, అసహ్యపడుట, మాటిమాటికిఉమ్మివేయుట, మొదలైనవిగలుగును. ...

క్రోధస్థాయిలక్షణం.

శ్లో॥ భవేత్ప్రజ్వలనంక్రోధః పురాక్షేపాదిసంభవః॥ ౨౫౬

ఫుల్లనాసాపుటోద్వృత్త తారకాద్యనుభావయుక్।

శత్రుభృత్యసుహృత్పూజ్యాశ్చత్వారోవిషయామతాః॥ ౨౫౭

తా॥ పురాక్షేపాదులచేగలుగుమనఃప్రజ్వలనము క్రోధస్థాయియనబడును. ఇది ఫుల్లనాసాపుటము, గిరగిరతిరుగునల్లగ్రుడ్లు, మొదలైనఅనుభావములనుగలదై యుండును. దీనికి శత్రువులు, భృత్యులు, స్నేహితులు, పూజ్యులు, ఈనలుగురువిషయులనబడుదురు.

శత్రువిషయక్రోధోయథా.

శ్లో॥ ముహుర్దష్టోష్ఠతాభంగో భ్రుకుట్యాదంతఘట్టనం।

హస్తనిష్పీడనంగాత్ర ప్రకంపోస్త్రస్యవీక్షణం॥ ౨౫౮

స్వభుజాపేక్షణంకంఠ గర్జాద్యాశ్శత్రవక్రుధి।

తా॥ శత్రువిషయక్రోధమందు అడుగడుగునకుపెదవులుకొఱుకుకొనుట, కనుబొమలువంకరయవుట, పండ్లుకొఱుకుట, చేతులనుపిసుకుకొనుట, దేహమువణకుట, అస్త్రమునుజూచుట, తనభుజములనుజూచుకొనుట, గర్జించుట, మొదలైనవిగలుగును.

భృత్యవిషయక్రోధోయథా.

శ్లో॥ భృత్యక్రోధేతుచేష్టాస్స్యు నేత్రాంతపతదశ్రుతా॥ ౨౫౯

తూష్ణీంధ్యానంచనైశ్చల్యం శ్వసితాన్నిముహుర్ముహుః।

మౌనంవినమ్రముఖతా భుగ్నదృష్ట్యాదయోమతాః॥ ౨౬౦

తా॥ భృత్యక్రోధమందు కన్నీరుకారుట, ఊరకధ్యానించుట, కదలకయుండుట, అడుగడుగునకునిట్టూర్పులువిడుచుట, మాటలాడకయుండుట, తలవంచుకొనుట, భుగ్నదృష్టి, మొదలైనవిగలుగును. ... ...

మిత్రక్రోధోయథా.

శ్లో॥ మిత్రక్రోధేతుచేష్టాస్స్యుః భావగర్భవిభూషణం।

భ్రూభేదనిటలస్వేద కటాక్షారుణిమాదయః॥ ౨౬౧

తా॥ మిత్రక్రోధమందు భావగర్భముగభాషించుట, కనుబొమ్మలు భేదపడుట, నొసటచెమటగలుగుట, కన్నులు ఎఱ్ఱనౌట, మొదలైనవిగలుగును.

పూజ్యక్రోధోయథా.

శ్లో॥ పూజ్యక్రోధతుచేష్టాస్స్యుస్స్వనిందానమ్రవక్త్రితా।
అనుత్తరప్రదానాంగ స్వేదగద్గదతాదయః॥ ౨౨౨

తా॥ పూజ్యక్రోధమందు తన్నుతానునిందించుకొనుట, తలవంచుకొనుట, ప్రత్యుత్తరముచెప్పకుండుట, దేహమునచెమటగలుగుట, కంఠగద్గదము మొదలైనవిగలుగును.

శ్లో॥ భృత్యాదికోపత్రితయేతత్తతోక్తాః ప్రోదితాః క్రియాః। మిథఃస్త్రీపుంసయో రేవ రోషస్త్రీస్సగోచరః పునః ॥ ౨౨౩ ॥ ప్రత్యయావధిరత్రాస్యుః వికారాః కుటిలేక్షణం । అధరస్ఫురణాపాంగ రాగనిశ్వసితాదయః ॥ ౨౨౪

తా॥ భృత్యాదిక్రోధత్రితయమందును దానిదానికిజెప్పబడినక్రియలు దానిదానికి కలుగును. మిత్రక్రోధాంతర్గతమైన స్త్రీపురుషులకోపములయందు స్త్రీమీదిపురుషకోపము ప్రత్యయముగలుగునంతవఱకునుండును. ఇందు వంకరచూపు, పెదవులదరుట, కడగన్నులెఱ్ఱనౌట, నిశ్వాసములు మొదలైనవిగలుగును.

శ్లో॥ ద్వేధానిగదితస్త్రీస్సణాం రోషఃపురుషగోచరః। సపత్నీరోషహేతుస్స్యా దన్యస్స్యాదన్యహేతుకః॥ ౨౨౫॥ సపత్నీహేతుకోరోషః విప్రలంభేప్రపంచ్యతే। అన్యహేతుకృతేత్వత్ర క్రియాః పురుషరోషవత్ ॥ ౨౨౬

తా॥ పురుషవిషయమైనస్త్రీకోపము సపత్నీహేతుకమనియు, అన్యహేతుకమనియు, ఇరుదెఱగులౌను. సపత్నీహేతుకమైనరోషము విప్రలంభమందు జెప్పబడుచున్నది. అన్యహేతుకృతరోషమందు పురుషరోషమందుగలక్రియలుగలుగును.

శ్లో॥ ఏతేచస్థాయినస్సర్వే విభావైర్వ్యభిచారిభిః। సాత్వికైరనుభావైశ్చ నటాభినయగోచరాః ॥ ౨౨౭॥ సాక్షాత్కారమివానీతాః ప్రాపితాస్స్వాదురూపతాం। సామాజికానాంమనసి ప్రయాంతిరసరూపతాం॥ ౨౨౮

తా॥ విభావ వ్యభిచారిభావ సాత్వికానుభావ వ్యాపారరూపానుభావములచే సాక్షాత్కారమునుబొందింపబడినట్లు అభినయగోచరములై స్థాయిభావములు స్వాదురూపతనుబొందింపబడి సామాజికులమనసునరసభావమునుబొందుచున్నవి.

శ్లో॥ దధ్యాదివ్యంజనైశ్చించా మరీచ్యాదిభిరౌషధైః। గుడాదిమధురద్రవ్యై ర్యథాయోగ్యంసమన్వితైః॥ ౨౨౯ ॥ యథాపాకవిశేషైశ్చ నిష్పాద్యో రసభోదనః। నిష్పాద్యతేవిభావాద్యైః ప్రయోగేణతథారసః॥ ౨౩౦ సోయమానందసంభేదో భావకైరనుభూయతే। ...

తా॥ యథాయోగ్యముగకూడినపెరుగు మొదలైనవ్యంజనములచేతను, చింతపండు మిర్యాలుమొదలయినయౌషధములచేతను, బెల్లము మొదలయినమధురపదార్థములచే

లేను, పాకభేదములచేతను, అన్నమునకురసమెట్లుకలుగుచున్నదో అట్లువిభావాదిభావములచేతను, ప్రయోగముచేతను, రసమునిష్పన్నమగుచున్నది. రసమనునదిమనస్సుచేనెఱుగదగినసుఖవిశేషము. అదిభావజ్ఞులచేఆస్వాదింపబడుచున్నది. *

రసభేదానాహ.

శ్లో॥ శృంగారవీరకరుణాద్భుతహాస్యభయానకాః॥౫౧

భీభత్సశ్చతథారౌద్రో నాట్యేత్వష్టరసాస్మృతాః।

తా॥ శృంగారము, వీరము, కరుణము, అద్భుతము, హాస్యము, భయానకము, భీభత్సము, రౌద్రము, అని నాట్యమందుఎనిమిదిరసములుచెప్పబడుచున్నవి. *

శృంగారరసలక్షణం.

శ్లో॥ రసేషుతత్రశృంగారః ప్రథమంవక్ష్యతేస్ఫుటం॥౫౨॥ విభావైరనుభావైశ్చ సాత్వికైర్వ్యభిచారిభిః। నీతాసదస్యరస్యత్వం రతిశ్శృంగారఉచ్యతే॥౫౩॥ నాయికానాయకోవాపి తత్రచాలంబనంమిథః। రూపయౌవనలావణ్య కులశీలాదితద్గుణైః॥౫౪॥ వాగ్భిశ్చమధురాలాప గీతకర్మకలాదిభిః। చేష్టాభిర్భుజవిక్షేప కటాక్షహసితాదిభిః॥౫౫॥ అలంకారైస్స్రగాలేప దుకూలకటకాదిభిః। తటస్థైశ్చంద్రదీపాద్యైః భావైరుద్దీపితాత్మతః॥౫౬॥ కాంతదృష్టిప్రసన్నాస్య రాగాద్యైరాంగికైరపి। వాచికైర్మధురాలాప గుణసంకీర్తనాదిభిః॥౫౭॥ సాత్వికస్తంభకంపాద్యైరనుభావైఃప్రకాశితా। ఔత్సుక్యచింతాహర్షాద్యైస్సంపుష్టాసహకారిభిః॥౫౮॥ యారతిస్థాయినీసైవ భావాద్యైరభిరంజితా। రస్యమానాసహృదయై ర్యాతిశృంగారతామియం॥౫౯ *

తా॥ క్రిందజెప్పినయెనిమిదిరసములలోమొదటశృంగారరసముచెప్పబడుచున్నది. విభావానుభావ వ్యభిచారిసాత్విక భావములచే సదస్యస్వాద్యత్వమును బొందిన రతిస్థాయిభావముశృంగారరసమనిచెప్పబడును. ఆరతిస్థాయి నాయికానాయకులను ఆలంబనముగగలది. రూపము యౌవనము లావణ్యము కులము శీలము మొదలయిననాయికానాయకులగుణములచేతను, మధురమైనపలుకులచేతను, సంగీతవిద్యమొదలయినవానిచేతను, భుజవిన్యాసము కటాక్షము హాసముమొదలయినవానిచేతను, చేష్టలచేతను, పుష్పము గంధము వస్త్రము హస్తాభరణము మొదలయినఅలంకారములచేతను, చంద్రదీపాదులయినతటస్థభావములచేతను, మరలఉద్దీపితమైచక్కనిచూపుప్రసన్నముఖరాగము మొదలయిన ఆంగికములచేతను, మధురాలాపము గుణకీర్తనము మొదలయినవాచికములచేతను, స్తంభకంపాదులయిన సాత్వికానుభావములచేతను, ప్రకాశితమైఔత్సుక్యము చింత హర్షము మొదలయినసహకారులచేతను, పోషింపబడినఆరతియేభావములచేరంజితమై రసికులచేఆస్వాద్యమానమైశృంగారరసమనుపేరుపొందుచున్నది.

తంవిభజతే.

శ్లో॥ విప్రలంభశ్చసంభోగ ఇతిసద్వివిధాభవేత్॥

తా॥ ఆశృంగారరసము విప్రలంభశృంగారమనీ, సంభోగశృంగారమని రెండువిధములౌను.

విప్రలంభంలక్షయతి.

శ్లో॥ అప్రాప్తిర్విప్రలంభస్స్యాద్యూనో ర్జాతాభిలాషయోః॥ ౫౦॥ పాండిమగ్లానిదృష్ట్యాద్యా అనుభావాఇహస్మృతాః। హర్షగర్వజుగుప్సోగ్ర్యమదహాసశమైర్వినా ॥ ౫౧ ॥ అన్యేసంచారిణస్సర్వే భవంత్యత్రయథోచితం॥ ... ... *

తా॥ అత్యంతాసక్తిగల నాయికానాయకులకు పరస్పరముచేరికలేకయుండుట విప్రలంభమనబడును. ఇందువిరహపాండిమము, సోలినచూపు మొదలైనవిగలుగును. హర్షము, గర్వము, జుగుప్స, ఉగ్రభావము, మదము, హాసము, శమము, ఇవివినా కడమసంచారిభావములన్నియును ప్రకృతానుగుణముగగలుగును. ... *

విప్రలంభంవిభజతే.

శ్లో॥ అయోగోవిరహోమానః ప్రవాసశ్శాపఇత్యపి॥ ౫౨
విప్రలంభస్యపంచైతే హేతవఃపరికీర్తితాః॥

తా॥ అయోగము, విరహము, మానము, ప్రవాసము, శాపము అని విప్రలంభమునకుఅయిదు హేతువులుగలవు. ... ... ... *

అయోగవిప్రలంభశృంగారలక్షణం.

శ్లో॥ ప్రాగసంగతయోర్యూనో రనురాగేపిజాగ్రతి ॥ ౫౩ ॥ అయోగః పారతంత్ర్యాద్యైర్విప్రలంభోభిలాషజః। ప్రవేశనిర్గమౌతూష్ణీంతద్దృష్టిపథగామితా ॥ ౫౪॥ రాగప్రకాశనపరాశ్చేష్టాస్స్వాత్మప్రకాశనం। వ్యాజోక్తయశ్చవిజనే స్థితిరిత్యాదయోపిచ ॥ ౫౫ ॥ తత్రసంచారిణోగ్లానిశంకాసూయాభ్రమోభయం। నిర్వేదౌత్సుక్యదైన్యానిచింతా నిద్రాప్రబుద్ధతా ॥ ౫౬ ॥ విషాదజడతోన్మాదా మోహోమరణమేవచ। తత్తత్సంచారిభావానాముచితాపిదశాభవేత్ ॥ ౫౭ ॥ క్రమేణప్రాప్తినైరస్య దశావస్థాస్సమాసతః। ప్రోక్తాస్తదనుసారేణభరతేన మహాత్మనా ॥ ౫౮॥ ... ... *

తా ॥ అతిప్రేమగల నాయికానాయకులకు ప్రథమసమాగమమునకుమునుపుగలవిప్రలంభము అయోగవిప్రలంభమనబడును. ఇందునాయకునిజూచియింటిలోపలబోవుట, బయటవచ్చుట, ఊరకఅతనిచూపునకగపడుట, తనఆసనుబయలుపఱచుచేష్టలు, తనదేహమునుప్రకాశపఱచుట, వ్యాజోక్తులు, నిజనస్థలమందుండుట మొదలైనవిగలవు- గ్లానియు, శంకయు, అసూయయు, భ్రమము, భయము, నిర్వేదము, ఔత్సుక్యము, దైన్యము, చింత, నిద్ర, ప్రబోధము, విషాదము, జాడ్యము, ఉన్మాద

ము, మోహము, మరణము, ఈవ్యభిచారిభావములకుయథోచితముగ ప్రవేశముగలదు. ఈయయోగవిప్రలంభమునకు దశావస్థలుగలవని ప్రాచీనులమతమునను సరించి భరతునిచేతనుం జెప్పబడినవి. ... ... ... •

దశావస్థానిరూపయతి.

శ్లో॥ చక్షుఃప్రీతిశ్చింతా సంకల్పో గుణనుతిః క్రియాద్వేషః।
తాపో లజ్జాత్యాగో న్మాదౌ మూర్ఛా మృతిర్దశావస్థాః॥ ౨౯౯

తా॥ చక్షుఃప్రీతి, చింత, సంకల్పము, గుణనుతి, క్రియాద్వేషము, తాపము, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మృతి అనునవి పదియవస్థలు. ... •

చక్షుఃప్రీతిలక్షణం- ౧టిది.

శ్లో॥ చక్షుఃప్రీతిస్స్యా ద్రమ్యే దృష్టేవాలంబనే శ్రుతే।
కౌతుకస్వేదరోమాంచ హర్షవిస్మయసాధ్వసైః॥ ౩౦౦
చాపలస్తంభలజ్జాద్యై రనుభావ్యోఽభవేదయం॥

తా॥ రమ్యమైన ఆలంబనము వినబడినదిగాని, చూడబడినదిగాని కాగాదానియందుగలిగినఇచ్ఛ చక్షుఃప్రీతియనబడును. ఇది సంతోషము, పులకరింపు, హర్షము, సాధ్వసము, చాపలము, స్తంభము, సిగ్గు మొదలైనవానిచేతభావింపదగినది. •

చింతాలక్షణం- ౨వది.

శ్లో॥ కేనోపాయేన సంసిధ్యే త్కదా తేన సమాగమః॥ ౩౦౧॥ దూతీముఖేన కిం వాచ్య మిత్యాద్యూహో విచింతనం। అత్రానుభావానిశ్వాసధ్యానస్రస్తాంగతాదయః ॥ ౩౦౨ ॥ వలయాదిపరామర్శ స్వేదాంబుపులకాదయః। శయ్యాసనాదివిద్వేష ఇత్యాద్యాస్స్మరకల్పితాః॥ ౩౦౩॥ నిర్లక్ష్యవీక్షణంచైవ మాద్యాస్స్యుర్విక్రియామతాః ॥ •

తా॥ కోరిక ఏయుపాయముచేత ఈడేరును అతనితోడ ఎప్పుడుకూడికకలుగును చెలులతో ఏమిచెప్పిపంపవచ్చును అని ఊహించుటచింతయనబడును. ఇందునిట్టూర్పు, ధ్యానము, దేహముసోలుట, హస్తాభరణాదులను చేతితో తడవుట, చెమట, పులకరింపు, శయ్యాసనాదులయందు విద్వేషము, నిర్లక్ష్యవీక్షణము మొదలైనవిగలుగును.

సంకల్పావస్థాలక్షణం- ౩వది.

శ్లో॥ మనోరథస్స్యాత్సంకల్ప స్తత్సమాగమగోచరః॥ ౩౦౪
ఔత్సుక్యస్వేదరోమాంచ స్మృతిశ్వాసాక్షిమీలనైః।
బాహ్యార్థస్యాపరిజ్ఞానే నానుభావ్యోఽభవేదసౌ ॥ ౩౦౫

తా॥ నాయకసమాగమగోచరమైనమనోరథము సంకల్పమనబడును. ఈయవస్థయందు ఔత్సుక్యము, స్వేదము, రోమాంచము, స్మరణము, శ్వాసము, కన్నులు మూసికొనుట, బాహ్యవ్యాపారము దెలియకయుండుట, మొదలైనవిగలుగును.

గుణనుతిలక్షణం- ౪వది.

శ్లో॥ భవేద్గుణనుతి స్తస్య రూపాదిపరికీర్తనం ॥౩౦౬॥ రోమాంచోగద్గదా
వాణీ భావావరణవీక్షణం।తత్సంగచింతనం సఖ్యా గండస్వేదాదయోపి
చ ॥౩౦౭॥ ఔత్సుక్యహర్షస్మృత్యాద్యా అనుభావా ఇహస్మృతాః॥

తా॥ నాయకుని రూపము మొదలైనగుణములనుబాగడుట గుణనుతియనబడును. ఇందు రోమాంచము, డగ్గుత్తుకగలపలుకులు, సాభిప్రాయముగజూచుట, చెలికత్తెలతో అతనిసంగమమునుగుఱించియోచించుట, కపోలములయందు చెమట, ఉత్సాహము, హర్షము, స్మరించుట మొదలైనవిగలుగును. ... ... *

క్రియాద్వేషలక్షణం- ౫వది.

శ్లో॥ క్రియాద్వేష స్తతోన్యత్ర విద్వేషాభోజ్యవస్తుని ॥౩౦౮
చింతానిశ్వాసదైన్యాశ్రు కళాజాగరపాండుతాః।
విషాదోగ్లానిరిత్యాద్యా అనుభావా స్తదుద్భవాః॥౩౦౯

తా॥ నాయకునితప్ప ఇతరములైన భోజ్యవస్తువులయందుగలుగుద్వేషము క్రియాద్వేషమనబడును. ఇందు చింత, నిశ్వాసము, దైన్యము, కన్నీరువిడుచుట, నిదురలేకయుండుట, వెలవెలపోవుట, విషాదము, సోలుట మొదలైనవిగలుగును. ... *

తాపలక్షణం- ౬వది

శ్లో॥ తత్ప్రాప్తివైక్లవ్యప్రకర్షేణ తాపస్స్యాత్కామజోజ్వరః।
వైవర్ణ్యమశ్రువైస్వర్యం శయనేపరివర్తనం॥౩౧౦
నిశ్వాసముఖశోషాద్యా అనుభావా స్తదుద్భవాః।

తా॥ ప్రియునిరాకయొక్కవిలంబమునగలుగుకామజ్వరము తాపావస్థ యనబడును. ఇందు వైవర్ణ్యము, కన్నీరు, స్వరభంగము, పడకలోపొరలుట, నిట్టూర్పు, ముఖమువాడుట, మొదలైనవిగలుగును. ... ... ... *

లజ్జాత్యాగలక్షణం- ౭వది.

శ్లో॥లజ్జాత్యాగ స్త్రపాహాని రౌత్సుక్యాదిసముద్భవా॥౩౧౧
ఉల్లంఘనంభవేద్వాచాం గౌరవాగణనంతథా।
విషాదోవ్యగ్రతాదైన్య మిత్యాద్యైరనుభావ్యతే॥౩౧౨

తా॥ ఔత్సుక్యము మొదలైనవానిచేత సిగ్గునుమానుట లజ్జాత్యాగమనబడును. ఇది ఆజ్ఞనుమీఱుట, గౌరవమునుతలపకుండుట, విషాదము, వ్యగ్రత, దైన్యము మొదలైనవిగలుగును. ... ... ... ... *

ఉన్మాదలక్షణం- ౮వది.

శ్లో॥సర్వావస్థాసుసర్వత్ర తన్మనస్కతయాసదా।అతస్మిం స్తదితిభ్రాంతి రున్మాదోవిరహోద్భవః॥౩౧౩॥తత్రచేష్టాస్తువిజ్ఞేయాద్వేషస్సేష్టే
పివస్తుని।దీర్ఘాముహుశ్చనిశ్వాసోనిర్నిమేషతయాస్థితిః॥౩౧౪॥అనిమిత్త

